# గీతా వ్యాఖ్యానము





రచయిత
సచ్చిదానందమూర్తి

# గీతా వ్యాఖ్యానము

ACC No 12272
1393 | HDL
ROP



రచయిత

సచ్చిదానందమూర్తి

ప్రథమ ముద్రణ : మే, 85

ప్రతులు : 1000

వెల : రు. 25/-

స్వామ్యములు : ప్రకాశకులవి

ప్రకాశకులు : బండి మోహన్, రేపల్లె.

ACC No. 1227

SAC

ప్రాప్తిస్థానము : బండి మోహన్
ఇంటి నెం. : 10-13-9
రేపల్లె (R S.)
గుంటూరు జిల్లా (ఆంధ్రప్రదేశ్)

ముద్రణ : లక్ష్మి ప్రెస్, తెనాలి-1.

# ఉపోద్ఘాతము

ఈ కాన్పించు సర్వమును బ్రహ్మ (భ్రమ) యొక్క పగటి కాలమందు కాన్పించని ప్రకృతి (మాయ) యందుండి వచ్చుచున్నదని, రాత్రి రాగానే ఆ ప్రకృతి (మాయ) యందే కలియుచున్నదని 8 వ అ. 18 శ్లో.లోను, అట్టి జీవులు స్వాతంత్ర్యములేనివై అనేక జన్మల నెత్తుచు రాత్రిరాగానె మరల వచ్చుచున్నవని 19 వ శ్లో.లో ఉన్నది.

మాయయందుండి వచ్చి నశించి మాయయందే కలియుచు మరల వచ్చుచు తిరుగుచుండు ఈ ప్రపంచములో 15 వ అ, 17, 18 శ్లో.లలో చెప్పబడిన ఉత్తమ పురుషుడు పరమాత్మ (పరమతేజస్సు) లేదు. ఈశ్వరుడు లేడు. కృష్ణుడు లేడు. 13 వ అ. 21, 22 శ్లో.లలో మాయ కార్యకారణ కర్తృత్వములకు హేతువని, జీవుడు సుఖ దుఃఖముల ననుభవించుటకు కారణమని, ఈ గుణము లుండుటవలన జీవుడు గుణముల ననుభవించుచున్నాడు. వీనివలన అనేక ఉత్కృష్ట, నికృష్టజన్మల నెత్తుటకు కారణమని ఉన్నది. జీవులు వానియందున్న కామ రాగద్వేషాదిగుణములు చేయు కర్మలను మరల యింకొకపుడు ఆ జీవులకు వాని స్వభావము చేయుటవలన సుఖ, దుఃఖముల ననుభవించుచున్నవి. అనేక జన్మల నెత్తుచున్నవి. ఇట్లు ప్రవర్తించు స్వభావము జీవులకు సహజముగనె యున్నది. ఈశ్వరుడు జీవులకు కర్తృత్వమును, కర్మలను, కర్మఫలములతోటి సంబంధమును సృజింపడు. మరెట్లనిన జీవులకు స్వభావము ప్రవర్తించుచున్నదని 5 వ అ. 14 వ శ్లో.లో ఉన్నది. జీవులు వానియందున్న రాగద్వేషాది గుణములవలనను, వాని సహజ స్వభావము(గుణము) వలనను సుఖ దుఃఖముల ననుభవించుచు జన్మల నెత్తుచున్నవి. ఈ గుణముల ప్రవర్తననే అసురసంపద కర్మబంధమునుకలుగజేయునవియని 16 వ అ. 5 వ శ్లో.లో ఉన్నది. అంతియెగాని సర్వజీవులను ప్రవర్తింపజేయు ఈశ్వరుడు లేడు. కృష్ణుడు లేడు.

అర్జునా! నీవు యుద్ధము చేయనని తలంచినను నీ ప్రకృతి అనగా స్వభావము నిన్ను యుద్ధమునకు నియమించునని 18 వ అ.59 వ శ్లో.లోను, నీసంస్కా

రమువలన నీ స్వభావమునకు వశుడవై యున్నావు. నీవు దేనిని చేయనని తలంచుచున్నావో, దానిని పరవశుడవై చేయుదువు. అనగా నీ స్వభావమే చేయునని 60వ శ్లో.లోను ఉన్నది. జీవులకు వాని సంస్కారము ననుసరించి వాని స్వభావము (గుణము) ప్రవర్తించు ప్రవర్తనను ఈశ్వరుడు సర్వజీవులను వాని యందుండి యంత్రములను త్రిప్పునటుల మాయచేత త్రిప్పుచున్నాడని 18 వ అ, 61 వ శ్లో. లోను, తానే ప్రవర్తింపజేయుచున్నానని 10 వ అ. 8 వ శ్లో.లోను కృష్ణుడుచెప్పినటుల కల్పించి వ్రాసినారు గాని, ఈశ్వరుడు లేడు. అట్టి కృష్ణుడు లేడు.

అర్జునా! నేనును, నీవును అనేక జన్మల నెత్తినామని 4 వ అ. 5 వ శ్లో. లోను, నేను నశించని ఆత్మ (స్వభావము) గలవాడనని, ఆత్మ మాయయా అనగా నా సంస్కారమువలన నా స్వభావము ప్రవర్తించు ప్రవర్తనవలన నా ప్రకృతిఅనగా స్వభావము (సంస్కారము) ననుసరించి పుట్టుచున్నానని 6 వ శ్లో.లోను ఉన్నది. విష్ణువు రాముడుగా పుట్టినాడని, రాముడు విష్ణులోకమునకు వెళ్ళి మరల కృష్ణుడుగా పుట్టినాడని చెప్పుచున్నారు. రాముని జన్మయందున్న రాగద్వేషాది గుణములు చేసిన కర్మయను సంస్కారమువలన రాముడు తన స్వభావముచేత కృష్ణుడుగా పుట్టినాడు. వాలిని చంపిన కర్మ (సంస్కారము) వలన తన స్వభావముచేతనె బోయవానిద్వారా చంపబడినాడు. కృష్ణునికిని స్వభావము ప్రవర్తించుచున్నదిగాని, సర్వమును కృష్ణునివలన ప్రవర్తింపబడుట లేదు. కృష్ణుని స్వభావమును కృష్ణుని ఆత్మ, ప్రకృతియని వ్రాసినారు. ఆత్మ లేదు.

నేను జన నాశనము చేయుకాలుడనై యున్నాను. జనులను చంపుటకై ప్రవర్తించినవాడను. వీరలు యిదివరకే నా చేత చంపబడిరి. నీవు నిమిత్త మాత్రమగుమని 11 వ అ. 32, 33 శ్లో.లో ఉన్నది. వీరలు యిదివరకే నా చేత చంపబడిరి. అనగా వీరలు వీరి పూర్వ జన్మయగు మానవజన్మయందున్న రాగద్వేషాదిగుణములు యితరులను చంపినవి. అప్పుడే వీరు వీరి స్వభావమునకు వశులై వీరిని వీరే చంపుకొనిన వారైనారు. ఇప్పుడు వీరి స్వభావముచేతనె అర్జునునిద్వారా చావనున్నారు. అటులనె కృష్ణుడును అనేక జన్మల నెత్తినవాడు. రాముని జన్మయందున్న రాగద్వేషాది గుణముల కర్మయను సంస్కారమువలన తనస్వభావముచేతనె కృష్ణుడుగా పుట్టినాడు. ఆ సంస్కారము ననుభవించి, వాలిని చంపిన కర్మయను సంస్కారము వలన తనను తానె చంపుకొనినవాడై కృష్ణుని జన్మయందు తన స్వభావముచేతనే

బోయవానిద్వారా చంపబడినాడు. కృష్ణుడు జనులను చంపు కాలుడనినచో, కృష్ణుడు చంపబడినవాడా ? చంపినదియా ? అనిన కృష్ణుడు చంపబడినవాడే గాని, తనను చంపిన కాలుడనునట్టి తన స్వభావము తాను (కృష్ణుడు) కాదు. కృష్ణ పరమాత్మ, కృష్ణ భగవాన్ అనుచున్నారు. పరమాత్మ, భగవాన్ అను కృష్ణుడు చంపబడిన వాడా ? చంపినదియా ? అనిన, చంపబడిన కృష్ణుడును, కృష్ణుని చంపిన తన స్వభావమును పరమాత్మ (పరమతేజస్సు) కాదు. భగవంతుడు కాదు.

అజ్ఞానులకును, జ్ఞానులకును స్వభావము ప్రవర్తించుచున్నది. అనగా వారి సంస్కారము ననుసరించి వారి స్వభావము ప్రవర్తించుచున్నది. దీనిని నిగ్రహించ లేరని 3 వ అ. 33 వ శ్లో.లో ఉన్నది. ఆ కర్మలయందు రాగద్వేషము లుండ కూడదు. రాగద్వేషములు శత్రువులని 34 వ శ్లో.లో ఉన్నది. రాగద్వేషాది గుణములు శత్రువులు అందువలన మానవులయందు రాగద్వేషాదిగుణములుండకూడదు. కామ, క్రోధ, లోభములు నరక ద్వారములని, వీనిని విడువవలయునని 16 వ అ. 21 వ శ్లో.లో ఉన్నది.

జీవులయందున్న కామ, క్రోధ, లోభ, రాగ, ద్వేషాది శత్రువులగు గుణముల ప్రవర్తనవలన ఆ జీవులకు వాని స్వభావము ప్రవర్తించుచున్నది. అందువలన జీవులు సుఖ, దుఃఖముల ననుభవించుచు జన్మలనెత్తుచు ఈ ప్రపంచమునందు తిరుగుచున్నవి. ఈ గుణములను వెడలగొట్టినచో, శత్రువులు ఉండరు. బాధయును ఉండదు. అందువలన రాగద్వేషాది శత్రువులను జయించ (వెడలగొట్ట) వలయును. ఈ ప్రపంచము నరకద్వారములగు రాగద్వేషాది గుణములవలనను, జీవుల స్వభావమను గుణమువలనను ప్రవర్తింపబడుచున్నది. అంతియెగాని ఈశ్వరునివలన ప్రవర్తింపబడుచున్నదని, కృష్ణునివలన ప్రవర్తింపబడుచున్నదని ఈ గీతయందున్నది. కల్పితమేగాని యథార్థము కాదు.

ఈ కాన్పించు రూపములును, సహజ స్వభావము (గుణము) గల జీవులును సత్వ రజ, స్తమో గుణములనునట్టి భ్రమ, కామ రాగద్వేషాది గుణములునుగల ఈ ప్రపంచము భ్రమవలన మాయయందుండి సృష్టింపబడినది. అట్టి ఈ ప్రపంచములో జీవులకు వాని స్వభావమువలన కామ రాగద్వేషాది గుణములు సంభవించినవి. ఇట్లు సంభవించిన సత్వ, రజ, స్తమో గుణములు జీవులకు నా వలననే సంభవించినవి యని 7 వ అ. 12 వ శ్లో.లో కృష్ణుడు చెప్పినటుల కల్పించి వ్రాసినారు.

మానవులు వారియందున్న కామ రాగద్వేషాది గుణములు చేయు కర్మలనను సరించి వారి స్వభావమువలన ప్రవర్తింపబడి అనేక ఉత్కృష్ట, నికృష్ట జన్మముల నెత్తుచు, సుఖ దుఃఖముల ననుభవించుచు ఈ ప్రపంచమునందు తిరుగుచున్నారు. మాయయందుండి వచ్చిన సర్వజీవులును కామ రాగద్వేషాది గుణములవలనను ఆ జీవుల స్వభావమను గుణమువలనను ప్రవర్తింపబడుచున్నవి. ఈ గుణములనుఅసుర సంపదయని, యివి కర్మబంధమును కలుగజేయునవి యని 16 వ అ. 5 వ శ్లో.లో ఉన్నది. ఇది మాయయందుండి వచ్చినదనిన అసుర గుణముల ప్రవర్తన గల ప్రపంచము.

ఈ కన్నులకు కాన్పించనిది, నశించనిది చేరవలసిన సర్వోత్కృష్టమైన స్థానమని, ఎచ్చటికి చేరినవారు (జీవులు) జన్మమునకు తిరిగిరారో అది తనయొక్క (కృష్ణుడను జీవుడును చేరునట్టి) స్థానమని 8 వ అ, 21 వ శ్లో.లో ఉన్నది. అట్టి స్థానముగా ఉన్నది నిరాకార నిర్గుణముగా ఉన్న పరమతేజస్సు. అది జన్మమునకు రానిది. అచటికి చేరినవారు జన్మలనెత్తుట ఉండదు. అందువలన అచటికి చేరినవారు జన్మమునకు తిరిగిరారు. దానిని చేరవలసిన గమ్యస్థానమని, పరమపదమని, నిర్వాణ పదమని, మోక్షపదమని, పరమతేజో లోకమని అనేక పేరులతో చెప్పుచున్నారు. ఆ తేజోలోకమునందు ఈ ప్రపంచము లేదు. ఈ ప్రపంచమునందు ఆ తేజస్సు లేదు. ఎవరైనను ఈ లోకమునుండి ఆ పరమపదమును (తేజోలోకమును) చేర వలయును. గాని దానిని ఎట్లు పిలిచినను అది ఈ లోకమునకు వచ్చునది కాదు.

అట్టి పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను, జ్ఞానముద్వారా చేరవలెనని 13 వ అ. 18 వ శ్లో.లో ఉన్నది. జ్ఞానమనునది పరమపదముగా ఉన్న పరమ తేజస్సును చూచు భావము. (గుణము).

ఈ భావము అనాదియై యున్నది. అవ్యక్తమగు మాయకంటె వేరుగా నున్నది. శ్రేష్ఠమైనది. కనబడనిది. అట్టి భావము బ్రహ్మతోసహా ఈ సర్వప్రపంచము నశించినను నశించునది కాదని 8 వ అ. 20 వ శ్లో.లో ఉన్నది. ఈ భావముతో విజ్ఞానమగు భావమును ఉండును. ఈ జ్ఞాన, విజ్ఞాన భావములు (గుణములు) అనాదియై ఉన్నవిగాని మాయయందు లేవు. మాయయందుండి వచ్చిన ఈ ప్రపంచములో ఎవరియందును లేవు. పరమపదమునందు లేవు. అందుండి వచ్చినవి కాదు. ఇవి దైవసంపదయని మోక్షపదమును చేర్చునని 16 వ అ. 5 వ శ్లో.లో ఉన్నది.

ఎవరైనను ఈ భావముల నార్జించి వీనివలన ఆ తేజోపదమును జేరవలయునుగాని, దానిని (ఆ తేజస్సును) భగవంతుడని ఏ విధముగ పిలిచినను అది ఈ లోకమునకు వచ్చునది కాదు. వారిని పరమపదమును జేర్చునది కాదు.

దేనిని తెలిసిన (ఆర్జించిన) ఈ లోకమునందు తెలియదగినది (ఆర్జించవలసినది) మరియొకటిలేదో అట్టి విజ్ఞాన సహితమైన జ్ఞానమును నేను నీకు చెప్పుచున్నానని 7 వ అ. 2 వ శ్లో.లోను, దేనినెరిగిన (ఆర్జించిన) అశుభములనుండి విముక్తుడవు కాగలవో అట్టి విజ్ఞానసహితమైన జ్ఞానమును నేను నీకు చెప్పుచున్నానని 9 వ అ. 1 వ శ్లో.లోను ఉన్నది.

పరమ తేజోపదమును చేర్చునట్టి విజ్ఞాన సహితమైన జ్ఞానమును (జ్ఞాన విజ్ఞానములను) చెప్పుచున్నానని కృష్ణుడర్జుననికి చెప్పెను. అంతియెకాని కృష్ణుడు ఆ తేజోపదమును జేర్చువాడు కాదు.

తత్వ అనగా పరమతేజస్సు దర్శనమైన జ్ఞానుల అనగా విజ్ఞానముతోనున్న జ్ఞానము (జ్ఞాన విజ్ఞానములు) గలవారి దరిజేరి వారిసేవ చేయుచు వారిని పదే పదే అడుగుచుండుము. వారు నీకు జ్ఞానమును బోధించెదరు. (నీయందు ప్రవేశింప జేసెదరు). అని 4 వ అ. 34 వ శ్లో.లో ఉన్నది. అట్టి జ్ఞానులవలెనె, కృష్ణుడును జీవించి ఉన్నపుడు తనను విడువక సేవ చేయువారలకు తనను తెలియునట్టి బుద్ధి (భక్తి) నిచ్చెదనని 10 వ అ. 10 వ శ్లో.లోను, అట్టి బుద్ధి (భక్తి) భావమునతాను (కృష్ణునియందుండి చెప్పుచున్న విజ్ఞానము) వారియందు ప్రవేశించి వారియందున్న అజ్ఞానమను చీకటి పోగలందులకు వారియందును జ్ఞానమను దీపమును (విజ్ఞానముతోనున్న జ్ఞానమును) ప్రవేశింపజేసెదనని 11 వ శ్లో.లోను ఉన్నది. జ్ఞానవిజ్ఞానములు గలవారును, అట్టి కృష్ణుడును వారియందున్న విజ్ఞాన ప్రవర్తనవలన ఉత్త మోత్తములు, ఉత్తమ పురుషులు అనబడినారు. వారు భగవంతులు కాదు.

ఎవరైనను జ్ఞాన విజ్ఞానములను అవి యున్నవారి సాంగత్యమున వారినుండి వారిద్వారానే ఆర్జించవలయును గాని, వారు శరీరములను విడిచిన తరువాత వారు లేరు. వారినుండి ఆర్జించలేరు. ఇంకేవిధముగను ఆర్జించలేరు. వారి నామముద్వారా చేయునవన్నియును 16 వ అ. 5 వ శ్లో.లో కర్మబంధమును కలుగజేయునవిఅసుర సంపదయని చెప్పబడిన కామ రాగద్వేషాది గుణముల ప్రవర్తన.

ఆత్మను తాను ఆత్మ (జ్ఞానము) ద్వారా చూచి ఆనందించువాడగుచు తన యందున్న కామాది గుణములను విడుచువానిని స్థితప్రజ్ఞుడందురని 2 వ అ. 55 వ శ్లో.లోను, ఆహారమును మానివేసిన పురుషునకు విషయవృత్తి ఉండదు. కాని,వాంఛ విడువదు. పరమతేజస్సుగా ఉన్న పరమపదము కాన్పించగనే వాంఛయే వానిని విడుచునని 59 వ శ్లో.లోను ఉన్నది. జ్ఞానముద్వారా పరమపదముగా ఉన్న పరమ తేజస్సు దర్శనమైన తరువాతనే మానవునియందున్న కామ రాగద్వేషాది గుణములు **వానిని విడుచును.**

ఆత్మను తాను ఆత్మచేత చూచి అనగా తనయందు పరమపదముగా ఉన్న పరమతేజస్సు ఉన్నదని ఆ తేజస్సును తాను ఆ తేజస్సుచేత చూచుచు ఆనంద మందుచున్నటుల కల్పించి వ్రాసినారు. ఆ తేజస్సు ఆత్మకాదు. ఎవరియందును లేదు. దానికి దానిని చూచు గుణము లేదు. జ్ఞానము నార్జించిన వారికి జ్ఞానముద్వారా పరమపదముగా ఉన్న పరమతేజస్సు కాన్పించినపుడు వారియందున్న కామ రాగ ద్వేషాది గుణములు వారిని విడుచును. మాయయందుండి వచ్చిన ప్రపంచములో స్వభావమను గుణముగల జీవులును, కామ రాగద్వేషాది గుణములును ఉన్నవిగాని ఆత్మ, పరమాత్మయని కల్పించిన పరమతేజస్సు లేదు.

ఎవరికైనను జ్ఞాన, విజ్ఞానభావములు (గుణములు) అవి యున్నవారి సాంగ త్యమున వారినుండి వారిద్వారానే సంభవించినపుడు వీరికిని జ్ఞానముద్వారా పరమ తేజోపద దర్శనమగును. అపుడు వీరియందున్న విజ్ఞానము పరమతేజస్సును,దానిని చూచి జీవుడానందమనుభవించుటయును ఎరిగియున్నది. తదుపరి ఈ సర్వ ప్రపంచ ప్రవర్తన నెరిగి ఉన్నది. అపుడు వీరియందున్న రాగ ద్వేషాది గుణములు వీరిని విడిచి వెళ్ళును. ఈ గుణములు పోవుట కాన్పించదుగాని వీరియందు ఈ గుణముల ప్రవర్తన ఉండదు. వీరిని వీరి ప్రవర్తనద్వారానే కామ రాగద్వేషాది గుణములులేని వారని చెప్పుచున్నారు. వీరి సంస్కారము ననుసరించి వీరి స్వభావము ప్రవర్తించు కర్మలయందు వీరియందున్న విజ్ఞానము నిష్కామము, సమత్వబుద్ధి నిత్యసత్వము, పవిత్ర ప్రేమభావములతో ప్రవర్తించుచుండును. వీరియందు కర్మబంధములకుకారణ మగు రాగద్వేషాది గుణములు లేవు గనుక ఆ గుణముల ప్రవర్తన ఉండదు. అందు వలన వీరు కర్మరహితులగుదురని చెప్పుచున్నారు. కర్మరహితులైనపుడు వీరికి జ్ఞానముద్వారా పరమతేజస్సు కాన్పించుచుండును, వీరు మరల జన్మల నెత్తుట

ఉండదు. వీరు జ్ఞానముద్వారా కాన్పించుచున్న పరమ తేజోపదమును చేరుదురని చెప్పుచున్నారు. పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను. జ్ఞానముద్వారా చేర వలెను అని 13 వ అ. 18 వ శ్లో.లో ఉన్నది. అంతియెగాని కామ రాగద్వేషాది గుణములను పోగొట్టు భగవంతుడు లేడు. ఆ పరమపదమును జేర్చు భగవంతుడును లేడు.

దైవసంపద అనగా జ్ఞాన, విజ్ఞాన భావములు (గుణములు) మోక్ష (పరమ) పదమును చేర్చునని; అసురసంపద అనగా కామ రాగద్వేషాది గుణములు, జీవుల స్వభావమను గుణమును కర్మబంధమును కలుగజేయునవి యని 16 వ అ. 5 వ శ్లో.లోను, ఈ లోకములో దైవసంపద, అసురసంపద అను రెండు విధములగు గుణముల సృష్టులున్నవని 6 వ శ్లో.లోను ఉన్నది. అసుర జనులు అనగా అసుర గుణములు గలవారు ప్రవృత్తి మార్గమును అనగా రాగద్వేషాది మాయాగుణములు జన్మలను, సుఖ దుఃఖములను కలిగించి ఈ ప్రపంచమునందు బంధించి త్రిప్పు చుండు ప్రవర్తనను ఎరుగరు. నివృత్తి మార్గమును అనగా విజ్ఞానముయొక్క నిష్కామ భావము, సమత్వబుద్ధి, సత్యసత్వము, పవిత్ర ప్రేమ భావముల కర్మ రహిత ప్రవర్తనను ఎరుగరు. వారియందు మంచి ప్రవర్తన, సత్యమును ఉండదని 7 వ శ్లో.లో ఉన్నది. ఇది నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరిగి నివృత్తిమార్గమున ప్రవర్తించు విజ్ఞానముతోనున్న జ్ఞానము (జ్ఞాన, విజ్ఞాన భావములు) గలవాడగు కృష్ణునిచేతను అట్టివారిచేతను చెప్పబడినది. ఈ లోకములో కర్మ బంధములను కలిగించి త్రిప్పుచుండు అసుర సంపదయను గుణములును, ఈ లోకమునుండిపరమ పదమును జేర్చు దైవ సంపద యనిన జ్ఞాన, విజ్ఞాన భావములు (గుణములు)ను ఉన్నవి. అంతియెగాని యింకొక ప్రవర్తనగల వాడెవ్వడును లేడు. అందువలన యింకొక ప్రవర్తన యనునది లేదు. ఇది జ్ఞాన, విజ్ఞానముల గలవారెరిగి ఉన్నారు గాని, అసుర గుణములు గలవారెరుగరు.

ఈ ప్రపంచములో ఉత్తమ పురుషుడు పరమాత్మ (పరమతేజస్సు) ఉన్నదని వాడె ఈశ్వరుడు, కృష్ణుడని 15 వ అ. 17, 18 శ్లో.లోను, అట్టి ఈశ్వరుడు యంత్రములనునట్టి శరీరములను ధరించియున్న సర్వజీవులను వాని యందుండి యంత్రములను త్రిప్పునటుల మాయచేత త్రిప్పుచున్నాడని 18 వ అ. 61 వ శ్లో. లోను ఈ సర్వమును తనవలననే ఉత్పత్తి యగుచున్నదని, తనవలననే ప్రవర్తింప

బడుచున్నదని 10 వ అ. 8 వ శ్లో.లోను ఉన్నది. నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరుగరని 16 వ అ. 7 వ శ్లో.లో చెప్పబడిన అసుర గుణములు గలవారిచేత అవ్యక్తముగ కల్పించి వ్రాయబడినదియేగాని జ్ఞాన, విజ్ఞానములుగల కృష్ణుడును, అట్టివారెవ్వరును చెప్పినది కాదు.

ఈ విధముగనే పరమపదమును జేర్చునవి 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన జ్ఞాన విజ్ఞాన భావముల (గుణముల) ప్రవర్తనను ఈశ్వరుని ప్రవర్తనయని అన్ని విధములచేతను ఈశ్వరుని శరణు వేడికొనుము. వాని అనుగ్రహమువలన పరమశాంతిని, శాశ్వతముగ నుండుస్థానము (పరమపదము)ను పొందగలవని 18 వ అ. 62 వ శ్లో.లో ఉన్నదియును, కృష్ణుని స్మరించినను, ధ్యానించినను, శరణ్యమనినను, పరమపదమును జేరుదురని ఈ గీతయందున్నదియును, ఈ గీతనువ్రాసిన నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరుగని అసుర గుణములుగల వారి కల్పితమేగాని యథార్థము కాదు.

ఈ లోకములో జీవులకు స్వాతంత్ర్యము లేదు. అట్టి జీవులకు వాని స్వభావమువలన కామ, రాగ, ద్వేషాది గుణములు సంభవింపబడినవి. ఈ గుణములవలనను, వాని స్వభావమను గుణమువలనను అనేక జన్మల నెత్తుచు, సుఖ, దుఃఖముల ననుభవించుచు తిరుగుచున్నవి. ఇట్లు జీవులను త్రిప్పుచుండునవి 8 వ అ. 18,19 శ్లో.లలో చెప్పబడినటుల మాయయందుండి వచ్చిన గుణములు. అట్టి ఈ లోకము నుండి జీవులను పరమపదమును జేర్చునవి జ్ఞాన, విజ్ఞానములనునట్టి భావములు (గుణములు). ఇవి 8 వ అ. 20 వ శ్లో.లో చెప్పబడినటుల నశించనివి, మాయ కంటె వేరుగా అనాదియై యున్నవి.

మాయయందుండి వచ్చిన ప్రపంచములోని గుణములు అసుర సంపదయని కర్మబంధమును కలుగజేయునవియని, అనాదియైయున్న జ్ఞాన, విజ్ఞాన భావములు దైవసంపదయని, పరమపదమును జేర్చునని 16 వ అ. 5 వ శ్లో.లోను, ఈ విధముగ ఈ లోకములో అసుర సంపద, దైవసంపదయను రెండు విధములగు ప్రవర్తనలు గుణములున్నవని 6 వ శ్లో.లోను చెప్పిన కృష్ణుడు నివృత్తి, ప్రవృత్తి మార్గముల (ప్రవర్తనల) నెరిగి, నివృత్తి మార్గమున ప్రవర్తించు విజ్ఞానముతో నున్న జ్ఞానము గలవాడు. నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరుగరని 7 వ శ్లో.లో చెప్ప

బడిన అసుర గుణములు లేనివాడు. అట్టి కృష్ణుడు ఈ లోకములో రెండువిధములగు ప్రవర్తనలుగల గుణములున్నవని చెప్పెను. 16 వ అ. 7 వ శ్లో.లో చెప్పబడి నటుల నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరుగని అసుర గుణములు గలవారు ఈశ్వరు డున్నాడని, ప్రవర్తింప జేయుచున్నాడనిచెప్పుచు మంచిప్రవర్తనలేనివారై యున్నారు. ఈ రెండు ప్రవర్తనల నెరిగినవారు నిష్కామాది పవిత్ర ప్రేమ భావముల ప్రవర్తన గలవారు. వీరు కర్మరహితులగుదురు.

ఈ లోకమునకు హాని కలిగించు దేశద్రోహులుగను, క్రూరకర్మలు చేయు వారుగను పుట్టుచున్నారని 16 వ అ. 7 వ శ్లో.లోను, అన్యాయమార్గమున ధనము నార్జించుచున్నారని 12 వ శ్లో.లోను చెప్పబడిన వారు ఈశ్వరుడు లేడనువారలా? ఈశ్వరుడున్నాడనువారలా? అనిన, ఈశ్వరుడున్నాడని, ప్రవర్తింపజేయుచున్నాడని చెప్పు అసుర గుణములు గలవారే నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరుగక ఈ ప్రపంచమునకు హాని కలిగించు దేశద్రోహులు, క్రూరకర్మలు చేయువారు. భగ వంతుని పేరులతో ప్రజలను మోసగించి వారినుండి అన్యాయ మార్గమున ధనము నార్జించు చున్నవారు. నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరిగినవారు నివృత్తిమార్గమున (ప్రవర్తనవలన) కర్మబంధ రహితులగుచున్నారు. ఇతరులను పవిత్రప్రేమభావము లతో ప్రవర్తింపజేయుచు వారియందును జ్ఞాన విజ్ఞానములను ప్రవేశింప జేయువారు. దేశమునకు హాని కలిగించునవి, ద్రోహము చేయునవి, క్రూరకర్మలు చేయునవి యగు అసురగుణములు వీరియందుండవు. వీరు ప్రపంచములో పుణ్యాపాపములను నట్టి ధర్మాధర్మముల నెరిగియున్నారు. కర్మబంధరహితమగు పరమధర్మము నెరిగి యున్నారు. పరమధర్మ ప్రవర్తన గలవారై యున్నారు. ఇది వారియందున్న విజ్ఞా నముయొక్క ప్రవర్తన.

ఈ ప్రపంచములో రాగ, ద్వేష, గుణములు గలవారనేకులున్నారు. జ్ఞాన విజ్ఞానములు గలవారు అరుదుగా యున్నారు. ఈ విధముగ యీ ప్రపంచములో రెండు విధములగు ప్రవర్తనలుగల గుణములు గలవారున్నారు. అంతియెకాని, ఈ ప్రపంచములో ఎవరియందును ఈ గీతయందు చెప్పబడిన పరమతేజస్సులేదు. ఆత్మ పరమాత్మ లేదు. పరమపురుషుడు లేడు. ఈశ్వరుడు లేడు. కృష్ణుడు లేడు. ఏ భగవంతుడును లేడు. అని చెప్పు విజ్ఞానము గలవారి ప్రవర్తనను చూచిన కొందరు ఈ లోకములో ఉన్నవి గుణములేగాని భగవంతుడు లేడు అని చెప్పుచున్నారు. ఈ ప్రపంచము ఎవనిచేతను సృష్టింపబడుట లేదు. ఈశ్వరుడు లేడు. స్త్రీ, పురుషుల

పరస్పర సంబంధమువలననే పుట్టుచున్నది. అందులకు కామమే హేతువని చెప్పు చున్నారు. అని 16 వ అ 8 వ శ్లో.,లో ఉన్నది యథార్థము.

భూతములు క్షేత్ర, క్షేత్రజ్ఞుల అనగా క్షేత్రజ్ఞుడనునట్టి జీవుల స్వభావమను గుణము క్షేత్రములనునట్టి స్త్రీ, పురుషుల శరీరములతో చేయు సంయోగమువలననే పుట్టుచున్నవని 13 వ అ. 27 వ శ్లో.లో ఉన్నది. ఇట్లు కామగుణముల సంబంధము వలననే జరుగుచున్నది. అంతియేకాని, ఈశ్వరునివలన కాదు. ఈశ్వరుడు లేడు. అని చెప్పుచున్నారు. వీరిని నాస్తికులనుచున్నారు. వీరు ప్రపంచమునకు హాని కలిగించు శత్రువులుగను, క్రూరకర్మలు చేయువారుగను పుట్టుచున్నారని 16 వ అ. 9 వ శ్లో.లో కృష్ణుడు చెప్పినటుల కల్పించి వ్రాసినారు. ఇది అసుర గుణములు గలవారు వ్రాసినదియేకాని, కృష్ణుడు చెప్పినది కాదు. కర్మ (ప్రవర్తన) వలననే సర్వమును అనుభవించుచున్నామను నాస్తికులు సర్వమును కర్మద్వారానే సాధించ గలరు.

ఈశ్వరుడున్నాడు సర్వమును ప్రవర్తింపజేయుచున్నాడు అను ఆస్తికులు నివృత్తి, ప్రవృత్తి మార్గముల (ప్రవర్తనల) నెరుగక, నెరుగుటకు ప్రయత్నించక భగవంతుడు ఈశ్వరుడున్నాడని సర్వమును భగవంతుడే చేయునని 12 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడినటుల అధికతర దుఃఖములకు కారణమగు అవ్యక్తఆసక్తితో అవ్యక్తముగ ప్రవర్తించుచు అధిక దుఃఖముల ననుభవించువారగుచున్నారు. వీరికినివృత్తి ప్రవర్తన తెలియదు. ప్రవృత్తి ప్రవర్తన తెలియదు.

భగవంతుడున్నాడని అనేకులను నమ్మించి వారిని భగవంతునికొరకని అనేక విధములుగ అవ్యక్తముగ (గ్రుడ్డివారివిగ) ప్రవర్తింపజేయుచు వారిని మోసగించి అన్యాయమార్గమున వారినుండి ధనము నార్జించుచు భోగముల ననుభవించుచున్నారు. ఈ విధముగ అనేకులు అన్యాయ మార్గమున (ప్రవర్తన వలన) ధనమార్జించు చున్నారు.

నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరుగని అసుర గుణములు గలవారు ధనము కొరకే భగవంతులను కల్పించి అనేకులను గ్రుడ్డివారినిగా ప్రవర్తింప జేయుచున్నారని ఎరుగక వారి మాటలు నమ్మి అనేకులు కర్మబంధమును కలుగజేయు అసుర గుణములచేత ప్రవర్తింపబడుచు అధిక దుఃఖముల ననుభవించు వారగుచున్నారు.

అసుర జనులు (అసుర గుణములు గలవారు) నివృత్తి, ప్రవృత్తిమార్గముల (ప్రవర్తనల) నెరుగరని, వారియందు శౌచము, మంచి ప్రవర్తన, సత్యమును ఉండదని 16 వ అ. 7 వ శ్లో.లో ఉన్నది. అనగా అసుర గుణములు గలవారియందు తప్పు ప్రవర్తనయే ఉండునుగాని, మంచి ప్రవర్తన యుండదని కృష్ణుడు చెప్పినను అసుర గుణములు గలవారు నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరుగర. ఎవడో. భగవంతుడున్నాడని నమ్మించి గ్రుడ్డివారినిగా ప్రవర్తింపజేయు అసుర గుణములు గలవారు చెప్పునవి నమ్మి అనేకులు భగవంతుడను పేరుతో కర్మబంధమును కలుగ జేయునవియని 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన అసుర గుణములచేత తప్పు మార్గమున ప్రవర్తింపబడుచున్నారు. అసుర గుణములు గలవారు ఏమి చెప్పినను, ఏమి చేసినను, 16 వ అ. 7 వ శ్లో.లో చెప్పబడిన తప్పు ప్రవర్తనయేకాని, మంచి ప్రవర్తనకాదని తెలియవలెను. జన్మల నెత్తుచు, సుఖ, దుఃఖముల ననుభవించుచుండు ఈ లోకమునుండి ఎచ్చటికి చేరినవారు జన్మమునకు తిరిగిరారో అది చేరవలసిన స్థానమని, అది కృష్ణుడును చేరునట్టి స్థానము (పరమపదము) అని 8 వ అ. 21 వ శ్లో.లో ఉన్నది. అట్టి పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను, జ్ఞానముద్వారా చేరవలెనని 13 వ అ. 18 వ శ్లో.లో ఉన్నది. ఈ లోకములో ప్రవృత్తి, నివృత్తి మార్గములు (ప్రవర్తనలు) రెండున్నవని, ప్రవృత్తి మార్గము అసుర గుణముల కర్మబంధములు కలిగించు ప్రవర్తనయని, నివృత్తి మార్గముదైవ గుణముల కర్మవిముక్తులు అనగా కర్మరహితులు అగు ప్రవర్తనయని ఈ రెండు మార్గములను (ప్రవర్తనలను) అసుర గుణములు గలవారెరుగరని, అందువలన, వారియందు మంచి ప్రవర్తన ఉండదని 16 వ అ. 5, 6, 7 శ్లో.లలోఉన్నది. కర్మ విముక్తులు జన్మల నెత్తుట యుండదని, అందువలన వారు జ్ఞానముద్వారా పరమపదమును జేరుదురని చెప్పుచున్నారు. రాగ, ద్వేషాది గుణములను అసురసంపదయని వ్రాసినారు. జ్ఞాన, విజ్ఞాన గుణములను దైవసంపదయని వ్రాసినారు. కాని, అసుర యను రాక్షసి లేదు. దైవము లేదు. జ్ఞాన, విజ్ఞానగుణములు విలువగలవి యగుటచేత భావములని వ్రాసినారు.

రాగ ద్వేషాది గుణముల ప్రవర్తనయును, నిష్కామాది పవిత్ర ప్రేమభావముల ప్రవర్తనయును కాన్పించును. కాని, జ్ఞానముద్వారా పరమ తేజస్సు దర్శనమగుట, రాగ, ద్వేషాది గుణములు పోవుట, కర్మరహితులగుట, అప్పుడు విజ్ఞానము వారిని విడిచి వెళ్ళుట, అట్టివారు (జీవులు) జ్ఞానముద్వారా పరమపదమును చూచుచు

ఆ పదమును జేరుట, అచ్చట పరమపదముగా ఉన్న తేజో ఆనంద మనుభవించుట యనునవి కాన్పించవు. అటులనె జీవులు ఒక శరీరమునుండి ఇంకొకశరీరమునందు ప్రవేశించుట అనగా జన్మల నెత్తుట కాన్పించదు. ఈ ప్రపంచమునందున్న వెలుతురులుగాక ఈ ప్రపంచము లేని వెలుగు (తేజస్సు) కాన్పించినవారు అది ఈ ప్రపంచము లేక వేరుగా ఉన్నదని చెప్పుచున్నారు. ఈ ప్రపంచమునందున్న జీవులు నశించునవికావని, రాగ, ద్వేషాది గుణముల ప్రవర్తనవలన సుఖ, దుఃఖములననుభవించుచు, జన్మల నెత్తుచు తిరుగుచుండు స్వభావము (గుణము) జీవులకున్నదని, ఈ గుణములులేనిచో సుఖ, దుఃఖముల ననుభవించుట, జన్మల నెత్తుట ఉండదని ఈ గుణముల ప్రవర్తన నెరిగి చెప్పుచున్నారు. ఆ తేజస్సు కాన్పించిన తరువాత వారి యందు ఈ గుణముల ప్రవర్తన కాన్పించదు. అందువలన వారియందు గుణములు లేవని చెప్పుచున్నారు. ఈ గుణములు లేనపుడు, ఈగుణముల కర్మయుండదు. వారు అనుభవించు కర్మయును, జన్మల నెత్తుటయును ఉండదు. వారు ఇదివరకు చేసిన కర్మలను మరల వారికి వారి స్వభావము చేయును. ఆ కర్మలయందు వారు నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించుచుందురు. వారు ఆ కర్మలను, కర్మఫలమును వారి స్వభావమువలన అనుభవించి కర్మరహితులగుదురు. అప్పుడు వారికి ఈ లోకము లేని ఆ తేజస్సే కాన్పించుచుండును. కాన్పించుచున్న ఆ తేజస్సునందు వారు చేరుదురని, కాన్పించుచున్న ఆ తేజస్సును చూచుచు అచ్చట ఆనందముతో నుందురని చెప్పుచున్నారు.

ఆ తేజస్సు భావము (గుణము) లేనిది. దానిని చూచునది భావము(జ్ఞానము). ఈ భావము ఆ తేజస్సును చూచునదియేకాని ఈ ప్రపంచము నెరుగదు. జ్ఞానము గలవాడు జ్ఞానముద్వారా ఆ తేజస్సును చూచుచు ఆనందముతో నుండుటచూచి, వానికి ఈ ప్రపంచము కాన్పించినపుడు అదియంతయు చూచి చెప్పునది ఒకటి యున్నది. దీనిని భావము (జ్ఞానము) గలవారియందున్న విజ్ఞానమను భావమని చెప్పుచున్నారు. విజ్ఞానము కర్మరహితపరచి వారిని విడిచివెళ్ళునని చెప్పుచున్నారు. నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్వము, రాగ, ద్వేషములులేని పవిత్రప్రేమ భావములప్రవర్తన వలన వారు సర్వము నెరిగిన విజ్ఞానము గలవారని వారు చెప్పునట్లు ప్రవర్తించ వలయునుగాని వారు కర్మరహితులగునది, వారియందున్న విజ్ఞానము వారిని విడిచి వెళ్ళునది, వారు (అట్టి జీవులు) పరమపదమును చూచుచు, ఆ పదమును చేరునది,

అచట తేజస్సును చూచుచు ఆనందముతో నుండునది, జీవులు జన్మలనెత్తునది అనగా ఒక శరీరమునుండి ఇంకొక శరీరమునందు ప్రవేశించి జన్మించునది ఇవియన్నియును చూచి చెప్పువారు లేరు. ఇవి గుణముల ప్రవర్తనవలన నిర్ణయించి చెప్పుచున్నారు. అట్టివానిని గురించి గ్రుడ్డివారుగ చెప్పుకొనుటవలన ఏదియును రాదు.

అశుభములనుండి విముక్తునిగ జేయు విజ్ఞాన సహితమైన జ్ఞానమును చెప్పుచున్నానని 9 వ అ. 1 వ శ్లో,లోను, అట్టి విజ్ఞానసహితమైన జ్ఞానమును (జ్ఞాన, విజ్ఞానములను) ఆర్జించిన, మరల ఆర్జించవలసినది మరియొకటి లేదని 7 వ అ. 2 వ శ్లో.లోను, ఉన్నది. ఈ జ్ఞాన, విజ్ఞానములు కర్మబంధ విముక్తులనుగ జేసి మోక్ష (పరమ) పదమును జేర్చునని 16 వ అ. 5 వ శ్లో.లో ఉన్నది. జ్ఞానము ద్వారా పరమపద దర్శనమగును. విజ్ఞానమువలన కామ, రాగ, ద్వేషాది గుణములు వెళ్ళిపోవును. అట్టివారు కర్మబంధ విముక్తులగుదురు. జ్ఞానముద్వారా పరమ పదమును జేరుదురు. జ్ఞానముద్వారా పరమపదమును చూడవలెను, జ్ఞానముద్వారా చేరవలెనని 13 వ అ. 18 వ శ్లో.లో ఉన్నది. అట్టి విజ్ఞాన సహితమైన జ్ఞానమును అట్టి జ్ఞానముగల జ్ఞానుల సాంగత్యమున వారినుండి వారిద్వారానే ఆర్జించగలవని 4వ అ. 34 వ శ్లో.లోను, ఆ విధముగనె కృష్ణుడును తనకు సేవ చేయు వారియందున్న అజ్ఞానమను చీకటి పోగలందులకు వారియందును జ్ఞానమనుదీపమునువెలిగించుచున్నానని అనగా విజ్ఞానముతోనున్న జ్ఞానమును ప్రవేశింప జేయుదునని 10 వ అ. 10, 11 శ్లో.లలో ఉన్నది. ఈ విధముగ ఉన్నదానినె, ఒక్క దీపము తాను వెలుగుచునే, అనేక దీపములను వెలిగించునని ఆ విధముగనె జ్ఞానముగల జ్ఞాని తాను జ్ఞానముతో ప్రకాశించుచునే అనేకులయందును జ్ఞానమును ప్రవేశింపజేయునని సర్వము నెరిగి ప్రవర్తించు విజ్ఞానముతోనున్న జ్ఞానము గలవారు చెప్పుదురు.

అటులనే విజ్ఞానముతోనున్న జ్ఞానముగలవాడగు కృష్ణుడు విజ్ఞానముతోనున్న జ్ఞానము అర్జునునియందును ప్రవేశించు ప్రవర్తననే చెప్పును. గాని, ఈ ప్రపంచములో అందరియందును పరమాత్మ (పరమ తేజస్సు) ఉన్నదని, భగవంతుడున్నాడనె దానిని స్మరించమని, ధ్యానించమని ఈ గీతయందు చెప్పబడిన గ్రుడ్డివారినిగా ప్రవర్తింపజేయు అవ్యక్త ప్రవర్తనను చెప్పువాడు కాదు. చెప్పడు. సర్వము నెరిగి నివృత్తి మార్గమున ప్రవర్తించు విజ్ఞానము గలవారుగాని, అట్టి కృష్ణుడనువాడు గాని

చెప్పిన ప్రవర్తనను విని కొన్ని వ్రాయుచు, భ్రమగలవారి భ్రమచేత అవ్యక్తముగ వ్రాయబడిన వేదములయందును, ఉపనిషత్తులయందును, బ్రహ్మసూత్రములయందును ఈ విధముగా వ్రాయబడిన శాస్త్రములయందును ఉన్న అనేక తప్పు ప్రవర్తనలు ఈ గీతయందు కృష్ణుడు చెప్పినటుల కల్పించి వ్రాసి ఇది భగవంతుడు కృష్ణుడు చెప్పిన భగవద్గీత యని వ్రాసినారు.

ఎవడు శాస్త్రవిధిని అనుసరించక యిచ్చవచ్చినట్లు ప్రవర్తించుచున్నాడో ఈ విధముగా వ్రాయబడిన శాస్త్రములయందు వాడు పరమగతిని పొందడని, సుఖమును పొందడని, శాస్త్రము నీకు ప్రమాణమని శాస్త్రములయందు చెప్పబడినదానిని ఎరిగి, ఈ ప్రపంచమునందు కర్మ చేయుటకు తగుదువని కృష్ణుడు చెప్పినటుల 16 వ అ. 23, 24శ్లో.లలో ఉన్నది కల్పితమేగాని, విజ్ఞానముగల కృష్ణుడు చెప్పినదికాదు. చెప్పడు.

వేదశాస్త్రములుచదివి, అందున్న అర్థమును అందమైన పువ్వులవలెఅందముగా చెప్పు అజ్ఞానుల పలుకులు నమ్మి భోగముల నాశించి అనేక కర్మలలో చిక్కి భోగులకు నిశ్చయ బుద్ధి కలుగదని 2 వ అ. 42, 43, 44 శ్లో.లలోను, వేదశాస్త్రములు సత్వ, రజ, స్తమో గుణములగు త్రిగుణముల కర్మలనే చెప్పును. ఇవి సుఖముల యందును, దుఃఖములయందును బంధించునవియని 14 వ అధ్యాయములో ఉన్నది. సుఖ, దుఃఖములను కల్పించు వేదములయందు చెప్పబడినది విడిచి, ఆత్మ(జ్ఞానము) గలవాడవును, నిత్యసత్వము (విజ్ఞానము) గలవాడవునగుమని 45 వ శ్లో.లోను, ఉన్నది. ఆత్మ యనునది కల్పితము. ఆత్మ లేదు.

15 వ 1, 2, 3 శ్లో.లలో చెట్టును పెంచు వేరులవలె రాగ, ద్వేషాది గుణములతోను, ఆకులవలె వేదములతోను పెంచబడుచున్నకోరికయనుఅశ్వత్థవృక్షమును వేరులతోసహా అసంగశస్త్రము అనగా నిష్కామ భావముగల విజ్ఞానముచేత నరికి వేయవలెనని ఉన్నది. కోరికను నరికి వేయునపుడు కోరికతో సహా రాగ ద్వేషాది గుణములును, కోరికను పెంచు వేదములును నరికి వేయబడునవి, నశించునవి.

వేదములు, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు మొదలగు శాస్త్రములు రాత్రి పగలులు గలది, ఈ ప్రపంచమును మాయయందుండి సృష్టించినదియని 8 వ అ. 18, 19 శ్లో.లలోను, ఈ ప్రపంచముతోసహా నశించునట్టిదియని 20 వ శ్లో. లోను చెప్పబడిన నశించు బ్రహ్మ అనగా 16 వ అ. 5 వ శో.లో కర్మబంధమును కలుగజేయునవి అసుర సంపదయని చెప్పబడిన అసుర గుణములు గలవారి

యందున్న భ్రమయను అసుర గుణముచేతనే కల్పించి వ్రాయబడినవి. వీనియందు అవ్యక్తముగ చేయు యజ్ఞ, దాన, తపస్సులు వ్రాయబడియున్నవి. ఇవి 16 వ అ. 7 వ శ్లో.లో చెప్పబడినటుల నివృత్తి, ప్రవృత్తి మార్గముల (ప్రవర్తనల) నెరుగని అసుర గుణములు గలవారి భ్రమచేత చేయబడుచున్నవి. అట్టి వారియందు మంచి ప్రవర్తన, సత్యమును ఉండదు. ఇవి సుఖ, దుఃఖములనునట్టి కర్మబంధములను కలుగజేయు కర్మలు. అసుర గుణములు గలవారు నివృత్తి, ప్రవృత్తి ప్రవర్తనల నెరుగక, నరకద్వారములని 16 వ అ. 21 వ శ్లో.లో చెప్పబడిన కామ, క్రోధ, లోభ, ద్వేషాది గుణములను జయించలేక నివృత్తి, ప్రవృత్తి ప్రవర్తనల నెరుగని అసుర గుణములు గలవారిచేత వ్రాయబడిన శాస్త్రములను చదివి అనేకులు అనేక విధములుగ చెప్పుచు నరకద్వారములని చెప్పబడిన కామ, క్రోధ, లోభాదిగుణముల చేత ప్రవర్తింపబడుచున్నారు. వీరు కర్మబంధములను కలుగజేయు అసురసంపద యనిన అసుర గుణముల ప్రవర్తన గలవారేగాని, విజ్ఞానముయొక్క నివృత్తి ప్రవర్తనయగు నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్వము, కామ, క్రోధ, లోభ, రాగ, ద్వేషాది గుణములు లేని పవిత్రప్రేమ భావముల ప్రవర్తన గలవారు కారు.

8 వ అ. 20 వ శ్లో.లో చెప్పబడినటుల బ్రహ్మ (భ్రమ) యే నశించు నప్పుడు బ్రహ్మ(భ్రమ)చేత సృష్టింపబడి బ్రహ్మ(భ్రమ)తో యున్న సర్వ ప్రపంచము నశించునట్టిది బ్రహ్మచేత సృష్టింపబడినవని చెప్పుచున్న సర్వ వేదములును, సర్వశాస్త్రములును, యజ్ఞ, దాన, తపస్సులును, ఓమ్, తత్, సత్ అను శబ్దములును నశించునట్టివి. వేదాది శాస్త్రములు నశించునప్పుడు ఆ శాస్త్రములయందువ్రాయ బడిన సర్వమును నశించునట్టిది. నశించునట్టి బ్రహ్మయనునది భ్రమయను గుణము. వేదాది సర్వశాస్త్రములును యజ్ఞ, దాన, తపస్సులును భ్రమ గలవారి భ్రమచేతనే వ్రాయబడినవి. ఓమ్, తత్ సత్ అను శబ్దములును చెప్పబడినవి. భ్రమయను గుణమును బ్రహ్మయని, భ్రమను పోషించు (యిష్టపరచు) ఇష్టమను గుణమును విష్ణువని, జీవుల సహజ స్వభావమను గుణమును ఈశ్వరుడని, వీరిని భగవంతులని చెప్పుచున్నారు. అంతియేకాని, బ్రహ్మలేదు. విష్ణువు లేదు. ఈశ్వరుడు లేదు. ఈ ప్రపంచములో భగవంతుడు లేదు.

శ్రీమత్ భగవద్గీత ఉపనిషత్ బ్రహ్మవిద్య యోగశాస్త్రమని శ్రీ కృష్ణార్జున సంవాదమని 18 అధ్యాయములలోను చివర వ్రాసినారు. ఇది భగవంతుడు కృష్ణుడు అర్జునునకు చెప్పిన భగవద్గీతయని, ఉపనిషత్ అని, బ్రహ్మవిద్యయగు యోగశాస్త్రమని వ్రాసినారు. ఈ బ్రహ్మ యనునది 8 వ అ. 18, 19 వ శ్లో.లో చెప్పబడి నటుల ఈ ప్రపంచమును సృష్టించినది, 20 వ శ్లోకములో చెప్పబడినటుల ఈ ప్రపంచముతో నశించునది. నశించునట్టి బ్రహ్మచేత సృష్టింపబడిన ఈప్రపంచములో భ్రమ, రాగద్వేషాది గుణములు గలవారు బ్రహ్మవిద్యచేతవ్రాసిన వేదములు, ఉపనిషత్తులు, బ్రహ్మవిద్యలు, యోగములును, బ్రహ్మయును నశించునట్టివి. నశించునట్టి బ్రహ్మయనునది భ్రమయను గుణము. నశించునట్టి బ్రహ్మ (భ్రమ)యను గుణము భగవంతుడు లేడు.

విజ్ఞాన సహితమైన జ్ఞానమును ఆర్జించిన మరల ఆర్జించవలసినదిలేదని 7 వ అ. 2 వ శ్లో.లోను, విజ్ఞాన సహితమైన జ్ఞానమును ఆర్జించిన అశుభములనుండి విముక్తుడవు కాగలవని 9 వ అ. 1 వ శ్లో.లోను, ఇట్టిజ్ఞానము నార్జించువిద్య జ్ఞానవిద్యయని, విద్యలలో రాజు (రాజవిద్య) యని, నశించనిదియని 2 వ శ్లో.లోను ఉన్నది. 8 వ అ. 20 వ శ్లో.లో చెప్పబడిన భావము అనగా విజ్ఞాన సహితమైన జ్ఞానమను భావము (జ్ఞాన విజ్ఞాన భావములు) కర్మబంధ విముక్తులను జేయునవి యని, (మోక్ష పరమపదమును జేర్చునవియని) బ్రహ్మ(భ్రమ)చేత మాయయందుండి వచ్చినదని 8 వ అ, 18, 19 శ్లో.లలో చెప్పబడిన ఈప్రపంచములో రాగద్వేషాది గుణములు కర్మబంధమును కలుగజేయునవియని 16 వ అ. 5 వ శ్లో.లోను, ఇట్లు ఈ లోకములో రెండు విధములగు ప్రవర్తనలుగల గుణములున్నవని 6 వ శ్లో.లోను, ఈ రెండు విధములగు గుణముల ప్రవర్తనలగు నివృత్తి ప్రవృత్తి మార్గములను అసురులు అనగా రాగద్వేషాది గుణములు గలవారు ఎరుగరని వీరియందు మంచి ప్రవర్తన, సత్యమును ఉండదని 7 వ శ్లో.లోను ఉన్నది. ఇట్లు విజ్ఞానసహితమైన జ్ఞానమును (జ్ఞాన విజ్ఞానములు) గలవాడగు కృష్ణుడు విజ్ఞానమువలన ఎరిగి చెప్పును. అట్టి విజ్ఞానము గలవారందరును చెప్పుదురు. అట్టి కృష్ణుడును, అట్టివారందరును పురుషులలో ఉత్తములు. అంతియెకాని, భగవంతులు కారు. నశించనివి, అనాదియై యున్నవియగు జ్ఞాన విజ్ఞాన భావములు (గుణములు) నశించునట్టి భ్రమవలన మాయయందుండి వచ్చి నశించునట్టి ప్రపంచములో ఎవరియందును లేవు.

నశించనిది, సర్వోత్కృష్టమైనది, జన్మమునకు రాని స్థానమని 8 వ అ. 21 వ శ్లో. లలో చెప్పబడిన పరమపదముగా ఉన్న పరమతేజస్సు లేదు.

విజ్ఞానము గలవారి విజ్ఞాన ప్రవర్తనను, అట్టి వారిచేత చెప్పబడినవియగు నిష్కామాది పవిత్ర ప్రేమభావముల ప్రవర్తనను వ్రాసి, ఇది రాగద్వేషాది గుణములు గలవారియందున్న భ్రమచేత వేదములయందును, ఉపనిషత్తులయందును, బ్రహ్మ సూత్రాది శాస్త్రములయందును అవ్యక్తముగ వ్రాయబడినవి, రాగద్వేషాది గుణములు గలవారి భ్రమచేత అవ్యక్తముగ చేయబడునవి యగు యోగము, ధ్యానములు, నామస్మరణలు మొదలగు రాగ ద్వేషా గుణములు గలవారి ప్రవర్తనలు వ్రాసినారు. ఇవి 12 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడినటుల అధికదుఃఖములకు కారణమగు అవ్యక్తాసక్తితో చేయు అవ్యక్త ప్రవర్తనలు (గ్రుడ్డివారు పోవు మార్గములు). ఇట్టి తప్పు ప్రవర్తనలు వ్రాసి ఇవి భగవంతుడు కృష్ణుడుఅర్జునునకు చెప్పినవియని ఇది భగవద్గీతయని, ఉపనిషత్ అని వ్రాసిన కల్పితగాధయే గాని, కృష్ణుడు అర్జునునకు చెప్పినది కాదు. ఇది కృష్ణార్జునుల సంవాదము కాదు. భగవద్గీతయనునది లేదు. సర్వము నెరిగిన విజ్ఞానముగల కృష్ణుడనువాడు ఉండవచ్చును. కాని. భగవంతుడను కృష్ణుడు లేడు. ఈ ప్రపంచములో ఉన్నవి రెండు విధములగు ప్రవర్తనలుగల గుణములేగాని, భగవంతుడు లేడు. భగవంతుడు చెప్పుట యనునదియును లేదు. ఈ భగవద్గీత కల్పితము.

ఈ ప్రపంచములో మానవులు నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్వము, పవిత్ర ప్రేమభావములతో ప్రవర్తించుటకు విజ్ఞానము నార్జించుటకై ప్రయత్నము చేయవలెను. విజ్ఞానము గలవారికి విజ్ఞానముయొక్క ప్రవర్తన తెలియును. రాగద్వేషాది గుణముల ప్రవర్తన, వారి స్వభావమను గుణముయొక్క ప్రవర్తన తెలియును. వారియందు విజ్ఞానముయొక్క నిష్కామాది పవిత్రప్రేమ భావముల ప్రవర్తన యుండును. కాని, రాగద్వేషాది గుణములుండవు. అందువలన ఈ గుణముల ప్రవర్తన యుండదు.

ఈ సర్వమును బ్రహ్మ (భ్రమ)కు వెయ్యి యుగములు పగలు అని,వెయ్యి యుగములు రాత్రియని 8 వ 17 వ శ్లో.లో ఉన్నది. ఎరుగనినిర్ణయము. బ్రహ్మకు

పగటికాలమందు అవ్యక్తమను పేరుగల ప్రకృతి (మాయ) యందుండి వచ్చి రాత్రి రాగానే ఆ మాయయందే కలియుచు, మరల వచ్చుచున్నవనునది ఎరుగనినిర్ణయము. ఎరుగని దానినే కాన్పించని ప్రకృతి (మాయ) అని వ్రాసినారు. తెలియబడనిదానిని గురించి చెప్పుకొనునది ఎరుగని నిర్ణయమే కాని, చూచి ఎరిగి చెప్పుకొనుట కాదు. గనుక, దీనిని (సృష్టిని) గురించిన నిర్ణయము అనవసరము.

జీవులు స్త్రీ,పురుషుల శరీరముల సంయోగమువలననే పుట్టుచుండుటకాన్పించుచున్నవి. శరీరమును విడిచినపుడు ఎచ్చటికి పోవునది కాన్పించదు. అందువలన జన్మలను గురించి ఆలోచించుట అనవసరము వాద ప్రతివాదములును అనవసరము. అనగా వీనిని గురించిన వాదములవలన ప్రయోజనము లేదు.

మానవులు కర్మద్వారానే సర్వమును అనుభవించుట కాన్పించుచున్నది. మానవులు ఇతరులకు సుఖమును కలుగజేయు కర్మవలన సుఖమును, యితరులకు బాధ కలుగజేయు కర్మవలన బాధను అనుభవించుచున్నారనినచో, యితరులకు సుఖములనిచ్చు కర్మలనే చేయవలయును కాని, బాధలను కలిగించు కర్మలను చేయ కూడదు. అందువలన సుఖముగ జీవించుచుందురు.

ఇవి యన్నియును పంచభూతములవలన సహజముగ జరుగుచున్నవనినచో పుణ్య పాపములతోను, ధర్మాధర్మములతోను పనిలేదు. పరమాత్మ (పరమతేజస్సు) భగవంతుడు, ఈశ్వరుడు, కృష్ణుడు సర్వమును జేయుచున్నాడనినచో అప్పుడును మానవులు దేనికొరకును కర్మ చేయ ప్రయత్నించ నవసరము లేదు. పుణ్య పాపములతోను, ధర్మాధర్మములతోను పనిలేదు. ఆ భగవంతులతోను పనిలేదు. అటుల గాక, మానవులు చేయు కర్మలవలననే భగవంతుడు వారిని సుఖ దుఃఖములను అనుభవింప జేయుచున్నాడనినచో, మానవులు సుఖముగా జీవించవలెనని మంచి ప్రవర్తన మీదనే ఆధారపడవలెను. గాని తప్పు ప్రవర్తన గలవారు కాగూడదు. అంతియె కాని, భగవంతునితో పని లేదు.

మానవులు కర్మబంధములనుసట్టి సుఖ దుఃఖములు లేనివారు గావలయునని నచో కర్మలయందు రాగద్వేషాది గుణములుండకూడదు. నిష్కామము, సమత్వ

బుద్ధి, నిత్యసత్వము, పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించవలయునుగాని భగవంతునితో పనిలేదు.

ఈ ప్రపంచమునందు కామ రాగద్వేషాది గుణముల ప్రవర్తన గలవారును ఈ గుణముల ప్రవర్తన లేనివారగు నిష్కామాది పవిత్రప్రేమ భావముల ప్రవర్తన గలవారును ఉన్నారు. ఈ రెండు విధములగు గుణముల ప్రవర్తనలు గలవారియందును ప్రవర్తించు స్వభావముయొక్క ప్రవర్తన ఉన్నది.

ఇది రాగద్వేషాది గుణముల కర్మవలన ఏర్పడిన ప్రవర్తన. అనగా, మానవులయందున్న రాగద్వేషాది గుణములు చేయు కర్మలను మరల యింకొకపుడు వారికి వారి స్వభావమను గుణము చేయును. ఈ విధముగ ప్రవర్తించు జీవుల స్వభావమను గుణమును పరమాత్మ (పరమతేజస్సు) ఈశ్వరుడు, కృష్ణుడు అని, ఈ స్వభావముయొక్క ప్రవర్తనను పరమాత్మ (పరమ తేజస్సు), ఈశ్వరుడు, కృష్ణుడు స్వయముగ ప్రవర్తింప జేయుచున్నాడని ఈ గీతయందు అజ్ఞానవిద్యయగు బ్రహ్మ (భ్రమ) విద్య నేర్చినవారు భ్రమచేత వ్రాసియున్నారు. అంతియేకాని ఈ ప్రపంచములో ప్రవర్తించు పరమతేజస్సు లేదు. ఈశ్వరుడు లేడు. భగవంతుడు లేడు భగవద్గీత యనునది లేదు. జీవుల స్వభావముయొక్క ప్రవర్తనను, విజ్ఞానముయొక్క ప్రవర్తనను, పరమతేజస్సును చూచు జ్ఞానమను భావముయొక్క ప్రవర్తనను భగవంతుడు, ఈశ్వరుడు, కృష్ణుడు చేయుచున్నాడని వ్రాసినారు.

ఈ ప్రపంచము సూక్ష్మ స్థూలరూపములతో యున్నది. ఇందుజీవులుసుఖములను, బాధలను అనుభవించుచున్నవి. ఇట్లనుభవించుటకు జీవులయందున్న కామ రాగద్వేషాది గుణములు కారణము. ఎట్లనగా, ఈ గుణములు చేయు కర్మలను మరల యింకొకపుడు ఆ జీవులకు వాని స్వభావము చేయుచుండును. ఈ కర్మలను, కర్మలఫలమును జీవులు వాని స్వభావమువలననే అనుభవించుచుండును. ఇట్టిస్వభావమను గుణము జీవులకు సహజముగనె ఉన్నది. మానవులు రాగద్వేషాది గుణముల చేత నాది, నావారు అను మమత్వముతో స్వార్థపరులై ప్రవర్తించుటవలననే సుఖదుఃఖముల ననుభవించుచున్నారు. అనేక జన్మల నెత్తుచున్నారు. సుఖములను, కష్ట

దుఃఖములను అనుభవించుట కాన్పించుచున్నది. కాని, జీవులు ఒక శరీరమునుండి బయలుదేరి యింకొక శరీరమునందు ప్రవేశించి జన్మించుట (జన్మలనెత్తుట)కాన్పించుట లేదు. మానవులయందున్న రాగద్వేషాది గుణములు చేయు కర్మలను మరల యింకొకపుడు వారికి వారి స్వభావము చేయుచుండును. ఈ కర్మలయందును మరల రాగద్వేషాది గుణములు ప్రవర్తించుచుండును.

మానవులయందున్న రాగ,ద్వేషాదిగుణముల ప్రవర్తన అందరికిని కాన్పించుచుండును. జీవుల స్వభావముయొక్క ప్రవర్తన విజ్ఞానము గలవారు ఎరిగియున్నారు గాని రాగ, ద్వేషాది గుణములు గలవారెరుగరు. జ్ఞానము విజ్ఞానము గలవారు ఈ ప్రపంచమునందు అరుదుగా ఉన్నారు. వారికి జ్ఞానముద్వారా (పరమ తేజస్సునట్టి) ఒకతేజస్సు కాన్పించినప్పుడు వారియందున్న విజ్ఞానము వారు ఆతేజస్సును చూచుట ఎరిగియున్నది. తదుపరి ఈ ప్రపంచముయొక్క ప్రవర్తనను ఎరిగియున్నది.

అప్పుడు వారియందు కామ, రాగ, ద్వేషాది గుణముల ప్రవర్తన యుండదు. వారి పూర్వకర్మయను సంస్కారము ననుసరించి వారి స్వభావము ప్రవర్తించు కర్మలయందు వారియందున్న విజ్ఞానము నిష్కామభావము, సమత్వబుద్ధి, నిత్య సత్వము, పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించుచుండును. ఈ విజ్ఞానముయొక్క ప్రవర్తన కాన్పించుచుండును.

వారు కర్మరహితులైనపుడు వారియందున్న విజ్ఞానము వారిని విడిచివెళ్ళునని వారికి జ్ఞానముద్వారా కాన్పించిన తేజోలోకమునకు జ్ఞానముద్వారానే చూచుచు వెళ్ళుదురని చెప్పుచున్నారు. అంతియేకాని, వారు కర్మరహితులైనపుడు ఎరిగి చెప్పునది లేదు. అందువలన వారు కర్మరహితులగుట, ఆ తేజస్సును చూచుచు, ఆ తేజోలోకమునకు వెళ్ళుట, అచ్చట యుండుట చూచి చెప్పువారు లేరు. ఇది ఎరిగిచెప్పుట కాదు.

రెండు విధములగు గుణముల ప్రవర్తనలు గలవారు ఈ ప్రపంచమునందు కాన్పించుచుందురు. అంతియేకాని, ఇంకొక ప్రవర్తన గలవాడు లేడు, ప్రవర్తన లేదు. సర్వమును గుణముల కర్మవలననేజరుగుచున్నది. జ్ఞానముగలవారియందున్న

విజ్ఞానముయొక్క నిష్కామాది పవిత్ర ప్రేమ భావముల ప్రవర్తనవలన వారిని గుర్తించి, వారు చెప్పునటుల చేయుచున్నచో, వారివలన వీరును జ్ఞాన, విజ్ఞానములు గలవారై, వారివలెనె విజ్ఞానమువలన సర్వమునెరిగి గుణరహితులై, నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తింపబడు వారగుదురు. ఈ ప్రవర్తనగలవారు కర్మ రహితులై ఆ తేజోలోకమును చేరుదురని చెప్పబడుదురు.

మనము చేయు పాపములు మనము అనుభవించకుండ జేయువాడెవడైనను యున్నాడా? ఉన్నచో మనము పాపములు చేయుటకు భయపడ నవసరము లేదు. ఎందుచేతననగా ఆ పాపములు మనము అనుభవించనపుడు భయపడుటెందులకు? అటులనే పుణ్యకర్మలు చేయనవసరము లేదు. అటులగాక మనము చేయు పాప పుణ్యములను మనము అనుభవించకుండా తప్పించువాడు లేనపుడు వానిని మనము అనుభవించవలసినపుడు పాప కర్మలను విడిచి, పుణ్య కర్మలు చేయవలెను గాని, ఎవడో ఉన్నాడని వానికొరకు చూచుట తప్పు ప్రవర్తన. మనము ఇతరులకు కలిగించు సుఖమే మన సుఖము, ఇతరులకు కలిగించు బాధయే మనబాధ. ఈ విధముగ ఎవరు చేయునది వారే అనుభవించెదరు. మానవులు కర్మవలననే వృద్ధి, క్షయముల ననుభవించుచున్నారు. కాని, ఇంకెవరివలనను అనుభవించుట యనునదిలేదని కర్మ మీదనె ఆధారపడవలయును. అంతియెకాని, కర్మను విడిచి, ఎవడో ఉన్నాడని వాని కొరకు చూచుట తప్పు ప్రవర్తన.

అటులనే జ్ఞాన, విజ్ఞాన భావముల ప్రవర్తనవలన పరమ పదమనునట్టి తేజో లోకమును జేరుచున్నారు గాని, అచటికి చేర్చు భగవంతుడు లేడు. ఈ రెండు ప్రవర్తనలు గలవారు ఈ ప్రపంచమునందు కాన్పించుచుండ, ఎవడో భగవంతుడున్నాడని, వానికొరకు చూచుట, అనేక విధములుగ చేయుట కామ రాగ ద్వేషాది గుణముల అజ్ఞాన మార్గము. (తప్పు ప్రవర్తన).

రాగద్వేషాది గుణముల మంచి కర్మలకు మంచి ఫలమును, చెడ్డ కర్మలకు చెడ్డ ఫలమును అనుభవించుట ఉండునా? ఉండదా? ఉండదనినచో మంచి చెడ్డలను ఆలోచించ నవసరము లేదు. అనుభవించుట యుండుననినపుడు మంచి చెడ్డలను

ఎరిగి మంచినే చేయవలయును గాని, ఎవడో అవ్యక్తముగా ఉన్నాడని వానికొరకు చూచుట తప్పు మార్గము(ప్రవర్తన). అటులనే, విజ్ఞానముయొక్క నిష్కామభావము సమత్వబుద్ధి, నిత్యసత్వము, పవిత్రప్రేమ భావముల ప్రవర్తనవలన కలుగు ఫలము కర్మరహితమగుట. కర్మరహితులు జన్మల నెత్తుట యుండదు. వారు (ఆ జీవులు) జన్మల నెత్తి యీ లోకమునుండి జన్మించుట యుండని పరమ పదమనునట్టి ఆతేజో లోకమునకు వెళ్ళుదురని చెప్పుచున్నారు. పరమపదమును చేరుటకు జ్ఞాన విజ్ఞానములను అవి యున్నవారి సాంగత్యమున వారిద్వారా ఆర్జించవలయును గాని, పరమ పదమును చేర్చు భగవంతుడున్నాడని వాని కొరకు చూచుట అనేక విధములుగ్గ చేయుట తప్పు మార్గములు (ప్రవర్తనలు). ఈ ప్రపంచములో భగవంతుడనిచేయు సర్వమును రాగద్వేషాది గుణముల తప్పు ప్రవర్తనలు.

ఈ ప్రపంచములో మానవులు అనుభవించు సుఖములును, దుఃఖములును, సర్వమును వారియందున్న గుణముల కర్మలవలన అనుభవించుచున్నారా? లేక భగవంతుడు కలుగజేయుచున్నాడా? మానవులు వారియందున్న రాగ, ద్వేషాది గుణములతో ప్రవర్తించుచున్నారు. ప్రేమతో కర్మలయందు ప్రవర్తించునపుడే సంతోషముతోను, ఆనందముతోను యుండుట కాన్పించుచున్నది. ఈ సంతోషముతో, ఆనందముతో ప్రవర్తించునపుడే సుఖముగ నుండుట కాన్పించుచున్నది. ఇట్లు సుఖముగ నుండుట ప్రేమతో కర్మ చేయుచుండుట (ప్రవర్తించుచుండుట) వలననే గాని ఎవని వలనను అనుభవించుట లేదు. ఇది ప్రేమయొక్క లక్షణము (ప్రేమలోనున్న స్థితి) ఈ విధముగా ఒకరి యందొకరు ప్రేమతో నుండునపుడు ప్రవర్తించునపుడు ఇరువ్వురును అధిక సంతోషముగను సుఖముగను ఉండుట కాన్పించుచున్నది. ఇది యిరువురి ప్రేమవలన యిరువురును అనుభవించు సంతోషము. ఆనందము. సుఖము. ఇట్లే ద్వేషముతోను కోపముతోను ఉండునప్పుడే కష్టమును బాధయును అనుభవించుచున్నారు. ఇది క్రోధ ద్వేషములలోనున్న లక్షణము (స్థితి). క్రోధ ద్వేషములతో ఒకరి యందొకరు ప్రవర్తించుచున్నపుడు క్రోధ ద్వేషములు అధికమై అధికకష్టములను అధిక బాధయును ఇరువురి వలనను అనుభవించుచున్నారు. క్రోధ ద్వేషముల కర్మవలన యింకను అధిక దుఃఖ కష్టముల ననుభవించుచున్నారు.

ఈ విధముగ ప్రకృతి గుణమును, ఆ గుణముయొక్క లక్షణమగు స్థితిని ఆ గుణము ప్రవర్తించుచున్నపుడు అనుభవించుచున్నారు. ఇది ప్రత్యక్షముగకాన్పించు చున్నది. ఈ విధముగ గుణముల కర్మవలన సుఖములును కష్ట దుఃఖములనుఅను భవించుచుండుట మానవులయందేగాక అన్ని జీవ జంతువులయందును కాన్పించు చున్నవి. ఇట్లు గుణముల కర్మవలన వెంటనేగాని ఆలస్యముగగాని గుణముల కర్మ ఫలమును సర్వమును అనుభవించుచున్నారు. ఇట్లనుభవించు స్వభావము (గుణము) జీవులకున్నది. ఇట్లు గుణములు ప్రవర్తించుచున్నపుడు గుణముల ననుభవించు చున్నారు. వాని ప్రవర్తనవలన కలుగు ఫలము ననుభవించుచున్నారు. ఈ విధముగ గుణములవలన ప్రవర్తింపబడుచున్న ఈ ప్రపంచము బ్రహ్మ(భ్రమయను గుణము) వలన మాయయందుండి వచ్చి నశించి మాయయందే కలియుచు మరల వచ్చుచున్న దని ఈ గీతయందు 8 వ అ. 18, 19 వ శ్లో.లలోను, బ్రహ్మతో సహా ఈ సర్వ ప్రపంచము నశించునదియని 20 వ శ్లో.లోను, ఉన్నది, నశించునట్టి బ్రహ్మ యను నది ఈ ప్రపంచమునందు ప్రవర్తించుచున్న భ్రమయను గుణమేగాని భగవంతుడు కాదు. భగవంతుడు లేడు.

మానవులు వారియందున్న గుణములవలన సర్వమును అనుభవించుచున్నారు. ఇట్లు అనుభవించుటకు సర్వజీవులకును స్వభావమను గుణమున్నది. భగవంతుడు లేడు.

స్త్రీ,పురుషుల సంయోగమువలన జీవులు శరీరములతో పుట్టుచుండుటకాన్పించు చున్నవి. ఈ విధముగ పుట్టువానినే క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగముచేతనే సర్వ భూతములును పుట్టుచున్నవని 13 వ అ. 27 వ శ్లో.లో ఉన్నది. ఇట్లు పుట్టుటకు ఈ ప్రపంచమును సృష్టించినదనిన భ్రమయే కారణము. ఈ భ్రమను జయించిన వానియందు కామ, రాగ, ద్వేషాది గుణములును ఉండవు. అందువలన వాడుపుట్టుట ఉండదు. ఇట్లు మానవులు పుట్టుటకును పుట్టకుండ యుండుటకును భ్రమయనురాగ, ద్వేషాది గుణములును కారణము అంతియెకాని, యింకెవడును కారణము కాదు.

— o —

## గ మ ని క

స్వల్పముగా అచ్చుతప్పులు పడినవి. వాటిని ఈ క్రింద తెలియజేసితిమి.

| | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 5 వ అ. 11 వ శ్లో.లో చివర వాక్యంలో | కుద్వన్తి | కుర్వన్తి |
| 23 వ శ్లో.లో చివర వాక్యంలో | యక్తస్య | యుక్తస్య |
| 7 వ అ. 15 వ శ్లో.లో చివర వాక్యంలో | షూయయా | మాయయా |
| 11 వ అ. 13 వ శ్లో.లో | పాంజవస్తదా | పాండవస్తదా |

9 వ అ. 25 వ శ్లోకము తా. లో 2 వ వాక్యంలో "భూతముల నారాధించువారు భూతములను, నన్ను ఆరాధించువారు" నన్ను పొందుచున్నారు. అని చదువవవలెను.

9 వ అ. 29 వ శ్లో. తా.లో చివరలైనును "వారు నా యందున్న వారగుదురు. నేను వారియందున్న వాడనగుదును" అని చదువవలెను.

15 వ అ. 12 వ శ్లో.లో మొదటి లైనులో చివర జగద్భానయతేఽభిలం – జగద్భాసయతేఽఖిలం

18 వ అ. 16 శ్లో.లో వ్యా.లో 6 వ లైనులో చివర "జీవులను, కర్మ" చేయు గుణములను అని చదువవలెను.

"మా మాట"లో 8వ లైనులో ది. 17–12–1956 ను ది. 7–12–1956 యని చదువ వలెను.

# మా మాట

భగవద్గీత వ్యాఖ్యాత శ్రీసచ్చిదానంద మూర్తిగారు. వీరి పూర్వవృత్తాం
తము కొంచెము తెలియజేయదలచితిమి. వీరి తల్లిగారు శ్రీ చిన్నమ్మగారు. పరమ
తేజస్సు దర్శనమైనవారు. శ్రీ చిన్నమ్మగారు రాగ, ద్వేషాది గుణములు లేక
అందరియందును సమభావమున పవిత్ర భావములతో ప్రవర్తించిన శ్రీకృష్ణ, బుద్ధ,
వర్ధమాన మహావీరుడు, వేమన, రామకృష్ణ పరమహంస, దొంతులమ్మ, రంగాప
దూత, క్రీస్తు సోక్రటీసు మొదలగు జ్ఞానులకోవకు చెందినవారు. వీరు విజ్ఞానముచేత
సర్వము నెరిగి నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తింపబడుచూ గుణ
రహితులై, వృత్తి రహితులై అభిమాన రహితులై ది. 17-12-1956 న శరీర
మును విడిచినారు. (వీరు పరమపదమును బడసినవారని అనేకులు చెప్పుచుందురు.)
వీరి సుపుత్రులైన శ్రీ సచ్చిదానంద మూర్తిగారే ఈ గీత వ్యాఖ్యాత. వీరు
శ్రీ చిన్నమ్మగారి సాంగత్యము గలవారు. వారిద్వారా జ్ఞాన, విజ్ఞానముల నార్జించి
నారు. వీరు చిన్నమ్మగారిని ఆత్మ స్వరూపులని, పరమాత్మ స్వరూపులని, భగ
వంతులని ఎప్పుడునూ తలంచలేదు. వీరు 1944 జూన్ 4 వ తేదీన పరమతేజస్సు
దర్శనమైనవారు. అప్పటినుండి వీరియందు రాగ, ద్వేషాది ప్రకృతి గుణముల
ప్రవర్తన లేదు. అందువలన వీరియందు రాగద్వేషాది గుణములులేవని చెప్పవలెను
అట్టి వారియందు కోరికతోసహా రాగ, ద్వేషాది గుణములుండలేక వారిని విడిచి
వెడలి పోవునని వీరు చెప్పుచుందురు. వారి ప్రవర్తనయందు విజ్ఞానముయొక్క
నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్యము, పవిత్రప్రేమ భావముల ప్రవర్తనఉండు
నని, నాది, నావారను రాగ, ద్వేషాది గుణముల ప్రవర్తన ఉండదని వీరు చెప్పు
చుందురు. వీరును నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించుచూ అనేకు
లకు అట్టి ప్రవర్తన చెప్పుచుందురు.

వీరు భగవద్గీతయని వ్రాసిన ఈ గీతలో ఉన్న మార్గముల (ప్రవర్తనల)
నెరిగియున్నారు. ఈ గీతయందు విజ్ఞానము గలవారు సర్వము నెరిగి నిష్కామాది
పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించు ప్రవర్తనను వ్రాసి దానిని రాగ, ద్వేషాది
గుణముల ప్రవర్తనగా వ్రాసినారని; రాగ, ద్వేషాది ప్రవర్తనలు గ్రుడ్డివారు పోవు

# గీతా వ్యాఖ్యానము

## అర్జున విషాద యోగము

## 1 వ అధ్యాయము

ధృతరాష్ట్ర ఉవాచ :- ధృతరాష్ట్రుడు చెప్పెను.

శ్లో. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయ ॥ 1

తా. సంజయా ! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమందు యుద్ధ సన్నద్ధులైయున్న నా వారలును, పాండవులును ఏమి చేసిరి ?

సఞ్జయ ఉవాచ :- సంజయుడు చెప్పెను.

శ్లో. దృష్ట్వా తు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా।
ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్ ॥ 2

తా. రాజైన దుర్యోధనుడు వ్యూహాకారముగా నొనర్పబడియున్న పాండవ సైన్యమును జూచి, ద్రోణాచార్యునితో నిట్లు పలికెను.

శ్లో. పశ్యైతాం పాణ్డుపుత్రాణామాచార్య
మహతీం చమూం।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥ 3

తా. ద్రోణాచార్యా ! నీకు శిష్యుడును, బుద్ధిమంతుడును, ద్రుపదరాజ పుత్రుడు నగు దృష్టద్యుమ్నునిచేత వ్యూహాకారముగా నేర్పరుప బడినదియు గొప్పదియునగు పాండవ సైన్యమును చూడుము.

శ్లో. అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ 4

తా. ఈ పాండవ సేనయందు మిగుల గొప్ప విలుకాండ్రును, యుద్ధమునందు భీమార్జునులతో సమానులునగు శూరులైన వారలను చెప్పుచున్నాను వినుము.

శ్లో. ధృష్టకేతుశ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్।
పురుజిత్కుంతి భోజశ్చశైబ్యశ్చ నరపుంగవః॥ 5

తా. ధృష్టకేతుపును, చేకితానుడును, పరాక్రమ వంతుడగు కాశీరాజును, పురుజిత్తును, కుంతి భోజుడును, పురుష శ్రేష్ఠుడగు శైభ్యుడున్ను,

శ్లో॥ యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః॥ 6

తా. పరాక్రమశాలియగు యుధామన్యుడును, పరాక్రమవంతుడగు ఉత్తమౌజుడును, సుభద్రా పుత్రుడగు అభిమన్యుడును, ఉప పాండవులును వీరందరును మహారధులు.

శ్లో॥ అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ।
నాయకా మమసైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమితే॥ 7

తా. బ్రాహ్మణోత్తమా! మన వారిలో నెవరు శ్రేష్ఠులో నా సైన్యమునకు అధిపతు లెవరో వారిని చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ। కృపశ్చ సమితింజయః।
అశ్వత్థామా వికర్ణశ్చ। సౌమదత్తిస్తథైవ చ॥ 8

తా. నీవును, భీష్ముడును, కర్ణుడును, యుద్ధమునందు జయశీలుడైన కృపాచార్యుడును, అశ్వత్థామయును, వికర్ణుడును, భూరిశ్రవుడును,

శ్లో॥ అన్యే చ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః।
నానాశస్త్రప్రహరణాస్సర్వే యుద్ధవిశారదాః॥ 9

తా. అనేకులు ఇతర పరాక్రమ వంతులును, నానావిధ శస్త్రాస్త్రములను గలిగియుండువారును యుద్ధమున మహానేర్పరులును నా కొరకు ప్రాణములను విడువ సంసిద్ధులై యున్నారు.

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్॥ 10

తా. అట్టి మన సైన్యము అపరిమితమైనదియు, భీష్మునిచే రక్షింపబడు చున్నదియునై యున్నది. పాండవసైన్యము పరిమితమైనదియు, భీమునిచేత రక్షింప బడునదియునై యున్నది.

శ్లో॥ అయనేషు చ సర్వేషు। యథాభాగమవస్థితాః।
భీష్మమేవాభి రక్షన్తు। భవంతస్సర్వ ఏవ హి॥ 11

తా. కాబట్టి మీరందరును అన్నివిధములమీ స్థానములను విడువక భీష్ముని కాపాడుచుండవలయును.

శ్లో॥ తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥

తా. పరాక్రమశాలియు, తాతయునగు భీష్ముడు దుర్యోధనునికి సంతోషము పుట్టించుటకు సింహనాదముచేసి శంఖమును పూరించెను.

శ్లో॥ తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।
సహసై వాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్॥ 13

తా. పిమ్మట కౌరవసైన్యము శంఖములు, తప్పెటలు, మొదలగు యుద్ధ వాద్యములను ప్రయోగించిరి. ఆ వాద్యముల ధ్వని అంతటను వ్యాపించినదాయెను.

శ్లో॥ తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌశంఖౌ ప్రదధ్మతుః॥ 14

తా. ఆ తరువాత తెల్లని గుఱ్ఱములతో కూడినదియు గొప్పదియు నగు రథమునందు కూర్చుండియున్న కృష్ణార్జునులు దివ్యములగు శంఖములను పూరించిరి.

శ్లో॥ పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।
పౌండ్రందధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః॥15

తా. శ్రీకృష్ణుడు పాంచజన్యమను శంఖమును, అర్జునుడు దేవదత్తమను శంఖమును పూరించెను. భీముడు పౌండ్రమను గొప్ప శంఖమును పూరించెను.

శ్లో॥ అనంతవిజయం రాజా। కుంతీపుత్రో యుధిష్ఠిరః।
నకులస్సహదేవశ్చ। సుఘోషమణిపుష్పకౌ॥ 16

తా. ధర్మరాజు అనంత విజయమను శంఖమును, నకుల సహదేవులు సుఘోషమణి పుష్పకమను శంఖములను పూరించిరి.

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖండీ చ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ। సాత్యకిశ్చాపరాజితః॥ 17

తా. కాశీరాజును, శిఖండియును, ధృష్టద్యుమ్నుడును, విరాటుడును, సాత్యకియును,

శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।
సౌభద్రశ్చ మహాబాహుశ్శంఖాన్ దధ్ముః
పృథక్పృథక్॥ 18

తా. ద్రుపదుడును, ద్రౌపదీ పుత్రులగు ప్రతి వింద్యాదులును, సుభద్రా పుత్రుడగు అభిమన్యుడును, వీరందరును వేరు వేరుగా శంఖములను పూరించిరి.

శ్లో॥ స ఘోషోధార్తరాష్ట్రాణాం హృదయాని
వ్యదారయత్।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్॥ 19

తా. సంకులమైన ఆ ధ్వని ఆకాశమును, భూమిని ప్రతిధ్వనులచేత నింపించినదై దుర్యోధనాదుల గుండెలను బ్రద్దలు చేసెను. (కలవర పరచెను).

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వాధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః॥ 20

శ్లో॥ హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే।

తా. ధృతరాష్ట్ర మహారాజా! అట్లు శంఖములను పూరించిన పిమ్మట శస్త్రములను ధరించి యుద్ధము ప్రారంభమగు చుండగా హనుమ ధ్వజుడగు అర్జునుడు యుద్ధ రంగమున సన్నద్ధులై నిలిచియున్న దుర్యోధనాదులను చూచి వింటిని ఎక్కుపెట్టి కృష్ణునితో నిట్లు చెప్పెను.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥21

తా. కృష్ణా! ఈ రెండు సేనలమధ్య యందు నా రథమును నిలుపుము.

శ్లో॥ యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్।
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే॥22

తా. ఈ యుద్ధరంగమునందు నే నెవ్వరితో యుద్ధము చేయవలయునో, ఎవరెవరు యుద్ధమునకు వచ్చి యున్నారో వారిని తెలిసికొనవలెను.

శ్లో॥ యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః॥　23

తా. దుష్టబుద్ధిగల దుర్యోధనునకు ప్రియము చేయదలచినవారై యుద్ధమును చేయుటకు ఎవరెవరు వచ్చియున్నారో వారలను నేను చూచెదను.

సంజయ ఉవాచ :- సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత।
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వారథోత్తమమ్॥ 24

శ్లో॥ భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితాం।
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి॥ 25

తా. ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుని చేత ఈ విధముగా చెప్పబడిన మాటలనువిని కృష్ణుడు రెండు సైన్యములయొక్క మధ్యమందు భీష్మ ద్రోణుల యెదుటను, ఇతర రాజుల యెదుటను రథమును నిలిపి అర్జునా! యుద్ధముచేయుటకు నిశ్చయులై కూడియున్న యా కౌరవులను చూడుమని చెప్పెను.

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్
పౌత్రాన్ సఖీంస్తథా॥ 26

శ్లో॥ శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి।

తా. అటు పిమ్మట అర్జునుడు ఉభయ సైన్యముల యందును ఉన్నట్టి తండ్రులను, తాతలను, గురువులను, మేనమామలను, మామలను, అన్నదమ్ములను, కుమారులను, మనుమలను, ఉపకారము చేయు స్నేహితులను చూచెను.

తాన్సమీక్ష్య స కౌంతేయస్సర్వాన్ బంధూనవస్థితాన్ 27

శ్లో॥ కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్॥

తా. అర్జునుడు యుద్ధరంగము నందున్న సమస్త బంధువులను చూచి దయచే ఆవరింప బడినవాడై దుఃఖించుచు నిట్లు పలికెను.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను!

దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం
సముపస్థితమ్॥ 28

శ్లో॥ సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥ 29

తా. కృష్ణా! యుద్ధముచేయ నిచ్ఛగలవారై యిచ్చటనిలిచియున్న, ఈ నావారలను చూచి నాఅవయవములు శిథిలమగుచున్నవి. నోరెండిపోవుచున్నది. నాదేహము వణకుచున్నది.

శ్లో॥ గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥ 30

తా. నా గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. దేహమునందు తపనము కలుగుచున్నది. నిలుచుటకు శక్తిలేకున్నది. మనస్సు భ్రమించు చున్నట్లున్నది.

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ।
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే॥31

తా. కృష్ణా! అనర్థ సూచకములగు దుశ్శకునములను చూచు చున్నాను. యుద్ధమునందు స్వజనులను వధించిన పిమ్మట శ్రేయస్సనునది కాన్పించుటలేదు.

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ। న చ రాజ్యం సుఖాని చ।
కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా॥ 32

తా. కృష్ణా! విజయమును, రాజ్యమును, సుఖమును కోరను. కృష్ణా! రాజ్యముచేతను, భోగములచేతను, జీవించి యుండుటచేత నేమి ప్రయోజనము?

శ్లో॥ యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ।
త ఇమేఽవ స్థితా యుద్ధే ప్రాణాం
స్త్యక్త్వా ధనాని చ॥ 33

తా. ఎవరి నిమిత్తము మనము రాజ్యమును, భోగములను, సుఖములను కాంక్షించుచున్నామో వారందరును ప్రాణములను, ధనమును విడిచి యుద్ధమునందు నిలిచి యున్నారు.

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రాస్తథైవ చ పితామహాః।
మాతులాశ్శ్వశురాః పౌత్రాస్స్యాలా స్సంబంధిన స్తథా॥

తా. గురువులును, తండ్రులును, పుత్రులును, తాతలును, మేనమామలును, మామలును, మనుమలును, బావమరదులును, యితర బంధువులును యుద్ధమునకు వచ్చియున్నారు.

శ్లో॥ ఏతాన్న హన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన।
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే॥35

తా. కృష్ణా! వారు నన్ను చంపువారలైనను, ముజ్జగముల రాజ్యాధిపత్యము లభించినను, వారలను చంపుటకు నిష్టపడను. ఈ భూలోకరాజ్యము కొరకు చెప్పవలసినదేమి?

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యా జ్జనార్దన।
పాపమేవాఽశ్రయే దస్మాన్ హత్వైతా
నాతతాయినః॥ 36

తా. కృష్ణా! దుర్యోధనాదులను సంహరించుటవలన మనకు సంతోష మేమి యున్నది. దుర్మార్గులైన వారిని హతమొనర్చిన మనకు పాపమే సంభవించును.

శ్లో॥ తస్మాన్నార్హా వయం హన్తుంధార్త
రాష్ట్రాన్స్వ బాంధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ॥37

తా. మాధవా! స్వబంధువులను వధించి యేమి సుఖమును పొందగలము. అందువలన బంధుపులగు దుర్యోధనాదులను సంహరించుట కర్హులము కాము.

శ్లో॥ యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్॥38

తా. దుర్యోధనాదులు రాజ్యలోభముచేత కులనాశము చేయుటవలన కలుగు దోషమును, మిత్ర ద్రోహమువలన కలుగు పాపమును చూడరు.

శ్లో॥ కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్ని వర్తితుమ్।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన॥ 39

తా. కృష్ణా! కుల నాశన మొనర్చుటచేత కలుగు దోషమును చూచుచున్న మేము పాపకార్యముల నెట్లు విరమింపగలమో తెలియుటలేదు.

శ్లో॥ కుల క్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః।
ధర్మే నష్టే కులంకృత్స్నమ ధర్మోఽభి భవత్యుత॥40

తా. కుల నాశము కలుగుటవలన అనాదియైన కులాచారములు నశించును. కుల ధర్మములు నశించుటవలన కులమునందు అధర్మము వృద్ధియగుచుండును.

శ్లో॥ అధర్మాభి భవాత్కృష్ణ ప్రదుష్యంతి కుల స్త్రియః।
స్త్రీ షు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥ 41

తా. కృష్ణా! అధర్మము వ్యాపించుటవలన కుల స్త్రీలు చెడిపోవుదురు. కృష్ణా! కుల స్త్రీలు చెడిపోవుటచే వర్ణసంకరము కలుగును.

శ్లో॥ సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ।
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియాః॥42

తా. కుల సంకరము వలన కులనాశకులకు నరకము కలుగును. అట్టివారల యొక్క పితృదేవతల పిండోదకాదులు ఇచ్చువారలు లేకపోవుటచే అధోగతిని పొందుదురు.

శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥

తా. వర్ణసంకరముచేయు కుల నాశకులయొక్క దోషములచేత శాశ్వతములై యున్న కుల ధర్మములును జాతి ధర్మములును నశించి పోవుచున్నవి.

శ్లో॥ ఉత్పన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।
నరకే నియతం వాసోభవతీత్యనుశుశ్రుమ॥ 44

తా. కృష్ణా! కుల ధర్మములను పోగొట్టుకొనిన వారలకు నరకమునందు ఎల్లప్పుడును నివాసము కలుగునని విని యున్నాము.

శ్లో॥ అహోబత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్।
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః॥ 45

తా. మనము ఎప్పుడు రాజ్య సుఖమునందలి లోభముచేత స్వజనులను చంపుటకు నుద్యుక్తులమైతిమో అప్పుడు గొప్ప పాపమును చేయుచున్న వారమైతిమి. ఎంత ఆశ్చర్యము! ఎంత కష్టము!

శ్లో॥ యది మామ ప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రారణే హన్యుస్తన్మే క్షేమతరంభవేత్॥ 46

తా. యుద్ధమునందు ప్రతీకారము చేయనట్టియు, నిరాయుధుడనైనట్టియు నన్ను దుర్యోధనాదులు ఆయుధములచే సంహరించినను మేలే కాగలదు.

# గీతా వ్యాఖ్యానము

## సాంఖ్యయోగము

## 2 వ అధ్యాయము

సంజయ ఉవాచ :- సంజయుడు చెప్పెను.

శ్లో॥ తం తథా కృపయాఽఽవిష్టమశ్రుపూర్ణాకులేక్షణం।
విషీదన్తమిదం వాక్యమువాచ మధుసూదనః॥ 1

తా. దయచే ఆవరింపబడినవాడును, కన్నీటితో వ్యాకులపడుచున్నవాడు నగు అర్జునుని గూర్చి కృష్ణుడు ఈ వాక్యమును చెప్పెను.

వ్యా. అర్జునుడు తనయందున్న మమత్వము నెట్లు జయింపవలెనో వానికి మొదట ఏది చెప్పవలెనో కృష్ణుడు దాని చెప్ప నారంభించెను.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్।
అనార్య జుష్టమస్వర్గ్యమకీర్తికర మర్జున॥ 2

తా. అర్జునా! అజ్ఞానులగు వారి యందుండి ప్రవర్తించునదియు, స్వర్గమునకు దూరముగా తీసికొని పోవునదియు, అపకీర్తికరమైనదియు నైన యీ పాడు మమత శత్రువులను జయించవలసిన యీ సమయమందు నీకెటుల గలిగెను.

వ్యా. జ్ఞానమున్నవారి యందుండనిదియు, జ్ఞానమును పొందగోరు వారిచేత ప్రవర్తింపబడ గూడనిదియునైన నాది, నావారు అను ఈమమతకు ఎవరును లోబడి ప్రవర్తించగూడదు.

శ్లో॥ క్లైబ్యం మా స్మ గమః పార్థనైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥ 3

తా. అర్జునా! నీ యందున్న పిరికితనమును విడువుము. ఇది నీకు తగినది కాదు. పరంతపా! నీచమైన హృదయ దౌర్బల్యమును విడిచి లెమ్ము.

వ్యా. అర్జుననకు మమత్వముచేత బలహీనత, పిరికితనము లేర్పడినవి. అవి కార్యసాధనకు ప్రతిబంధకములు. వారికి లోబడిన వారెట్టి కార్యమును సాధించలేరు. అందువలన, వానిని విడువుమని కృష్ణు డర్జునునకు చెప్పెను.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హౌ పరిసూదన॥ 4

తా. కృష్ణా! నేను యుద్ధమునందు పూజనీయులగు భీష్మ ద్రోణులను బాణములచేత నెదిరించి ఎట్లు యుద్ధము చేయుదును?

శ్లో॥ గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహలోకే।
హత్వాఽర్థ కామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్॥ 5

తా. మహానుభావులైన గురువులను చంపి యీ లోకమునందు అర్థ కామములను, రక్తసిక్తములైన భోగములను అనుభవించగలవాడనగుదును. గురువులను చంపుటకంటె ఈ లోకమునందు భుజించుటకు భిక్షాన్నమైనను మేలైనదిగదా!

శ్లో॥ న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యదివానోజయేయుః।
యానేవహత్వాన జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖేధార్త రాష్ట్రాః॥ 6

తా. ఎవరిని చంపి మనము జీవించుటకు నిచ్ఛగించమో వారే మొదట నిలిచి యున్నారు. మనము వారిని జయించెదమో లేక వారు మనలను జయించెదరో ఎరుగము. అందువలన మనకు ఏది శ్రేయస్కరమైనది.

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః।
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥ 7

తా. దయవలన కలిగిన దోషముచేత కొట్టబడిన స్వభావము గలవాడను గనుక ధర్మాధర్మములను నిర్ణయింపలేక నిన్నడుగుచుంటిని. నీకు శిష్యుడను, నిన్నాశ్రయించితిని. ఏది శ్రేయస్కరమని నిశ్చయింపబడుచున్నదో దానిని నాకు చెప్పుము.

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్।
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాఽధిపత్యమ్॥ 8

తా. ఈ భూమియందు నాకు నిష్కంటకాధిపత్యము లభించినను, ఇంద్రపదవి లభించినను, నా యింద్రియములను శోషింప చేయుచున్న యీ దుఃఖము తొలగదని నేను తలంచుచున్నాను.

వ్యా. గుణములే మానవులయందుండి ప్రవర్తింపుచుండును. అర్జునుడు ప్రకృతి గుణములు గలవాడై యుండెను. విజ్ఞానము వానియందులేదు. విజ్ఞానము గలవాడగు కృష్ణునియందు ప్రేమయున్నను, కౌరవులయందు ప్రేమ యుండుటచేత వారితో యుద్ధము చేయుటకు నిష్టములేనివాడై యుండెను. కృష్ణుని యందు ప్రేమచే కృష్ణుడు చెప్పు వాక్యములను త్రోసివేయలేకుండెను. అప్పుడేమియును చేయలేనివాడై "నేనేమి చేసిన నాకు శ్రేయస్కరమో చెప్పుమ"ని అర్జునుడు జిజ్ఞాసతో కృష్ణునడిగినటుల వ్రాసినారు.

సంజయ ఉవాచ :- సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః।
నయోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవహ॥ 9

తా. శత్రువులను తపింపజేయువాడగు అర్జునుడు కృష్ణునితో ఈ ప్రకారము చెప్పి యుద్ధము చేయనని ఊరకుండెను.

శ్లో॥ తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత।
సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః॥ 10

తా. ధృతరాష్ట్ర మహారాజా! రెండు సేనలమధ్య యందు వ్యసనపడుచున్న అర్జునుని గూర్చి కృష్ణుడు నవ్వుచున్నవానివలె ఈ వాక్యము పలికెను.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పండితాః॥ 11

తా. ఎవ్వరిని గురించి విచారము నొందగూడదో వారిని గురించి విచారపడుచున్నావు. ఎరిగినవారు మాట్లాడినటుల మాట్లాడుచున్నావు. ఎరిగినవారు చచ్చిన వారిని గూర్చియు, బ్రతికియుండినవారిని గూర్చియు దుఃఖింపరు.

శ్లో॥ న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః।
న చైవ న భవిష్యామస్సర్వే వయమతః పరమ్॥ 12

తా. నీవు, నేను, ఈ రాజులు ఎప్పుడును ఉండియున్నాము. ఇక ముందు ఉండమనునదియునులేదు.

శ్లో॥ దేహినోఽస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతరప్రాప్తిర్ధీరస్తత్ర న ముహ్యతి॥ 13

తా. దేహముల యందున్న జీవుడు ఈ దేహముల యందుండి బాల్యము, యౌవనము, ముసలితనము నెటుల పొందుచుండునో అటులనే ఈ దేహములను విడిచి క్రొత్త దేహములను ధరించు చుండునని ధీరుడైనవాడు అనగా విజ్ఞానము గలవాడు మోహమును జెందడు.

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖ దుఃఖ దాః।
ఆగమాపాయినోఽ నిత్యాస్తాం స్తితిక్షస్వ భారత॥ 14

తా. అర్జునా! శబ్దాది విషయ సంబంధమువలన కలిగిన శీతోష్ణ సుఖములు, దుఃఖములు రాకపోకలు గలవియును అనిత్యములునై యున్నవి. వానిని నీవు సహింపుము.

శ్లో॥ యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ।
సమ దుఃఖ సుఖం ధీరం సోఽమృత త్వాయ కల్పతే॥

తా. అర్జునా! విషయ సంబంధమువలన గలిగిన సుఖ దుఃఖములు సమానముగా నెవనికి కాన్పించుచుండునో అట్టి ధీరుడగు పురుషుని అవి బాధించలేవు. అతడే మోక్షపదవికి అర్హుడు.

వ్యా. 11, 12, 13, 14, 15 శ్లోకములయందు చెప్పబడినవి విజ్ఞానము గలవారి లక్షణములు. ఇందు వ్రాసిన సుఖ దుఃఖములు పూర్వజన్మ కర్మ సంస్కారములు. అట్టివారిని బాధించలేవు. వారే మోక్షపదవికి అర్హులు. అర్జునుడు కూడ సుఖ దుఃఖములు కలిగినను వానిని సమానముగా చూడ వలెను. కాబట్టి విజ్ఞానమును పొందవలెను. అదియే సుఖ దుఃఖములను సమముగ చూచును.

శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వ దర్శిభిః॥16

తా. శరీరము నశించునుగాని జీవుడు నశించువాడుకాదు. ఈ రెంటియొక్క స్వభావములను పరమపదము నెరిగినవారే ప్రత్యక్షముగా నెరిగియున్నారు.

శ్లో॥ అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతం।
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి॥ 17

తా. ఎవడు సర్వ ప్రపంచమును వ్యాపించియున్నాడో, వాడు నశించువాడు గాడని ఎరుంగుము. అట్టి శాశ్వతుడైన వానిని నాశనము చేయువాడెవ్వడునులేడు.

శ్లో॥ అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥ 18

తా. శాశ్వతముగ నుండువాడును, నాశన రహితుడునగు జీవుడు ధరించు ఈ శరీరములయున్ని నశించునవని చెప్పుదురు. ఈ జీవుడు ఏ ప్రమాణములచేతను తెలియబడడు. కాబట్టి అర్జునా! యుద్ధము చేయుము.

వ్యా. జీవుడు ఏ విధముగను, ఏ శాస్త్రప్రమాణముచేతను నెరుగబడడు. పరమపదము నెరిగినవారే జీవుని, శరీరమును, వాని స్థితులను ప్రత్యక్షముగా నెరిగియున్నారు. జీవుడు ధరించు శరీరములన్నియు నశించుచుండును. వాడు నశించువాడు కాడు. పరమపదముగా నున్న తేజస్సు దర్శనము కానంతవరకును జీవుని స్థితిని ఎరుగజాలరు. జీవులతోనున్న ఈ సర్వప్రపంచము మాయా భ్రమవలన మాయ యందుండి వచ్చినది. (8 వ అ. 18, 19 శ్లో.) కాని జీవుడు ఈ సర్వ ప్రపంచమును వ్యాపించియుండలేదు.

శ్లో॥ య ఏనం వేత్తిహంతారం యశ్చైనం మన్యతే హతం
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే॥19

తా. ఎవడు జీవుని చంపువానినిగా తలంచుచున్నాడో, ఎవడు జీవుడు చంపబడు వాడని తలంచుచున్నాడో వారిరువురును తెలిసినవారుకాదు. జీవుడు చంపువాడుకాదు. చంపబడువాడుకాదు.

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ 20

తా. జీవుడు పట్టుకలేనివాడు, నిత్యుడు, శాశ్వతుడు. అనాది పుట్టువాడుకాదు. చచ్చువాడుకాదు. ఇదివరకు లేకుండి మరల నుండువాడునుకాదు. శరీరము నశించును. జీవుడు నశించువాడుకాదు.

శ్లో॥ వేదా వినాశినం నిత్యం య ఏనమజమవ్యయం।
కథం స పురుషః పార్థకం ఘాతయతి హన్తికమ్॥ 21

తా. అర్జునా! జీవుడు క్షయము, జన్మము, నశించుటయు లేనివాడని, నిత్యుడని ఎరిగినవాడు ఎవనినెట్లు చంపించును? ఎవనినెట్లు చంపును?

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని
సంయాతి నవాని దేహీ॥ 22

తా. మనుష్యుడు పాత బట్టలను తీసిపైచి క్రొత్తవానిని ధరించునట్లు జీవుడు జీర్ణించియున్న శరీరములను వదలి క్రొత్త శరీరములను ధరించుచుండును.

శ్లో॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః॥ 23

తా. దీనిని (జీవునిని) ఆయుధములు ఖండించలేవు. అగ్ని కాల్పజాలదు. జలము తడుపజాలదు. గాలి ఎండింపజాలదు.

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ
నిత్యస్సర్వగతస్థాణురచలోఽయం సనాతనః 24

తా. జీవుడు ఎండింపబడజాలడు. దహింపబడజాలడు. తడుపబడజాలడు. ఖండింపబడజాలడు. ఎల్లప్పుడును నుండువాడును, భూతముల యందున్నవాడును, నిత్యుడును, స్థిరముగ నుండువాడును, అచలుడును, సనాతనుడునై యున్నాడు.

శ్లో॥ అవ్యక్తోఽయమచిన్త్యోఽయమవికార్యోఽయముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి॥ 25

తా. ఈ జీవుడు ఇంద్రియములకు కానరాడు. మనస్సునకు గోచరించడు. వికారము లేనివాడని ఎరిగి దుఃఖించుట తగదు.

శ్లో॥ అథచైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతం।
తథాపి త్వం మహాబాహో నైవం శోచితుమర్హసి॥ 26

తా. అర్జునా! ఈ జీవుడు ఎల్లప్పుడును పుట్టుచుండునని, చచ్చుచుండునని నీవు తలంచినచో అప్పుడును నీవు దుఃఖించుట తగదు.

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం
జన్మ మృతస్య చ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి॥ 27

తా. జన్మించినవాడు చచ్చుటయు,చచ్చినవాడెల్ల మరల పుట్టుటయు నిశ్చయము. కాబట్టి అవశ్యముగా కలుగుచున్న విషయమునందు నీవు దుఃఖించుట తగదు.

వ్యా. — జీవుడు ఊహలకు, ఈ కన్నులకు గోచరింపడు. చనిపోవువాడు కాదు. పుట్టువాడుకాదు. ఒక శరీరమును విడిచి ఇంకొక శరీరమును కర్మాను సారముగా ధరించు స్వభావము గలవాడు. అనుభవించు స్వభావముగలవాడు. అందు వలన దేనినైనను అనుభవించువాడేగాని, 24 శ్లోకమునందు అచలుడని వ్రాసినది యథార్థముకాదు. గుణ వికారములను అనుభవించువాడేగాని, వికారముల ననుభ వించనివాడుకాదు. ప్రకృతి గుణముల సంబంధమైన పూర్వ జన్మకర్మానుసారముగా అనుభవించు కర్మలను, చేయవలసిన కర్మలను తప్పించుకొనుటకెవ్వరికిని సాధ్యముకాదు.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥ 28

తా. అర్జునా! ఈ భూతములు జన్మించుటకు ముందును, నశించిన పిమ్మటను తెలియబడుటలేదు. మధ్యయందు కాన్పించుచున్నవి. ఈ శరీరముల స్థితి నెరింగియు నీవు దుఃఖింపనేల?

శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవచ్చైనమన్యశ్శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్॥ 29

తా. ఒకానొకడు ఈ జీవుని ఆశ్చర్యముగా చూచుచుండును. మరియొకడు ఆశ్చర్యముగా చెప్పుచుండును. మరియొకడు ఆశ్చర్యముగా వినుచుండును. వీరెవ్వరును జీవుని ప్రత్యక్షముగా నెరిగినవారుకాదు.

వ్యా. జీవుని నెరుగకపోయినను ఎరిగినవారివలె అవ్యక్తముగా మాట్లాడు వారు అనేకులున్నారు. సర్వమును ఎరిగి మాట్లాడునదే యథార్థము. పరమపదము దర్శనమైనవారే సర్వము నెరిగినవారు.

శ్లో॥ దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత।
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి॥ 30

తా. అర్జునా! సమస్త శరీరములు నశించును. ఆ శరీరముల యందున్న జీవుడు నశించువాడుకాదు. అందువలన నీవు సమస్త భూతములను గురించి దుఃఖింప వలదు.

వ్యా. పైన చెప్పబడిన శ్లోకములన్నియును జీవుని యొక్కయు, శరీరముల యొక్కయు స్థితులను గురించి చెప్పియున్నాడు. ఇవి యన్నియును పరమపదము నెరిగినవారెరిగియున్నారు. ఇతరు లెరుగరు.

శ్లో॥ స్వధర్మమపి చావేక్ష్య న వికంపితుమర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్
క్షత్రియస్య న విద్యతే॥ 31

తా. స్వధర్మము నాలోచించినప్పటికెని చలించుట కర్హుడవుకావు. క్షత్రియు నకు ధర్మయుద్ధముకంటె మరియొకటి శ్రేయస్కరమైనదిలేదు.

వ్యా.క్షత్రియులకు ధర్మయుద్ధము స్వధర్మమనునది, కులధర్మమనునది ప్రకృతి ప్రజలచే నిర్మింపబడినవియేగాని, విజ్ఞానము గలవారిచేతను, కృష్ణునిచేతను నిర్మింపబడినవికావు. పరమపదము నెరుగుట, కామ, క్రోధ, లోభ, రాగ, ద్వేషాది గుణములను జయించవలెననునది మానవులకు స్వధర్మమైయున్నది. ఈ గుణములను జయించుటకంటె శ్రేయస్కరమైనదిలేదు.

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతం।
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశమ్॥ 32

తా. అర్జునా! అప్రయత్నముగా లభించినదై తెరువబడిన స్వర్గద్వార రూప మైన యిట్టి యుద్ధమును ఏ రాజులు పొందుచున్నారో వారు సుఖమును పొందు చున్నారు.

వ్యా. ఇది యథార్థముకాదు. స్వర్గసుఖములు ఎట్టి యుద్ధము వలననురావు. ఇవి ప్రకృతి కవుల అవ్యక్త కల్పితములు. ఇతర ప్రాణులకు సుఖములనిచ్చు సత్వగుణ కర్మవలననే స్వర్గసుఖములు లభించును.

శ్లో॥ అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి।
తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి॥

తా. అట్లుగాక నీవు ధర్మయుక్తమైన యుద్ధమును చేయకుంటివేని కుల ధర్మమును, కీర్తిని విడనాడిన వాడవగుదువు. ఇట్లు కుల ధర్మమును, కీర్తిని వదలుటవలన పాపమును పొందుదువు.

వ్యా. రాగద్వేషాది ప్రకృతి గుణములను జయించు యుద్ధమే మానవ యుక్తమైన ధర్మము. వానిని జయించనిచో పాపమును పొందుదురు. మానవజాతి యంతయు నొక్కటే. అందరి యందున్నదియును ఒక లాంటిదే. కులములు, కుల ధర్మములు, గుణముల కర్మలనుబట్టి ప్రకృతి గుణములచే ఆ గుణములు గల వారిద్వారా నిర్మింపబడినవి. ఇవి మానవ ధర్మములుగావు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులు వారి, వారి కుల ధర్మముల ననుసరించినను ప్రకృతి గుణముల ధర్మము ననుసరించిన వారలే యగుదురు. ఇవి యథార్థ ధర్మములుకావు. ఎవరైనను రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వాది గుణములను జయించి నిష్కామభావము సమత్వబుద్ధి, పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించవలయును. ఇదియే మానవ జన్మకు విధియగు ధర్మము. అంతియేగాని, మానవులను వేరు, వేరు కులములుగా నిర్మించి, వారికి కుల ధర్మములను వేరు వేరుగా నిర్మింపబడినవనుట యథార్థముకాదు.

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయాం।
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే॥ 34

తా. మరియును జనులు చిరకాలమువరకు మాయకుండునట్టి నీ అప యశస్సును చెప్పుకొనుచుందురు. గౌరవస్థునికి అపకీర్తి మరణముకంటె నధికమైన దగుచున్నది.

శ్లో॥ భయాద్రణాదుపరతం మంస్యన్తే త్వాం మహారథాః।
యేషాం చ త్వం బహుమతో భూత్వా
యాస్యసి లాఘవమ్॥ 35

తా. ఎవరికి నీవు సన్మానింపబడిన వాడవుగానుంటివో, అట్టి మహారథులు కూడ నిన్ను పిరికితనమువలన యుద్ధరంగమునుండి పారిపోయిన వానినిగా తలంతురు. అందువలన నీవు చులకదనమును పొందగలవు.

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యంతి తవాహితాః।
నిందంత స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥36

తా. నీ యొక్క సామర్థ్యమును నిందించుచున్న నీయొక్క శత్రువులు అనేకములైన నిందలు చెప్పుకొనుచుందురు. అంతకంటె మిక్కిలి వేదనకరమైనది మరియేమి కలదు ?

శ్లో॥ హతో వా ప్రాప్స్యసే స్వర్గం
జిత్వా వా భోక్ష్యసే మహీం।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః 37

తా. యుద్ధమునందు నీవు శత్రువులచేత చంపబడితివేని స్వర్గలోక సుఖముల ననుభవింపగలవు. అట్లుగాక నీవే శత్రువులను జయింతువేని, భూలోక రాజ్య భోగము ననుభవింపగలవు. కాబట్టి యుద్ధము చేయుటకు నిశ్చయించుకొనిలెమ్ము.

వ్యా. ఈ లోకమునందు రాజ్యముకొరకు చేయు యుద్ధములు స్వర్గలోక సుఖముల ననుభవింపజేయునవిగావు. ఈ లోక రాజ్యములు లభించినను అవి యథార్థ సుఖములుగావు. వానివలన శాంతి యనునది యుండదు. ఇట్టి యుద్ధము నందు మరణము పొందిన వారికి స్వర్గలోక సుఖములురావు. ఎవరైనను ఈ లోకమునందుగాని, స్వర్గలోకమునందుగాని సుఖము ననుభవింపవలయుననిన, వారు చేయు కర్మలు ఇతరులకు సుఖము నిచ్చునవియై ఉండవలెను. సుఖములకొరకు చేయు కర్మలయందు పాప ఫలమునిచ్చు కర్మలును ఉండుచుండును. విజ్ఞానము గల కృష్ణుడుగాని, అట్టి వారెవరైననుగాని సుఖ భోగముల కొరకు కర్మ చేయుమని చెప్పరు. రాగద్వేషాది గుణములను జయించి మోక్షపదమును చేరు మార్గమునే చెప్పుదురు.

శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥

తా. జయాపజయములను, లాభ నష్టములను, సుఖ దుఃఖములను సమానముగా భావించి అటుపిమ్మట యుద్ధము చేయుము. ఇట్లు చేసితివేని పాపమును పొందవు.

వ్యా. రాగద్వేషాది గుణములు గల వారిచే స్వయముగా చేయబడు కర్మల యందుగాని, యుద్ధముల యందుగాని, జయాపజయములను, లాభ నష్టములను, సుఖ దుఃఖములను సమముగా చూచు సమత్వబుద్ధి ఉండదు. వారు సమత్వబుద్ధిగల విజ్ఞానము గలవారి దరిజేరి వారు చెప్పునట్లు చేయవలెను. అటుల చేసినచో పాప పుణ్యములు రెండును ఉండ అట్టివారే ఈ శ్లోకమునందు చెప్పబడిన విధముగా చేయువారు.

**శ్లో॥ ఏషాతేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।**
**బుద్ధ్యాయుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి॥**

తా. ఎట్టి బుద్ధికి జీవుడను తాను తెలియబడునో అట్టి సాంఖ్యమును చెప్పితివి. ఎట్టి బుద్ధి కలిగిన కర్మబంధములు కలుగవో అట్టి కర్మయోగమును చెప్పెదను వినుము.

**శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥**

తా. ఈ కర్మయోగమును ప్రారంభించిన తరువాత ఆగిపోవుట యనునది లేదు. అందు దోషములేదు. ఈ ధర్మమును కొంచెముగ నాచరించినను గొప్పదై యున్న సంసార భయమునుండి రక్షణ కలుగును.

వ్యా. శరీరము, తానను జీవుడు. వాని స్థితులను గురించి చెప్పినదే సాంఖ్యము. దీనిని పరమపదము నెరిగినవారే యథార్థముగా నెరిగియున్నారు. ఇదియే 16 వ శ్లోకమునందు తత్వ దర్శనులే వీనిని నెరిగి యున్నారని చెప్పబడి యున్నది. సమత్వబుద్ధియే కర్మబంధ విముక్తులను జేయునది. సమత్వబుద్ధి, నిష్కామభావము, పవిత్రప్రేమ, నిత్యసత్వము ఇవి విజ్ఞాన లక్షణములు. అట్టి విజ్ఞానమును పొందుటకొరకు విజ్ఞానముగలవారి దరిజేరి వారు చెప్పునటుల చేయునదియే కర్మయోగము. అట్టి కర్మయోగమునే కృష్ణుడర్జునునకు చెప్పెదననెను.

అట్టి కర్మ ప్రారంభించిన తరువాత వారి ద్వారానే భక్తినిపొంది, ఆ భక్తితో వారి యందున్న, విజ్ఞానమును పొందువరకును అగిపోపుట ఉండదు. అట్టివారికి గొప్ప దగు సంసారభయమునుండి రక్షణ కలుగును.

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధిరేకే హ కురునన్దన।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥

తా. అర్జునా! అట్టి కర్మయోగమును ఆచరించు బుద్ధియే నిశ్చయమైనబుద్ధి. ఇది ఒక్కరీతిగనే యుండును. నిశ్చయములేని బుద్ధు లనేక విధములుగా అసంఖ్యాకములగుచున్నవి.

వ్యా. ఈ 41 వ శ్లోకమునందు విజ్ఞానముగలవారి దరిజేరి, వారు చెప్పునటులచేయు నిశ్చయబుద్ధి గలవారిని, అట్టి నిశ్చయ బుద్ధిలేని అనేక బుద్ధులు గలవారిని వేరుగా చెప్పియున్నారు. నిశ్చయ బుద్ధిగలవారు కాగానే అదివరకు వారి యందున్న అనేక విధములుగా పోవు నిశ్చయములేని బుద్ధులు వారి యందణగి యుండును.

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః॥ 42

శ్లో॥ కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥ 43

శ్లో॥ భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే॥ 44

తా. అర్జునా! వేద శాస్త్రములు చదివి, వాని యర్థము చెప్పుచు, ఈ షణత్రయములందు కోరికగలవారై స్వర్గమునకంటె మించిన సుఖమెచ్చటను లేదని చెప్పుచు, అనేక విధములైన కర్మలు చేయించుచు, అనేక జన్మ కర్మ బంధములను కలిగించి జనులందరిని భోగాపేక్షపరులనుగా చేయు అజ్ఞానులైన శాస్త్రవాదుల పుష్పములవలె అందముగానుండు మాటలను విని మోసపోవునట్టి భోగులకు నిశ్చయ బుద్ధి ఎట్లు సంభవించును?

వ్యా. శాస్త్రములు చదువవలయును, శాస్త్రములు చదువకపోతే మీకేమియు తెలియదని కొందరు శాస్త్రవాదులు చెప్పుచున్నారు. ఈ వేదశాస్త్రములు చదివిన వారలలో శాస్త్రములద్వారా పరమపదమును, పరమపద మార్గము నెరిగి రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వ, వాంఛాది గుణములను జయించిన వారొక్కరును లేరు. ఉండరు. పరమపదమును చూడని, ప్రకృతి గుణములను జయించలేని శాస్త్రవాదులు ప్రత్యక్షముగా నెరిగినటుల చెప్పుట సమంజసముకాదు. శాస్త్రవిద్య జ్ఞానవిద్యకాదు. పరమపదము నెరిగినవారియందే జ్ఞానవిద్య యున్నది. దానిని వారి నుండియే పొందవలెను. శాస్త్రములు చదివినవారు వానిద్వారా కర్మబంధములను కలిగించు కర్మలనే చేయుదురు, ఇతరులచేత చేయించెదరు. రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వరహితమైన పవిత్రప్రేమ మార్గమున ఒక్కడుగైనను వేయలేరు. పవిత్ర ప్రేమ భావముల ప్రవర్తన వారెరుగరు.

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥45

తా. వేద శాస్త్రములు త్రిగుణముల సంబంధమైన విషయములను తెలుపునవియై యున్నవి. ఆ త్రిగుణముల సంబంధమైన కష్ట సుఖముల యందపేక్షను విడిచి ఆత్మను పొంది నిత్య సత్వముగల వాడవగుము.

వ్యా. వేదశాస్త్రములు త్రిగుణముల (సత్వ, రజ, స్తమోగుణముల) సంబంధమైన మంచి చెడులను నట్టి కర్మబంధములను కలిగించు కర్మలను చెప్పు చుండును. అందుచేత, ఆ శాస్త్రములను విడిచి విజ్ఞానముగలవారి దరిజేరి ఆత్మను (జ్ఞానమును) పొందినప్పుడే, ఆత్మ (జ్ఞానము) గలవారును, నిత్యసత్వము (విజ్ఞానము) గలవారును అగుదురు.

శ్లో. యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ 46

తా. త్రాగుటకు జలము అంతటను నిండియున్న యెట్టి ప్రయోజనమో, అట్టి ప్రయోజనము సర్వవేదముల యందు తెలిసిన బ్రాహ్మణునకు కలుగుచున్నది.

వ్యా. త్రాగుటకు జలము అంతటను నిండియున్నవానివలె అంతటను కాళీలేక నిండియున్న పరమతేజోపదము సర్వవేదములద్వారా ఎవరికిని కలుగదు. వేద శాస్త్రములద్వారా ప్రపంచ సంబంధమైన త్రిగుణముల యొక్క సుఖదుఃఖముల ననుభవించెదరు.

శ్లో॥ కర్మణ్యేవాధి కారస్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూర్మా తే సంగోఽ స్త్వకర్మణి॥

తా. నీవు కర్మచేయుటయందే అధికారివిగాని, కర్మ ఫలము నందధికారివి గాకుండుము. కర్మఫలమునకు కారణమైన వాడవు గాకుము. నీవు కర్మచేయ కుండుట యనునది లేనివాడవు గాకుము.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ।
సిద్ధ్య సిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

తా. కర్మఫలము లభించినను, లభింపకున్నను సమత్వబుద్ధి గలిగియుండుట యోగమని చెప్పబడుచున్నది. నీవు సమత్వబుద్ధిగల వాడవై ఆసక్తిని విడిచి కర్మ చేయుము.

వ్యా. 47, 48 శ్లోకములందు చెప్పబడినది పరమపదము నెరిగిన వారి దరి జేరి వారు చెప్పునటుల చేయు కర్మ. ఇదియే ఏ విచారణయులేని బుద్ధియోగము. ఇదియే కర్మయోగము. ఇంకేవిధముగను ఈ శ్లోకములయందు చెప్పబడినటుల చేయుట యనునదిలేదు. సమత్వబుద్ధిగలది, ఆసక్తిలేనిది విజ్ఞానమను భావము.

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధి యోగాద్ధనంజయ।
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥ 49

తా. అర్జునా! ఫలమనుభవించుటకు కారణమైన కర్మ హీనస్థితిని పొందించును. సమత్వబుద్ధితో చేయు కర్మమునకు కామ్య కర్మము మిక్కిలి దూరమైనది. కాబట్టి నీవు బుద్ధియోగము నాశ్రయింపుము.

వ్యా. కోరికగలవారు చేయు కర్మహీన స్థితిని పొందించును. వారు సమత్వ బుద్ధిగల విజ్ఞానము గలవారి నాశ్రయించి వారు చెప్పునటుల చేయుచున్నది బుద్ధి యోగము (కర్మయోగము)

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే।
తస్మాద్యోగాయ యుజ్యస్వయోగః కర్మసు కౌశలమ్॥

తా. సమత్వబుద్ధి గలవాడు పుణ్యపాపములు రెండును ఈ లోకమునందే విడుచుచున్నాడు. అందువలన బుద్ధియోగము కొరకు సన్నద్ధుడ వగుము. కర్మలన్నిటియందును బుద్ధియోగమే నేర్పరియైనది.

వ్యా. విజ్ఞానముగలవారే సమత్వబుద్ధిగలవారు. వారికి పుణ్యపాపముల బంధములుండవు. అందువలన సమత్వబుద్ధిగల వారగుటకు అట్టివారి నాశ్రయించి ఫలాపేక్షలేక వారు చెప్పునటుల చేయవలయును. అందువలన వారి యందున్న విజ్ఞానమును, జ్ఞానమును పొందుదురు. అప్పుడు వారును పరమపద దర్శనమైన వారై విజ్ఞానముచేత సమత్వబుద్ధితో కర్మలయందు ప్రవర్తింపబడుదురు. వారిని రాగ, ద్వేషాది గుణములు విడుచును. వారు పుణ్యపాపములనుండి విముక్తులగుదురు. అందుచేత కర్మ లన్నిటియందును బుద్ధియోగము (కర్మయోగము) జ్ఞానమును పొందుటయందు నేర్పరియైనది. ఇట్లు చేయువారుగాక ఇతరులు స్వయముగా చేయునది కర్మలయందు బంధించు కర్మ.

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥ 51

తా. అట్టి బుద్ధియోగముతో నున్నవారు కర్మఫలమును విడిచి జన్మ బంధములనుండి విడువబడినవారై దుఃఖములేని పరమపదమును చేరుచున్నారు.

వ్యా. అట్టి కర్మయోగులు కర్మఫల మనుభవించనివారై వారాశ్రయించిన వారి యందున్న జ్ఞానమును పొంది జ్ఞానముద్వారా పరమపదమును చూడబడిన తదుపరి ప్రకృతి గుణములచేత విడువబడినవారై వారి సంస్కార కర్మలయందు ప్రవర్తించు విజ్ఞానమువలన జన్మ కర్మబంధ విముక్తులై పరమపదమును చేరుదురు. జ్ఞాన, విజ్ఞానములు గలవారు చెప్పునటుల చేయు కర్మయే బుద్ధియోగము. స్వయముగా చేయు బుద్ధియోగ మనునదిలేదు.

శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥ 52

తా. నీబుద్ధి మోహకలుషమునెప్పుడు దాటగలదో అప్పుడు వినవలయునను దానియందును, ఇదివరకు వినియున్నదాని యందును వైరాగ్యము కలుగును.

వ్యా. ఎవరైనను జ్ఞాన విజ్ఞానములు గలవారి నాశ్రయించినవారే యిదివరకు విన్నవానియందును, వినవలయుననువానియందును, అన్నిటి యందును వైరాగ్యము గలవారగుదురు. మోహమను కలుషమునకు లోబడని వారగుదురు.

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధావచలా బుద్ధిస్తదాయోగమవాప్స్యసి॥ 53

తా. శ్రుతులయందు చెప్పబడిన వానిని వినుటచేత చంచలమైన నీ బుద్ధి ఎప్పుడు నిశ్చలమైనదై సమాధియందు స్థిరముగ నుండునో అపుడు యోగసిద్ధిని పొందుదువు.

వ్యా. వేదశాస్త్రము లెన్ని చదివినను, అందు చెప్పబడినవి ఎన్ని వినినను అన్నిబుద్ధులు పుట్టి అన్నివిధముల చలనము కలుగుచుండును. విజ్ఞానము గలవారి నాశ్రయించి కర్మచేయువారు స్థిరబుద్ధిగల వారగుదురు. అదివరకు వారికి శాస్త్రముల వలన కలిగిన చలనములన్నియు వారిని విడిచిపోవును. అపుడు వారియందు భక్తి గలవారై వారి యందున్న జ్ఞానమును పొందుదురు. ఇదియే కర్మయోగ ఫలసిద్ధి యని తెలియవలెను. శాస్త్రములద్వారా ఎవరును నిశ్చయబుద్ధి గలవారుకారు. ఇందు సమాధియని వ్రాసినది యథార్థముకాదు.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ స్థిత ప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్॥ 54

తా. కృష్ణా! నాకు చెప్పినట్టి సమాధి స్థితిగల ఓ స్థిత ప్రజ్ఞగలవాని లక్షణము లెవ్వి? అట్టి వాడేమి మాట్లాడుచుండును? ఏరీతిగనుండును? వాని ఆచరణ యెట్లుండును?

వ్యా. సమాధి స్థితి యనునదిలేదు. పరమపదమును దర్శించు జ్ఞానము, స్థిత ప్రజ్ఞ (విజ్ఞానము) గలవారిని ఆచరణ ద్వారానే గుర్తించవలయును. అట్టివారి ఆచరణ ఎట్లుండునని అర్జునుడడిగెను.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థిత ప్రజ్ఞస్తదోచ్యతే॥ 55

తా. అర్జునా! ఎప్పుడు ఆత్మయందు అనగా పరమ తేజోపదము గానున్న ఆ తేజస్సును ఆత్మ అనగా జ్ఞానమను భావము ద్వారా దర్శించి ఆనంద మనుభవించినవానిని (జీవుని) కోరికయే విడుచును. అట్టివానిని స్థిత ప్రజ్ఞుడందురు.

వ్యా. ఎవరియందు జ్ఞానమున్నదో, జ్ఞానముద్వారా వారికి పరమ తేజోపద దర్శనమైనపుడు వారు ఆనంద మనుభవించుచుందురు. పరమపదమును చూచిన తరువాతనే వారి యందున్న రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వ, వాంఛాది ప్రకృతి గుణములన్నియును వారిని విడిచి వెళ్ళిపోవును. వారి యందున్న విజ్ఞానము సర్వమును ఎరిగినదై పవిత్ర ప్రేమ భావములతో ప్రవర్తించుచుండును. అట్టివారినే స్థిత ప్రజ్ఞగల వారందరు. ఆత్మచేత ఆత్మయందే యని వ్రాయుట పొరపాటు. పరమతేజస్సు ఆత్మగాదు. పరమ తేజస్సును చూచు జ్ఞానము ఆత్మ కాదు. ఆ తేజస్సును చూచి ఆనంద మనుభవించునది జీవుడు. జీవుడు ఆత్మకాదు; పరమపదముగానున్న తేజస్సుగాదు. ఆత్మ యనునది కల్పితము.

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనాస్సుఖేషు విగతస్పృహః।
వీతరాగ భయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే॥ 56

తా. దుఃఖములయందు కష్టమును, సుఖములయందు ఆశయును జెందక, కోపము, రాగము, భయములేని ముని స్థితప్రజ్ఞగలవాడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 57

తా. ఎవడు అన్నిటియందును తటస్థముగానుండి శుభములను, అశుభములను పొందినప్పుడు రాగ, ద్వేషములు చెందడో అట్టివానియొక్క ప్రజ్ఞ స్థిరమైనది.

వ్యా. 55, 56, 57 శ్లోకములయందు చెప్పబడినది జ్ఞాన విజ్ఞానములుగలవారి విజ్ఞానము యొక్క ప్రవర్తన యని తెలియవలెను. అట్టి వారియొక్క ఆచరణనే స్థితప్రజ్ఞ యందురు. ఆచరణ రూపమునగాక, యింకే విధమునను వారివి తెలియ

లేరు. ఏ మూలనో కూర్చుండి కన్నులు మూసికొని మాట్లాడక యుండువాడు ముని కాడు. స్థితప్రజ్ఞ గలవాడుకాదు. పై శ్లోకములయందు చెప్పబడిన లక్షణములు గలవాడే స్థితప్రజ్ఞ గలవాడు. అట్టివారియందు రాగ, ద్వేషాది గుణములుండవు. వారు దేని కొరకును ప్రయత్నము చేయరు.

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 58

తా. తాబేలు అవయవములవలె యోగి యింద్రియములను సమస్తమైన విషయములనుండి ఎప్పుడు మరలించుకొనుచున్నాడో, అప్పుడు వానియొక్క ప్రజ్ఞ స్థిరమైనది.

వ్యా. ఈ 58 వ శ్లోకమునందు చెప్పబడినది యథార్థముకాదు. స్థిత ప్రజ్ఞుని లక్షణముకాదు. తాబేలు అవయవములు అవసరమునుబట్టి లోపలికి, వెలుపలికి తిరుగుచుండును. లోపలికి తీసికొనుట యెప్పుడుండునో, వెలుపలికి విడుచుటయు నప్పుడేయుండును. ఆ విధముగనే యింద్రియములను (గుణములను) విషయముల నుండి మరల్చుట యెప్పుడుండునో, వానిని వదలుటయు నప్పుడేయుండును. అందరును వారి పూర్వజన్మ సంస్కార కర్మల ననుసరించి కర్మలయందు వారి స్వభావముచేత ప్రవర్తింపబడుచుందురు. వారి యందున్న రాగ, ద్వేషాది గుణములు వారి శరీరములద్వారా ఆ కర్మలయందు ప్రవర్తింపబడుచుండును. ఎవరియందు ఏ గుణములున్నవో, ఆ గుణములే కర్మల యందుండును. ప్రారబ్ధ కర్మలను నిగ్రహించి తప్పించుకొనుట కెవ్వరికిని సాధ్యముకాదు. మరల ప్రారబ్ధ కర్మలను కలుగజేయు రాగద్వేషాది ప్రకృతి గుణములు కర్మల యందుండరాదు. అందు వలన రాగద్వేషాది గుణములే వారియందు లేకుండవలెను. జీవులేమియును చేయు నవికావు. గుణములుచేయు కర్మయొక్క ఫలము ననుభవించునది జీవులే. ఇంద్రియ ములను నిగ్రహించవలెననునదియును ప్రకృతి (మాయా) గుణములే. ఈ గుణము లను వెడలగొట్టునది విజ్ఞానము. అట్టి విజ్ఞానము లేనివారు ఈ గుణములచేత ఒక చోట కూర్చుండి ఎంతవరకు ఇంద్రియములను విషయములనుండి లాగి అణచి యుంచినను ఈ గుణములు వారిని విడువవు. ఇవి సమయము ననుసరించి వారి శరీరములద్వారా విషయములయందు ప్రవర్తించుచుండును. ఇంద్రియములను అణచియుంచి గుణములను వెడలగొట్టలేరు. అది గుణములను జయించు మార్గము

కాదు. గుణములను జయించని (తననుండి వెడలగొట్టని) వారు స్థితప్రజ్ఞ గల వారుకాదు.

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ 59

తా. ఆహారమును మానివేసిన పురుషుడు విషయవృత్తులు లేకయుండును. కాని ఆ విషయములయందు పోవువాంఛ వానిని విడువదు. పరమపదమును చూచిన తదుపరి వాంఛయే వానిని విడిచి వెళ్ళిపోవును.

వ్యా. ఆహారము మానివేసిన వాని శరీరము బలహీనమై విషయవృత్తులు లేకయుండును. కాని వాని యందున్న వాంఛాది గుణములు వానిని విడువవు. జ్ఞానము ద్వారా పరమపదమును దర్శించిన తరువాతనే వాంఛయే ఆ జీవుని విడిచి వెళ్ళిపోవును. దానివెంట రాగద్వేషాది ప్రకృతి గుణములన్నియును వెళ్ళిపోవును. అట్టివానినే స్థితప్రజ్ఞు డనవలెను.

శ్లో॥ యతతో హ్యపి కౌన్తేయ। పురుషస్య విపశ్చితః।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ 60

తా. అర్జునా ! యత్నము చేయుచున్న విద్వాంసుడైన పురుషునియొక్క మనస్సును ప్రమాదమును గలుగజేయునట్టి యింద్రియములు బలత్కారముగా ప్రవర్తించుచున్నవి.

వ్యా. గుణములను నిగ్రహించి పరమపదమును దర్శింపవలెనని జప, తప, ధ్యాన, ప్రాణాయామ, సాధన మొదలగు యోగాభ్యాసములు చేయునదియును ఈ గుణములే. అందువలన ప్రయత్నముచేయు విద్వాంసుడైనను, ఎన్ని శాస్త్రములు చదివిన వాడైనను పరమపదమును దర్శించలేడు, గుణములను జయించలేడు. స్వాధీనము చేసికొనలేడు. ప్రయత్నము చేయునదియును, విద్వాంసుడను విద్యయును, ప్రకృతి సంబంధమైనవియేగాని పరమపదముగానున్న తేజస్సును చూచునవికాదు. ఈ గుణములను జయించునవియుకాదు. అందువలన ప్రకృతి గుణములు గలవారు స్వయముగా ఏమి చదివినను, ఏమి చేసినను అవియన్నియును వారికి కర్మబంధములు కలిగించునవియేగాని, మోక్షమార్గములుగాదు.

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥61

తా. అన్ని యింద్రియములను వశపరచుకొని, నా సంబంధముగలవాడై యుండవలయును. ఎవని యింద్రియములు వశమునందుండునో వాని ప్రజ్ఞ స్థిరమైనది.

వ్యా. ఎవరు కృష్ణుని దరిజేరి, కృష్ణుని సంబంధముగలవారై యుందురో, వారు కృష్ణునియందే ప్రేమ, భక్తిగలవారై యుండునట్లుగా కృష్ణుడే వారిని ప్రవర్తింపజేయును.. వారి యింద్రియములు ప్రపంచముకొరకు పోవు. అట్టివారు ప్రజ్ఞగల వారగుదురని చెప్పవలెను. పరమపదము నెరిగినవారు వారి దరిజేరినవారిని స్థితప్రజ్ఞగల వారినిగా చేయుదురు.

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంసస్సంగస్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥

తా. విషయములను చింతించుచున్న మనుజునకు, ఆ విషయములయందు అసక్తి గలుగుచున్నది. అసక్తివలన కోరిక గలుగుచున్నది. కోరిక వలన కోపము కలుగుచున్నది.

శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్స్మృతి విభ్రమః।
స్మృతి భ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥ 63

తా. కోపము వలన అవివేకము కలుగుచున్నది. అవివేకమువలన మతిభ్రమ కలుగుచున్నది. మతిభ్రమవలన బుద్ధి నశించుచున్నది. బుద్ధి నశించుటవలన తాను నశించుచున్నాడు.

వ్యా. రాగ, ద్వేష, అసూయ, వాంఛాది గుణములు గల మనుజునకు ఈ గుణములద్వారా ప్రపంచముగానున్న రూపముల యందు ప్రేమ కలుగుచున్నది. అందువలన కోరిక గలుగుచున్నది. కోరికవలన వాని కొరకు చింతించుచు యత్న మొనరించుచుండును. అట్టి ప్రయత్నములకు వెలుపలనుండి ఆటంకము కలిగి నప్పుడు వానికి కోపము కలుగుచున్నది. కోపము వలన మంచి, చెడు అను విచారించు తెలివిలేకపోవును. అట్టి తెలివిలేకపోవుటచేత చపలత్వము కలుగు

చున్నది. అట్టివాని జీవితము వృథాయగుచున్నది. జీవుడు నశించువాడుకాదు. మానవ జన్మ ధర్మమునుండి పతనమై కష్టదుఃఖముల ననుభవించు వాడగుచున్నాడు.

శ్లో॥ రాగద్వేష వియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి॥ 64

తా. మనస్సును స్వాధీనము నందుంచుకొన్నవాడు, రాగ, ద్వేషములను విడిచినవాడు, ఆత్మ స్వాధీనమునందున్న యింద్రియములచేత విషయముల ననుభవించుచు శాంతిని పొందుచున్నాడు.

వ్యా. ఆత్మ (జ్ఞానము) గలవారికి జ్ఞానముద్వారా పరమపద దర్శనమగును. రాగద్వేషాది గుణములు వారి యందుండలేక వారిని విడిచి వెళ్ళిపోవును. వారు వారి యందున్న విజ్ఞానముచేత నిష్కామము, సమత్వబుద్ధి, పవిత్రప్రేమ భావములతో ఇంద్రియములద్వారా పూర్వ సంస్కార విషయముల ననుభవించు చున్నను శాంతిగనే యుందురు. మనస్సును స్వాధీనము నందుంచుకొనుట, ఆ విధముగ రాగద్వేషములను విడుచుటయని యిందు వ్రాసినది యథార్థముకాదు, ఆత్మయనునదిలేదు. ఆత్మ స్వాధీనమందున్న యింద్రియములనుట యథార్థముకాదు.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే॥ 65

తా. అట్టివారికి సర్వదుఃఖములు నశించుచున్నవి. అట్టి నిర్మలమైన మనస్సు గలవారి బుద్ధి స్థిరమైయుండును.

వ్యా. ఇది విజ్ఞానము గలవారి లక్షణములు. పై శ్లోకమునందు చెప్పబడిన వారి లక్షణములుకాదు.

శ్లో॥ నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా।
న చాభావయతశ్శాన్తిరశాన్తస్య కుతస్సుఖమ్॥ 66

తా. ఇంద్రియ నిగ్రహము లేనివానికి నిశ్చయబుద్ధి కలుగదు. నిశ్చయబుద్ధి కలుగని వానికి భావము (జ్ఞానము) కలుగదు. భావము (జ్ఞానము) లేనివానికి శాంతి కలుగదు. శాంతిలేనివానికి సుఖములేదు.

వ్యా. ఇంద్రియ నిగ్రహమనునది యథార్థముకాదు. ఇటుల నిశ్చయబుద్ధి కలుగదు. భావము కలుగదు భావము (జ్ఞానము) గలవారి సాంగత్యమున వారి యందున్న భావమును (జ్ఞానమును) పొందవలెను.

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥ 67

తా. విషయములమీదికి పోవుచున్న యింద్రియములతో చేరుకొని ఏ మనస్సు విషయములమీదికి పోవుచున్నదో, ఆ మనస్సు గాలి సముద్రమునందు నావనువలె వానియొక్క వివేకజ్ఞానమును హరించుచున్నది.

వ్యా. విజ్ఞానము గలవారియందు రాగ, ద్వేష, వాంఛాది గుణములుండవు. వారు పూర్వ కర్మల ననుసరించి వారి స్వభావము ప్రేరేపించి ప్రవర్తించు విషయము లందు విజ్ఞానముచేత పవిత్రప్రేమ భావములతో ప్రవర్తింప బడుచుందురు. వారు కర్మబంధములు లేక శాంతిగ నుందురు. అట్టి విజ్ఞానము లేనివారు వారి స్వభావము ప్రేరేపించి ప్రవర్తించు విషయములయందు రాగ, ద్వేష, అహంకార, వాంఛాది గుణములతో ప్రవర్తింపబడుచు, తుఫానుగాలిచే సముద్రమునందున్న నావ పతనమై నట్లు పతనమై అనేక కష్టములకు గురియగుచున్నారు. అంతియేగాని, మనస్సనునది వేరుగాలేదు.

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 68

తా. అందువలన ఓ అర్జునా! ఎవని యింద్రియములు విషయములనుండి సర్వవిధములచేతను నిగ్రహింపబడుచున్నవో, అతనియొక్క జ్ఞానము స్థిరమైనది.

వ్యా. ప్రకృతి గుణములు శరీరముద్వారా విషయములయందు ప్రవర్తించు చుండును. వానిని విషయములమీదికి పోనియ్యక నిగ్రహింపవలెననునది యథార్థము కాదు. ప్రకృతి గుణముల చెట్టునుండి ప్రకృతి గుణములే బయల్వెడలును. పూర్వ కర్మ ననుసరించియే కొంతవరకు ఆ గుణములతో ప్రవర్తింపక యుండవచ్చును. అదియును ప్రకృతి గుణముల సంబంధమైనదియే యగును. అది ప్రకృతి గుణముల చెట్టేగాని విజ్ఞాన వృక్షముకాదు.

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥

తా. సమస్తప్రాణులకును అనగా అజ్ఞానులకు ఏది రాత్రియగుచున్నదో, అట్టి రాత్రియందు ఇంద్రియ నిగ్రహముగలవాడు జాగరూకుడై యుండును. దేని యందు ప్రాణులు (అజ్ఞానులు) జాగరూకులగుచున్నవో, అది పరమపదమును చూచుచున్న మునికి రాత్రియగును.

వ్యా. జ్ఞానము గలవారికి జ్ఞానము ద్వారా పరమ తేజోపదము కాన్పించు నపుడు వారి కది పగలగును. ఆ తేజోలోకము జ్ఞానములేని ప్రాణులకు కాన్పించదు. అట్టి ప్రాణులకది రాత్రి యనబడుచున్నది. ప్రకృతి గుణములతో ఇంద్రియములద్వారా ఈ ప్రపంచమును చూచుచు, ప్రవర్తించు ప్రాణులకు ఈ ప్రపంచము పగలనబడుచున్నది. పరమ తేజోలోకము కాన్పించు చున్నవారికి ఈ ప్రపంచము కాన్పించదు. అట్టివారికి ప్రపంచము రాత్రియనబడుచున్నది. ఏ కన్నులకేది కనబడునో అదియే కాన్పించునుగాని యింకొకటి కాన్పించదు. ఈ శ్లోకము జ్ఞానము గలవారిని, జ్ఞానము లేనివారిని గురించి చెప్పబడియున్నది. ఇంద్రియ నిగ్రహముగలవాడని ఈ శ్లోకమునందు వ్రాసినది యథార్థముకాదు. జ్ఞానముగల జ్ఞానియే ముని. ధ్యానమని కన్నులు మూసికొని కూర్చుండి, యింద్రియములను నిగ్రహించెదననువాడు మునిగాదు.

శ్లో॥ ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తియద్వత్।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తిమాప్నోతి న కామకామీ॥ 70

తా. అనేకమైన నదులద్వారా జలము సముద్రమునందు ప్రవేశించినను హద్దు మీరక ఎట్లుండునో, అట్లే సమస్తమైన కోరికలు ఎవ్వనియందు ప్రవేశించి చలింపక యున్నవో అట్టివాడు శాంతిని పొందుచున్నాడు. విషయాసక్తుడగువాడు పొందడు.

వ్యా. సముద్ర ఉపమానము యథార్థముకాదు. సముద్ర మనునట్టి జీవుని యందెన్ని కోరికలు ప్రవేశించునో, అవియన్నియును ప్రకృతి గుణములతో

ఆ జీవుడున్న శరీరముద్వారా కర్మలయందు ప్రవర్తించుచు ఆ జీవుని ననేక జన్మ కర్మల ననుభవింప జేయునవియగుచున్నవి. కోరికయే చలనముగలది. కోరికలు లేనివాడు కావలెనుగాని, కోరికలు ప్రవేశించి చలింపక యున్నవనునది యథార్థము కాదు. ఈ శ్లోకము ఈ క్రింది శ్లోకములకే వ్యతిరేకము.

శ్లో॥ విహాయ కామాన్ యస్సర్వాన్
పుమాంశ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకారస్స శాంతిమధిగచ్ఛతి॥ 71

తా. ఏ పురుషుడు సమస్తమైన కోరికలు విడిచినవాడును, ఆశలేనివాడును, మమకారము లేనివాడును, అహంకారము లేనివాడునై సంచరించుచున్నాడో వాడు శాంతిని పొందుచున్నాడు.

వ్యా. పరమపదము నెరిగిన వానిని కోరిక, ఆశ, మమకారము, అహంకారాది ప్రకృతి గుణములన్నియును విడిచిపోవును. అపుడు వాడు వాని సంస్కారము ననుసరించి స్వభావము ప్రవర్తించు కర్మలయందు విజ్ఞానముచేత ప్రపంచమునందు విధిగా సంచరింపబడుచు శాంతుడై యుండును. కోరిక లేనివాడు కావలెనుగాని, కోరికలవలన చలింపక యున్నవాడని పైన 70 వ శ్లోకమునందు వ్రాసినది యథార్థముకాదు.

శ్లో॥ ఏషా బ్రాహ్మీస్థితిః పార్థనైనాం ప్రాప్యవిముహ్యతి।
స్థిత్వాఽస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥

తా. ఓ అర్జునా! ఇది బ్రహ్మ సంబంధమైన స్థితి. ఈ స్థితిని పొందినవాడు మోహమును చెందడు. మరణకాలమందైనను ఈ స్థితి యందుండి బ్రహ్మ నిర్వాణమును (మోక్షమును) పొందుచున్నాడు.

వ్యా. 71, 72 శ్లోకములయందు చెప్పబడినవి జ్ఞాన, విజ్ఞానములు గలవారి లక్షణములు. వారు పొందుస్థితి. ఇంద్రియములను స్వాధీనము చేసికొని పరమ శాంతిని పొందవచ్చునని ఈ భగవద్గీతయందు వ్రాసినది యథార్థముకాదు. ఎందుచేత ననగా వారికి జ్ఞానమును, విజ్ఞానమును సంభవింపవు. పరమ తేజోపదము కాన్పించదు. రాగ ద్వేషాది ప్రకృతి గుణములు వారిని విడువవు. వారు ఈ గుణము లున్నంతవరకును ఈ ప్రపంచమునందు తిరుగుచుందురు.

అ. వ్యా. అర్జునా! నాది, నావారను మమతను విడువవలయునని, పిరికితనము, దుర్బలత్వమును విడువుమని చెప్పెను. ఇవి మానవు లేకార్యమునైనను చేయుటకు ప్రయత్న మొనరించునప్పుడు వారికి అపజయము కలిగించునవియేగాని, జయమును చేకూర్చునవిగావు. అందువలన మొదట ఈ గుణములకు లోబడగూడదని చెప్పెను. తదుపరి జీవుడు, శరీరములయొక్క భేదములను చెప్పి, పరమపదము నెరిగినవారే వీనిని యథార్థముగా నెరిగి యున్నారని చెప్పెను. నిశ్చయబుద్ధిని, నిశ్చయములేని బుద్ధులను వేరు వేరుగనే చెప్పెను. జ్ఞానమును, విజ్ఞానమును పొందుటకు వారు చెప్పునటుల చేయు కర్మను బుద్ధియోగమని వ్రాసియున్నారు. వేదశాస్త్రములు చదివిన అజ్ఞానులే ప్రజలను భోగముల నాశింపజేసి అనేక కర్మలయందు ప్రవేశింప జేసి కర్మబంధితులనుగా జేయుచున్నారని, వేద శాస్త్రములద్వారా సుఖదుఃఖముల ననుభవింపజేయు త్రిగుణములవరకే ప్రవర్తింపబడుచుందురని, ఆ శాస్త్రములను విడిచి ఆత్మగలవాడవు, నిత్య సత్వముగలవాడవు నగుమని చెప్పెను. జ్ఞానము గలవారగు స్థిత ప్రజ్ఞుల లక్షణములను చెప్పెను. ఆహారమును మానివేసినను, ఎట్టి ప్రయత్నములద్వారానైనను, వాడెంత పండితుడైనను గుణములను గెలువలేడని, పరమ తేజస్సును జ్ఞానముద్వారా చూడగనే వాంఛయే వానిని విడిచి పోవునని 59, 60 శ్లోకములయందు చెప్పెను. 71, 72 శ్లోకములయందు జ్ఞానముగలవారి లక్షణములను చెప్పెను. విగ్రహపూజ, భజన, పారాయణ, నామస్మరణ, జప, తప, ధ్యానాదులనునవి మొదట మెట్టనిగాని, రెండవ మెట్టనిగాని చెప్పలేదు. ఇవి జ్ఞాన విజ్ఞానముల నార్జించు మార్గము (ప్రవర్తన) కాదు.



# గీతా వ్యాఖ్యానము

## కర్మయోగము

### 3 వ అధ్యాయము

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥ 1

తా. కృష్ణా! కర్మయోగముకంటె బుద్ధియోగమే గొప్పదని నీవు తలంచిన యెడల కేశవా! ఘోరమైన ఈ కర్మకు నన్నెందుకు నియమించు చున్నావు?

వ్యా. ఇచ్చట బుద్ధియోగమనగా విజ్ఞానయోగము. కర్మయోగము తరువాత విజ్ఞానయోగము. యోగమనగా ప్రవర్తన.

శ్లో॥ వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్॥

తా. సంశయ వాక్యములచేత నా బుద్ధిని మోహింపజేయుచున్నావు. ఏది నాకు శ్రేయస్కరమైనదో దానినే నిశ్చయముగా చెప్పుము.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయాఽనఘ।
జ్ఞాన యోగేన సాంఖ్యానాం
కర్మయోగేన యోగినామ్॥ 3

తా. అర్జునా! ఈ లోకమునందు ఇట్లు రెండు విధములుగ పూర్వము నాచేతనే చెప్పబడినవి. కర్మ చేయవలసినవారికి కర్మయోగమును చెప్పితిని. జ్ఞానులయొక్క జ్ఞానమార్గమును చెప్పితిని.

వ్యా. ఈ శ్లోకమునందు ప్రపంచ సంబంధమైన కర్మగాక కర్మయోగము, జ్ఞానయోగము చెప్పబడినవి. కర్మ జ్ఞానయోగములు కృష్ణునికి పూర్వము విజ్ఞానము గల వారిచేతనే చెప్పబడినవి. విజ్ఞానమే కృష్ణుని యందుండి 'నేనే' చెప్పితినని చెప్పియున్నది. ఇట్లు చెప్పిన వారెందరో కృష్ణునికి పూర్వమును ఉన్నారు. కృష్ణుడున్నపుడును ఉన్నారు. ఎప్పుడును ఉందురు. ఇవి రెండును ఒకేమార్గములోనివి.

శ్లో॥ న కర్మణామనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥ 4

తా. పురుషుడు కర్మచేయక పోవుటవలన నిష్కామమును పొందడు. కర్మలను విడుచుటవలన సిద్ధిని పొందడు.

వ్యా. విజ్ఞానము గలవారి దరిజేరి వారు చెప్పునట్లు చేయనిచో నిష్కామ భావమును (విజ్ఞానమును) పొందలేడు. విజ్ఞానమే నిష్కామ భావముగలది. చేయవలసిన పూర్వకర్మ నిష్కామముగా చేయనిచో కర్మలనుండి విముక్తుడుకాడు. ఈ రెండు ప్రవర్తనలను కర్మయోగమని, జ్ఞానయోగమని వ్రాసినారు. స్వయముగా చేయు యోగములనునవి కామరాగద్వేషాది మాయా గుణముల యోగములేగాని కర్మయోగముకాదు, జ్ఞానయోగము (విజ్ఞాన ప్రవర్తన) కాదు.

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్యకర్మకృత్।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥ 5

తా. ఎవడును కర్మచేయకుండ ఒక్క క్షణమైనను నుండడు. ప్రకృతి గుణముల కందరును వశులైన వారగుటచే అందరును గుణములచే ఎల్లప్పుడును కర్మ చేయబడుచునే యుందురు.

వ్యా. ప్రకృతి గుణములు సర్వజనులను స్వాధీనము చేసికొని, ఎల్లప్పుడును కర్మచేయుచుండును. ఎవరును గుణములను స్వాధీనము చేసికొని నడుపలేరు. అందుచేత జ్ఞానముగలవారి దరిజేరి వారు చెప్పునటుల చేయవలెను.

శ్లో. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।
ఇంద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే॥

తా. ఎవడు కర్మేంద్రియములను నిగ్రహించి యింద్రియ విషయములను మనస్సుచేత స్మరించుచున్నాడో వాడు వివేక శూన్యుడు. మిథ్యాచారుడని చెప్పబడు చున్నాడు.

వ్యా. ప్రకృతి గుణములు గలవారు కర్మేంద్రియ నిగ్రహము, ఇంద్రియ నిగ్రహము అనగా గుణములను నిగ్రహించుట అను రెండు విధముల నిగ్రహము లలో దేనిని కూడ నిగ్రహించలేరు. ఈ గుణములను జయించలేరు. సంస్కార విషయముల ననుసరించి వారి యందున్న స్వభావముచేత ప్రేరేపింపబడి ప్రవర్తింప బడు కర్మలయందు వారి యందున్న ప్రకృతి గుణములు ప్రవర్తించు చుండును.

శ్లో॥ యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేంద్రియైః కర్మయోగమసక్తస్స విశిష్యతే॥　　7

తా. అర్జునా! ఎవడు మనస్సుచేత ఇంద్రియములను (గుణములను) నిగ్రహించి కర్మేంద్రియములద్వారా కర్మయోగమును కోరికలేక చేయుచున్నాడో వాడు శ్రేష్ఠుడగు చున్నాడు.

వ్యా. ప్రకృతి గుణములు గలవారెవరైన నే విధముగను గుణములను నిగ్రహించలేరు. కోరికలేక కర్మయోగమును స్వయముగా చేయలేరు. కోరిక ఎవరి యందున్నదో వారు కోరికలేక కర్మచేయలేరు.

శ్లో॥ నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।
శరీరయాత్రాఽపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః॥　　8

తా. కర్మ చేయకుండుటకంటె, కర్మచేయుటే శ్రేష్ఠమైనది. కాబట్టి నీవు నియమితమైన కర్మచేయుము. ఏలననగా కర్మచేయకుంటివేని నీవు జీవించుటకు ఆధారముకూడ నుండదు.

వ్యా. కర్మచేయనిచో ఏదియును లభింపదు. జీవించుటకైనను ఆధార ముండదు. అందుచేత అర్జునుడు కర్మచేయవలెను. సంస్కార కర్మను చేయక తప్పించుకొనలేడు. ఆ కర్మలు విజ్ఞానము గలవారిదరిజేరి, వారిచే నియమింపబడి వారు చెప్పినట్లు చేయవలెను.

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగస్సమాచర॥ 9

తా. అర్జునా! యజ్ఞార్థమైన కర్మకంటె, ఇతరమగు కర్మ ఈ జనులకు కర్మ బంధములను కలుగజేయుచున్నది. కనుక యజ్ఞార్థమైన కర్మను ఫలాపేక్షలేనివాడవై చేయుము.

వ్యా. లోకములో హోమములతో చేయు యజ్ఞములు కర్మబంధములను కలుగజేయును. వానిని ఫలాపేక్ష లేకుండ చేయవలెననుసదియు యథార్థముకాదు. కోరిక యున్నవారు అపేక్షలేకుండ స్వయముగా ఏ కర్మయును చేయువారుకారు. అందువలన విజ్ఞానము గలవారిదరిజేరి వారు చెప్పునట్లు చేయుకర్మయే వారియందున్న జ్ఞాన, విజ్ఞానములను పొందునట్టి ఫలాపేక్షలేని కర్మ.

శ్లో॥ సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్ట కామధుక్॥ 10

తా. పూర్వము బ్రహ్మదేవుడు ప్రజలను యజ్ఞములతో కూడ సృజించి, యజ్ఞాది కర్మలచేత మీరు అభివృద్ధి పొందుడు. ఈ యజ్ఞములు ఇష్టార్థముల నిచ్చునవి అవుగాక యని చెప్పెను.

వ్యా. ఇచ్చట యజ్ఞమనగా కర్మయని అర్థము. ఏ కర్మచేసిన ఆ కర్మ ఫలమునే పొందుదురుగాని, ఒకటిచేసి యింకొక ఫలము కావలెననినరాదు. కర్మ వలననే ఫలమును పొందుదురు. కష్టసుఖములుగాని, దేనినైననుగాని కర్మవలననే పొందుదురు. ఇది మానవుల సహజ లక్షణము. ఈ యజ్ఞములు బ్రహ్మదేవుడు చెప్పినవికాదు. మాయ యందున్న బ్రహ్మఅనగా భ్రమచే (భ్రమగలవారిచేత) నిర్మింపబడినవి. హోమాది యజ్ఞములెన్నిచేసినను ఇష్టార్థములు లభింపవు. కాని, ఆ హోమాగ్ని యందుబడి బాధచెంది శరీరములువిడిచిన ప్రాణుల వలనను, అందు వస్తువులను వేసి వృథాగా పాడుచేయుట వలనను పాపమును పొందుదురు.

శ్లో॥ దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ॥ 11

తా. ఈ యజ్ఞములచేతనే దేవతలను తృప్తిపరచుడు. ఆ దేవతలు మిమ్ము లను తృప్తి పొందించెదరు. మీరు అన్యోన్యభావము గలవారై ఉత్తమమైన శ్రేయస్సును పొందుడు.

వ్యా. ఈ శ్లోకము యథార్థముకాదు. ఉత్తమ గుణములు గలవారి సాంగత్య మున ఉత్తమ గుణములనుపొంది, వానిద్వారా కర్మచేయుచు ఉత్తమమైన శ్రేయస్సును అనుభవించెదరు. అంతియేగాని, దేవతలను మీరు తృప్తిపరచుట, ఆ దేవతలు మిమ్ములను తృప్తి పొందించెదరనుట సత్యముకాదు.

శ్లో॥ ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తానప్రదాయైభ్యోయో భుఙ్క్తే స్తేన ఏవ సః॥12

తా. యజ్ఞములచేత పూజింపబడిన దేవతలు మీకు ప్రియములైన భోగముల నిచ్చెదరు. ఆ దేవతలచేత నివ్వబడిన దానిని ఆ దేవతలకు నివ్వక యెవ్వ డనుభవించుచున్నాడో వాడు చోరుడు.

వ్యా. ఈ శ్లోకము యథార్థముకాదు.

శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః।
తే త్వఘం భుంజతే పాపా యే
పచంత్యాత్మ కారణాత్॥ 13

తా. యజ్ఞములుచేసి మిగిలిన యన్నమును భుజించెడు సత్పురుషులు సమస్త పాపములనుండి విడువబడుచున్నారు. ఎవరు తాము భుజించుటకు మాత్రము వండు కొను చున్నారో అట్టి పాపులైనవారు పాపము ననుభవించుచున్నారు.

వ్యా. ఈ శ్లోకమును యథార్థముకాదు. ప్రాణుల ఆహారమును హోమముల యందు వేసి వృధాగా పాడుచేయుటవలన పాపము సంభవించును. అందు మిగిలిన అన్నమును సత్పురుషులు భుజింపరు. ఎవరు భుజించినను వారు కర్మబంధితు లగుచురు కాని పాపములనుండి విడువబడరు. ఒకప్పుడు సత్పురుషులు విధిగ తినినను వారు తినిన ఆహారమువలన పాపములనుండి విడువబడరు. కాని వారి యందున్న సత్ అను జ్ఞాన విజ్ఞానముల ప్రవర్తన వలననే పాపములనుండి విడువబడుదురు. రాగ ద్వేషాది గుణములు లేనివారగు జ్ఞానులకును; ప్రకృతి

ప్రవర్తించు విజ్ఞాన మార్గము (ప్రవర్తన) కాదు. మాయయందున్న భ్రమను బ్రహ్మ, బ్రహ్మదేవుడని కల్పించి వ్రాసినారు.

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి॥

తా. అర్జునా! ఎవడు పైన చెప్పిన ప్రకారము ప్రవర్తింపజేయబడిన చక్రమును ఈ లోకము నందనుసరింపడో వాడు పాప జీవనము గలవాడును, విషయాసక్తుడునై వ్యర్థముగా బ్రతుకుచున్నాడు.

వ్యా. ఈ శ్లోకము యథార్థముగాదు. రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వ, వాంఛాది గుణములు గలవారు పైన చెప్పబడిన హోమ యజ్ఞములు చేయుచు కర్మ బంధితులై, విషయాసక్తులై పాప జీవనము గలవారై బ్రతుకుచుందురు.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే॥ 17

తా. ఏ మనుష్యుడు ఆత్మయందే రమించువాడును, ఆత్మతోనే తృప్తి పొందువాడును, ఆత్మయందే సంతోషమును పొందుచున్నవాడునగునో వానికి చేయ దగిపదిలేదు.

వ్యా. ఈ శ్లోకము యథార్థముకాదు. జ్ఞానము (భావము) గలవాడు అపుడపుడు జ్ఞానముద్వారా పరమపదముగా నున్న పరమతేజస్సును చూచుచున్నవాడై ఆనంద మనుభవించుచుండును. వాడు కామ రాగ ద్వేషాది గుణములచేత విడువబడినవాడై వాని స్వభావముచేత వాని సంస్కార కర్మలయందు ప్రవర్తింపబడుచుండును. ఆ కర్మలయందు వాని యందున్న విజ్ఞానము నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించుచుండును. వానికి కావలయునను కోరికయేలేదు. కావలసినదిలేదు. చేయ దగినదిలేదు. వాడు జ్ఞానమను భావముద్వారా ఆ తేజస్సును చూచుచు ఆ తేజోపద మునుచేరి, అచ్చట ఆ తేజో ఆనంద మనుభవించుచుండును. వాడు ఈ లోకము నందు జన్మమునకురాడు. అది జన్మమునకు రాని పరమతేజో లోకము.

పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను. జ్ఞానము ద్వారానే చేరవలెనని 13 వ అ. 18 వ శ్లో. లో ఉన్నది. జన్మమునకు రాని పరమ పదముగాయున్న

పరమ తేజస్సును మాయ యందుండి వచ్చిన తనయందే రమించుచు తృప్తియును, ఆనందమును పొందుచున్నాడనునది యథార్థముకాదు.

ఈ కాన్పించు సర్వమును బ్రహ్మయొక్క పగటికాలమందు ప్రకృతి (మాయ) యందుండి వచ్చుచున్నదని, రాత్రి రాగానే ఆ మాయయందే కలియు చున్నదని 8 వ అ. 18 వ శ్లో. లోను, అట్టి జీవులు స్వాతంత్ర్యము లేనివై అనేక జన్మల నెత్తుచు రాత్రి రాగానే ఆ ప్రకృతి (మాయ) యందే కలియుచున్న వని, పగలు రాగానే ఆ మాయ యందుండి వచ్చుచున్నవని 19 వ శ్లో. లోను ఉన్నది.

ప్రకృతి (మాయ) కార్యకారణ కర్తృత్వములకు హేతువని, జీవుడు సుఖ, దుఃఖముల ననుభవించుటకు హేతువని 13 వ అ. 21 వ శ్లో. లోను, మాయాగుణములుండుట వలన ఈ గుణముల ననుభవించుచున్నాడని వీనివలన అనేక ఉత్కృష్ట, నికృష్ట జన్మల నెత్తుచున్నాడని 22 వ శ్లో. లోను ఉన్నది. మాయ యందుండివచ్చి, మాయాగుణములచేత స్వాతంత్ర్యము లేక అనేక జన్మల నెత్తుచు, సుఖ దుఃఖముల ననుభవించుచు మాయ యందే కలియుచు మరల వచ్చుచు తిరుగుచుండు జీవుడు తన ఆత్మయందే రమించుచు ఆత్మయందే తృప్తియును సంతోషమును పొందుచున్నాడనునది మాయ యందు బంధించు మాయా గుణముల ఆనందమేగాని పరమతేజో ఆనందముకాదు. నశించనిది, సర్వోత్కృష్టమైనది, చేరవలసిన స్థానమని, అది జన్మమునకు రానిదని 8 వ అ. 21 వ శ్లో. లో చెప్ప బడిన పరమపదముగానున్న పరమతేజస్సును ఆత్మయని వ్రాయుచు, ఇది ఈ లోకములో అందరి యందును యున్నదనుటకుగాను ఇట్లు కల్పించి వ్రాసినారు.

శ్లో॥ నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః॥ 18

తా. అట్టివారికి ఈ లోకమునందు కర్మచేయుటచేత ప్రయోజనములేదు. కర్మ చేయకుండుటచేతను ప్రయోజనములేదు. వానికి సమస్త భూతములయందు నాశ్రయింపదగినది ఏదియునులేదు.

వ్యా. ఈ శ్లోకమునందు చెప్పబడినవి పైన 17 వ శ్లోకమునందు చెప్పబడిన వాని లక్షణములుకాదు. ఇవి పరమపదమును, దానిని చేరుమార్గము నెరిగిన వారి

లక్షణములు. అట్టివారు పూర్వకర్మ సంస్కారము ననుసరించి వారి స్వభావము ప్రవర్తించు కర్మలయందు విజ్ఞానము నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించుచుండును. వారు కర్మరహితులగుదురు. కాని, కర్మఫలము ననుభవించరు. వారికి ఆశ్రయింపదగినది సమస్త భూతములయందునులేదు. కర్మ చేయుటవలన ఫలమును పొందరు.

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥ 19

తా. కోరికయే లేక కర్మచేయువాడు పరమపదమును జేరును. నీవు కోరిక లేనివాడవై ఎల్లప్పుడును చేయవలసిన కర్మ చేయుము.

వ్యా. జ్ఞానము గలవారియందు కోరిక, ప్రకృతి గుణములును ఉండవు. వారు కోరికయే లేక కర్మచేయుదురు. కర్మ రహితులై పరమపదమును చేరుదురు. అర్జునుడు కోరికలేనివాడై చేయవలసిన కర్మ చేయవలెననిన జ్ఞానమును పొందవలెను. జ్ఞానముతో విజ్ఞానమును పొందును. విజ్ఞానమే చేయవలసిన సంస్కార కర్మను కోరికయే లేక చేయునది.

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః।
లోక సంగ్రహమేవాపి సంపశ్యన్కర్తు మర్హసి॥ 20

తా. జనకుడు మొదలగువారు కర్మచేయుచునే మోక్షమును పొందియున్నారు. జనులను సన్మార్గమున నడిపియున్నారు. కాబట్టి నీవు జనులకు మంచిమార్గము చూపుటకైనను కర్మచేయుటకు తగుదువు.

వ్యా. జనకుడు జ్ఞాన, విజ్ఞానములు గలవాడు. అందువలన రాగ, ద్వేషాది గుణములు లేనివాడు. చేయవలసిన తన సంస్కారకర్మ తన స్వభావముచే చేయబడుచు, కర్మరహితుడై మోక్షపదమును చేరువాడు. అట్టివారు జనులను ఆ మార్గముననే నడుపుచుందురు. అర్జునుడు ఆ విధముగ చేయవలెననిన, అట్టివారియందున్న జ్ఞానమును పొందవలెను.

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥ 21

వ్యా. జ్ఞానము లేనివారియందు రాగద్వేష వాంఛాది గుణములుండును. ఆ గుణములు కర్మల యందాసక్తి చేయుచుండును. జ్ఞానము గలవారు కోరిక లేనివారగుటచే కర్మచేయవలెనను కోరిక (యిచ్ఛ) యే లేనివారై పూర్వ కర్మ సంస్కారము ననుసరించి వారి స్వభావముచే ప్రవర్తింపబడు కర్మలయందు విజ్ఞానము నిష్కామము, సమత్వబుద్ధి, పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించు చుండును. జ్ఞానము లేనివారియందు రాగద్వేష వాంఛాది ప్రకృతి గుణములుండును. జ్ఞానముగల వారియందు విజ్ఞానము సమత్వబుద్ధి, పవిత్రప్రేమ భావములతో నుండును. ఎవరియందే గుణములుండునో, ఆ గుణములే కర్మలయందు ప్రవర్తించు చుండును. ఒక గుణము ప్రవర్తన యింకొక గుణమునకు చేతకాదు. గుణములే కర్తలుగాని, జీవుడు కర్తకాదు. కోరికయే లేనివానియందు కర్మచేయవలెనను ఇచ్ఛయే యుండదు. కాని, కోరికయే లేనివాడు చేయుట యందిచ్ఛగలవాడై చేయ వలెనని యిందు వ్రాసినది యథార్థముకాదు. కృష్ణుడును, జ్ఞానము గలవారును విజ్ఞానముచేత పవిత్రప్రేమ భావములతో సంస్కార కర్మలయందు విధిగా ప్రవర్తింపబడుచుందురు. ఎల్లప్పుడును ఇతర జనులను విజ్ఞాన ప్రవర్తనయందు ప్రవర్తింపజేయుచుందురు. ఇది వారి యందున్న విజ్ఞానముయొక్క ప్రవర్తన. అంతియేగాని కృష్ణుడును, జ్ఞానము గలవారును తాము కర్మచేయనిచో, ఇతరులు కూడ కర్మచేయక చెడిపోదురని చేయరు.

శ్లో॥ న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినాం।
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తస్సమాచరన్ ॥ 26

తా. విద్వాంసుడు కర్మల యందాసక్తిగల అజ్ఞానుల (జ్ఞానములేనివారి) కర్మచేయు బుద్ధిని చెడగొట్టరాదు. వారు జ్ఞానము గలవారై సర్వకర్మలను చేయునట్లు వారిని ప్రోత్సాహపరచవలెను.

వ్యా. జ్ఞానము గలవారు జ్ఞానములేని వారాసక్తితో కర్మచేయు బుద్ధిని చెడగొట్టరు. ఎందుచేతననగా వారు, వారి జీవితాధారమునకు కర్మచేయ వలెననునది, సంస్కార కర్మలయందు ప్రవర్తింపబడుదురనునది జ్ఞానము గలవారెరిగి యున్నారు. వారిని ప్రాణి హింసాది పాప కర్మలనుండియు, తప్పుమార్గములనుండియు తొలగించెదరు. జ్ఞానులు, అజ్ఞానులవలె కర్మలను చేయరు. వారు విజ్ఞానముచేత ప్రవర్తింపబడుచు ప్రాణి రక్షణ అనగా ప్రాణులకు కష్ట దుఃఖములను కలిగించు

రాగద్వేషాది గుణములు వానినుండి తొలగుటకు వానియందును జ్ఞాన, విజ్ఞానములు ప్రవేశింప జేయుటకు వానిని ప్రవర్తింపజేయుచుందురు. ఇది వారి యందున్న విజ్ఞానముయొక్క ప్రవర్తన.

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకార విమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే॥ 27

తా. అహంకారముచే మూఢ బుద్ధిగలవాడు ప్రకృతి గుణములచేత చేయ బడు సర్వకర్మలును నేను చేయు చున్నానని తలంచుచున్నాడు.

వ్యా. జీవుని యందున్న అహంకారాది ప్రకృతి గుణములు కర్మలయందు ప్రవర్తించుచుండును. అందువలన అహంకారమే "నేను" చేయుచున్నాననును. అహంకారముచేత ప్రకృతి గుణములతో ప్రవర్తింపబడుచు నేను చేయుటలేదనుట తప్పు. జీవునియందు గుణములుండుట వలన గుణములు చేయు కర్మ ఆ జీవునికే వర్తించును.

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః।
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే॥ 28

తా. అర్జునా! పరమపదము నెరిగినవాడు ప్రకృతి గుణములు వాని స్వభావములగు పనులయందు ప్రవర్తించు చున్నవని తలంచి కర్తృత్వాభి మానమును పొందడు.

వ్యా. పరమపదము నెరిగినవారు వారి యందున్న విజ్ఞానముచేత జీవుని, జీవుని స్వభావమును, కర్మబంధములు లేని పవిత్రభావములను, కర్మబంధములను కలిగించి కర్మల ననుభవింపజేయు ప్రకృతి గుణములను ఎరిగియున్నారు. వారి యందు ప్రకృతి గుణములుండలేక వెళ్ళిపోవును; కర్తృత్వాభిమానములును ఉండవు. ఆ గుణముల ఆచరణయు నుండదు. వారు విజ్ఞానముచేత పవిత్రప్రేమ భావములతో విధియగు కర్మ చేయబడుచున్నదని ఎరిగియున్నారు. పరమపదము నెరిగినవారియందు రాగద్వేషాది ప్రకృతి గుణములున్నట్లును, అవి వాని స్వభావము లగు పనులయందు ప్రవర్తించుచున్నటులను, వారు కర్తృత్వాభిమానమును బొంద నటులను ఈ శ్లోకమునందు వ్రాసినది యథార్థముకాదు. ఇది కృష్ణుడును, పరమ పదము నెరిగినవారును చెప్పినదికాదు. కొందరు ఇటువంటి శ్లోకములను,

శాస్త్రములను చదువుకొని మేము పరమ తేజోపదము నెరిగి యున్నాము. ప్రకృతి గుణములు వాని స్వభావములగు పనులయందు ప్రవర్తించుచున్నవి. ఆ కర్మలు మాకంటవు అని చెప్పుచు ఆ గుణములతో కర్మలయందు ప్రవర్తింపబడు చున్నారు. ఇట్టి తప్పు ప్రవర్తనను ఇంకెందరికో బోధించి వారిని కూడ తప్పు మార్గమున కీడ్చు చున్నారు. వారందరును జ్ఞాన, విజ్ఞానములు లేకపోవుటవలన ప్రకృతికి దాసులై పతనమగుచున్నారు. ఇది ప్రకృతి గుణములు గలవారి ఆచరణ (ప్రవర్తన).

శ్లో॥ ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు।
తానకృత్స్నవిదో మన్దాన్కృత్స్నవిన్న
విచాలయేత్॥ 29

తా. ప్రకృతివలన కలిగిన గుణములచేత మూఢులైనవారు, ఆ గుణముల కర్మల యందాసక్తులగుచున్నారు. ఏమియునెరుగని మంద బుద్ధులైన వారలను సమస్తము నెరిగినవారు చలింపజేయగూడదు.

వ్యా. ప్రకృతి గుణములు గలవారు మూఢులనబడుచున్నారు. జ్ఞాన విజ్ఞానములుగలవారు జ్ఞానులనబడుచున్నారు. గుణముల కర్మలనుబట్టి వారికాపేర్లు సంభవించినవి. ప్రకృతి గుణములు ఆసక్తి, కర్తృత్వము గలవి యగుటచే ఆ గుణముల కర్మలద్వారా కర్మబంధములు గలవారై, సుఖములను, దుఃఖములను, అనుభవించు వారగుదురు. ఇది యంతయును జ్ఞానము గలవారి యందున్న విజ్ఞానము ఎరిగియున్నది. విజ్ఞానమే అదియున్నవారి దరిజేరిన ప్రకృతి గుణములు గలవారికి పవిత్రమార్గమును, పవిత్రప్రేమ భావములతో చెప్పుచుండును. అది వారి యందున్న గుణముల కర్మల యందాసక్తిని తొలగించి వారిని పవిత్ర మార్గమున ప్రవర్తింప జేయుచుండునుగాని, వారిని చలింపజేయదు.

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥ 30

తా. జ్ఞానాభిలాషతో సమస్త కర్మలను నాకే వదలి ఆశయును, మమకారమును లేనివాడవును, తాపము లేనివాడవునై యుద్ధము చేయుము.

వ్యా. కృష్ణుని యందున్న జ్ఞానమును పొందవలయునను అభిలాషతో కృష్ణుని సాంగత్యమున కృష్ణునియందు ప్రేమ గలవాడై ఆశయును, మమకారమును

వ్యా. అజ్ఞానులైనను, జ్ఞానులైనను వారి వారి పూర్వ సంస్కార కర్మల ననుసరించి వారి స్వభావముచేత కర్మలయందు ప్రేరేపింపబడి ప్రవర్తింపబడు చున్నారు. వారి యందున్న గుణములు ఆ కర్మలయందు ప్రవర్తించుచున్నవి. నిగ్రహించుటను నదియును సంస్కార ప్రేరేపణవలన అసుర అను ప్రకృతి గుణములచేతనే చేయబడుచున్నది. అందరును సంస్కార కర్మలయందు ప్రవర్తింపబడుచున్నారు. వానిని నిగ్రహించి తప్పించుకొనుట కెవ్వరికిని చేతకాదు. అజ్ఞానులు అనగా జ్ఞానము లేనివారి యందున్న రాగ, ద్వేష, అహంకార కర్తృత్వాది గుణములు వారిసంస్కారము వలన వారి స్వభావముచేత ప్రేరేపింపబడి ప్రవర్తింపబడు కర్మలయందు ప్రవర్తించుచుండును. అందువలన వారు మరల నూతన సంస్కార బంధములు గలవారగు చున్నారు. ఈ గుణములింకననేక నూతన కర్మబంధములను గూడ వారికి కలిగించు చుండును. జ్ఞానుల (జ్ఞానము నార్జించినవారి) యందు కర్మబంధములు కలిగించు రాగ ద్వేషాది ప్రకృతి గుణములుండవు. వారి యందున్న విజ్ఞానము నిష్కామాది పవిత్ర ప్రేమభావములతో వారి పూర్వ సంస్కారము ననుసరించి వారి యందున్న స్వభావము చేత ప్రేరేపింపబడి ప్రవర్తింపబడు కర్మలయందు ప్రవర్తించుచుండును. అందువలన వారికి కర్మబంధములుండవు. వారి కర్మలు నశించుచున్నవి.

శ్లో॥ ఇన్ద్రియ స్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ॥ 34

తా. ఇంద్రియములయొక్క విషయములయందు రాగద్వేషములు కలిగి యున్నవి. ఆ రాగద్వేషములకు వశులు కాగూడదు. ఎందుచేతననగా రాగ ద్వేషములు శత్రువులు.

వ్యా. స్వభావముచేత ప్రేరేపింపబడు సంస్కార కర్మలయందు రాగ ద్వేషాది గుణములుండకూడదు. ఈ గుణములు కర్మబంధమును కలిగించి నరకము ననుభవింపజేయు శత్రువులు. ఎవరైనను ఈ గుణములను వారినుండి వెడలగొట్టవలెను గాని, ఈ గుణములకు వశులుగాక వీనిని నిగ్రహించలేరు. ఈ గుణములను జయించుటకు జ్ఞాన, విజ్ఞానములను అవియున్నవారినుండియే పొందవలెను.

శ్లో॥ శ్రేయాన్స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ 35

తా. స్వధర్మము బాగుగానాచరింపబడు నితర ధర్మముకంటె శ్రేష్ఠమైనది. స్వధర్మమునందు మరణము కలిగినను శ్రేయస్కరము. ఇతర ధర్మము భయంకర మైనది.

వ్యా. స్వధర్మమనగా మానవునకు విధియైన ధర్మము. ఇది విజ్ఞానముగల వారిచేత చెప్పబడిన ధర్మము. ఇది విజ్ఞానముచేత రాగద్వేషాది గుణములను వెడల గొట్టబడినవారై నిష్కామాది పవిత్రప్రేమ భావములచేత ప్రవర్తింపబడు ధర్మము. ఇదియే మానవ జన్మయందు మానవుడు నడువవలసిన స్వధర్మము. అన్య ధర్మము అనగా ప్రకృతి గుణములు గలవారిచేత చెప్పబడి, ప్రకృతి గుణములచేత చేయబడు ధర్మము. ఇది మానవజన్మకు విధియగు ధర్మముకాదు. ఈ ధర్మము నెంత బాగుగా నాచరించినను ఇది ప్రకృతి యను రాక్షసి వైపునకు ఈడ్చుకొని పోవును. ఇది భయంకరమైనది. అందువలన పైన చెప్పబడిన స్వధర్మమైన మానవ ధర్మమునందు మరణము కలిగినను శ్రేయస్కరమే యగును.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥ 36

తా. కృష్ణా ! పురుషుడు దేనిచేత ప్రేరేపింపబడి యిచ్ఛలేని వాడయ్యును బలవంతముగా నియమింపబడిన వానివలె పాపకార్యమును చేయుచున్నాడు ?

శ్రీ భగవాను ఉవాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్॥ 37

తా. రజోగుణమువలన బుట్టినదియు, తృప్తిలేనిదియునగు కామము వలననే మహాపాపమునకు క్రోధము కారణము. ఈ కామము ఈ లోకమునందు శత్రువుగా నెరుంగుము.

వ్యా. జీవుని యందున్న కామ, క్రోధ, ద్వేషాది గుణములలో కామము వలననే క్రోధ, ద్వేషాది గుణములు మహాపాపమునకు కారణమగుచున్నవి. కామ

షున్నంతవరకును ఈ కామమును, రాగద్వేషాది గుణములను శత్రువులుగా నెరుగవలెను.

శ్లో॥ ధూమేనాఽఽవ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్॥38

తా. అగ్ని పొగచేతను, అద్దము మాలిన్యముచేతను, శిశువు మావిచేత నావరింపబడునట్లు, జ్ఞానము కామముచేత నావరింపబడును.

వ్యా. జ్ఞానము కామముచేత నావరింపబడునని యిందు వ్రాసినది యథార్థము కాదు: కామాది గుణములన్నియును జీవుని యందున్నవి. ఇవి కర్మరూపమున జీవునకు జన్మ కర్మబంధముల ననుభవింపజేయుటకు కారణమగునవియై యున్నవి. జ్ఞానము నార్జించిన వారియందు కామాది గుణములన్నియును ఉండలేక వెళ్ళిపోవును. జ్ఞానము కామముచేత నావరింపబడునదికాదు.

శ్లో॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ॥ 39

తా. అర్జునా! ఎప్పటికిని నిండనిదియు, తృప్తిలేనిదియు కామరూపమై జ్ఞానికి నిత్య శత్రువైనదియునగు కామముచేత జ్ఞానము ఆవరింపబడుచున్నది.

వ్యా. జ్ఞానము కామముచేత ఆవరింపబడుననియు, కామము జ్ఞానికి నిత్య శత్రువనియు యిందు వ్రాసినది యథార్థముకాదు. జ్ఞానమును కప్పునదేదియును లేదు. జ్ఞానమును ఎవరు పొందుదురో వారిని కామాది గుణములన్నియును విడిచి వెళ్ళిపోవును. జ్ఞానికి శత్రువైనది తనయందులేదు; ఇంకెచ్చటనులేదు. జ్ఞానములేని వారి యందున్న కామాది గుణములన్నియును వారికి నిత్య శత్రువులై వారియందు ప్రవర్తించుచుండును.

శ్లో॥ ఇన్ద్రియాణి మనో బుద్ధిరస్యాధిష్ఠాన ముచ్యతే।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥ 40

తా. ఇంద్రియములు, మనస్సు, బుద్ధియును ఈ కామమునకు ఆశ్రయములని చెప్పబడుచున్నవి. ఈ కామము యింద్రియములద్వారా జ్ఞానమును ఆవరించి జీవుని మోహింపజేయుచున్నది.

వ్యా. రాగద్వేషాది గుణములన్నియును కామముతో జీవుని యందుండి శరీరేంద్రియములద్వారా కర్మలయందు ప్రవర్తించుచుండును. జీవుడు కామమునకు ఆశ్రయము. కామము గుణములకు ఆశ్రయము. జీవునకు ఆశ్రయము శరీరము. ఈ విధముగా జీవుని యందున్న గుణములలో మోహము కామముతోకూడి శరీరము ద్వారా ప్రపంచమును మోహించుచున్నది. కామముగాని, గుణములుగాని, జ్ఞానము నావరించునని 38, 39, 40 శ్లోకములయందు వ్రాసినది యథార్థముకాదు. జ్ఞానము నావరించున దేదియునులేదు. జ్ఞానము నెవరు పొందుదురో అదివరకు వారియందున్న కామాది గుణములన్నియును వారి యందుండలేక, వారిని విడిచి వెళ్ళిపోవును. కామము జీవుని యందుండును. అందువలన కామము, గుణములు జీవుడున్న శరీరము నందంతటను నుండును.

శ్లో॥ తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్॥

తా. అర్జునా! అందువలన నీవు మొదట ఇంద్రియములను నియమ మందుంచి జ్ఞాన, విజ్ఞానములను నశింపజేయునట్టి పాపరూపమైన కామమును ప్రయత్న పూర్వకముగా విడువుము.

వ్యా. ఎవరును ఎట్టి ప్రయత్నముల చేతనైనను స్వయముగా ఇంద్రియములను నియమ మందుంచి కామమును విడువలేరు. కామమును విడువవలెనని యత్న మొనరించునదియును కామమే. ఇట్లు కామమే వారి యందుండి చేయుచున్నపుడు కామము వారిని విడువదు. యత్నమొనరించు పండితుడైనను ఇంద్రియములచేత నీడ్వబడుచుండును. ఇంద్రియములే బలముగలవి యని 2 వ అధ్యాయమున 60 వ శ్లోకమునందు చెప్పబడినదియే యథార్థము. కామము జ్ఞాన, విజ్ఞానములను నశింప జేయునని ఈ గీతయందు ఎచ్చట వ్రాసినను యథార్థముకాదు. జ్ఞానమును, విజ్ఞానమును నశింపజేయునదేదియునులేదు. జ్ఞానము గలవారినుండి జ్ఞాన విజ్ఞానములను పొందినచో పాపరూపమైన కామ మోహాది గుణములన్నియును వారిని విడిచి వెళ్ళిపోవును. ఈ జ్ఞానమును గురించి 4 వ అధ్యాయమునందు 34, 35, 36, 37, 38 శ్లోకములలో చెప్పబడినది యథార్థము.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః॥ 42

తా. ఇంద్రియములు శ్రేష్ఠమైనవి. ఇంద్రియములకంటె మనస్సు, మనస్సు కంటె బుద్ధి శ్రేష్ఠమైనవి. బుద్ధికంటె ఆత్మ శ్రేష్ఠమైనదని చెప్పుదురు.

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥

తా. అర్జునా! బుద్ధికంటె ఆత్మను శ్రేష్ఠమైనదానినిగా నెరింగి, ఆత్మచేత నిగ్రహించి కామరూపమైనదియు, జయింప కష్టమగునదియునగు శత్రువును జయింపుము.

వ్యా. జ్ఞానమున్నవారియందు విజ్ఞానముండును. వారియందు కామముండదు. కామముగలవారు స్వయముగా ఏ విధముగ నిగ్రహించియును కామరూపమైన శత్రువును జయించలేరు. ఆత్మచేత నిగ్రహించి కామరూపమైన శత్రువును జయింపుమని యిందు వ్రాసినది యథార్థముకాదు. ఆత్మలేదు. జీవుడు తనయందున్న గుణములద్వారా తనకు సంభవించిన దానిని అనుభవించువాడేగాని స్వయముగా ఏమియును చేయువాడుకాదు. వానికి దేనిని ఏ విధముగ నిగ్రహించుటకును చేత కాదు. ఏ జీవునియందు ఏ గుణములున్నవో, ఆ గుణములే కర్మచేయు కర్తలు గాని, జీవుడు కర్తకాదు. జ్ఞాన విజ్ఞానములు, నిష్కామము, సమత్వబుద్ధి, పవిత్రప్రేమ భావములు శ్రేష్ఠములైనవి. రాగద్వేషాది ప్రకృతి గుణములు శ్రేష్ఠమైనవికాదు. ఎవరియందే గుణములున్నవో కర్మలద్వారా కాన్పించుచుండును. చూచుకొనుడు. మోక్ష (పరమ) పదమును చేర్చు జ్ఞాన, విజ్ఞాన, పవిత్రప్రేమ భావములను దైవసంపదయని; కర్మబంధమును కలుగుజేయు కామ రాగద్వేషాది గుణములను అసుర సంపదయని 16 వ అ. 5 వ శ్లో॥ ఉన్నది.

ఈ అధ్యాయమున అజ్ఞానులు జ్ఞాన విజ్ఞానములు గలవారి సాంగత్యమున వారు చెప్పునట్లు చేయునది కర్మయోగము. వారు అట్టికర్మద్వారా జ్ఞానముగలవారియందున్న జ్ఞాన విజ్ఞానములనుపొంది జ్ఞానముద్వారాపరమపద దర్శనమైనవారై, విజ్ఞానముచేత గుణరహితులై నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్వము, పవిత్రప్రేమ భావములతో ప్రవర్తింపబడి కర్మరహితులగుదురు. ఇది విజ్ఞానయోగము (ప్రవర్తన). అట్టి

వారికి జ్ఞానముద్వారా పరమపదము కాన్పించుచుండును. వారు పరమపదమును చేరుదురు. ఇట్టి కర్మను (విజ్ఞాన ప్రవర్తనను) ప్రకృతి గుణముల కర్తృత్వముతో స్వయముగా ప్రవర్తించవలయునని తప్పుగా వ్రాసియున్నారు. ఇందు యజ్ఞములని ధ్యానమని, నిష్కామ కర్మయని, ఫలాసక్తిలేని కర్మయని, జ్ఞానమును అజ్ఞానమావరించునని అట్టి అజ్ఞానమును తొలగించవలెనని ప్రకృతి గుణములచేత చేయబడు అనేకమైన తప్పు మార్గములను ఇందు వ్రాసియున్నారు. జ్ఞానము నావరించునది ఏదియునులేదు. జ్ఞాన, విజ్ఞానముల నార్జించినచో అజ్ఞానము వారిని విడిచి వెళ్ళిపోవును.



# గీతా వ్యాఖ్యానము

## జ్ఞానయోగము

### 4 వ అధ్యాయము

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయం
వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ 1

తా॥ అర్జునా ! నాశరహితమైన ఈ కర్మయోగమును నేను సూర్యునకు చెప్పితిని. సూర్యుడు మనువునకు, మనువు ఇక్ష్వాకునకు చెప్పెను.

శ్లో॥ ఏవం పరంపరాప్రాప్తమిమం రాజర్షయో విదుః
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప ॥ 2

తా. ఇట్లు పరంపరగా వచ్చిన ఈ కర్మయోగమును రాజర్షులు ఎరుగుదురు. ఈ కర్మయోగము ఈ లోకమునందు బహుకాలమునకు క్షీణించినది.

వ్యా. ఈ యోగమును కర్మను జ్ఞాన, విజ్ఞానములు గలవారెరిగి యున్నారు, గాని రాజర్షులు ఎరుగరు.

శ్లో॥ స ఏవాయం మయాతేఽద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్॥3

తా. నాకు భక్తుడవు, సఖుడవును అయినందునవలన అనాదియైన ఈ కర్మయోగమును యిప్పుడు నేను నీ కొరకు చెప్పుచున్నాను. ఇది శ్రేష్ఠమైనది. రహస్యమైనది.

వ్యా. జ్ఞాన, విజ్ఞానములు గలవారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయుటయే కర్మయోగము. ఇది పూర్వమునుండియును ఉన్నది. దీనిని కృష్ణుడర్జును

నకు చెప్పెను. దీనిని రాజర్షులు ఎరుగలేరు. విజ్ఞానమే దీనిని ఎరిగి యున్నది. కృష్ణునియందుండి నేను చెప్పితిననిన విజ్ఞానమే పూర్వము ఒకరియందుండి సూర్యునకు చెప్పియున్నది. సూర్యునియందుండి మనువునకును, మనువునందుండి ఇక్ష్వాకునకును చెప్పియున్నది. ఇట్లు చెప్పువారు కృష్ణునికి పూర్వమును, కృష్ణుడున్నపుడును, యిప్పుడును ఉన్నారు. ఎప్పుడునుఉందురు. ఇట్టి విజ్ఞానము గలవారిసాంగత్యమున వారుచెప్పునటుల చేయుటయే కర్మయోగము. యోగమనునది వేరు గాలేదు.

అర్జున ఉవాచ :– అర్జునుడు చెప్పెను.

శ్లో॥ అపరం భవతో జన్మపరం జన్మ వివస్వతః ।
కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి ॥ 4

తా. సూర్యుడు నీ కంటె పూర్వము జన్మించి యున్నాడు. నీవు తరువాతివాడవు. మొదట నీవు దీనిని చెప్పితివని ఎట్లు తెలిసికొనగలను ?

శ్రీ భగవానువాచ :– కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥ 5

తా. అర్జునా ! నేనును, నీవును ఈ భూమియందు అనేక జన్మలెత్తినాము. అర్జునా ! అవి యన్నియు నే నెరిగి యున్నాను. నీవెరుగవు.

వ్యా. కృష్ణుడు అందరివలెనే జన్మల నెత్తుచు క్రింది జన్మమునందు జ్ఞాన విజ్ఞానముల నార్జించి జన్మించినాడు. భగవదవతారమనునది కాదు. జన్మల నెత్తుట విజ్ఞానముగల కృష్ణుడును, అట్టివారును జీవుల స్వభావ ప్రవర్తన నెరిగి చెప్పుచున్నారు. ఇది అర్జును డెరుగడు. ఇతరులెరుగరు.

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥ 6

తా. నేను పుట్టుక లేనివాడను, నాశనములేని ఆత్మ(స్వభావము)గలవాడను. సర్వభూతములకు ఈశ్వరుడను. "ఆత్మమాయయా" అనగా నా సంస్కారము ననుసరించి నా స్వభావము ప్రవర్తించు ప్రవర్తన యను మాయచేత నా ప్రకృతి (నా స్వభావము) (సంస్కారము) ననుసరించియే జన్మమెత్తుచున్నాను.

వ్యా. కృష్ణుడను జీవుడు పుట్టు వాడేగాని పుట్టని వాడుగాదు. నశించని ఆత్మ అనగా స్వభావము గలవాడు. భూతములకు ఈశ్వరుడు కాదు. ఈశ్వరుడు లేడు. "ఆత్మమాయయా" అనగా తన సంస్కారము ననుసరించి తన స్వభావము ప్రవర్తించు ప్రవర్తన యను మాయచేత "స్వకీయమైన ప్రకృతిని" అనగా తన స్వభావము ననుసరించి (సంస్కారము ననుసరించి) పుట్టియున్నాడు. అటులనే సర్వజీవులకును స్వభావము ప్రవర్తించుచున్నది. రాముని జన్మయందు వాలిని చంపిన కర్మ వలన బోయవానిద్వారా చంపబడిన కృష్ణుడు భగవంతు డెట్లగును? దుష్టులను నాశనము చేయుటకు ఎట్లు పుట్టును?

అర్జునా! నేనును, నీవును అనేక జన్మలనెత్తినామని పైన 5 వ శ్లోకము నందు చెప్పిన కృష్ణుడు 6 వ శ్లోకమునందు "నేను పుట్టువాడను కాన"నునది కల్పితము. తన సహజస్వభావమును 'నశించని తన ఆత్మయనుట', స్వయమైన తన ప్రకృతి యనుట కల్పితము. తన సంస్కారము ననుసరించి తన స్వభావము ప్రవర్తించు కర్మను 'ఆత్మమాయ' యనుట కల్పితము. తాను భూతములకు ఈశ్వరుడనని నదియును కల్పితము. కృష్ణుడను జీవునికిని, సర్వజీవులకును యున్న స్వభావమునే ఈశ్వరుడని కల్పించినారు. ఈశ్వరుడు లేడు. అందరివలెనే కృష్ణుడును తన సంస్కారము ననుసరించి తన స్వభావమువలన పుట్టియున్నాడు. రాముని జన్మయందు చేసిన కర్మవలన కృష్ణుడుగా పుట్టి అందు వాలిని చంపిన కర్మవలన తన స్వభావముచేతనే బోయవానిద్వారా చంపబడినాడు. భగవంతుని అవతారములను నవి యథార్థము కాదు. ఈ అధ్యాయమున వ్రాసిన 7, 8 శ్లోకములు యథార్థము కాదు.

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్॥ 7

తా. అర్జునా! ధర్మమునకు హానియు, అధర్మమున కభివృద్ధియు నెప్పుడగుచున్నదో అప్పుడు నన్ను నేను సృజించుకొను చున్నాను.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ 8

తా. సాధువుల రక్షణ కొరకును, దుష్టుల నాశము కొరకును, ధర్మమును స్థాపించుట కొరకును ప్రతి యుగమునందును జన్మించు చుందును.

వ్యా. ధర్మమునకు హానియు, అధర్మమునకు వృద్ధియు కలుగునప్పుడు కృష్ణుడు "నన్ను, నేను" సృజించుకొను చున్నానని, సాధురక్షణ, దుష్ట నాశము కొరకును, ధర్మమును స్థాపించుట కొరకును జన్మించు చున్నానని వ్రాసినది యథార్థము కాదు. కృష్ణునివలెనే జ్ఞాన విజ్ఞానములు గలవారు అన్ని యుగములయందును అన్ని కాలములయందును ఉన్నారు. వారియందున్న విజ్ఞానము వారి సాంగత్యము చేయువారికిని జ్ఞాన విజ్ఞానములను సంభవింప జేయుట కొరకు పరమ ధర్మమును స్థాపించుచున్నది. మానవ జన్మయందు జీవులయందున్న రాగద్వేషాది గుణముల కర్మలవలన వారిని చంపునది, పుట్టించునది, సుఖ దుఃఖముల ననుభవింప జేయునది వారి (జీవుల) స్వభావము. జీవులకు స్వభావము ప్రవర్తించుచున్నదని 5 వ అ, 14 వ శ్లో. లో ఉన్నది.

శ్లో॥ జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున॥ 9

తా. అర్జునా! ఎవడు నాయొక్క దివ్యమైన జన్మమును, కర్మమును యథార్థముగా నెరుంగుచున్నాడో వాడు శరీరమును విడిచినను మరల జన్మమును పొందడు. నాయందు ప్రవేశించు చున్నాడు.

వ్యా. కృష్ణుని యందున్న విజ్ఞానముయొక్క పవిత్రప్రేమ భావముల ప్రవర్తన నెరిగినవాడు, కృష్ణుని సాంగత్యమువలన వానియందు ప్రేమ, భక్తి గలవాడై శరీరమును విడిచినప్పుడు కృష్ణుడను శరీరమునందు ప్రవేశించినను, కృష్టుడు అను జీవుడు కర్మరహితుడైనచో పరమపదమును చేరి మరల జన్మింపడు గనుక, ఆ శరీరమునందు ప్రవేశించి యున్నవాడు (జీవుడు) వాని సంస్కారము ననుసరించి కృష్ణునియందున్న జ్ఞానమును పొందిన వారి సంబంధమున జన్మించి వారి సాంగత్యమున గాని; లేక, కృష్ణుడు కర్మ రహితుడు కానిచో మరల జన్మించును గనుక వాని సంబంధమున జన్మించి, వాని సాంగత్యమునగాని జ్ఞాన, విజ్ఞానములనుపొంది, వానిద్వారా కర్మరహితుడై పరమ పదమునుచేరి మరల జన్మింపడు. పైన చెప్ప

బడినటుల కృష్ణునియందువలెనే పరమ పదమును, ఆ మార్గమును ఎరిగిన విజ్ఞానము గలవారియందును జరుగుచుండును.

శ్లో॥ వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥ 10

తా. అనేకులు ఆత్మ గలవారగుటకు నన్నాశ్రయించినవారై జ్ఞాన తపస్సు చేత నా భావమును (జ్ఞానమును) పొంది నాయొక్క స్థితి గలవారై అనురాగమును, భయమును, క్రోధమును పోగొట్టబడినవారైరి.

వ్యా. కృష్ణుని సాంగత్యమున వానియందు భక్తి గలవారై ఆ భక్తితో కృష్ణునియందున్న భావమును (జ్ఞానమును) పొంది పరమపదము నెరిగినవారై రాగ ద్వేషాది గుణములను పోగొట్టబడి కృష్ణునితో సమానులైరి. ఆ విధముగనే యిప్పుడు ఎవరైనను పరమ పదము నెరిగిన వారి సాంగత్యమున వారియందు భక్తి గలవారై వారియందున్న భావమును (జ్ఞానమును) పొందవలెను. జ్ఞాన తపస్సు అనునది యథార్థము కాదు. ఇందు ఆత్మ అనునది జ్ఞానమను భావము.

శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహం
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥ 11

తా. ఎవ్వరే విధమున నన్ను సేవించుచున్నారో నేను వారిని ఆలాగుననే అనుగ్రహించెదను. అన్ని విధములచేతను మనుజులు నా మార్గమునే అనుసరించిన వారగుచున్నారు,

వ్యా. ఎవ్వరే విధముననైనను కృష్ణుని సాంగత్యమున నున్నచో వారినందరిని ఆ విధముననే కృష్ణుడు తనయందున్న విజ్ఞాన మార్గమున ప్రవర్తింపజేయుచు, విజ్ఞానము గలవారినిగను చేసి యుండును. అటుల వారందరును కృష్ణుని మార్గమున ప్రవర్తించినవారలైరని తెలియవలెను. ఆ విధముగనె జ్ఞానము గలవారును వారి వద్దకు వచ్చినవారిని జ్ఞాన, విజ్ఞానములు గలవారినిగ చేయుదురు.

శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహదేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా 12

తా. ఈ మనుష్య లోకమందు కర్మవలన గలిగెడు ఫలము శీఘ్రముగా అగుచున్నది. కర్మఫలమును కోరువారు దేవతల నారాధించు చున్నారు.

వ్యా. ఈ మానవ లోకమునందు మానవులు వారు చేయు కర్మలకు ఫలము ననుభవించెదరు. దేని ననుభవించవలెననినను ఈ లోకమునందు మానవ జన్మమెత్తియే కర్మచేసి, ఆ కర్మఫలమనుభవించవలెను. దేవతల నారాధించుట యథార్థము కాదు. జ్ఞాన విజ్ఞానములను అవి యున్నవారి సాంగత్యమున వారినుండియే పొందవలెను.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః ।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥ 13

తా. గుణములను, కర్మలను విభజించి నాలుగు వర్ణములుగా నాచేత సృష్టింపబడినవి. ఆ సృష్టికి కర్తనైనను నన్ను కర్తనుగాని వానినిగాను, నాశరహితునిగాను తెలియుము.

వ్యా. ఈ శ్లోకమునందు నాలుగు వర్ణములు కృష్ణునిచేత సృష్టింపబడినవని వ్రాసినది యథార్థము కాదు. కృష్ణునియందు సృష్టించు ప్రకృతి (మాయ) లేదు. ప్రకృతి గుణములు లేవు. పరమ తేజోపదమును చూచు జ్ఞానము; సృష్టించు బ్రహ్మ (భ్రమ)ను, మాయను, గుణములను జయించు విజ్ఞానమును ఉన్నవి. సృష్టించు మాయను, సృష్టింపబడు ఈ ప్రపంచమును, గుణములును లేనికృష్ణుడు ఈ ప్రపంచమును, గుణములను సృష్టించలేడు. ప్రకృతి గుణములను, ఆ గుణములతో చేయు వృత్తులనుబట్టి నాలుగు రకముల వారినిగా ప్రకృతి గుణములు గలవారే విభజించి యున్నారు. ఈ లోకము నందున్నవి రెండే వంశములు. ఒకటి జ్ఞాన, విజ్ఞానములు గలవారు. రెండవది రాగ, ద్వేష, అహంకారాది ప్రకృతి గుణములు గలవారు. గుణములనుబట్టి రెండు వంశములని చెప్పవలెను. దైవ సంపద (జ్ఞాన విజ్ఞాన భావములు) మోక్షపదమును చేర్చునని, అసురసంపద(కామ రాగ ద్వేషాదిగుణములు) కర్మబంధమును కలుగజేయునవియని ఇట్లు యీ ప్రపంచమునందు రెండు సృష్టులున్నవని 16 వ అధ్యాయము 5, 6 శ్లో. లలో ఉన్నది.

శ్లో॥ న మాం కర్మాణి లింపంతి న మే కర్మ ఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే॥ 14

తా. “నాకు కర్మఫలములయందు కోరిక లేదు. నన్ను కర్మలంటవు. అని నన్ను ఎవడెరుగునో, వాడు కర్మలచేత బంధింపబడడు.

వ్యా. కృష్ణునియందు కర్మచేయవలెనను కోరికయే లేదు. వానికి కర్మలంటవు. కాబట్టి కృష్ణుడు కర్మబంధితుడు కాడని ఎరిగినవారు కృష్ణుడు చెప్పునటుల చేయుచుండును. అందువలన వారును కర్మబంధితులుగారు. ఆ విధముగనే కోరిక లేనివారియందును జరుగుచుండును.

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురుకర్మైవ తస్మాత్త్వం పూర్వైః
పూర్వతరం కృతమ్ ॥　15

తా. మోక్షాపేక్ష గలవారైన పూర్వులుగూడ కర్మను ఈ విధముగనే ఎరిగి చేసియున్నారు. నీవును పూర్వీకులచేత చేయబడినదియు, పురాతనమైనదియునగు కర్మనే చేయుము.

వ్యా. మోక్షాపేక్ష గలవారైన పూర్వులు కోరికయే లేనివారి నెరిగి, వారి సాంగత్యమున వారు చెప్పునటుల కర్మ చేసియున్నారు. అర్జునుడుకూడ కోరికలేని వారి సాంగత్యమున వారు చెప్పునటుల కర్మ చేయవలెను.

శ్లో॥ కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యత్జ్ఞాత్వా మోక్ష్యసేఽ
శుభాత్ ॥　16

తా. కర్మమనగా నెట్టిదో, అకర్మమనగా నెట్టిదో తెలియజాలక అజ్ఞాన విద్యా పండితులు (కవులు)కూడ మోహమును చెందియున్నారు. ఏ కర్మాకర్మముల నెరిగి అశుభములనుండి విడువబడగలవో, అట్టి కర్మాకర్మలను నీకు వివరముగా చెప్పెదను.

వ్యా. శాస్త్రములు చదివిన ఎంత పండితులైనను కర్మాకర్మలను యథార్థముగా తెలియజాలరు. వారు శాస్త్రములు చదివినవారే గాని జ్ఞాన, విజ్ఞానములు గలవారు కాదు. అందువలన వానిని తెలియజాలరు. అట్టి కర్మాకర్మలను కృష్ణుడర్జునునకు చెప్పెద ననెను.

శ్లో॥ కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ 17

తా. అర్జునా! కర్మతత్వమును. వికర్మతత్వమును, అకర్మతత్వమును తెలియదగినది. ఈ కర్మ, వికర్మ, అకర్మలను తెలియ కష్టమై యున్నది.

వ్యా. విజ్ఞానము గలవారే కర్మ, వికర్మ, అకర్మ ప్రవర్తనల నెరిగి యున్నారు. అట్టి వారి నెరిగి వారి ద్వారానే వీనిని తెలియవలెను. కాని యింకెవ్వరును ఏ విధముగను ఈ కర్మలను స్వయముగా నెరుగలేరు.

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మ
కృత్ ॥ 18

తా. ఎవడు కర్మమునందు అకర్మను చూచుచున్నాడో, అకర్మమునందు కర్మను చూచుచున్నాడో వాడే మానవులయందు బుద్ధిమంతుడు. వాడే ఎరిగినవాడు. సకల కర్మల నాచరించినవాడు నగుచున్నాడు.

వ్యా. విజ్ఞానమే కర్మయందు అకర్మాభావమును అకర్మయందు కర్మాభావ ఎరిగియున్నది. అట్టి విజ్ఞానము గలవారియందు కోరిక యుండదు. వారు చేయవలసిన సంస్కారకర్మను వారి స్వభావము విధిగా చేయుచుండును. ఆ కర్మలయందు వారియందున్న విజ్ఞానము నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించుచుండును. అందువలన వారు చేయు కర్మఫలమును వారనుభవించుట యుండదు. చేయుకర్మను చేయవలసినదిగాను, ఆ కర్మఫలమనుభవించని స్థితియును వారికి కాన్పించుచుండును. వారుచేసిన కర్మఫలమును వారు అనుభవించుట యుండనప్పుడు, వారు కర్మచేసియును చేయని వారివలెనె, ఆ కర్మఫల మనుభవించని వారగుచున్నారు. అందువలన వారు చేయుకర్మయందు అకర్మస్థితిని అనగా కర్మఫలమనుభవించని స్థితిని ఎరిగియున్నారు. ఇదియే కర్మయందు అకర్మను చూచుట యనునది. కోరికయే లేనివారు కర్మచేయుచు ఆ కర్మఫల మనుభవించని స్థితి నెరిగియును అట్టి కర్మవారు చేయవలసినదిగా వారికి కాన్పించుచుండును. ఇదియే అకర్మయందు కర్మను చూచుట యనునది. అట్టివారు

మానవులలో బుద్ధిమంతులు. వారె సర్వము నెరిగినవారు. వారు చేయవలసిన సకల కర్మలును చేసిన వారగుచున్నారు.

శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః॥ 19

తా. ఎవని కర్మారంభములన్నియును కామ సంకల్పములు లేనివై యున్నవో అట్టివానిని బుధులు జ్ఞానము గలవానినిగాను, జ్ఞానమనెడి అగ్నిచేత దహింపబడిన కర్మలు గలవానినిగాను, పండితునిగాను చెప్పుదురు.

వ్యా. జ్ఞానము గలవారియందు కోరిక యుండదు. వారి కర్మారంభముల యందు కర్మచేయవలెనను కోరికయే లేక వారి స్వభావము ప్రవర్తించు సంస్కార కర్మలయందు విజ్ఞానము నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించు చుండును. తుదకు వారు సర్వకర్మ రహితులగుదురు. అట్టివారిని జ్ఞానముగలవారని, విజ్ఞానమనెడి అగ్నిచేత కామాది ప్రకృతిగుణములను వెడలగొట్టబడినవారై దహింప బడుచున్న అనగా కర్మరహితమగుచున్న కర్మలు గలవారని చెప్పుదురు. జ్ఞానము పరమపదముగా ఉన్న పరమతేజస్సును చూచునదియేగాని ఈ ప్రపంచమును, కర్మ లను ఎరుగదు. కర్మలను దహించు అగ్నికాదు.

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపినైవ కించిత్కరోతి సః ॥ 20

తా. కర్మఫల సంబంధములేనివాడై, ఎల్లప్పుడు తృప్తుడై ప్రపంచమునందు దేనినిగూడ ఆశ్రయించనివాడు కర్మ చేయుచుండినవాడైనను కర్మ చేయనివాడే యగును.

వ్యా: కోరికయే లేక కర్మ చేయువాడు ఎల్లప్పుడును తృప్తుడును, ప్రపం చమునందు దేనిని ఆశ్రయించనివాడు నగును. వాడు కర్మ చేయుచున్నవాడైనను కర్మ చేయనివాడే యగును. కాబట్టి కోరికయే లేనివాడు చేయునది అకర్మ. కోరిక గలవారు ఈ ప్రపంచసంబంధమును విడిచి, కోరికయే లేనివారి దరిజేరి ఫలాసక్తి లేక వారు చెప్పునటుల చేయుకర్మ వికర్మ. ప్రకృతి గుణములతో స్వయముగా చేయునది కర్మ. ఇవియే అకర్మ, వికర్మ, కర్మ యనునవి.

ప్రకృతి గుణములు గలవారు స్వయముగా చేయునది కర్మ. ఇది కర్మ బంధము గలది. ఈ అధ్యాయమున 34 వ శ్లోకమునందు చెప్పబడిన విధమునఅనగా పరమపద దర్శనమైన జ్ఞానుల దరిజేరి వారు చెప్పునట్లు చేయుచు వారియందు భక్తి గలవారై వారియందున్న జ్ఞాన విజ్ఞానములను పొందునట్టి కర్మయే వికర్మ. పరమ పద దర్శనమైన వారు రాగ, ద్వేష, వాంఛాది ప్రకృతి గుణములు లేనివారు. వారు జ్ఞాన విజ్ఞానములు గలవారు గనుక వారి సంస్కార కర్మ ననుసరించి వారి స్వభావముచేత ప్రవర్తింపబడు కర్మలయందు విజ్ఞానము నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్యము, పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించుచుండును. అట్టివారు కర్మ చేసినను కర్మఫల మనుభవించరు. కర్మచేయక ఫలమనుభవించనటుల, కర్మ చేసియును ఆ కర్మఫల మనుభవించనిదియే అకర్మ యనబడును. వారు విజ్ఞానము చేతనే పరమపదమును, దానిని చూచు జ్ఞానమును, అచటికి చేరు మార్గమును, నిష్కామాది పవిత్రప్రేమ భావములను, శరీరమును, జీవుని, జీవుని స్వభావమును ప్రకృతి (మాయా) గుణములను, సర్వమును ఎరిగియున్నారు. ఇట్లు గుణముల ప్రవర్తనవలనను వారి స్వభావముయొక్క ప్రవర్తనవలనను విజ్ఞానముయొక్క ప్రవర్తనవలనను ఎరిగియున్నారు. అట్టివారినే జ్ఞానము, విజ్ఞానమును గలవారని, జ్ఞానులని, సన్యాసులని చెప్పవలెను.

శ్లో॥ నిరాశీర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ 21

తా. ఆశ లేనివాడును, జ్ఞానము గలవాడును, సమస్త వస్తువులయందును ప్రేమ లేనివాడును, శరీరముతో విధిగా చేయవలసిన కర్మను చేయుచుండినను వాడు పాపమును పొందడు.

శ్లో॥ యదృచ్ఛా లాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।
సమస్సిద్ధావ సిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే॥ 22

తా. అప్రయత్నముగా లభించిన దానితో తృప్తి పొందినవాడును, సుఖ దుఃఖముల కతీతుడును, మాత్సర్యము లేనివాడును, ప్రాప్తాప్రాప్తములందు సమ బుద్ధిగలవాడును విధిగా చేయవలసిన కర్మ చేసినను కర్మబద్ధుడు కాడు.

శ్లో॥ గత సంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ 23

తా. పరమపదమును దర్శించు భావము (జ్ఞానము) గలవాడు దేనియందును సంగము లేనివాడును, కర్మబంధములనుండి విడువబడినవాడును, ఏది సంభవించిన ప్రాణులు కష్ట దుఃఖములనుండి తొలగి రక్షణ గలవి యగునో అట్టి భావమును ప్రాణులకు సంభవింపజేయు యజ్ఞము (కర్మ) చేయువాడునై యున్నాడు. వాని యొక్క కర్మయంతయు నశించు చున్నది.

వ్యా. 18 నుండి 23 వ శ్లోకమువరకు చెప్పబడినవి జ్ఞానవిజ్ఞానములు గల వారి లక్షణములు.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ
బ్రహ్మణాహుతమ్ ।
బ్రహ్మైవతేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా॥ 24

తా. బ్రాహ్మణునిచేత బ్రహ్మమను అగ్నియందు వ్రేల్చబడిన హవిస్సును, అర్పణము చేయు పదార్థములును బ్రహ్మమే. బ్రహ్మకర్మ సమాధిచే పొందదగి నదియును బ్రహ్మమే యగును.

వ్యా. ఇందు చెప్పబడిన వన్నియును బ్రహ్మ (భ్రమ) స్వరూపములేగాని, పరమ తేజ స్వరూపములు కాదు.

శ్లో॥ దైవమేవాఽపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥ 25

తా. కొందరు యోగులు దైవారాధనమునే యజ్ఞముగా ఆచరించు చున్నారు. మరికొందరు యజ్ఞమును యజ్ఞముచేతనే బ్రహ్మాగ్నియందు వ్రేల్చుచున్నారు.

వ్యా. ఇందు వ్రాసినవి యథార్థములు గావు. దైవారాధన యనునది లేదు. ఏ ఆరాధనయును లేదు.

శ్లో॥ శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీన్విషయానన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥ 26

తా. కొందరు శ్రోత్రేంద్రియములను నిగ్రహములనెడు అగ్నులయందు వ్రేల్చుచున్నారు. మరికొందరు శబ్దము మొదలగు విషయములను యింద్రియములనెడు అగ్నులయందు హోమము చేయుచున్నారు.

శ్లో॥ సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥ 27

తా. మరికొందరు జ్ఞానముచే ప్రకాశింపబడిన మనో నిగ్రహమనెడి అగ్నియందు సమస్తములైన యింద్రియ వ్యాపారములను, ప్రాణముల వ్యాపారములను హోమము చేయుచున్నారు.

వ్యా. 26, 27 శ్లోకములందు వ్రాసినవి యథార్థముకాదు. ఇంద్రియ నిగ్రహమనునది, ఆత్మసంయమమనునది రాగద్వేషాదిమాయాగుణముల కర్మలు. 26, 27 శ్లోకములలో ఉన్నవి అజ్ఞాన మార్గములు.

శ్లో॥ ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాఽపరే ।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః28

తా. కొందరు ద్రవ్యముచేతను, కొందరు తపముచేతను, కొందరుయోగముచేతను, కొందరు అధ్యయనముచేతను, కొందరు వ్రతములచేతను, ప్రయత్నములతో యజ్ఞములు చేయు వారలగుచున్నారు.

వ్యా. ఇవి యన్నియును జన్మ కర్మబంధములను కలిగించు మాయాగుణముల ప్రవర్తనలేగాని విజ్ఞాన ప్రవర్తన కాదు.

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే ।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః॥29

తా. ప్రాణాయామమును చేయువారగు కొందరు ప్రాణాపానముల గతులను నిరోధించి ప్రాణమును అపానమునందును, అలాగుననే అపానమును ప్రాణమునందును వ్రేల్చుచున్నారు.

శ్లో॥ అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి ।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥ 30

తా. మరికొందరు నియతాహారము గలవారై ప్రాణములను ప్రాణములయందు హోమము చేయుచున్నారు. పైనచెప్పబడిన వారందరును యజ్ఞముల నెరిగినవారును, యజ్ఞములచేత పాపమును నశింపజేసికొనినవారు నగుచున్నారు.

వ్యా. 24 వ శ్లోకమునుండి 30 వ శ్లోకమువరకు చెప్పబడిన వన్నియును యథార్థముకాదు. ఈ యజ్ఞములలో ఏ యజ్ఞము చేసినను చేసిన పాపములు అనుభవించవలసినదేగాని, ఏ పాపమును నశించదు. పాపములు చేయు గుణములు నశింపవు. ఈ యజ్ఞములు కర్మబంధములు గలవి.

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనం ।
నాయంలోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురు
సత్తమ ॥ 31

తా. అర్జునా! పైన చెప్పబడిన యజ్ఞములలో నొక్కటియైనను చేసిన తరువాత భుజించెడి అన్నము అమృతము వంటిదగును. అట్టివారు శాశ్వతమైన బ్రహ్మమును పొందుచున్నారు. యజ్ఞములలో నొక్కదానినైనను చేయని వారికి ఈ లోక సుఖముండదు. పరలోక సుఖము నుండదు.

వ్యా. పైన చెప్పబడిన యజ్ఞములు చేసి యజ్ఞ శేషాన్నమునుభుజించినవారికి భ్రమయును, కర్మబంధములును అధికమగును. గాని యీ లోక సుఖముండదు. అట్టివారు శాశ్వతమైన బ్రహ్మము (పరమ తేజస్సు) నెరుగరు. పరలోకసుఖమను నట్టి పరమ తేజోలోకమును చేరరు.

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥32

తా. ఇటువంటి యజ్ఞములనేక విధములుగా బ్రహ్మముఖమునుండి విస్తరింపబడినవి. ఆ యజ్ఞములన్నియు కర్మమువలన పుట్టిన వానినిగా నెరుంగుము. ఈ విధముగా నెరిగిన కర్మబంధములనుండి విడువబడిన వాడవగుదువు.

వ్యా. అనేక విధములైన యజ్ఞములు (కర్మలు) మాయా బ్రహ్మ (భ్రమ) గలవారి భ్రమచేతవేదాది శాస్త్రములందు వ్రాయబడినవి. ఇవి భ్రమచే అనగా భ్రమ గలవారిచే యజ్ఞముల (కర్మల) ద్వారా కర్మబంధములు కలిగించి మాయ యందు బంధించుటకే విస్తరింపబడినవి. వీనివలన కర్మబంధములధికమగునుగాని, కర్మ బంధములనుండివిడువబడరు. ముఖమున్న బ్రహ్మ బుద్ధిలేని భ్రమయేగాని, నిరాకార నిర్గుణమగు పరమ తేజస్సు కాదు.

శ్లో॥ శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥ 33

తా. అర్జునా! ద్రవ్యముచేత చేయబడు యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేయస్కరమైనది. అర్జునా! సమస్త కర్మములును నిరవశేషముగా జ్ఞానమునందు పరిసమాప్తి పొందుచున్నవి.

వ్యా. ఇందువ్రాసిన జ్ఞానయజ్ఞమనునది యథార్థముకాదు. ఈ దిగువ34వశ్లోకమునందు చెప్పబడిన విధమున జ్ఞానము గలవారి సాంగత్యమున జ్ఞానమును పొందినచో విజ్ఞానముయొక్క ప్రవర్తనవలన సర్వకర్మలును సమాప్తి యగును. ఇంకే విధమునను జ్ఞాన యజ్ఞమనునది లేదు. ద్రవ్యముచేత చేయబడు యజ్ఞము కర్మబంధములు గలది.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ 34

తా. పరమపద దర్శనమైన జ్ఞానుల సాంగత్యమున వారికి నమస్కరించి, భక్తితో సేవ జేయుచు, అవసరమైనపుడు వారినడుగుచుండుము. వారు చెప్పునట్టి జ్ఞానమును తెలిసికొనుము.

వ్యా. పరమపదమును దర్శించిన వారియందు పరమపదమును చూచు జ్ఞానముండును. ఈ జ్ఞానమున్న వారియందు విజ్ఞానమును ఉండును. అర్జునుడు అట్టివారి సాంగత్యమున వారిద్వారానేవారియందు ప్రేమ, భక్తిగలవాడై వారియందున్న జ్ఞానమును పొందవలెను. అంతియేగాని, గ్రుడ్డివాడు గ్రుడ్డివాని దరిజేరినచో నిరువురును గ్రుడ్డివారగుటచే వీరికేదియును తెలియదు. అటులనే పరమపదమును, అచటికి చేరు

మార్గము నెరుగని కామ రాగ ద్వేషాది దుణములుగల వారి మాటలు నమ్మి వారి ననుసరించినవో అందరును తప్పు ప్రవర్తన గలవారగుదురు. జ్ఞాన, విజ్ఞానములు గలవారును, కృష్ణుడును సమానులు. అట్టి కృష్ణుడు చెప్పినవానివి కొన్ని వ్రాయుచు అందు అనేకమైన తప్పు విధములను కల్పించి వ్రాసి దీనిని భగవద్గీత యని వ్రాసినారు.

శ్లో॥ యద్ జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాండవ
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి॥35

తా. అర్జునా! దేనిని ఎరిగినచో నీవు మరల మోహమును పొందవో, అట్టి జ్ఞానముచేత సకల భూతములను నీయందును, తదుపరి నాయందును చూడగలవు.

వ్యా. అర్జునుడు జ్ఞాన విజ్ఞానములు గలవారి దరిజేరి వారియందున్న జ్ఞానమును పొందినప్పుడు విజ్ఞానమును పొందును. జ్ఞానముద్వారా వానికి పరమపద దర్శనమైనపుడు విజ్ఞానము పరమపదమును, సర్వమును ఎరుగును. అందువలన రాగ, ద్వేష, మోహాది గుణములు వానిని విడుచును. అర్జునుడు విజ్ఞానమువలన "నేను నేను" అను జీవునిని ఎరిగి తన శరీరమునందును, కృష్ణుడను శరీరమునందు ఉన్న జీవుడును, సర్వ శరీరములయందును యున్న జీవులును ఒకలాంటివే యని ఎరుగ గలడు. ఎవరైనను జ్ఞానమును అట్టి జ్ఞానము గలవారినుండియే, వారిద్వారానే పొందవలెను. ఇంకేవిధముననూ పొందలేరు. అట్టి జ్ఞానులును, కృష్ణుడును సమానులు. ఒకరు జ్ఞానియును, ఒకరు భగవంతుడును కాదు. కృష్ణుడు భగవంతుడు కాదు.

శ్లో॥ అపి చేదసి పాపేభ్య సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥ 36

తా. నీవు సమస్త పాపములు చేసిన వారందరికంటె నధిక పాపములు చేసిన వాడవైనను, ఈ జ్ఞానమనెడు తెప్పచేత పాపమనెడు సముద్రమును సులభముగా దాటగలవు.

వ్యా. అర్జునుడు విజ్ఞానముచేతనే రాగద్వేషాది గుణములను పెడలగొట్టబడిన వాడై, పాపమనెడు ప్రకృతి బంధములు లేనివాడై సంస్కార కర్మ ననుభవించి కర్మ రహితుడగును.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 37

తా. అర్జునా! మండుచున్న అగ్ని ఏ విధముగా కట్టెలను భస్మమొనరించు చున్నదో, ఆ విధముగనే జ్ఞానాగ్ని (విజ్ఞానము) సమస్త కర్మలను భస్మము చేయు చున్నది.

వ్యా. మండుచున్న అగ్నియందు కట్టెలు భస్మమగు విధమున, విజ్ఞానము కర్మబంధములను కలిగించు రాగద్వేషాది గుణములను అది యున్నవారినుండి వెడల గొట్టును. వారి స్వభావము ప్రవర్తించు సంస్కార కర్మలయందు విజ్ఞానము నిష్కామాది పవిత్ర ప్రేమభావములతో ప్రవర్తించుచుండును. అందువలన వారు కర్మ రహితులగుదురు.

శ్లో॥ న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి॥ 38

తా. ఈ లోకమునందు జ్ఞానముతో సమానమైనదియు పవిత్రమైనదియులేదు. జీవించి యున్నకాలమునందే యోగసిద్ధిని స్వయముగా పొందుచున్నాడు.

వ్యా. జ్ఞానము గలవారగు జ్ఞానుల దరిజేరి వారు చెప్పునటుల చేయుచు జ్ఞానమును తాను దరిజేరిన జ్ఞానినుండియే ఆ జ్ఞానిద్వారానే తాను జీవించి యుండ గనే పొందుచున్నాడు. ఈ విధమునగాక యోగసిద్ధిని స్వయముగా పొందుట యను నది లేదు. ఈ జ్ఞానముతో సమానమైనది, పవిత్రమైనది లేదు. ఈ జ్ఞానము నశించ నిది, సర్వోత్కృష్టమైనది, మాయకంటె వేరుగా అనాదియై యున్నదని 8 వ అ. 20 వ శ్లోకమునందు చెప్పబడిన భావము.

శ్లో॥ శ్రద్ధావాంల్లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధిగచ్ఛతి॥ 39

తా. అట్టి జ్ఞానియందు శ్రద్ధ గలవాడును, వాని పరముగా నున్నవాడును, ఇంద్రియ నిగ్రహము గలవాడును జ్ఞానమును పొంది పరమశాంతిని పొందుచున్నాడు.

వ్యా. అట్టి జ్ఞాని సాంగత్యమువలన వానిద్వారానే వాని సంబంధులై వాని యందు శ్రద్ధయును, భక్తియును గలవారై ఆ జ్ఞానియందున్న జ్ఞానమును పొంది, జ్ఞానముద్వారానే పరమ తేజోపద దర్శనమైనవారై పరమ శాంతియను ఆ తేజో ఆనంద మనుభవించెదరు. ఇంద్రియ నిగ్రహమనునది యథార్థము కాదు.

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తినపరోన సుఖం సంశయాత్మనః॥40

తా. జ్ఞానము లేనివాడును, జ్ఞానులయందు శ్రద్ధయును లేనివాడును సంశయము గలవాడునై నశించుచున్నాడు. అట్టి సంశయము గలవానికి ఇహ సుఖము లేదు, పరసుఖము లేదు. సుఖమనునదియే లేదు.

వ్యా. ఇది పరమపదము నెరిగిన జ్ఞానులను చూచి సంశయము గలిగినవారిని గురించి చెప్పబడినది.

శ్లో॥ యోగసన్న్యస్త కర్మాణం జ్ఞాన సంచ్ఛిన్న సంశయం
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ॥ 41

తా. అర్జునా! కర్మయోగమువలన ప్రకృతి సంబంధమైన కర్మలు విడిచినవాడు జ్ఞానమును పొంది, జ్ఞానముద్వారా పరమ తేజోపద దర్శనమైనవాడును, సంశయములు ఛేదింపబడినవాడును అగుచున్నాడు. అట్టి జ్ఞానిని కర్మలు బంధింపవు.

వ్యా. జ్ఞాని సాంగత్యమున జ్ఞాని చెప్పునటుల చేయువాడు ప్రకృతి సంబంధమైన కర్మ చేయువాడు కాదు. వాడు జ్ఞాని సంబంధుడై జ్ఞానియందున్న జ్ఞానమును పొందినవాడై జ్ఞానముద్వారా పరమపద దర్శనమైనవాడును, విజ్ఞానముచేత సర్వము నెరిగినవాడును, రాగద్వేషాది గుణరహితుడును సంశయరహితుడును అగుచున్నాడు. అట్టి జ్ఞాని వాని స్వభావము ప్రవర్తించు సంస్కార కర్మలయందు విజ్ఞానముచేత నిష్కామాది పవిత్ర ప్రేమ భావములతో ప్రవర్తింపబడుచు ఆ కర్మలచే బంధింపబడడు.

శ్లో॥ తస్మాదజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత॥ 42

చున్నారు. వారికి నిశ్చయబుద్ధి కలుగదని 2 వ అ. 22, 23, 24 శ్లో.లలోఉన్నది. ఎందుచేతననగా వేదములు త్రిగుణముల (సత్వ, రజస్తమోగుణముల) వరకే చెప్పు చున్నవని 45 శ్లో.లో ఉన్నది.

చెట్టును ఆకులు పోషించునటుల వేదములు అశ్వత్థ వృక్షమను కోరికను పోషించుచున్నవి. అట్టి వేదములతోనున్న కోరికయను చెట్టును వేరులతో సహా అసంగశస్త్రము అనగా నిష్కామ భావముగల విజ్ఞానముచేత నరికివేయవలెనని 15వ అ. 1,2,3 శ్లో,లలో ఉన్నది. యజ్ఞములు చేయువారియందును, సర్వ యజ్ఞముల యందును, అందు ఉపయోగింపబడు సర్వ వస్తువులయందును, యజ్ఞ శేషాన్నము నందును, ఆ అన్నమును భుజించు వారియందును 12 వ అ. 5 వ శ్లో.లో చెప్ప బడినటుల అధిక దుఃఖములకు కారణమగు అవ్యక్తాసక్తితో, అవ్యక్తముగ (గుడ్డి వారి వలె) ప్రవర్తించు భ్రమయను గుణమే యున్నది.



# గీతా వ్యాఖ్యానము

## కర్మ సన్న్యాస యోగము

### 5 వ అధ్యాయము

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ ! పునర్యోగం చ శంససి।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥1

తా. కృష్ణా ! కర్మసన్న్యాసమును, మరల కర్మయోగమును చెప్పుచున్నావు. ఈ రెంటిలో ఏది శ్రేయస్కరమైనదో, అట్టి ఒక్కదానినే నాకు చెప్పుము.

వ్యా. కర్మ సన్యాసము, కర్మయోగము ఇవి రెండు మార్గములని వీనిలో ఏది శ్రేయస్కరమైనదో, దానిని చెప్పుమని అర్జునుడడిగినట్లుగా వ్రాసియున్నారు.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే ॥ 2

తా॥ కర్మ సన్యాసము, కర్మ యోగము అను రెండును శ్రేష్ఠమైనవి. ఈ రెంటిలో కర్మసన్యాసముకంటె కర్మయోగమే శ్రేష్ఠమైనది.

వ్యా. కర్మ సన్యాసమనగా ప్రకృతి ప్రపంచ సంబంధమైన కర్మలను విడుచుట. కర్మయోగమనగా జ్ఞానుల దరిజేరి వారు చెప్పునటుల చేయుట. ఈ రెంటిలో కర్మయోగమే శ్రేష్ఠమని చెప్పియున్నది. ప్రపంచ సంబంధమైన కర్మలను విడిచి జ్ఞానుల సాంగత్యమున వారు చెప్పునటుల చేయుటయందు కర్మసన్యాస, కర్మయోగములు రెండును ఉన్నవి. జ్ఞానుల సాంగత్యమున ఉండి వారు చెప్పునటుల చేయనిదే జ్ఞానమును పొందలేరు. కర్మసన్యాసము చేయక (ప్రపంచ సంబంధమైన కర్మ

లను విడువక) ప్రపంచముకొరకు ప్రపంచ సంబంధమైన కర్మచేయుచు, జ్ఞానులు చెప్పునటుల చేయుట యనునది యథార్థము కాదు.

శ్లో॥ జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి।
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ప్ర
ముచ్యతే॥ 3

తా. అర్జునా! కోరిక, ద్వేషము అనునవి లేనివాడు నిత్య సన్యాసి యని ఎరుగవలెను. అట్టివాడు సుఖ దుఃఖాది ద్వంద్వరహితుడై ప్రకృతి బంధములనుండి సుఖముగ విడువబడుచున్నాడు.

వ్యా. జ్ఞానము గలవారియందు విజ్ఞానముండును. అందువలన రాగ, ద్వేష, వాంఛాది ప్రకృతి గుణములుండవు. అట్టివారే నిత్యసన్యాసు లనబడుదురు. వారికి కర్మబంధములుండవు. వారు విజ్ఞాన ప్రవర్తనవలన పూర్వకర్మ బంధ విముక్తులగు చున్నారు. ఇది విజ్ఞానయోగ మనబడును.

శ్లో॥ సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః।
ఏకమప్యాస్థితస్సమ్యగుభయోర్విందతే ఫలమ్॥ 4

తా. బాలురు (తెలియనివారు) సాంఖ్య, కర్మయోగములను వేరుగా చెప్పుచున్నారు. జ్ఞానులట్లు చెప్పరు. ఈ రెంటిలో ఒకదానిని బాగుగా నాచరించిన పరమ పదమును చేరుదురు.

వ్యా. కర్మయోగము (ప్రకృతి సంబంధమైన కర్మలనువిడిచి జ్ఞానుల సాంగత్యమున వారు చెప్పునటుల చేయుట) వలన వారిద్వారానే వారియందున్న జ్ఞానమును విజ్ఞానమును పొంది వానివలన పరమపదమును, అచటికి చేరు మార్గము నెరిగి ఆ మార్గమున విజ్ఞానముచేత ప్రవర్తింపబడునపుడు అది సాంఖ్యయోగము అనగా విజ్ఞాన ప్రవర్తన యనబడును. వాడు కర్మరహితుడై పరమపదమును చేరును. అందువలన రెండును ఒకేమార్గములోనివని చెప్పవలెను. ఇవి రెండును రెండు మార్గములుకాదు.

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥5

తా. సాంఖ్యయోగముచేత ఏ స్థానమును పొందుచున్నారో, కర్మయోగము చేత అదే స్థానమును పొందుచున్నారు. సాంఖ్య, కర్మయోగముల నొకటిగ నెరిగిన వాడే యథార్థము (పరమపదము) నెరిగినవాడు.

వ్యా. జ్ఞానము గలవారగు జ్ఞానులు సర్వ కర్మరహితులై పరమపదమును చేరుదురు. అట్టివారి దరిజేరి వారు చెప్పునట్లు చేయువాడు జ్ఞానులయందున్న జ్ఞానమును పొందినవాడై జ్ఞాని యనబడును. సర్వకర్మరహితుడై పరమపదమును చేరును. ఇరువురును విజ్ఞాన ప్రవర్తనవలన ఒకేస్థానమును(పరమపదమును)జేరువారగుదురు. పరమపదము నెరిగినవారే సాంఖ్యమును, కర్మయోగమును, కర్మసన్యాసమును, ఈ ప్రపంచమును, ప్రాపంచిక సంబంధమైన కర్మబంధములను కలిగించు కర్మలను సర్వమును ఎరిగియున్నారు.

పూర్వ కర్మఋణము తీర్చుచు "ఇది కాదు, ఇది కాదు" అని ప్రకృతిని ఖండించునది విజ్ఞానము. యోగమనగా ప్రవర్తనయేగాని, కన్నులు మూసికొని కూర్చుండి చేయుట కాదు.

శ్లో. సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి ॥ 6

తా. కర్మయోగము లేనిచో సన్యాసమును పొందజాలరు. కర్మయోగి శీఘ్రముగా బ్రహ్మపదమును పొందుచున్నాడు.

వ్యా. కర్మయోగము లేనిచో (జ్ఞాని సాంగత్యమున కర్మచేయనిచో) కర్మసన్యాసి (ప్రపంచ సంబంధమైన కర్మలను విడిచినవాడు) కాడు. జ్ఞానమును పొందజాలడు. జ్ఞాని చెప్పునటుల చేయువాడు(కర్మయోగి) జ్ఞానమును పొందినవాడై జ్ఞాని, సన్యాసి యనబడుచున్నాడు. గుణరహితుడును, కర్మరహితుడునై పరమపదమును చేరువాడగుచున్నాడు.

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే॥ 7

తా. కర్మయోగి యగువాడు జ్ఞానము గలవాడును, విజ్ఞానము గలవాడును, ఇంద్రియములను (గుణములను) జయించినవాడును, అన్నిభూతముల యందున్న

జీవులును తనవంటివే (ఒకలాంటివే) యని ఎరిగినవాడగుటచే కర్మలచే బంధింప బడడు.

వ్యా. ఈ శ్లోకమునందు చెప్పబడినవి జ్ఞాని సాంగత్యమున చేయు కర్మ ద్వారా జ్ఞానియందున్న జ్ఞాన, విజ్ఞానములను పొంది, జ్ఞానముద్వారా పరమ పద దర్శనమైన వారి లక్షణములు. ఆత్మలేదు. ఆత్మను జయించుట యనునది యథార్థము కాదు.

శ్లో॥ నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్శృణ్వన్స్పృశన్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపన్శ్వసన్ 8

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి ।
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్॥ 9

తా. అట్టివాడు కర్మ చేయుచున్నను, చూచుచున్నను, తినుచున్నను, నడచు చున్నను, మాట్లాడుచున్నను, నిద్రించుచున్నను, ఊపిరివిడుచుచున్నను, గ్రహించు చున్నను, కన్నులు తెరచుచున్నను, కన్నులు మూయుచున్నను, ఇంద్రియములు విధిగా విషయములయందు ప్రవర్తించు చున్నవని ఎరిగిన వాడగుటచే కొంచెమైనను తాను చేయుట లేదని తలంచును.

వ్యా. పై శ్లోకములయందు చెప్పబడినవి పరమపదము నెరిగిన విజ్ఞానము గలవాని లక్షణములు. రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వ, వాంఛాది గుణములు గలవారు ఆ గుణములచేత అన్నియును చేయబడుచు, ఈ 8, 9 శ్లోకములు చదువుకొని "మేమేమి చేసినను అవి మాకంటవు. మేము చేయుటలేదు. ఇంద్రియ ములే అన్నియును చేయుచున్నవి." అని చెప్పుచున్నారు. పైన చెప్పబడినజ్ఞానము గలవాని లక్షణములు వీరి యందుండవు. వీరు రాగ ద్వేషాది గుణములను జయించ లేరు. వీరియందు జ్ఞాన విజ్ఞానములు, నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్వము, పవిత్రప్రేమ భావములుండవు. ఈ భావముల ప్రవర్తనయు నుండదు. వీరు యథా ర్థము నెరిగినవారు కాదు.

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా ॥ 10

తా. ఎవడు సర్వకర్మలను బ్రహ్మమునందు సమర్పించి ఫలాసక్తిని విడిచి కర్మ చేయుచున్నాడో వానిని తామురాకును నీరు అంటని విధమున పాపమంటదు.

వ్యా. జ్ఞాన, విజ్ఞానములు గలవారి దరిజేరి, ఫలాపేక్షలేక వారు చెప్పినట్లు చేయుచున్న వానిని పాపమంటదు. తామరాకు ఉపమానము జ్ఞాన విజ్ఞానములుగల వారిని గురించి, వారి దరిజేరిన వారిని గురించి చెప్పినది. అంతియేగాని, రాగ ద్వేషాది గుణములు గలవారు స్వయముగా సర్వకర్మలను బ్రహ్మమునకు (పరమ తేజస్సునకు) సమర్పించుట, ఫలాసక్తిని విడిచి కర్మచేయుట యనునది యథార్థము కాదు. కండ్లు, చెవులు, నోరు, ముఖము, ఆకారమే లేని బ్రహ్మమునకు (పరమ పదముగానున్న పరమ తేజస్సునకు) జనులు ఎట్లు సమర్పించెదరు? వీరు సమ ర్పించు దానిని ఆ తేజస్సు ఎట్లు చూచును? తీసికొనును? ఎట్లు తినును? ఇది రాగద్వేషాది గుణముల తప్పు ప్రవర్తన.

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి ।
యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వాఽఽత్మ శుద్ధయే ॥ 11

తా. కర్మయోగులు ఆత్మశుద్ధికొరకు ప్రపంచ సాంగత్యమును విడిచి, శరీరముచేతను, మనస్సుచేతను, బుద్ధిచేతను, ఇంద్రియములచేతను కర్మ చేయు చున్నారు.

వ్యా. ఈ శ్లోకమునందున్న విధము యథార్థము కాదు. ఆత్మను(జ్ఞానమును) పొందుటకొరకు ప్రపంచ సాంగత్యమును విడిచి ఆత్మ (జ్ఞానము) గలవారి దరిజేరి కర్మ చేయువారే కర్మయోగులనబడుదురు. ఈ శ్లోకమునందు ఆత్మశుద్ధి కొరకని వ్రాసినది యథార్థము కాదు. జ్ఞానమును పొందుటకొరకని తెలియవలెను. జ్ఞానము ఎల్లప్పుడును పరిశుద్ధమైనదేగాని, మలినపడునది కాదు. ఇది యున్న వారియందు మలిన పరచునదేదియును నుండదు. ఆత్మ యనునది కల్పితమే గాని ఆత్మ లేదు.

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ 12

తా. కర్మయోగి కర్మ ఫలాపేక్షను విడిచిన వాడగుటచే నిష్ఠ (ఆ కర్మ) వలన కలుగు శాంతిని పొందుచున్నాడు. అట్టి కర్మయోగము నాశ్రయింపక లోకము కొరకు కర్మ చేయువాడు కర్మఫలమునందు కోరిక గలవాడై కర్మలచే బంధింప బడుచున్నాడు.

వ్యా. కోరిక గలవాడు జ్ఞానము గలవారి దరిజేరక స్వయముగా కర్మనే విధముగా చేయుచున్నను, యథార్థమైన శాంతిని పొందలేడు. అది కర్మయోగము కాదు. వాడు కర్మలచే బంధింపబడును.

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్॥ 13

తా. స్వాధీనమునందున్న మనస్సుచేత సమస్త కర్మలను విడిచినవాడు (జీవుడు) తానేమియు చేయనివాడును, చేయింపనివాడునై తొమ్మిది వాకిళ్ళుగల పురమను శరీరమునందు సుఖముగా ఉన్నాడు.

వ్యా. పూర్వ సంస్కార కర్మల ననుసరించి, సంకల్పములను ప్రేరేపింప జేయుచు ప్రవర్తించు స్వభావమే యిచ్చట మనస్సనునది.జీవుడు తన స్వభావమును, గుణములను స్వాధీనము చేసికొనలేడు, నిగ్రహించలేడు. స్వాధీనము నందున్న మనస్సుచేత అనునది యథార్థము కాదు. జీవుడు కర్మ చేయువాడు కాదు. గుణముల చేత చేయించువాడును కాదు. కర్మచేయక ఒకచోట కూర్చుండి, ఈ ప్రకృతి గుణములతో సుఖముగ నుండునది యథార్థమైన సుఖము కాదు. ఇది కొంచెము శాంతిగ నున్నట్లుండును. ఎంత ప్రయత్నము చేయువానినైనను గుణములు బలము గలవియై యీడ్చుచుండునని 2 వ అధ్యాయమున 60 వ శ్లోకమునందు చెప్పబడి యున్నది యథార్థము. ప్రకృతి గుణములవలన కలుగు శాంతి యథార్థమైన శాంతి కాదు.

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥ **14**

తా. జీవులకు ప్రభువగు ఈశ్వరుడు ఈ ప్రపంచమునందు కర్తృత్వమును, కర్మలను, కర్మఫలముతోటి సంబంధమును సృజింపడు. స్వభావమే ప్రవర్తించుచున్నది.

వ్యా. జీవుల స్వభావమునే జీవేశ్వరుడనియు, ఈశ్వరుడనియు చెప్పుచున్నారు. రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వాది ప్రకృతి గుణములు జీవులకు వాని స్వభావమువలన ఈ ప్రపంచసంబంధమున సంభవించుచున్నవి. ఈ గుణములు కర్తృత్వముతో కర్మలయందు ప్రవర్తించుచుండును. ఈ కర్మలను వానిస్వభావము మరల యింకొకపుడు చేయుచుండును. ఈ కర్మలయొక్క ఫలమును జీవులు వాని స్వభావమువలననే అనుభవించుచున్నవి. ఈ స్వభావము స్వయముగా ఏమియును చేయునది కాదు. దేనిని సృష్టించునది కాదు. ఇందు చెప్పబడిన ఈశ్వరుడు లేడు. జీవుల స్వభావ ప్రవర్తనయే సంస్కారమనునది.

శ్లో॥ నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః॥**15**

తా. ఈశ్వరుడు ఎవనియొక్క పాపపుణ్యములను గ్రహించువాడును, అనుభవించువాడునుకాదు. జ్ఞానము అజ్ఞానముచేత ఆవరింపబడి యున్నది. అందుచేత జీవులు మోహమును పొందుచున్నవి.

వ్యా. ఈశ్వరుడు (జీవుల స్వభావము) జీవులయందున్న గుణములు చేయుపాప పుణ్యములను మరల చేసి, వానిచేత అనుభవింప జేయునదియేగాని, అనుభవించునది కాదు. జీవులు వానియందు రాగ, ద్వేష, మోహాది ప్రకృతి గుణములుండుటవలన మోహమును పొందుచున్నవి. జ్ఞానమును అజ్ఞానమావరించి యుండుటచేత జీవులు మోహమును పొందుచున్నవని ఈ శ్లోకమునందు వ్రాసినది యథార్థము కాదు. జ్ఞానమును ఆవరించునది ప్రపంచమునందేదియును లేదు. ఎవరు జ్ఞానము గలవారి చెరి జేరి జ్ఞానమును పొందుదురో, అది వరకు వారియందున్న అజ్ఞానము వారియందుండక లేక వారిని విడిచి వెళ్ళిపోవును.

శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।
తేషామాదిత్యవద్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ 16

తా. అట్టి అజ్ఞానము జ్ఞానముచేత ఎవరికి నశింప జేయబడి యున్నదో, అట్టి వారలకు జ్ఞానము సూర్యునివలె తేజరిల్లుచు పరమ పదమును ప్రకాశింప జేయు చున్నది.

వ్యా. అందరియందును జ్ఞానములేదు. విజ్ఞానములేదు. వారియందున్న అజ్ఞానమును వారు స్వయముగా నశింపజేసి కొనలేరు. ఎవరు జ్ఞానమును పొందుదురో, వారికి జ్ఞానముద్వారా పరమపద దర్శనమగును. పరమపదము కాన్పించిన తరువాతనే వారియందున్నట్టి అజ్ఞానమగు ప్రకృతి గుణములు వారిని విడిచి వెళ్ళిపోవును. తదుపరి వారియందున్న విజ్ఞాన ప్రవర్తనవలన వారి సంస్కార కర్మయంతయు నశించి నపుడు జ్ఞానముద్వారా వారికి పరమ తేజోపదమే కాన్పించుచుండును.

శ్లో॥ తద్బుద్ధయస్తదాత్మానస్తన్నిష్ఠాస్తత్పరాయణాః ।
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః ॥ 17

తా. జ్ఞానము గలవారు ఆత్మ (జ్ఞానము) ద్వారా పరమపద దర్శనమైన వారును, పరమపద సంబంధమైనవారును విజ్ఞానముచే కల్మషముపోగొట్టబడినవారునై, పునర్జన్మము లేని పదమును పొందు (చేరు) చున్నారు.

వ్యా. జ్ఞానముద్వారా పరమపద దర్శనమైన వారు విజ్ఞానముచేత కల్మషమను నట్టి ప్రకృతి గుణములను పోగొట్టబడినవారై, పూర్వ కర్మరహితులై జ్ఞానముద్వారా మరల జన్మములేని ఆ పరమ తేజోపదమును చూచుచు, అచటికి చేరుదురు. పునర్జన్మమునకు రాని స్థానము వేరుగా నున్నది. జన్మమునకు వచ్చుచుండు స్థానము (ఈ లోకము) వేరుగా నున్నది. ఈ లోకమునుండిజన్మమునకు రాని లోకమును చేరవలెనుగాని, అది యీ లోకమునకు వచ్చునది కాదు.

శ్లో॥ విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శునిచైవ శ్వపాకే చ పండితాస్సమ దర్శినః ॥ 18

తా. విద్య, వినయముగల బ్రాహ్మణుని, గోవును, ఏనుగును, కుక్కను, కుక్కను తిను శ్వపచుని సమముగా చూచువారే జ్ఞానులు.

వ్యా. పరమపదము నెరిగినవారే జ్ఞానము గలవారు. వారియందురాగద్వేషాది గుణములుండవు. భేద భావములుండవు.

శ్లో॥ ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తేస్థితాః ॥ 19

తా. ఎవరియందు సమబుద్ధి భావమున్నదో, అట్టివారు ఈ లోకమునందే జనన మరణములకు కారణమగు బంధమును జయించినవారగుదురు. బ్రహ్మము సమభావము గలది. దోషము లేనిది. అందువలన అట్టివారు బ్రహ్మము నందుండు వారగుచున్నారు.

వ్యా: జ్ఞానము గలవారే పరమపద దర్శనమైనవారు. వారియందు విజ్ఞానమును ఉండును. విజ్ఞానము నిష్కామము, సమత్వబుద్ధి, పవిత్రప్రేమ భావములతో కర్మల యందు ప్రవర్తించుచుండును. వారియందు జనన, మరణములకు కారణమగు రాగ ద్వేషాది ప్రకృతి గుణములుండవు. అందువలన వారియందు భేద భావముండదు. అట్టివారు కర్మరహితులై పరమపదమును చేరి అచ్చట నుండెదరు. సమబుద్ధి విజ్ఞానముయొక్క లక్షణము, పరమపదమను పరమ తేజస్సునందు ఏ భావమును లేదు. స్వభావమును లేదు, ఇంకేదియును లేదు.

శ్లో॥ న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్ ।
స్థిరబుద్ధి రసంమూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ॥ 20

తా. బ్రహ్మజ్ఞానము (పరమపదముగానున్న పరమతేజస్సునుచూచుజ్ఞానము) గలవాడు పరమపదమును చూచు స్థితి గలవాడును, స్థిరబుద్ధి గలవాడును, మోహ రహితుడును అనబడుచున్నాడు. అట్టివాడు ప్రియము గలిగినపుడు సంతోషింపడు. అప్రియము కలిగినప్పుడు దుఃఖమును పొందడు.

వ్యా. ఈ శ్లోకమునందున్నవి పరమపదమును చూచు జ్ఞానము గలవారి యందున్న విజ్ఞాన ప్రవర్తన.

శ్లో॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖం।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయ మశ్నుతే॥21

తా. ప్రపంచ స్పర్శసుఖములయందు ఆసక్తిలేని ఆత్మగలవాడు ఆత్మద్వారా ఏ సుఖమును పొందుచున్నాడో, వాడు ఆత్మచేత ఆ పరమపదమును చూచుచున్న వాడై శాశ్వతసుఖ మనుభవించుచున్నాడు.

వ్యా. పరమపదమును చూచు జ్ఞానముగల వారియందు కోరికయును, రాగ ద్వేషాది గుణములును ఉండవు. వారు కర్మరహితులైనపుడు జ్ఞానముద్వారా పరమ పదమును చూచుచు శాశ్వతమగు ఆనంద మనుభవించుచుందురు. అంతియేగాని ఆత్మలు లేవు.

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః 22

తా. అర్జునా! విషయ స్పర్శవలన కలిగిన భోగములన్నియు దుఃఖములు కలిగించునవి, ఆద్యంతములు గలవియని ఎరిగి, బుద్ధిమంతుడు విషయములయందు రమింపడు.

వ్యా. జ్ఞానము గలవారు కోరికయే లేనివారు. విజ్ఞానమువలన ఇందు వ్రాసిన వన్నియును ఎరిగి యున్నారు. అట్టివారు విషయములయందు ఆసక్తులు గారు.

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః॥ 23

తా. ఎవడు శరీరమును విడుచుటకు పూర్వమే (శరీరముతో నుండగనే) కామ క్రోధాది గుణముల వేగమును సహించు శక్తి గలిగియున్నాడో, అట్టి మనుజుడు సుఖము గలవాడగుచున్నాడు.

వ్యా. కామ, క్రోధాది ప్రకృతి గుణములు గలవారు ఈ శరీరమును ధరించి యుండగనే వానిని జయించు విజ్ఞానమును సంపాదించవలయును. ఈ గుణముల వేగమును సహించు శక్తి యనునది యథార్థము కాదు. వానిని జయించ (పెడల గొట్ట) వలెను.

శ్లో॥ యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాఽన్తర్జ్యోతిరేవయః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి 24

తా. ఎవడుతనయందే సుఖమనుభవించువాడును, అంతరారామముగలవాడును అగుచున్నాడో, ఆ విధముగ ఎవడు తనయందే ప్రకాశము గలవాడై యున్నాడో అట్టి యోగి బ్రహ్మభూతుడై బ్రహ్మనిర్వాణమును పొందుచున్నాడు.

వ్యా. జ్ఞానము గలవారు జ్ఞానముద్వారా పరమ పద దర్శనమైనపుడు ఆనంద మనుభవించుచున్నారు. వారు రాగద్వేషాది గుణరహితులై, కర్మరహితులై జ్ఞానము ద్వారా ఆ తేజోపదమునే చూచుచున్నవారై ఆ తేజో ఆనందమనుభవించుచు శరీర మును విడిచిన తదుపరి నిర్వాణ పదమనునట్టి పరమపదమును చేరి, అచ్చటను ఆనంద మనుభవించుచుందురు. కాని అందు కలియువారు కాదు. ఇట్లుగాక యోగి తనయందే సుఖము ననుభవించువాడు, అంతరారామము గలవాడు అనునది యథా ర్థము కాదు. అది కొంచెము శాంతిగ నుండునదియే గాని పరమశాంతి గాదు. తన యందే ప్రకాశము (పరమతేజస్సు) గలవాడనునది, బ్రహ్మభూతు డనునదియును యథార్థము కాదు. ప్రకాశమనునట్టి పరమ తేజోపదముగానున్న తేజస్సు తనయందు లేదు. ఈ లోకము నందెచ్చటను లేదు. అది ఈ లోకమునకు వచ్చునది కాదు. జ్ఞానము గలవారి స్థితులను తప్పు విధములుగ వ్రాసియున్నారు.

శ్లో॥ లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మానస్సర్వభూతహితేరతాః॥ 25

తా. ఆత్మ గలవారగు ఋషులు (జ్ఞానము గలవారు) ద్వంద్వములు లేని వారును సమస్తప్రాణులయెడ హితము గలవారును, కల్మషము నశించినవారునై బ్రహ్మ నిర్వాణమును పొందుచున్నారు.

వ్యా. ఈ శ్లోకమునందు చెప్పబడినవి జ్ఞానము గలవారిలక్షణములు. అంతియే గాని ధ్యానములు, తపస్సులు, యోగాభ్యాసములు చేయువారిని గురించి చెప్పినవి కాదు. ఆత్మ లేదు.

శ్లో॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసాం।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥ 26

తా. ఆత్మ నెరిగినవారును, కామ క్రోధములచే విడువబడినవారును, స్వాధీన మైన మనస్సు గలవారునైన యతులకు (జ్ఞానము గలవారికి) అంతటను నున్న బ్రహ్మ నిర్వాణపదమే యుండును (కాన్పించుచుండును).

వ్యా. జ్ఞానముగలవారికి జ్ఞానముద్వారాకాశీలేక అంతయును పరమతేజోపదముగా నున్న పరమ తేజస్సు దర్శనమగును. వారు విజ్ఞానమువలన పరమపదమును జీవుని, జీవునిస్వభావమును, పరమపదమును చూచుజ్ఞానమను భావమును, ఈసర్వమునుఎరిగి యున్నారు. కామక్రోధాది గుణములచే విడువబడిన వారగుచున్నారు. కర్మరహితు లైనపుడు వారికి జ్ఞానముద్వారా పరమపదమే కాన్పించుచుండును. వారు శరీరమును విడిచినప్పుడు ఆ పదమును చేరుదురు. ఎవరును స్వయముగా యత్నముల ద్వారా పరమపదమును చూడలేరు. కామక్రోధాది గుణములచేత విడువబడలేరు. స్వాధీన మైన మనస్సు గలవారని యిందు వ్రాసినది యథార్థము కాదు. ఇందు మనస్సు అను నది జీవుల స్వభావము. ఇది ఎవరికిని స్వాధీనమగునది కాదు. ఆత్మలు లేవు.

శ్లో॥ స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాంతరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ 27

శ్లో॥ యతేంద్రియమనోబుద్ధిర్మునిర్మోక్ష పరాయణః ।
విగతేచ్ఛా భయక్రోధో యస్సదా ముక్త ఏవ సః॥ 28

తా. ఎవడు వెలువల నున్న స్పర్శాది విషయములను బయటనే యుంచి దృష్టిని కలుబొమ్మల మధ్యప్రదేశమునందు నిలిపి ముక్కుల లోపల సంచరించు చున్నట్టి ప్రాణాపాన వాయువులను సమానముగా జేసి, స్వాధీనములోనున్న యింద్రి యములు, మనస్సు, బుద్ధి గలవాడును, కోరికయును, భయము, క్రోధము లేని వాడును, మోక్షము నందాసక్తి గలవాడునగు ముని ఎప్పుడును ముక్తుడే.

వ్యా. ఎవరైనను ఒకచోట కూర్చుండి దృష్టిని కనుబొమ్మల మధ్య నిలిపి యుంచినను, ప్రాణాపాన వాయువులను సమానముగా జేసినవాడైనను, మోక్షాపేక్షతో నున్న వారైనను, బాహ్యస్పర్శాది విషయములయందు ప్రవర్తించక, యింద్రియము లను బిగబట్టి కూర్చున్నను వారియందున్న రాగద్వేషాది ప్రకృతి గుణములు వారిని

విడువవు. ఈ గుణములే అటుల చేయుచుండును. వారు ఎప్పుడును ముక్తులు కారు. ఆ విధమున వారు గుణములను జయించలేరు. కోరికయు, భయము, క్రోధము లేని వారు కాజాలరు. అట్టి సమయమున ఏ కర్మయును చేయక కొంచెము శాంతిగ నున్నట్లుండును. అచటినుండి లేవగనే వారియందున్న కామ రాగద్వేషాది గుణములు వారియందు కర్మరూపమున ప్రవర్తించుచుండును. ఈ రెండు శ్లోకములును యథార్థములు గావు.

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరం ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి
మృచ్ఛతి ॥ 29

తా. నన్ను యజ్ఞ, తపస్సులకు భోక్తగాను, సమస్త లోకములకు మహేశ్వరునిగాను, సమస్త భూతములకు మంచి హృదయుడనుగాను, ఎరిగి శాంతిని పొందుచున్నాడు.

వ్యా. కృష్ణుడు శరీరముతో నున్నపుడు కృష్ణుడను జీవునియందున్న విజ్ఞానమే సమస్త భూతముల యెడల మంచిహృదయము గలదియును, తన సాంగత్యము చేయువారికి రక్షణ గలదియునై యున్నది. యజ్ఞ, తపస్సులు కర్మబంధములను గలిగించునవి. జ్ఞానవిజ్ఞానములు గల కృష్ణుడు యజ్ఞ, తపస్సులయందు లేడు. యజ్ఞ తపస్సులకు భోక్త కాడు. అన్నిలోకములకు మహేశ్వరుడనునది జీవుల సహజ స్వభావము. ఇది భోక్తకాదు. ఇది జీవులయందున్న గుణములు ఇతర జీవులకు చేయునది ఆ జీవులకు చేయుటకును, ఆ జీవులనుభవించుటకును ఉన్న జీవుల సహజ స్వభావమను గుణము. ఇది పాపవిముక్తులను చేయునదికాదు. మంచి హృదయుడు అను విజ్ఞానము సర్వభూతముల యందున్నచో, అందరియందును రాగ, ద్వేషాది ప్రకృతి గుణములుండవు. కృష్ణుడు విజ్ఞానము గలవాడగుటచేతనే రాగద్వేషాదిగుణ రహితుడైనాడు. విజ్ఞానముగల వారందరును గుణరహితులై యుందురు. ఇదిమానవులలో జ్ఞానము నార్జించినవారి యందుండును. అట్టివారి నెరిగినవారు వారి సాంగత్యమున శాంతిగ నుందురు.

అ. వ్యా. ప్రపంచసంబంధమైన కర్మలను విడిచి జ్ఞానవిజ్ఞానములు గలవారి సాంగత్యమునకు వచ్చి వారు చెప్పునటుల చేయుటయే కర్మయోగము. కాని కర్మ

సన్యాస యోగమనునది వేరుగాలేదు. జ్ఞాని చెప్పునటుల చేయు కర్మద్వారాజ్ఞానమును విజ్ఞానమును పొందినపుడు, సర్వము నెరిగి ప్రవర్తించు విజ్ఞాన ప్రవర్తనయే సాంఖ్య యోగము. స్వయముగా చేయు సాంఖ్యయోగమనునది రాగ ద్వేషాది గుణములు కర్మబంధమును కలుగజేయు యోగమేకాని, సాంఖ్యయోగము కాదు. కామ, రాగ, ద్వేషాది గుణములతో చేయు యోగములద్వారా వారియందున్న జ్ఞానము నావరించి యున్న కామమును (అజ్ఞానమును) తొలగించినచో జ్ఞానము పరమపదమును ప్రకాశింపజేయునని వ్రాసినది యథార్థము కాదు. యోగములద్వారా జ్ఞానము గలవారై పరమపదమును చేరుట ఉండదు. ఇది యంతయును జ్ఞాన విజ్ఞానములు లేనివారి యందున్న కామ రాగ ద్వేషాది గుణముల కల్పితమేగాని యథార్థముకాదు. ఈ సర్వ ప్రపంచము బ్రహ్మకు పగలు రాగానె మాయ యందుండి వచ్చి రాత్రిరాగానె మాయ యందే కలియుచున్నదని; అట్టి జీవులు స్వాతంత్ర్యము లేక అనేక జన్మలనెత్తుచు బ్రహ్మ (భ్రమ)కు రాత్రి రాగానే మాయయందే కలియుచున్నవని, పగలు రాగానే మరల వచ్చుచున్నవని 8 వ అ. 18, 19 శ్లో.లో ఉన్నది. భావము (జ్ఞానము) నశించనిది. సర్వోత్కృష్టమైనది. మాయకంటె వేరుగా అనాదియై యున్నదని, ఈ బ్రహ్మ (భ్రమ)తో సహ ఈ సర్వప్రపంచము నశించినను, ఈ భావము (జ్ఞానము) నశించునది కాదని 20 వ శ్లో.లో ఉన్నది. ఈ జ్ఞానము మాయకంటె వేరుగా అనాదియై ఉన్నది. మాయయందు లేదు. మాయయందుండి వచ్చిన ఈ ప్రపంచములో ఎవరియందును లేదు. మాయయందుండి వచ్చి నశించి మాయయందే కలియుచున్న దనిన ఈ ప్రపంచములో అందరియందును జ్ఞానమున్నదని వ్రాయుట యథార్థము కాదు. దానిని అజ్ఞానమావరించినదని వ్రాయుట మాయాగుణముల యోగములచేత అజ్ఞానమును తొలగించవలయునని వ్రాయుట యథార్థముకాదు. ఇట్లు వ్రాయుటవలనను, చెప్పుటవలనను అనేకులు తప్పుమార్గమున బడుచున్నారు.



# గీతా వ్యాఖ్యానము

## ఆత్మ సంయమ యోగము

## 6 వ అధ్యాయము

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః॥ 1

తా. ఎవడు కర్మఫలము నాశ్రయించనివాడై చేయవలసిన కర్మ చేయుచున్నాడో, వాడే సన్యాసి, కర్మయోగియు నగుచున్నాడు. చేయవలసిన కర్మచేయనివాడు సన్యాసియును కాడు. కర్మయోగియును కాడు.

వ్యా. చేయవలసిన కర్మ అనగా పూర్వ సంస్కార కర్మను కోరికయే లేక చేయువాడు జ్ఞానము గలవాడు. వాడు సన్యాసి, జ్ఞాని, యనబడును. ప్రకృతి గుణములు గలవాడు ప్రపంచ సంబంధమైన కర్మను విడిచి, చేయవలసిన కర్మ ఫలాపేక్ష లేనివాడై జ్ఞాని చెప్పునట్లు చేయువాడు కర్మ సన్యాసి, కర్మయోగి యనబడును. ప్రకృతి గుణములు గలవాడు స్వయముగా చేయు ఏ కర్మయైనను ఫలమనుభవించనిది కాదు. ప్రకృతి గుణములు ఆ కర్మలయందుండును. అందువలన కర్మ ఫలమనుభవించు వాడగును. సన్యాసియు కాడు. కర్మయోగియు కాడు.

శ్లో॥ యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధిపాండవ।
న హ్యసన్న్యస్త సంకల్పోయోగీ భవతి కశ్చన ॥ 2

తా. అర్జునా! దేనిని సన్యాసమని చెప్పుచున్నారో, దానినే కర్మయోగమని తెలియుము. ఎందుచేతననగా సంకల్ప రహితుడు కానివాడు యోగి కానేరడు.

వ్యా. సన్యాసము కర్మయోగమనబడదు. ప్రపంచ సంబంధమైన కర్మలను విడిచి జ్ఞాని చెప్పునటుల చేయుకర్మయే కర్మయోగము. అట్టి కర్మద్వారా జ్ఞాని యందున్న జ్ఞానమును పొందినవాడు విజ్ఞానమును పొందును. పరమ పద దర్శన మైన వాడగును. కోరికయే లేనివాడగును. జ్ఞాని, సన్యాసి యనబడును. వాడుచేయు కర్మవలన కర్మ రహితుడగును. కర్మ రహితుడే సంకల్ప రహితుడు.

శ్లో॥ ఆరురుక్షోర్ముేర్యోగం కర్మ కారణముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే॥ 3

తా. జ్ఞానయోగము నెక్కవలెనన్న వారికి అనగా జ్ఞానమును పొందగోరు వానికి కర్మయోగమే కారణముగా చెప్పబడుచున్నది. కర్మయోగముచేత జ్ఞానమును పొందినవానికి శమమే కారణముగా చెప్పబడుచున్నది.

వ్యా. జ్ఞానమును పొందుటకు జ్ఞానుల దరిజేరి వారు చెప్పునటుల కర్మ చేయ వలెను. జ్ఞానమును పొందినవానికి పరమపద దర్శనమైన తదుపరి రాగ ద్వేషాది ప్రకృతి గుణములు వానిని విడుచును. వాడు సర్వకర్మ రహితుడైనపుడు పరమ శాంతి ననుభవించును. కర్మ నివృత్తియగు మార్గ మీ విధముగనుండగా, జ్ఞానమును పొందుటకు, కర్మ నివృత్తి యగుటకు అనేక యోగములను కల్పించి వ్రాసి యున్నారు. ఇవి 16 వ అ. 5 వ శ్లో.లో అసురసంపద కర్మబంధమును కలుగ జేయునవి అని చెప్పబడిన కామ రాగద్వేషాది రాక్షస గుణముల యోగములు. ఇవి యథార్థము కాదు.

శ్లో॥ యదా హి చేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే।
సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే॥ 4

తా. ఎపుడు ఇంద్రియ విషయముల యందును, కర్మల యందును కోరికయే లేని వాడగుచున్నాడో, అపుడు సకల సంకల్పములను విడిచిన వాడగుచున్నాడు. కర్మయోగఫలమును పొందినవాడని చెప్పబడుచున్నాడు.

వ్యా. జ్ఞానము గలవారి దరిజేరి, వారు చెప్పునటుల చేయువాడు జ్ఞానమును పొంది, జ్ఞానముద్వారా పరమపద దర్శనమైన వాడై కోరికయే లేనివాడగును. వాడు తన సంస్కార కర్మలయందు తన స్వభావముచేత ప్రేరేపింపబడి ప్రవర్తింపబడు

చుండును. ఆ కర్మలయందు విజ్ఞానము నిష్కామాది పవిత్రభావములతో ఉండును. కర్మ రహితుడైనపుడు సకల సంకల్ప రహితుడగును. స్వయముగా చేయు కర్మ యోగమనునది లేదు.

శ్లో॥ ఉద్ధరేదాత్మనాఽఽత్మానం నాత్మానమవసాదయేత్।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవరిపురాత్మనః॥ 5

తా. ఆత్మను ఆత్మచేత నుద్ధరించుకొనవలెను. తన ఆత్మను నశింప జేయ గూడదు. ఎందుచేతననగా ఆత్మయే తనకు బంధువు. ఆత్మయే తనకు శత్రువు.

శ్లో॥ బంధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్॥ 6

తా॥ ఎవనిచేత తనయొక్క ఆత్మ, ఆత్మచేత జయింపబడుచున్నదో, వాని యొక్క ఆత్మయే బంధువగుచున్నది. ఆత్మను జయించని వానికి ఆత్మయే విరోధి వలె ద్రోహము చేయుటయందు ప్రవర్తించుచుండును.

వ్యా. తనకు ఆత్మ యున్నటులను, దానిని జయించినచో అదియే బంధువని దానిని జయించనిచో అదియే శత్రువని 5, 6 శ్లో.లలో యున్నది కల్పింపబడినదియే గాని, ఏ విధముగను యథార్థము కాదు. తానను వాడు స్వభావమను గుణముగల జీవుడు. శత్రువనునది రాగద్వేషాది గుణములతోనున్న కామము. బంధువనునది సమత్వబుద్ధి, నిష్కామాది పవిత్ర భావములతో నున్న విజ్ఞానము. ఈ విజ్ఞానము అందరియందును లేదు. పరమ తేజస్సును చూచు జ్ఞానము(భావము)న్న వారియందు మాత్రమే యున్నది. మాయయందుండి వచ్చి, స్వాతంత్ర్యము లేక అనేక జన్మల నెత్తుచు మాయయందే కలియుచు, మరల వచ్చుచున్నవని 8 వ అ. 18, 19 శ్లో. లలో చెప్పబడిన జీవుల స్వభావమను గుణమును ఆత్మయని అవ్యక్తముగ వ్రాసినారు. అవ్యక్తముగ చెప్పుచున్నారు. కృష్ణుని స్వభావమును కృష్ణుని ఆత్మయని, ప్రకృతియని 4 వ అ. 6 వ శ్లో. లో వ్రాసినారు. అంతియేకాని ఆత్మ యనునది లేదు. పరమపదముగా నున్న పరమతేజస్సును పరమాత్మ, ఆత్మయని కల్పించి, వీనిని మాయయందుండి వచ్చినవని చెప్పబడిన జీవుల స్వభావమునకు కల్పించి అందరియందును ఆత్మ, పరమాత్మ యున్నదని కల్పించి వ్రాసియున్నారు. చెప్పు చున్నారు. పరమపదమును చూచు జ్ఞానమనుచున్న భావమును కూడా ఆత్మయని

వ్రాసినారు. ఈ జ్ఞానమను భావము దీనినార్జించిన వారి యందున్నది కాని అందరి యందు లేదు.

శ్లో॥ జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః।
శీతోష్ణ సుఖ దుఃఖేషు తథా మానావమానయోః ॥ 7

తా. జితాత్మః (జయింపబడిన ఆత్మ) గలవానికి పరమాత్మ (పరమ తేజస్సు) కనుపించును. వాడు ప్రశాంతముగను, శీతోష్ణ సుఖ దుఃఖములయందు మానావమానములయందును సమభావము గలిగియుండును.

వ్యా. ఇందున్నవి జ్ఞానము గలవానికి జ్ఞానముద్వారా పరమాత్మ అనగా పరమ తేజోపదముగా నున్న తేజస్సు కాన్పించిన వాని లక్షణములు. ఆత్మ లేదు. జయింపబడిన ఆత్మ యమనది లేదు. జ్ఞానము గలవారికి జ్ఞానముద్వారా పరమ తేజస్సు కాన్పించును. వారియందు కామ రాగ ద్వేషాది గుణములుండవు. ఈ శ్లోకమునందు వ్రాసినవి అట్టి వారి లక్షణములు. వీనిని ఆత్మను జయించిన వాని లక్షణములని వ్రాసినది కల్పితము. ఎవరైనను జ్ఞానము గలవారి దరిచేరి జ్ఞానమును పొందవలయునుగాని, ఆత్మను జయించుటనునది లేదు. ఆత్మలేదు.

శ్లో॥ జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః॥ 8

తా. జ్ఞాన, విజ్ఞానములచేత తృప్తి పొందిన ఆత్మ కూటస్థుడును, గుణములను జయించినవాడును; మట్టిగడ్డ, రాయి, బంగారమును సమానముగ చూచువాడును నిజమైన యోగి యని చెప్పబడుచున్నాడు.

వ్యా. జ్ఞాన విజ్ఞానముల నార్జించినవానికి (జీవునికి) జ్ఞానముద్వారా పరమపద దర్శనమైనపుడు వాడు తృప్తుడగుచున్నాడు. అప్పుడు వానియందున్న ప్రకృతి గుణములు వాంఛతోసహా వానిని విడిచి వెళ్ళిపోవును. అందుచేత వాడు విజ్ఞానము వలన గుణములను జయించినవాడును, మట్టిగడ్డ, రాయి, బంగారము వీని నన్నిటిని సమానముగా చూచువాడు నగుచున్నాడు. వానిని యథార్థము నెరిగిన నిజమైన జ్ఞాని యని చెప్పవలెను. యోగి యనునది కల్పితము. ఇందు జీవునిని ఆత్మయని వ్రాసినారు. ఆత్మ లేదు.

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధుషు।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥ 9

తా. ఉపకారము చేసిన వాని యందును, మిత్రునియందును, ఉదాసీనుని యందును, శత్రువులయందును, మధ్యస్థులయందును, బంధువులయందును, సాధువుల యందును పాపములు చేయు వానియందును సమబుద్ధి గలవాడే ఉత్కృష్టుడు.

వ్యా. ఈ శ్లోకమునందు చెప్పబడినవన్నియు జ్ఞాన, విజ్ఞానములు గలవారి లక్షణములు.

శ్లో॥ యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ॥ 10

తా. పైన చెప్పబడిన యోగి ఆత్మతో నున్న చిత్తము గలవాడును, ఆశ లేనివాడును, అపరిగ్రహము గలవాడును, ఏకాంతస్థలమందు ఒంటరిగా నున్నవాడు నగుచు ఎల్లప్పుడును ఆత్మ యందుండవలెను.

వ్యా. జ్ఞాన, విజ్ఞానములు గలవారు కామ రాగద్వేషాది గుణములు లేనివార గుటచేత, ఆశ లేనివారును, అపరిగ్రహము గలవారునై యున్నారు. అట్టివారు ప్రపంచమునందెచ్చటను నాది యను ఆధారము లేనివారై, వారియందు ప్రేమభావము గలవారి ఆధారము గలవారై యుందురు. విధికి లోబడి యితరులనుండి ఆహారము తీసికొందురు. దాచుకొని తినరు. అంతేగాని, ఒంటరిగా నుండువారు కాదు. ఆత్మతో నున్న చిత్తము గలవాడని, ఏకాంత స్థలమునందు ఒంటరిగా నున్నవాడగుచు ఆత్మ యందుండవలెనని యిందు వ్రాసినది రాగ ద్వేషాది గుణములు గలవారి కల్పితమే గాని యథార్థము కాదు. రాగద్వేషాది గుణములు లేకపోవుటే అపరిగ్రహము. అవి ఉండుటే పరిగ్రహము.

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్॥ 11

తా. పరిశుద్ధమైన ప్రదేశమున నెత్తు పల్లములుగా నుండని స్థలమునందు వస్త్రము, కృష్ణాజినము, దర్భాసనము గలదియునగు తనయొక్క ఆసనమును ప్రతిష్ఠించుకొని,

శ్లో॥ తత్రైకాగ్రం మనః కృత్వా యత చిత్తేంద్రియ క్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగ మాత్మ విశుద్ధయే॥ 12

తా. ఆ యాసనమునందు కూర్చుండి మనస్సును ఏకాగ్రముగా జేసి చిత్తేంద్రియముల యొక్క వ్యాపారములను నియమించి ఆత్మశుద్ధి కొరకు యోగము నభ్యసింపవలెను.

శ్లో॥ సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ 13

తా. శరీర,శిరః కంఠములను సమముగాను, నిశ్చలముగాను జేసి స్థిరముగా నాసికాగ్రమును చూచుచు దిక్కులను చూడనివాడై యుండవలెను.

వ్యా. 11, 12, 13శ్లోకములయందు చెప్పబడినవి 16 వ అ. 5 వ శ్లో.లో కర్మబంధమును కలుగజేయునవి అసుర సంపదయని చెప్పబడిన కామ రాగ ద్వేషాది గుణములు గలవారి అవ్యక్త ప్రవర్తన.

శ్లో॥ ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారి వ్రతే స్థితః।
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥14

తా. ప్రశాంతమైన ఆత్మ గలవాడును, భయము లేనివాడును, బ్రహ్మచర్య వ్రతము నందున్నవాడును, మనస్సును నిగ్రహించి నాయందే యున్న చిత్తముగల వాడును, నా పరముగా నున్నవాడునై యుండవలెను.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. కృష్ణుడున్నపుడు కృష్ణుని విడువక సేవ చేయువారికి తనను తెలియు బుద్ధిని (భక్తిని) ఇచ్చెదనని, ఈ బుద్ధి భావమున తాను (కృష్ణుని యందున్న విజ్ఞానము) వారియందు ప్రవేశించి, యిదివరకు వారి యందున్న అజ్ఞానమనుచీకటి పోగలందులకు వారియందు జ్ఞానమను దీపమును వెలిగించు (ప్రవేశింపజేయు) చున్నానని 10 వ అ. 10, 11 శ్లో. లలో నున్నది యథార్థము.

శ్లో॥ యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ నియత
మానసః ।
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి॥ 15

తా. యోగి మనో నిగ్రహము గలవాడై ఎల్లప్పుడును ఆత్మ నలవరచుకొని పరమపదమే పర్యవసానముగా నాయందున్నట్టి శాంతిని పొందుచున్నాడు.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. కృష్ణుని సాంగత్యమున నున్నవారు కృష్ణునియందు భక్తి గలవారై కృష్ణునియందున్న జ్ఞానమును పొంది యుందురు. పరమపదముగా నున్న పరమ శాంతియగు పరమ తేజస్సు కృష్ణుని యందు లేదు. ఈ లోకమునందు లేదు.

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ 16

తా. అర్జునా ! అధికముగా తినువానికిని, ఏమియును తిననివానికిని, అధికముగా నిద్రించువానికిని, ఎక్కువగా మేలుకొని యుండువానికిని యోగము కుదురదు

శ్లో॥ యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావ బోధస్య యోగో భవతి దుఃఖహా॥ 17

తా. తగిన ఆహార విహారములు గలవాడును, ఉచితకర్మలు చేయుటయందు తగిన ప్రవర్తన గలవాడును, యుక్తమైన నిద్రాజాగరణలు గలవాడు నగు వానికి యోగము దుఃఖములను పోగొట్టునది యగుచున్నది.

వ్యా. ఈ 16, 17 శ్లోకములయందు చెప్పబడినది యథార్థము కాదు. వాని వలన కొంచెము సుఖముగనున్నట్లుండును. కాని కామగుణములుపోవు. దుఃఖములు పోవు. జ్ఞాని సాంగత్యమువలన కర్మ బంధితుడు కాడు. దుఃఖములను పొందడు. యోగమువలన దుఃఖములు పోవు.

శ్లో॥ యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే ।
నిఃస్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా 18

తా. ఎప్పుడు నియమింపబడిన చిత్తము ఆత్మయందే నిలిచినదో, అప్పుడు వాడు సమస్త కోరికల యందపేక్ష లేనివాడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ యథా దీపో నివాతస్థో నేంగతే సోపమాస్మృతా।
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః19

తా. నియమింపబడిన చిత్తము గలవాడును, యోగము ననుసరించిన వాడు నగు యోగియొక్క ఆత్మకు (జీవునకు) గాలి లేనిచోటనుండు దీపము ఏ ప్రకారము చలింపక యుండునో అట్టిది ఉపమానముగా చెప్పబడినది.

వ్యా. పై శ్లోకముల యందు వ్రాసినవి ప్రకృతి గుణముల లక్షణములు. ఒకడు ఒక ఊరు పోవుచు మార్గమున ఒక చెట్టునీడను కొంచెము విశ్రాంతిగనుండి అచటనుండి లేచి ఆ ఊరు పోవునటుల ప్రకృతి గుణములు కర్మబంధములను గలిగించుటకు కారణమగు కర్మలను చేయుచు కొంచెము సుఖమును చూపి ప్రపంచము నందు శరీరముతో చేయు కర్మలను విడిచి, చిత్తనిగ్రహమని, ఈ శరీరము నొక చోట కూర్చుండజేసి కొంచెము నిశ్చలముగా నుండి ఇదియే శాంతియని భ్రమింప జేయుచు అందును బంధించుటకు కారణమగుచున్నవి. అచ్చటనుండి లేవగనే ఈ ప్రకృతి గుణములు మంచి, చెడు అను కర్మలయందు ప్రవేశించి అనేక కర్మ బంధములు గలిగించునవి యగుచున్నవి. చిత్తము ఆత్మయందు నిలుచుట కాదు. ఆత్మలేదు. జ్ఞానము గలవారి సాంగత్యమువలన జ్ఞాన, విజ్ఞానముల నార్జించినవాడు సర్వము నెరిగిన వాడగుటవలన వానిని కోరికయును, సర్వ గుణములును విడుచును. కాని, సమస్తమైన కోరికలయందు అపేక్ష లేనివాడగుటయనునది **యథార్థము** కాదు.

శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్రచైవాత్మనాఽఽత్మానంపశ్యన్నాత్మనితుష్యతి20

తా. ఎప్పుడు చిత్తము యోగముచేత నిగ్రహింపబడి పరమాత్మ (పరమ తేజస్సు) యందున్నదో, ఎప్పుడు ఆత్మను, ఆత్మచేత, ఆత్మయందే దర్శించుచు ఆనందించుచున్నాడో,

వ్యా. ఇందు వ్రాసినవి యథార్థము కాదు. చిత్తమును పరమాత్మ యందుం చుట, ఆత్మను ఆత్మచేత ఆత్మయందే దర్శించుట; ఇవి ఎరుగని వారి వ్రాతలు. గుడ్డిదియును చంచలమునగు చిత్తమను గుణమును ఎట్లు నిగ్రహించినను పరమ తేజస్సు కాన్పించదు. ఆత్మను, ఆత్మచేత, ఆత్మయందు దర్శించుచు ఆనందమను భవించుట కాదు. జీవుడు జ్ఞానము నార్జించి, జ్ఞానముద్వారా పరమతేజస్సును దర్శిం చుచు ఆనందమనుభవించవలెను.

శ్లో॥ సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః॥ 21

తా. ఆద్యంతములు లేనిదియును, బుద్ధిచేతనే తెలియదగినదియును, ఇంద్రి యములకు గోచరము కానిదియునగు సుఖమును ఎప్పుడు తెలిసికొనుచున్నాడో, అట్టి స్థితి గలవాడు తత్వమునుండి చలింపడు.

వా. ఆద్యంతములు లేనిదియును, ఇంద్రియములకు గోచరము కానిదియు నగు పరమ తేజోపదమును జ్ఞానము గలవారు జ్ఞానముద్వారా దర్శించినవారై ఆ తేజో ఆనందమను సుఖ మనుభవించుచుందురు. వారు కర్మ రహితులై ఆ తేజో పదమును చేరి ఆ సుఖమునే అనుభవించుచుందురు. అట్టి సుఖము బుద్ధిచేత తెలియ దగినది కాదు. అది తత్వము కాదు.

శ్లో॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే॥ 22

తా. దేనిని పొంది (చూచి) దానికంటె మరియొక లాభమును (సుఖమును) అధికమైన దానినిగా తలంచడో, దానియందే యున్నవాడు అధికమైన దుఃఖముచేత గూడ చలింపడు.

వ్యా ఇందు వ్రాసినది పరమపద దర్శనమైన వాని అనగా జ్ఞాన విజ్ఞానములు గలవాని లక్షణములు. పరమపద దర్శనమైనవాడు సుఖదుఃఖములయందును భిన్న భావము నొందడు.

శ్లో॥ తం విద్యాద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితం।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥ 23

తా. దుఃఖ సంబంధ రాహిత్యమైన దానిని యోగమను దానినిగా నెరుంగ వలయును. అట్టి యోగమును విషయరాహిత్యమైన మనస్సుచేత నిశ్చయించి పొంద దగియున్నది.

వ్యా. దుఃఖ సంబంధమును రహిత పరుచునది విజ్ఞానము. ఇదియే కామ గుణములను రహిత పరుచునది. అట్టి విజ్ఞానము గలవారిని వారి ఆచరణ ద్వారా గుర్తించి వారి దరిజేరి వారియందు విషయాసక్తిలేని భావము (భక్తి)చేతవిజ్ఞానమును, జ్ఞానమును వారినుండియే పొందవలెను. యోగమును పొందుట కాదు.

శ్లో॥ సంకల్ప ప్రభవాన్ కామాంస్త్యక్త్వా సర్వానశేషతః ।
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమన్తతః॥ 24

తా. సంకల్పమువలన కలిగెడు సమస్తమైన కోరికలను నిశ్శేషముగా విడిచి మనస్సుచేత ఇంద్రియ సమూహమును విషయములనుండి మరలించి,

శ్లో॥ శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతి గృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥25

తా. ధైర్యముగా బుద్ధిచేత, మెల్లమెల్లగా మనస్సు ఉపరతిని పొందవలెను. అట్లు ఆత్మయందున్న దానినిగాజేసి కొంచమైనను ఇతర చింతన చేయకూడదు.

వ్యా. పై రెండు శ్లోకముల యందున్నది ప్రకృతి గుణముల అవ్యక్త ప్రవర్తన. అది యథార్థము కాదు. ఆత్మయనునది కల్పితము.

శ్లో॥ యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం ।
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥ 26

తా. చంచలమైనదియు, నిలకడలేనిదియునైన మనస్సు ఎచ్చటెచ్చట సంచరించుచుండునో, అచ్చటచ్చటనుండి ఆమనస్సును మరలించి ఆత్మయందుండు దానినిగా చేయవలెను.

వ్యా. చంచలమైన దానినెచ్చట నుంచినను అది చంచలమైనదేగాని, చాంచల్యము లేనిది కాదు. పరమపదముగానున్న తేజస్సు నెరుగదు. అది ఎరుగని దాని

యందెట్లుండును. దానిని ఆత్మయందే యుంచవలెననునది యథార్థము కాదు. సంస్కారము ననుసరించి సంకల్పములను ప్రేరేపణ చేయునది స్వభావము. ఈ స్వభావము ప్రేరేపణ చేసి ప్రవర్తించు విషయములందు రాగద్వేషాది గుణములుండ కూడదు. అందువలన రాగ, ద్వేషాది గుణములచేత విడువబడవలెను.

శ్లో॥ ప్రశాంత మనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్॥ 27

తా. ప్రశాంత మనస్సు గలవాడు, రజోగుణము నశించినవాడును, కల్మష రహితుడునై బ్రహ్మ స్వరూపుడైన యోగి ఉత్తమ సుఖమును స్వయముగా నిచ్చటనే పొందుచున్నాడు.

వ్యా. జ్ఞానము గలవాడు జ్ఞానముద్వారా పరమతేజో ఆనందమనునట్టి ఉత్తమ సుఖమును ఇచ్చటను అనుభవించును. త్రిగుణ రహితుడును, కర్మరహితుడునై ఆ తేజోపదమును చేరి, అచ్చటను ఆ తేజో ఆనంద మనుభవించుచుండును. ఎవరును గ్రుడ్డివి యగు ప్రకృతి గుణములద్వారా ఏ యోగము చేసియును ఉత్తమ సుఖమును పొందలేరు.

శ్లో॥ యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః।
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యంతం సుఖమశ్నుతే॥ 28

తా. పైన చెప్పబడిన యోగి ఆత్మను ఎప్పుడును ఐక్యపరచి కల్మష రహితుడై బ్రహ్మానుభవమైన మిక్కిలి ఆనందమును సుఖముగా అనుభవించుచున్నాడు.

వ్యా. ఏ యోగియును ఆత్మను ఐక్యపరచుటనునది లేదు. ఈ విధముగా కల్మష రహితుడగుట, పరమ తేజో ఆనంద మనుభవించుట యనునది యథార్థము కాదు. ఇది రాగద్వేషాది గుణముల ప్రవర్తన.

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ 29

తా. యోగముతో కూడుకొనిన ఆత్మ గలవాడు సమస్త భూతములను సమముగా చూచువాడై తానను జీవుని సమస్త భూతములయందును, సమస్త భూతముల యందున్నవానిని (జీవుని) తనయందును చూచుచున్నాడు.

వ్యా. పరమపదదర్శనమైనవారి దరిజేరి వారు చెప్పునట్లు చేయుచు వారి ద్వారా జ్ఞాన, విజ్ఞానములను పొంది జ్ఞానముద్వారా పరమపదదర్శనమైన వాడు తానను జీవుడును, సమస్త శరీరముల యందున్న జీవులును ఒకలాంటివేనని ఎరిగి యున్నాడు. వాడు అందరియందును లేడు. అందరును వానియందు లేరు. యోగ మనునది కాదు. ఆత్మ లేదు.

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥ 30

తా. ఎవడు సర్వప్రపంచమునందంతటను నన్ను చూచుచున్నాడో, సర్వము నాయందు చూచుచున్నాడో వానికి నేను కనబడక పోను. వాడును నాకు కనబడక పోడు.

వ్యా. జ్ఞానము గలవాడు విజ్ఞానమువలన "నేను, నేను" అను జీవుడును, సమస్త శరీరములయందున్న జీవులును, కృష్ణుడను శరీరమునందున్న జీవుడును ఒక లాంటివేనని ఎరిగియున్నాడు. కృష్ణుడను జీవుడును, సమస్త శరీరముల యందున్న జీవులును ఒక లాంటివేగాని, ఒకటి కాదు. సర్వ ప్రపంచమునందు అందరియందును ఉన్నది స్వభావమను గుణముగల జీవుడు. జ్ఞాన, విజ్ఞానములు గలవారు విజ్ఞానమువలన తానను జీవుడును, సమస్త శరీరములయందున్న జీవులును కృష్ణుడను జీవుడును ఒక లాంటివేగాని, ఒకటి కాదని ఎరిగియున్నారు. ఈవిధము గనె కృష్ణుడును విజ్ఞానమువలన ఎరిగియున్నాడు. సర్వ ప్రపంచములో అందరి యందును ఉన్నది ఒకలాంటి స్వభావముగల జీవుడేగాని, కృష్ణుడు కాదు. ఈ సర్వమును మాయయందున్నది. మాయయందుండి వచ్చినది గాని, కృష్ణునియందు లేదు. కృష్ణుని యందుండి వచ్చినది కాదు.

శ్లో. సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥ 31

తా. ఎవడు సర్వభూతములయందు నొకేస్వరూపముగానున్న నన్ను సేవించు చున్నాడో, అట్టి యోగి ఎల్లప్పుడును పనులయందు ప్రవర్తించు చుండినను నా యందుండు వాడగుచున్నాడు.

వ్యా. సర్వభూతములయందును ఒకే స్వరూపముగానున్న కృష్ణునిసేవించుట యనునది యథార్థము కాదు. కృష్ణుని యందుండు వాడగుచున్నాడనునదియు యథార్థము కాదు. 10 వ అ. 10, 11 శ్లోకములలో చెప్పబడినటుల కృష్ణుడున్నపుడు వాని శరీరమునకు సేవ చేయుటయే కృష్ణుని సేవ చేయుట.

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో
మతః ॥ 32

తా. అర్జునా! ఎవడు సమస్త జీవుల సుఖదుఃఖములను తనవంటివే యనెడు భావముతో సమానముగా చూచుచున్నాడో, అట్టి యోగి శ్రేష్ఠుడని నా మతము.

వ్యా. ఈ శ్లోకమునందు చెప్పబడినటుల ఎరిగినది సర్వమునెరిగినవిజ్ఞానము. ఈ విజ్ఞానము గలవారందరును సమస్త జీవుల సుఖదుఃఖములును తనవంటివే యని ఎరిగి సమముగా చూచువారు. అట్టి వారే శ్రేష్ఠులు. అట్టివారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయువాడును వారియందు ప్రేమ గలవాడై అందరియందును భేద భావము లేక సమముగా వర్తించుచుండును. అట్టివాడును శ్రేష్ఠుడగును. ఇట్లుఇతర మైన ఏ యోగముచేతను చూడలేరు. శ్రేష్ఠులు గారు.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధు
సూదన।
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్॥33

తా. కృష్ణా! తన సుఖ దుఃఖములును, సర్వజీవుల సుఖ దుఃఖములను సమముగా చూచు ఏ యోగము నీ చేత చెప్పబడినదో, దానియొక్క స్థిరమైన స్థితిని చంచలభావము గలవాడనగుటచేత నేను తెలిసికొనజాలకున్నాను.

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్
34

తా. కృష్ణా! ఎందువలన మనస్సు చంచలమైనదో, ప్రమాదమును గలిగించునదై బలముగను, దృఢముగను ఉన్నదో, దానియొక్క నిగ్రహమును, వాయువుయొక్క నిగ్రహమువలె శక్యముగాని దానినిగా నేను తలంచుచున్నాను.

వ్యా. జీవులకు వాని పూర్వకర్మ సంస్కారము ననుసరించి వాని స్వభావము చేతనే ఎల్లప్పుడును ప్రేరేపణ (సంకల్పములు) గలుగుచుండును. ఆ విధముగా కలుగుటకు కారణము చంచలమగు ప్రకృతి గుణములయొక్క కర్మయే (సంస్కారమే) గాని, మనస్సనునది వేరుగా లేదు. దాని చాంచల్యమనునది లేదు. ఆ విధముగా ప్రేరేపణలు చేయు ఈ స్వభావమునే చంచల మనస్సని యథార్థము నెరుగని వారనుచున్నారు. దానిని నిగ్రహించి, పూర్వకర్మల ననుభవించకయును, అట్టి కర్మలయందు ప్రవర్తించకయును ఉండుట కెవ్వరికిని సాధ్యము కాదు.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

**శ్లో॥ అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం।**
**అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే।35**

తా. అర్జునా! మనస్సు చంచలమైనది. నిగ్రహించుటకు శక్యము కానిది. ఇందు సంశయము లేదు. అర్జునా! అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను నిగ్రహింపదగియున్నది.

వ్యా. ఈ శ్లోకమునందు చెప్పబడినది యథార్థము కాదు. ఎందుచేతననగా, ఏ అభ్యాస, వైరాగ్యములచేతను ఈ స్వభావముయొక్క ప్రేరేపణను నిగ్రహించి ప్రేరేపణ లేనివారుగా నుండుట కెవ్వరికిని సాధ్యము కాదు. ఇది చంచలమైనదెప్పుడును కాదు. జీవులయందున్న ప్రకృతి గుణముల పూర్వకర్మ సంస్కారము ననుసరించి, వానిని కర్మలయందు ప్రేరేపణ జేసి ప్రవర్తించుచుండుటయే దీని విధి.

**శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః36**

తా. ఆత్మ నిగ్రహము లేనివాడు యోగమును పొందజాలడు. యత్నమొనరించుచున్న ఆత్మనిగ్రహము గలవాడు ఉపాయమువలన పొందుటకు సాధ్యమైనదని నా మతము.

వా. ఎవరును కర్తృత్వ ప్రయత్నములతో ఏ యోగముచేతను ఏ యుపాయముచేతను ఆత్మను నిగ్రహించుట యనునది యథార్థము కాదు. సమస్త జీవులకు నున్నది స్వభావమేకాని ఆత్మలేదు.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ అయతి శ్శ్రద్ధయోపేతో యోగాచ్చలిత మానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి॥37

తా. కృష్ణా ! శ్రద్ధ గలవాడైనను, నిగ్రహశక్తి లేనివాడగుటచేతయోగము నుండి చలింపబడిన మనస్సు గలవాడు యోగ ఫలమును పొందక ఏ గతిని పొందుచున్నాడు.

శ్లో॥ కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి॥ 38

తా. కృష్ణా! బ్రహ్మమార్గమునందు స్థిరతలేనిమూఢుడు ఇహపర సౌఖ్యముల రెంటికిని చెడిన వాడగుచు చెదరిన మేఘమువలె నశించిపోవును గదా !

వ్యా. ఈ శ్లోకముల యందున్నది కర్తృత్వ ప్రయత్నములతో చేయు ప్రకృతి గుణముల ప్రవర్తన. ఇది విజ్ఞాన ప్రవర్తన కాదు. విజ్ఞానమును పొందు ప్రవర్తన కాదు.

శ్లో॥ ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః ।
త్వదన్య స్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే॥39

తా. కృష్ణా ! నా సంశయమును నిశ్శేషముగా పోగొట్టుటకు నీవే అర్హుడవు. ఎందుచేతననగా ఈ సంశయమును ఛేదించువాడు నీకంటె నితరుడు మరియొకడు లభింపడు.

శ్రీ భగవాను వాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ పార్థనైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే।
న హి కల్యాణ కృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి॥ 40

తా. అర్జునా ! అట్టివానికి ఇహ పరలోకములయందును వినాశనము కలుగదు. ఎందుచేతననగా మంచిపని చేయు వాడెవ్వడును దుర్గతిని బొందడు.

వ్యా. పరమపదమునెరిగినవారును, వారి దరిజేరి, వారు చెప్పునటుల చేయువారును దుర్గతిని పొందరు. ధ్యానముగాని, ఏ యోగముగాని చేయువారు పరమపద మార్గము నెరిగినవారు కారు. ఆ మార్గమున నడుచువారు కారు. ఎవరైనను ఇతరులకుపయోగించు మంచికర్మ చేయువారే మంచి ఫలము ననుభవించెదరు. ధ్యాన, యోగాభ్యాసములు చేయువారు ఆ ఫలమును పొందరు.

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీ స్సమాః
　　శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే 41

తా. యోగభ్రష్టుడు పుణ్యము చేసినవారు పొందు స్వర్గలోకమును పొంది, అనేక సంవత్సరములచ్చట నివసించి, సదాచారము గలవారును, శ్రీమంతులగువారి గృహమునందు పుట్టుచున్నాడు.

వ్యా. యోగముద్వారా పుణ్యకర్మలుచేసినవారుపొందుస్వర్గలోకమునుపొందడు. శ్రీమంతులగు వారి గృహమునందు పుట్టడు. యోగము పుణ్యకర్మ కాదు. పాప కర్మకాదు. కర్మరహితమగు కర్మకాదు. జ్ఞానమును పొందు కర్మ కాదు. ఇది ప్రకృతి (మాయ) యందు బంధింపబడు కర్మ. ప్రకృతి గుణములు గలవారే యోగము చేయువారు. వారు చేయు కర్మలయందు పుణ్య పాపకర్మలు రెండును హెచ్చు తగ్గులుగా నుండును. వారు ఏ లోకములకు వెళ్ళినను, ఈ లోకమునందు ఏ జన్మమెత్తినను, మానవజన్మ మెత్తినను వారియందున్న గుణములు చేయు కర్మ యను సంస్కారము ననుసరించి వారి స్వభావమువలననే జన్మించెదరు.

శ్లో॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం ।
　　ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥　　42

తా॥ అట్లు కాని యెడల బుద్ధిమంతులైన యోగుల కులమునందు జన్మించుచున్నాడు. ఈలాటి జన్మము ఏది కలదో, అదియే కదా యీ లోకమునందుమిక్కిలి దుర్లభమైనది.

వ్యా. ఎవరైనను వారియందున్న గుణములు చేయు కర్మ సంబంధము ననుసరించి జన్మించెదరు. యోగుల కులము రాగద్వేషాది గుణముల సంబంధమైనదియే గాని జ్ఞాన, విజ్ఞానములు గల జ్ఞానుల కులముకాదు. జ్ఞానులసంబంధమున జన్మించు జన్మయే దుర్లభము.

శ్లో॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం।
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన ॥ 43

తా. అర్జునా! ఆ మరుజన్మమునందు మునుపటి జన్మ సంబంధమైనదియు, బుద్ధితో కూడియున్న యోగమును పొందుచున్నాడు. పిమ్మట సిద్ధి నిమిత్తము మరల యత్నము చేయుచున్నాడు.

శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ 44

తా. వాడు యోగము చేయుటకు ప్రయత్నము చేయని వాడైనను పూర్వ జన్మయందు చేయబడిన అభ్యాస వాసనా వశముచేత విధిగా లాగబడుచున్నాడు. యోగము చేయుటకు జిజ్ఞాస గలవాడు శబ్దబ్రహ్మ నతిక్రమించుచున్నాడు.

వ్యా. కామ రాగద్వేషాది గుణముల కర్మయే వాసనా వశము గలది. ఈ గుణములు చేయు యోగమువలన వాసనావశులై అనగా వారి స్వభావమునకు వశులై ప్రయత్నము చేయకయే యోగమునందు లాగబడుచు యోగము చేయుచుందురు. ఆ యోగమునందు మరల రాగద్వేషాది గుణములు ఉండును. వారు మరల వాసనావశులై లాగబడుచు యోగము చేయుచు ఈ ప్రపంచమునందు తిరుగుచుందురు. ఈ విధముగ అనేక కర్మలయందును ప్రవర్తించుచు తిరుగుచుందురు. యోగము చేయుటకు జిజ్ఞాస గలవాడు శబ్దబ్రహ్మ అనగా "ఓమ్" అను శబ్దముగల మాయాభ్రమ నతిక్రమించుచున్నాడని యిందున్నది యథార్థము కాదు. శబ్దబ్రహ్మ (శబ్దముగలమాయాభ్రమ)ను అతిక్రమించ వలసియుండగా "ఓం" అను శబ్దమును ఉచ్చరించువారు మాయాభ్రమను అనుసరించు వారగుదురు.

శ్లో॥ ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః ।
అనేకజన్మ సంసిద్ధ స్తతోయాతి పరాం గతిమ్ ॥ 45

తా. పట్టుదలతో యత్నించుచున్న యోగి అనేక జన్మలనుండి యోగసిద్ధిని పొందగలుగు చున్నాడు. తదుపరి కల్మష రహితుడై ఉత్తమ పదమును పొందు చున్నాడు.

వ్యా. యోగము కామ రాగద్వేషాది గుణముల అవ్యక్త మార్గము యోగి యోగమునందు పట్టుదలతో ఎన్ని జన్మములు యత్న మొనరించు చుండినను, ఈ ప్రపంచమునందు తిరుగుచుండునుగాని జ్ఞాన, విజ్ఞానములను పొందలేడు. కల్మష రహితుడు గాడు, పరమ పదమును చేరడు.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥ 46

తా. అర్జునా ! యోగి తపస్సు చేయు వారికంటెను, ప్రయత్నముతో స్వయముగా జ్ఞానాభ్యాసము చేయువారికంటెను శ్రేష్ఠుడని నా అభిప్రాయము. యోగి కర్మ చేయు వారికంటెను శ్రేష్ఠుడు. కాబట్టి నీవు యోగి వగుము.

వ్యా. తపస్సు చేయువారికంటెను, యోగము చేయువారికంటెను, స్వయముగా జ్ఞానాభ్యాసము చేయువారికంటెను, స్వయముగా కర్మ చేయు వారికంటెను, జ్ఞానము గలవారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయువాడు శ్రేష్ఠుడు. యోగి వగు మనునది యథార్థము కాదు.

శ్లో॥ యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।
శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో
మతః ॥ 47

తా. యోగులందరిలోను ఎవడు నాయందే యున్న భక్తితో శ్రద్ధ గలవాడై నన్ను సేవించునో అట్టివాడు యోగులందరిలోను ఉత్తముడని నా యొక్క అభిప్రాయము,

వ్యా. కృష్ణుడున్నప్పుడు, ఎవడు కృష్ణునియందు ప్రేమ గలవాడై కృష్ణునికి సేవ జేసియున్నాడో అట్టివాడే ఉత్తముడు. యోగమువలన ఉత్తముడు కాడు. కృష్ణుడున్నపుడు కృష్ణునికి సేవ చేయునటులనె జ్ఞాన, విజ్ఞానములు గలవారికి సేవచేయుచు వారు చెప్పునట్లు చేయవలెను గాని ఏ యోగము చేయుటయును యథార్థము కాదు.

ఈ అధ్యాయము పరమపదము నెరిగిన జ్ఞాన, విజ్ఞానములుగల జ్ఞానులసాంగత్యమున వారు చెప్పునటుల చేయు కర్మతో ప్రారంభమైనది. ఈ కర్మను కర్మ యోగమని వ్రాసినారు. అట్టి కర్మద్వారా జ్ఞానమును పొంది జ్ఞానముద్వారా పరమపదము నెరిగిన జ్ఞాని లక్షణములను వ్రాయుచు, అట్టి జ్ఞాని లక్షణములను, ప్రకృతి గుణములచేత చేయబడు ధ్యానము చేయువారి లక్షణములుగా వ్రాసియున్నారు. అవి యన్నియును ధ్యానయోగముద్వారా పొందునవియని, యిట్లు ఉత్తమపదమును(పరమ పదమును) పొందుదురని కృష్ణుడు చెప్పినట్లుగా కల్పించి వ్రాసినారు. ధ్యానము ద్వారాను, ఏ యోగము ద్వారానైనను వాసనావశులై తిరుగుచుందురు. చివర 47 వ శ్లోకమునందు కృష్ణుడు తన సాంగత్యమున శ్రద్ధతో తన సేవ జేయువాడే ఉత్తముడని చెప్పినది యథార్థము. వాడు ధ్యానయోగముకాని, ఏ యోగముగాని చేయువాడు కాదు.



# గీతా వ్యాఖ్యానము

## విజ్ఞాన యోగము

## 7 వ అధ్యాయము

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదా శ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసితచ్ఛృణు 1

తా. అర్జునా ! నాయందు ఆసక్తిగల మనస్సు గలవాడవై నన్నే ఆశ్రయించి కర్మయోగము నాచరించుచు నన్ను సంశయ రహితమగునట్లు సంపూర్ణముగ నెట్లెరుగ గలవో దానిని వినుము.

వ్యా. అర్జునుడు కృష్ణునియందు ప్రేమ గలవాడై, వానిసేవ చేయుచున్నచో కృష్ణుని యథార్థముగ తెలియు భక్తిని కృష్ణుడే యిచ్చును. నన్ను విడువకసేవించు వారలకు నన్ను తెలియుబుద్ధిని (భక్తిని) నేనే యిచ్చుచున్నానని 10 వ అ. 10 వ శ్లో.లో ఉన్నది యథార్థము. యోగముద్వారా తెలిసికొనుట యనునది యథార్థము కాదు.

శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్యమవశిష్యతే॥ 2

తా. దేని నెరిగిన (పొందిన) ఈ లోకమునందు మరల పొందదగినది మరి యొకటి లేదో, అట్టి విజ్ఞాన సహితమైన జ్ఞానమును నేను నీకు చెప్పుచున్నాను.

వ్యా. జ్ఞానము పరమపదమును చూచునది. విజ్ఞానము సర్వము నెరిగి ఇది యున్నవారి యందున్న రాగద్వేషాది ప్రకృతి (మాయా) గుణములను వెడలగొట్టు

నది. వారు కర్మబంధ రహితులై పరమపదమును చేరుట కర్హులగునటుల వారి సంస్కారము ననుసరించి వారి స్వభావము ప్రవర్తించు కర్మలయందు నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించునది.

కోరికయను అశ్వత్థ వృక్షమును వేరులతోసహా అసంగశస్త్రము అనగా కోరిక లేని విజ్ఞానముచేత నరికి వేయవలెనని 15 వ అ. 3 వ శ్లో.లో ఉన్నది.

దైవసంపద (జ్ఞాన, విజ్ఞానములు) మోక్ష (పరమ) పదమును చేర్చునవి యని 16 వ అ. 5 వ శ్లోకములో నున్నది. పరమపదమును జ్ఞానముద్వారా చూడ వలెను, చేరవలెనని 13 వ అ. 18 వ శ్లో.లో నున్నది.

పరమపదమును చేరినవారు ఈ లోకమునందు జన్మమునకు తిరిగిరారని 8 వ అ. 21 వ శ్లోకములో నున్నది.

జ్ఞాన విజ్ఞానములు గలవారు వీనిద్వారా పరమపదము నెరిగి గుణరహితులు, కర్మ రహితులునై ఆ పదమును చేరుదురు.

నన్ను (కృష్ణుడను శరీరమును) విడువక సేవించు వారలకు 'నన్ను' అనగా కృష్ణునియందుండి సర్వము నెరిగి ప్రవర్తించుచు చెప్పుచున్న విజ్ఞానమును తెలియు నట్టి బుద్ధిని (భక్తిని) నేను ఇచ్చుచున్నానని, ఆ భక్తి భావమున నేను (కృష్ణుని యందుండి చెప్పుచున్న విజ్ఞానము) వారియందు ప్రవేశించి, వారియందున్న అజ్ఞాన మను చీకటి పొగలందులకు వారియందు జ్ఞానమను దీపమును ప్రవేశింప జేయుచున్నా నని 10 వ అ. 10, 11 శ్లోకములలో ఉన్నది.

అర్జునుడు కృష్ణునికి సేవ చేయుచు విడువక యుండవలెను. కృష్ణుడు తనను తెలియు బుద్ధిని (భక్తిని) అర్జునునికి ఇవ్వవలెను. జ్ఞాన, విజ్ఞానములు అందరి యందును లేవు. వానిని ఎవరైనను అవి యున్న వారి నుండియే పొందవలెను. కృష్ణుని సేవ చేయునటులనే, పరమపద దర్శనులైన జ్ఞానుల దరిజేరి, వారిని సేవిం చుచు పదే పదే అడుగుచుండుము. వారు నీకు జ్ఞానమును బోధించెదరు. (నీయందు ప్రవేశింపజేయుదురు) అని 4 వ అ. 34 వ శ్లో.లో ఉన్నది. అట్టి విజ్ఞాన సహిత మైన జ్ఞానమును (జ్ఞాన విజ్ఞానములను) నేను నీకు చెప్పుచున్నానని చెప్పెను. ఈ జ్ఞాన, విజ్ఞానములు పరమపదమును చేర్చునవియేగాని, కృష్ణుని తెలిసికొనవలెనను

నవి కాదు. వీనిని ఇవి యున్నవారి సాంగత్యమున వారి యందుండి వారి ద్వారానే ఆర్జించవలెను. కాని పరమపదమును చేర్చు భగవంతుడు లేడు.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥ 3

తా. వేలకొలది మనుష్యులలో సిద్ధిని పొందుటకొరకు ఒకానొకడు మాత్రమే యత్నించు చున్నాడు. అట్లు యత్నించు వారలలో నెవ్వడో ఒక్కడు మాత్రమే నన్ను యథార్థముగ తెలిసికొనుచున్నాడు.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. ప్రయత్నించి సిద్ధిని పొంది కృష్ణు నెరిగిన వారెవ్వరును ఉండరు. ఇది అవ్యక్త మార్గము. కృష్ణుడున్నపుడు మాత్రమే తనకు సేవ చేయువారలకు తనను తెలియుబుద్ధి (భక్తి) నిచ్చుచున్నానని 10 వ అ. 10 వ శ్లో.లో ఉన్నది ప్రత్యక్షముగ కాన్పించు యథార్థము. నిష్కామాది పవిత్ర ప్రేమ భావముల ప్రవర్తనగల కృష్ణుడను శరీరము నెరుగుటయే కృష్ణు నెరుగుట.

శ్లో॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధిరేవ చ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా॥ 4

తా. భూమి, జలము, అగ్ని, గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అనునట్టి నా ప్రకృతి అనగా మాయ ఎనిమిది విధములుగా ఉన్నది.

వ్యా. పంచభూతములతోను, సహజ స్వభావముగల జీవులతోను, రాగ ద్వేషాది గుణములతోను ఉన్న ఈ కాన్పించు సర్వమును ప్రకృతి(మాయ) యందున్నది. కృష్ణునియందు జ్ఞాన విజ్ఞానములున్నవి. కాని, ఈ ప్రకృతి(మాయ)లేదు. ఇది జ్ఞాన, విజ్ఞానములు గలవారి యందుండదు.

శ్లో॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥5

తా. పైన చెప్పినది అపరా ప్రకృతి. దేనిచేత ఈ ప్రపంచము ధరింపబడు చున్నదో, జీవరూపమైన నాయొక్క మరియొక ప్రకృతి యింతకంటె శ్రేష్ఠమైనదిగా నెరుంగుము.

వ్యా. జీవరూపముగ నున్న నాయొక్క మరియొక ప్రకృతి యనునది కృష్ణు డను జీవుని స్వభావము. (సహజ గుణము). ఈ స్వభావముతోనున్న కృష్ణుడను జీవుడును, సర్వజీవులును 8 వ అ. 18, 19 శ్లోకములలో చెప్పబడిన ప్రకృతి (మాయ) యందుండి, దానియందున్న బ్రహ్మయను భ్రమద్వారా సృష్టింపబడినవి. ఈ స్వభావమును కృష్ణునియొక్క శ్రేష్ఠమైన ప్రకృతి యని వ్రాసినారు. అంతియే కాని, యిది ప్రకృతి కాదు, మరియొక ప్రకృతి యనునది లేదు.

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా ॥ 6

తా. సమస్త ప్రాణుల ఉత్పత్తికి ఈ ప్రకృతియే కారణము. అందువలన జగత్తుయొక్క ఉత్పత్తికిని, లయమునకును నేను కారణమని తెలియుము.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. సర్వజీవులవలెనే ప్రకృతి (మాయ) యందుండి బ్రహ్మ (భ్రమ) ద్వారా సృష్టింపబడిన కృష్ణుడను జీవుని సహజస్వభావ మును ప్రకృతి యని వ్రాసి, ఈ ప్రపంచోత్పత్తికి కృష్ణుని ప్రకృతియే కారణ మని వ్రాసినారు. మరల ఈ జగత్తుయొక్కయుత్పత్తికిని, లయమునకును కృష్ణుడు కారణమని వ్రాసినారు. ఇది భగవద్గీత యని వ్రాసినవారి కల్పితము.

ఈ ప్రపంచము బ్రహ్మయను మాయా భ్రమచేత మాయ యందుండి వచ్చు చున్నదని మాయయందే కలియు చున్నదని 8 వ అ. 18, 19శ్లోకములలోఉన్నది. అట్టి దానిని, కృష్ణునియందు ప్రకృతి (మాయ) ఉన్నదని ఈ 7 వ అ. 4 వ శ్లోకములో వ్రాసి, ప్రకృతి (మాయ) యందుండి భ్రమద్వారా వచ్చిన తన స్వభావ మును ప్రకృతియని, ఈ ప్రకృతియే ఈ ప్రపంచోత్పత్తికిని కారణమని కల్పించి వ్రాసినారు. ఈ రెండు ప్రకృతులవలన ఈ ప్రపంచోత్పత్తికి, లయమునకును కృష్ణుడు కారణమని వ్రాసినారు. ఇది యంతయును భగవద్గీత యని వ్రాసిన వారి కల్పితము. అర్జునా! నేనును, నీవును అనేక జన్మలనెత్తినామని 4 వ అ. 5 వ శ్లోకములోను, నా ప్రకృతి (స్వభావము) ననుసరించియే నేను జన్మించుచున్నానని 6 వ శ్లోకములోను ఉన్నది. అందరివలెనే అర్జునుడును, కృష్ణుడును వారి సంస్కా రము ననుసరించి వారి స్వభావముచేతనే జన్మల నెత్తినారు. ఈ స్వభావము మాన

వులయందున్న గుణముల కర్మల ననుసరించి చంపునది, పుట్టించునదియేగాని, ఈ ప్రపంచోత్పత్తికిని లయమునకును కారణము కాదు. రాముని జన్మయందున్న రాగ ద్వేషాది గుణముల కర్మవలన తన స్వభావముచేతనే కృష్ణుడుగా పుట్టినాడు. అందు వాలిని చంపిన కర్మవలన తన ప్రకృతి యనిన స్వభావముచేతనే బోయవానిద్వారా చంపబడినాడు. అట్టి కృష్ణుడు ఈ ప్రపంచోత్పత్తికిని లయమునకును కారణముకాదు.

శ్లో॥ మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ 7

తా. అర్జునా! నాకంటె శ్రేష్ఠతరమైనది మరియొకటి లేదు. మణుల సమూహము దారము నందువలె ఈ సర్వమును నాయందు కూర్చబడి యున్నది.

వా. ఇది ఈ గీత వ్రాసిన వారి కల్పితమేగాని, కృష్ణుడు చెప్పినది కాదు. నా యొక్క శ్రేష్ఠమైన ప్రకృతి యనినది కృష్ణుడను జీవునియొక్క స్వభావమను గుణము. ఇది కృష్ణుడు కాదు. ఇది కృష్ణునికి ఉన్నటులనే సర్వజీవులకును ఉన్నది. కాని, దీనియందు జీవులు లేవు. ఈ సర్వమును లేదు.

అర్జునా! నీ ప్రకృతి (స్వభావము) నీ చేత యుద్ధము చేయించునని 18 వ అ. 59 వ శ్లో.లో ఉన్నది. (ఎట్లనగా) నీ సంస్కారమువలన నీ స్వభావమునకు వశుడవై ఉన్నావు. నీ స్వభావము నిన్ను తప్పక యుద్ధము చేయించునని 60 వ శ్లో.లో ఉన్నది. ఇది అర్జునుని పూర్వజన్మయందున్న మాయా గుణముల కర్మ సంస్కారము ననుసరించి ప్రవర్తించు అర్జునుని స్వభావమను గుణము. దీనిని ప్రకృతి యని వ్రాసినారు. దీనిని ఈశ్వరుడని, సర్వజీవులయందున్న ఈశ్వరుడు యంత్రములనునట్టి శరీరములను ధరించి యున్న సర్వజీవులను వాని సంస్కారము వలన యంత్రగాడు యంత్రములను త్రిప్పునటుల త్రిప్పుచున్నాడని 18 వ అ. 61 వ శ్లో.లో ఉన్నది కల్పితము.

నేను నశించని ఆత్మ అనగా స్వభావము గలవాడను, ఈశ్వరుడను, 'ఆత్మ మాయయా' అనగా నా సంస్కారముననుసరించి ప్రవర్తించు నా స్వభావముయొక్క ప్రవర్తనచేత నా ప్రకృతి అనగా నా స్వభావము (సంస్కారము) ననుసరించియే

పుట్టుచున్నానని 4 వ 6 వ శ్లో.లో ఉన్నది. కృష్ణుని స్వభావమను గుణమును ఆత్మ యని, ప్రకృతి యని, ఈశ్వరుడని, దీనినే కృష్ణుడని వ్రాసినారు. ఇట్లు సర్వ జీవులకును ఉన్న స్వభావమను గుణమును కృష్ణుడని వ్రాసి, అట్టి కృష్ణుడు ఈ సర్వమును, సర్వజీవులును తనయందున్నవని, తనకంటె శ్రేష్ఠతరమైనది మరి యొకటి లేదని చెప్పినటుల కల్పించి వ్రాసినారు. కాని, ఇది శ్రేష్ఠతరమైనదికాదు. విజ్ఞానముయొక్క నిష్కామాది పవిత్రప్రేమ భావముల ప్రవర్తనయే శ్రేష్ఠతర మైనది.

నేను జననాశనము చేయు కాలుడనని, జనులను చంపుటకొరకుప్రవర్తించిన వాడనని 11 వ అ. 32 వ శ్లో.లో ఉన్నది. ఈ కృష్ణుడు (స్వభావమను గుణము) జనుల సంస్కారము ననుసరించి అనగా వారి పూర్వ జన్మయందు వారి యందున్న రాగద్వేషాది మాయాగుణములు యితరులను చంపుటవలన వారిని యింకొకపుడు చంపువాడు. ఇంకననేక విధములుగ చేయుటవలనను వారిని (జనులను) చంపువాడు జననాశనము చేయు కాలుడనినిన కృష్ణుడు (జీవుల స్వభావము) పరమ తేజస్సు కాదు. భగవంతుడు కాదు.

శరీరము క్షేత్రమని, శరీరము నెరిగినవాడు క్షేత్రజ్ఞుడని, క్షేత్రక్షేత్రజ్ఞుల నెరి గినవారు చెప్పుదురని 13 వ అ. 2 వ శ్లో.లోను, సమస్త క్షేత్రముల యందున్న క్షేత్రజ్ఞుని నన్నుగా నెరుంగుమని, క్షేత్ర క్షేత్రజ్ఞుల నెరిగినదే జ్ఞానము(విజ్ఞానము) అని 3 వ శ్లో.లోను ఉన్నది. జీవులు వాని శరీరములనుగాని, దేనినైననుగాని గుణముల ద్వారానే చూడవలెను, ఎరుగవలెను. కాని, స్వయముగా దేనిని కూడ చూడలేవు. ఎరుగలేవు. క్షేత్రజ్ఞుడు అను కృష్ణుడు (జీవుల స్వభావమను గుణము) క్షేత్రముల నెరిగినవాడే కాని, జ్ఞాన విజ్ఞానముల నెరుగడు. పరమపదము నెరు గడు. తననుకూడా ఎరుగడు. ఇంకేదియును ఎరుగడు. క్షేత్రము (శరీరము)నేగాని తనను ఎరుగని క్షేత్రజ్ఞుడను కృష్ణుడు సమస్త క్షేత్రముల యందున్నది తానని ఎట్లు చెప్పును ? క్షేత్రక్షేత్రజ్ఞుల నెరుగునది విజ్ఞానము. ఇది జ్ఞానమున్న వారి యందుం డును. అందువలన జ్ఞాన, విజ్ఞానములు గలవారి యందున్న విజ్ఞానమే శరీరమును క్షేత్రమని, క్షేత్రము నెరిగినది క్షేత్రజ్ఞుడని ఎరిగి చెప్పినది.

జ్ఞాన విజ్ఞానములు గల కృష్ణుడు విజ్ఞానమువలన క్షేత్ర క్షేత్రజ్ఞుల నెరిగి క్షేత్రము నెరిగినవాడు క్షేత్రజ్ఞుడని చెప్పును గాని, క్షేత్రజ్ఞుడను తాను అని అజ్ఞు

మునితో ఎట్లు చెప్పును? ఇది యంతయును విజ్ఞానము లేని వారి కల్పితమే గాని, సర్వము నెరిగిన విజ్ఞానముగల కృష్ణుడు చెప్పినది కాదు.

ఈ ప్రపంచమునందున్న ప్రతివస్తువును క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగముచేతనే కలుగుచున్నదని 13 వ అ. 27 వ శ్లో.లో ఉన్నది. సమస్త క్షేత్రముల (శరీరముల) యందున్న క్షేత్రజ్ఞుడను కృష్ణుడు (జీవుల ప్రకృతి యనిన స్వభావము) జీవుల యందున్న కామాది గుణములు చేసిన కర్మ (సంస్కారము) ననుసరించి క్షేత్రముల (శరీరముల) ద్వారా సంయోగము చేయువాడు.

ఈ విధముగనున్న జీవుల స్వభావమను గుణమును పరమాత్మ (పరమపదముగా నున్న పరమ తేజస్సు) అని ఈశ్వరుడని 15 వ అ. 17 వ శ్లో.లోను వ్రాసి అట్టివాడు కృష్ణుడగుటవలన తాను వేదమునందును ఈ లోకమునందును పురుషోత్తముడ ననబడుచున్నానని కృష్ణుడు చెప్పినటుల 18 వ శ్లో.లో వ్రాసినారు. ఇది యంతయును జ్ఞాన, విజ్ఞానములులేని ప్రకృతి(మాయా) విద్యాపండితులచేత కల్పింపబడినదియేగాని యథార్థము గాదు.

జనుల సంస్కారము ననుసరించి జననాశనము జేయు (జనులను చంపుచుండు) నది, జనులను అనేక జన్మ కర్మ కష్ట సుఖదుఃఖముల ననుభవింపజేయుచు ఈ ప్రపంచమునందు త్రిప్పుచుండునది, ఈ విధముగా ఒకని యందున్న ప్రకృతి (మాయా) గుణములు యితరులకు చేయునవి యింకొకపుడు వానికి (ఆ జీవునికి) చేయునది, క్షేత్రము నెరుగుటయే కాని, యింక దేనినైనను కాని తనను కాని ఎరుగనిది, వాని (జీవుల) సంస్కారము ననుసరించి శరీరములతో సంయోగము చేయునది ఇవియేనా కృష్ణ పరమాత్మ శ్రేష్ఠతర లక్షణములు ? ఇవియేనా కృష్ణభగవానుని లక్షణములు? ఇది రాముని జన్మయందు వాలిని చంపిన కర్మవలన బోయవానిద్వారా కృష్ణుని చంపిన కృష్ణుని స్వభావము.

మణులు కూర్చబడిన దారమువలె ఈ కృష్ణునియందు కూర్చబడియున్నవనిన (కృష్ణుడున్న) జీవులను అసురసంపద అనగా కామ రాగద్వేషాది గుణములు కర్మబంధితులనుగా చేయునవియని, దైవసంపదయనగా జ్ఞాన విజ్ఞానములు మోక్ష(పరమ) పదమును చేర్చునవియని 16 వ అ. 5 వ శ్లో.లో నున్నది. జీవులను పరమ పదమును చేర్చునవి జ్ఞాన విజ్ఞానములు. జనులను చంపుకాలుడననిన కృష్ణుడు అసుర

గుణములలోని జీవుల స్వభావమను గుణము. ఇది పరమ పదమును చేర్చునది కాదు.

ఒక జీవుని యందున్న అసురసంపదయను రాగద్వేషాది ప్రకృతి(మాయా) గుణములు ఇతర జీవులకు కలిగించు సుఖదుఃఖములను ఆ జీవునికి వాని స్వభావము కలిగించుచు వానిని ప్రకృతి (మాయ) యందు బంధించుచుండును. ఈ విధముగ జీవులను త్రిప్పుచు తన వ్యాపారమును స్వేచ్ఛగా సాగించుకొనుచుండుట కొరకు ప్రకృతి (మాయ) స్వభావముతోనున్న జీవులను, కామ రాగద్వేషాది మాయాగుణములను ఈ ప్రపంచమును తనయందుండి తన భ్రమద్వారా సృష్టించుకొనినది. జీవుల స్వభావమును ప్రకృతి, కృష్ణుడు, ఈశ్వరుడు, కాలుడు, క్షేత్రజ్ఞుడు, ఆత్మ, పరమాత్మ, పరమ పురుషుడు అని ఈ గీతయందు కల్పించి వ్రాసినారు. అట్టి జీవులను దైవసంపద అనగా జ్ఞాన విజ్ఞానములు పరమపదమును చేర్చును. ఈ జ్ఞాన, విజ్ఞానములు అనాదియై యున్నవి. కాని మాయయందుండి వచ్చిన ఈ ప్రపంచములో ఎవనియందును లేవు. దేనియందును లేవు.

పరమాత్మను (పరమపదముగానున్న పరమతేజస్సును) తాను (జీవుడు) ఆత్మ (జ్ఞానము) ద్వారా చూచి ఆనందమందుచుండి వానియందున్న కామాదిగుణములను విడుచువానిని స్థిత ప్రజ్ఞుడందురని 2 వ అ. 55 వ శ్లో.లో ఉన్నది.

ఆహారమును మానివేసినను వానియందున్న వాంఛ వానిని విడువదు. కాని పరమ తేజస్సుగా నున్న పరమపదము కాన్పించగనే వాంఛయే వానిని విడుచునని 59 వ శ్లో.లో ఉన్నది. పరమపదము జ్ఞానముద్వారా కాన్పించునుగాని, దారమువలె నున్నాననిన కృష్ణుడను జీవుల స్వభావముద్వారా కాన్పించదు.

కోరికయను అశ్వత్థ వృక్షమును వేరులతోసహ అసంగ శస్త్రముతో అనగా నిష్కామభావముగల విజ్ఞానముతో నరికి వేయవలెనని 15 వ అ. 3 వ శ్లో. లో ఉన్నది. ఇది ఎట్లన జ్ఞాన విజ్ఞానములు గలవారియందున్న జ్ఞానముద్వారా వారికి పరమపదము కాన్పించగనే, విజ్ఞానము పరమపదమును, సర్వమును ఎరిగి, వారికి కర్మబంధములు కలిగించునట్టి రాగద్వేషాది ప్రకృతి (మాయా) గుణములతోనున్న కోరికను వారినుండి వెడలగొట్టును. సమస్త క్షేత్రములయందున్న క్షేత్రజ్ఞుడనునేనని కృష్ణుడు (జీవుల స్వభావము) సర్వము నెరుగడు. జీవులయందున్న గుణము

లను వెడలగొట్టలేడు. వారి సంస్కారము ననుసరించి వారి యందున్న ప్రకృతి, కాలుడు, క్షేత్రజ్ఞుడు, కృష్ణుడు అని చెప్పబడిన స్వభావము ప్రవర్తించు కర్మల యందు విజ్ఞానము నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్త్వము, పవిత్రప్రేమభావము లతో ప్రవర్తించుచుండును. వారు సంస్కార కర్మ బంధ రహితులైనపుడు విజ్ఞానము వారిని విడిచి, వారి భక్తులయందు ప్రవేశించును. వారు జ్ఞానము (భావము) ద్వారా పరమపదమును చూచుచు, ఆ పదమును చేరి అచ్చట పరమతేజో ఆనంద మనుభవించు చుందురు.

పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను. జ్ఞానముద్వారా చేరవలెనని 13వ అ. 18 వ శ్లో.లో ఉన్నది.

జీవులయందున్న గుణములే కర్మలయందు ప్రవర్తించుచుండును. కాని, జీవులు ప్రవర్తించునవి కాదు. అయినను గుణములు జీవులయందుండును గనుక గుణములు చేయు కర్మలను, కర్మఫలములను అనుభవించునది మాత్రము జీవులే. మాయ ఈ విధముగా నుండు ఈ ప్రపంచమును సృష్టించినది.

మానవులకు కర్మ బంధములు కలిగించుటకు కారణమగుచున్న రాగద్వేషాది ప్రకృతి (మాయా) గుణములను వెడలగొట్టునట్టిది, వారి సంస్కారము ననుసరించి వారి స్వభావము ప్రవర్తించు కర్మలయందు వారు కర్మబంధ రహితులై పరమపదమును చేరుట కర్హులగునటుల నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించు నట్టిదియగు విజ్ఞానము శ్రేష్ఠతరమైనది. మానవులకు (జీవులకు) రాగద్వేషాది గుణముల నంటించు (సంభవింపజేయు)నదియే కాని ఈ గుణములను వెడల గొట్టుటకు చేతకానిది, వారియందున్న ఈ గుణముల కర్మల ననుసరించి కర్మబంధితులనుగా చేసి చంపుచు పుట్టించుచు, సుఖ దుఃఖముల ననుభవింపజేయుచు ఈ ప్రపంచము నందు త్రిప్పుచుండునది యగు కృష్ణుడని చెప్పబడిన జీవుల స్వభావమను గుణమును శ్రేష్ఠతరమైనదని వ్రాసినది యథార్థము కాదు.

మానవుల (జీవుల) యందున్న రాగద్వేషాది ప్రకృతి (మాయా) గుణముల కర్మల ననుసరించి ఆ కర్మలయందు ప్రవర్తించుచు వారిని ఆ కర్మల ననుభవింప జేయుచు ఈ ప్రపంచమునందు బంధించి త్రిప్పుచుండునది జీవుల స్వభావమను గుణము.

అట్టి కర్మబంధములకు కారణమగుచున్న ఈ గుణములను వెడలగొట్టి కర్మ బంధ రహితులగునటుల నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్వము, పవిత్ర ప్రేమాది పవిత్ర భావములతో ప్రవర్తించునది విజ్ఞానము.

మానవులను (జీవులను) చంపునట్టి కాలుడనునది వారి (జీవుల) స్వభావము. వారిని (జీవులను) ఈ కాలుడను మృత్యువునుండి తప్పించి పరమపదమును చేరుటకు కర్తలగునటుల ప్రవర్తించునది విజ్ఞానము.

వారి సంస్కారము ననుసరించి క్షేత్రము (శరీరము) లతో సంయోగము చేయునది వారి (జీవుల) స్వభావము. ఈ స్వభావము శరీరములతో చేయు సంయోగమునకు కారణమగు బ్రహ్మయనునట్టి భ్రమను చంపి (వారినుండి వెడలగొట్టి) వారిని బ్రహ్మచారులుగా (భ్రమరహితులుగా) చేయునది విజ్ఞానము.

యంత్రములనునట్టి శరీరములను ధరించియున్న సమస్త జీవులను 18 వ అ. 61 వ శ్లో.లో చెప్పబడినటుల యంత్రములను త్రిప్పునటుల వాని సంస్కారము ననుసరించి తన మాయచేత జన్మ కర్మ సుఖదుఃఖముల ననుభవింపజేయుచు త్రిప్పుచుండునది ఈశ్వరుడు (జీవుల స్వభావము). ఇటుల వానిని త్రిప్పుచుండుటకు కారణమగు గుణములను వారినుండి వెడలగొట్టి వానిని ఈశ్వరునకు (వానిస్వభావమునకు) వశము కానియ్యనిది విజ్ఞానము.

క్షేత్రముల (శరీరముల) నెరిగినదియే కాని, పరమపదము నెరుగదు. జ్ఞాన విజ్ఞానముల నెరుగదు. తనను ఎరుగదు, దేనినికూడ నెరుగనిది క్షేత్రజ్ఞుడను నన్ను నెరుంగుమని (నేనని) చెప్పినది కృష్ణుడు (జీవుల స్వభావము).

పరమపదమును, అచటికి చేరుమార్గమును, క్షేత్రమును, (శరీరమును) జీవులను, క్షేత్రజ్ఞుడను జీవుల స్వభావమును, ఈ ప్రపంచమును, సర్వమునెరుగునది విజ్ఞానము.

మానవుల యందున్న అజ్ఞానము (మాయ) చేయునది మరల వారికి చేయుచు వారిని కర్మబంధితులగునటుల జేయునది జీవుల స్వభావము. అజ్ఞానమును పోగొట్టి మానవులను కర్మబంధ విముక్తులగునటుల ప్రవర్తించునది విజ్ఞానము. ఈ రెంటిలో ఏది శ్రేష్ఠతరమైనదో యోచించి చూడుడు.

ఈ లోకమునందు క్షరుడు, అక్షరుడు, అను నిరువురు పురుషులున్నారని, క్షరుడు నశించు శరీరమని అక్షరుడు నశించని జీవుడని 15 వ అ. 16 వ శ్లో.లోను ఈ యిరువురు గాక యింకొకడున్నాడు. వాడే ఉత్తమ పురుషుడు. వాడే పరమాత్మ (పరమ తేజస్సు) వాడే ముల్లోకములయందున్న నశించనట్టి ఈశ్వరుడని 17 వ శ్లో. లోను అట్టి ఉత్తమ పురుషుడు పరమాత్మ ఈశ్వరుడని చెప్పబడినది జీవుల స్వభావము. దీనిని తానని అందువలన తాను వేదమునందును, ఈ లోకమునందును పురుషోత్తముడననబడుచున్నానని కృష్ణుడు చెప్పినటుల 18 వ శ్లో.లోను కల్పించి వ్రాసినారు. ఇట్లు వ్రాయుటవలన కృష్ణుడు పరమాత్మ (పరమ తేజస్సు)యని చెప్పుచున్నారు. మణులు దారమునందువలె ఈ సర్వమును తనయందు కూర్చబడియున్నదని కృష్ణుడు చెప్పినటుల 7 వ అ. 7 వ శ్లో.లో వ్రాసినారు. ఇట్లు వ్రాయుటవలన కృష్ణ పరమాత్మయందు అందరును ఉన్నారని, ఈ కృష్ణ పరమాత్మ అందరియందును ఉన్నాడని చెప్పుచున్నారు. ఇది యథార్థము కాదు. ఈ లోకమునందు జన్మమునకు రాని పరమపదముగా ఉన్న పరమ తేజస్సు లేదు. ఆ తేజస్సు 8 వ అ. 18, 19 శ్లో.లలో చెప్పబడినటుల బ్రహ్మ (మాయా భ్రమ) వలన మాయయందుండి వచ్చునది కాదు. మాయయందుండి వచ్చిన సర్వజీవులకును యున్న స్వభావము పరమతేజస్సు కాదు, ఈశ్వరుడు కాదు, కృష్ణుడు కాదు.

నేను జననాశనము చేయు కాలుడను, జనులను చంపుటకొరకు ప్రవర్తించినవాడనని 11 వ అ. 32 వ శ్లో.లోను వీరలు ఇదివరకే నా చేత చంపబడిరి. నీవు నిమిత్త మాత్రమగుమని 33 వ శ్లో.లోను కృష్ణుడు చెప్పినటుల ఉన్నది.

వీరలు ఇదివరకే నాచేత చంపబడిరి అనగా వీరి పూర్వ జన్మయందు వీరియందున్న రాగద్వేషాది గుణములు ఇతరులను చంపినవి. అప్పుడే వీరు వీరి స్వభావముచేత చంపబడువారై వీరిని వీరే చంపుకొనిన వారైనారు. ఇప్పుడు వీరు వీరి స్వభావముచేతనే అర్జునునిద్వారా చావనున్నారు.

కృష్ణుడును, తన పూర్వ జన్మయగు రాముని జన్మయందున్న రాగద్వేషాది గుణములు వాలిని చంపిన కర్మవలన అప్పుడే రాముడు తన స్వభావముచేత చంపబడువాడై తనను తానే చంపుకొనిన వాడైనాడు. అందువలన కృష్ణుని జన్మయందు తన స్వభావముచేతనే బోయవానిద్వారా చంపబడినాడు. కృష్ణుడు జనులను చంపు

కాలుడ ననినపుడు కృష్ణుడు చంపబడినవాడా ? చంపినదియా ? అనిన, చంపబడిన వాడేగాని, తనను చంపిన తన స్వభావము తాను (కృష్ణుడు) కాదు.

కృష్ణ పరమాత్మ, కృష్ణ భగవాన్ అనుచున్నారు. పరమాత్మ, భగవంతుడు అను కృష్ణుడు చంపబడినవాడా ? చంపినదియా ? అనిన చంపబడిన కృష్ణుడును, కృష్ణుని చంపినదియును పరమాత్మ (పరమ తేజస్సు) కాదు. భగవంతుడు కాదు.

జ్ఞాన విజ్ఞానములుగల జ్ఞానియను కృష్ణుడను వాడొకడున్నాడు. వానియందు కామ రాగద్వేషాది గుణములు లేవు. అట్టి కృష్ణునియందున్న విజ్ఞానముయొక్క నిష్కామాది పవిత్ర ప్రేమ భావముల ప్రవర్తన వలన, వానిని ఉత్తమ పురుషుడని అప్పటి జనులలో కొందరని యుండవచ్చును. కాని వేదము లెరుగవు. లోకము ఎరుగదు.

విశ్వరూపము అనగా మానవులయందున్న కామ, రాగద్వేషాది మాయా గుణముల ప్రవర్తనను (కర్మను) మరల ఇంకొకపుడు వారి (ఆ జీవుల) స్వభావ మను గుణము ప్రవర్తించుచున్న (చేయుచున్న) ప్రపంచరూపము. ఇట్టి రూపము గల నేను ఈ లోకమునందు నీకంటె నితరునెవ్వని చేతను, వేద పఠనముచేతను, యజ్ఞముచేతను, వేదాధ్యయనములచేతను, దానములచేతను, తపస్సులచేతను చూచు టకు సాధ్యపడువాడను కానని 11 వ అ. 48 వ శ్లో.లోను,

నన్ను ఏ రూపముతో చూచితివో, యిట్టిరూపముగల నేను వేదాధ్యయనము చేతను, తపస్సుచేతను, దానముచేతను, యజ్ఞములచేతను చూచుటకు శక్యుడను కానని 53 వ శ్లో. లోను చెప్పిన కృష్ణుడు మాయయందుండి వచ్చిన ఈ ప్రపంచ ములో శరీరము, జీవుడును గాక అందరియందును అనగా సర్వజీవులకును యున్న సహజస్వభావము(గుణము)ను ఇంకొకడున్నాడని వాడేఉత్తమపురుషుడు, పరమాత్మ (పరమ తేజస్సు) ఈశ్వరుడు అని దీనిని "తానని" అందువలన తాను వేదము నందును, ఈ లోకమునందును పురుషోత్తముడననబడుచున్నానని చెప్పినటుల 15 వ అ. 17, 18 శ్లో. లలో ఉన్నది కల్పితమే గాని ఏ విధముగను యథార్థము కాదు.

8 వ అ. 18, 19 శ్లో. లలో చెప్పబడినటుల పగలు రాత్రులు గలది, మాయయందుండి సృష్టించినది, సృష్టించిన ఈ ప్రపంచమునందుండి, ఈ ప్రపం

చముతోసహా నశించునట్టిదియగు బ్రహ్మ (మాయాభ్రమ)యే కాని, నశించనిది, జన్మమునకు రానిది యని 8 వ అ. 21 వ శ్లో.లో చెప్పబడిన పరమపదముగా ఉన్న పరమ తేజస్సు కాదు.

ఈ కాన్పించు సర్వమును నిరాకార నిర్గుణమై పరమతేజస్సుగా ఉన్న పరమ పదము నందున్నదని పరమ తేజస్సుచేత సృష్టింపబడినదని (పరమ తేజస్సు సృష్టి యని) భగవంతుని సృష్టియని వ్రాసినవారును ఈ విధముగ దీనిని వ్యాఖ్యానమొన రించి చెప్పువారును యథార్థము నెరిగినవారు కాదు.

జీవులకు మాయాగుణములను సంభవింపజేయునట్టిది, మానవుల యందున్న ఈ గుణముల కర్మల ననుసరించి ఆ కర్మలను మరల ఇంకొకపుడు చేయుచు వారిని అనేక ఉత్కృష్ట నికృష్ట జన్మలను సుఖదుఃఖములను అనుభవింపజేయునది, ఈ విధముగ ఘోరకర్మలను చేయునది జీవులను యంత్రగాడు యంత్రములను త్రిప్పు నటుల తన మాయచేత త్రిప్పుచున్నాడని 18 వ అ. 61 వ శ్లో. లో చెప్పబడిన ఈశ్వరుడనునది ఈ సర్వమును తన వలననే ప్రవర్తింపబడుచున్నదని 10 వ అ. 8 వ శ్లో.లో చెప్పిన కృష్ణుడనునది 8 వ అ. 18, 19 శ్లో.లలో చెప్పబడినటుల బ్రహ్మ (మాయా భ్రమ) చేత మాయయందుండి వచ్చి, మాయయందే కలియుచు, మరల వచ్చుచు తిరుగుచుండునట్టిదియగు జీవుల స్వభావము (గుణము). దీనిని ఈ ప్రపంచములో పరమాత్మ (పరమ తేజస్సు) అని వ్రాసినవారును, ఈ విధముగ దీనిని వ్యాఖ్యాన మొనరించి చెప్పువారును యథార్థము నెరిగినవారు కాదు.

అర్జునా! నేనును, నీవును అనేక జన్మముల నెత్తినామని 4 వ అ. 5వ శ్లో. లోను, నేను నా స్వభావము (సంస్కారము) ననుసరించియే జన్మించుచున్నానని 6 వ శ్లో. లోను చెప్పబడిన కృష్ణుడును, అర్జునుడును వారి సంస్కారము ననుస రించి వారి స్వభావముచేతనే జన్మించియున్నారు. కృష్ణునిస్వభావమును తనప్రకృతి యని, తన ఆత్మయని, సంస్కారకర్మను "ఆత్మ మాయ" యని కృష్ణుడు చెప్పి నటుల ఈ 6 వ శ్లో. లో వ్రాసినారు.

అటులనె జీవులను వాని స్వభావము ఆ జీవుల సంస్కారము ననుసరించి త్రిప్పుచుండు ప్రవర్తనను ఈశ్వరుడు తన మాయచేత త్రిప్పుచున్నాడని 18 వ అ.

61 వ శ్లో. లోను, ఈ సర్వమును తన వలననే ప్రవర్తింపబడుచున్నదని 10వ అ. 8 వ శ్లో. లోను వ్రాసినారు. కృష్ణుడు అందరివలెనే తన సంస్కారము వలన తన స్వభావము చేతనే జన్మించి యున్నాడు. జన్మములకు కృష్ణుని పూర్వజన్మయందున్న కామ రాగద్వేషాది గుణములును, వాని స్వభావమను గుణమును కారణము. కృష్ణుడు శ్రేష్ఠమైన నాయొక్క ప్రకృతి యనినది, దారమునందు మణులు కూర్చబడినట్లు ఈ సర్వము నాయందు కూర్చబడి యున్నదనినది 8 వ అ. 18, 19 శ్లో. లలో చెప్పబడినటుల మాయయందుండి వచ్చి నశించి మాయయందే కలియుచుమరల వచ్చుచు తిరుగుచుండు జీవుల స్వభావమను గుణమును. ఇది కర్మబంధమును కలుగజేయునవియని 16 వ అ. 5 వ శ్లో. చెప్పబడిన అసురగుణములలోని జీవుల స్వభావమను గుణము. 16 వ అ. 6 వ శ్లో.లో చెప్పబడినటుల ఈ ప్రపంచము నందు కర్మబంధమును కలుగజేయు అసుర సంపద యనిన కామ రాగ ద్వేషాది గుణములును, మోక్షపదమును జేర్చు దైవసంపద యనిన జ్ఞాన విజ్ఞానభావములు (గుణములు)ను ఉన్నవి. అంతియెకాని పరమ తేజస్సు లేదు. అందరియందును ఉన్నాడనిన ఈశ్వరుడు లేడు. కృష్ణుడు లేడు. ఇంకెవడును ఏ భగవంతుడును లేడు. ఏ శక్తియును లేదు.

శ్లో॥ రసోఽహమప్సు కౌంతేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥ 8

తా. అర్జునా! నేను జలమునందు రుచియును, సూర్య చంద్రులయొక్క ప్రకాశమును, సమస్తవేదములయందలి ఓంకారమును, ఆకాశమునందు శబ్దమును, నరులయందలి పౌరుషమునై యున్నాను.

శ్లో॥ పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥ 9

తా. భూమియందలి సువాసనయును, అగ్ని యందలి తేజమును, సర్వ భూతముల ఆయువును, తాపసులయందలి తపమును అయియున్నాను.

శ్లో॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనం।
బుద్ధి ర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్॥　　10

తా. అర్జునా! నేను బుద్ధి గలవారియొక్క బుద్ధియును, తేజస్సుగల వారియొక్క తేజమును అయియున్నాను. నేను సమస్త భూతములకును సనాతనమైన బీజమునై యున్నవానినిగా తెలిసికొనుము.

వ్యా. ఇందు కృష్ణుడు "నేనని" చెప్పినటుల ఉన్నది జీవుల స్వభావమను గుణము. ఇది బీజము కాదు. పై శ్లోకములందు చెప్పబడినదేదియును కృష్ణుడు కాదు.

శ్లో॥ బలం బలవతాం చాహం కామరాగవివర్జితం।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ॥　　11

తా. అర్జునా! బలవంతులయొక్క కామము, రాగములేని బలమును నేనై యున్నాను. ప్రాణులయందు ధర్మమునకు విరుద్ధముగాని కోరికయునై యున్నాను.

వ్యా. ఈ శ్లోకమునందున్నది యథార్థము కాదు.

శ్లో॥ యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చ యే।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి॥　12

తా. ఏవి సాత్త్విక, రాజస, తామస భావములు కలిగియున్నవో, అవియన్నియును నా వలన కలిగినవియే యని నెరుంగుము. నేను వాని యందు లేను. అవి నాయందును లేవు.

వ్యా. స్వభావమను గుణముగల జీవులును, సాత్త్విక, రాజస, తామస భావములన్నియును 8 వ అ. 18, 19 శ్లో. లలో చెప్పబడిన ప్రకృతి యనినమాయ యందున్నవి. మాయచేతనే దాని బ్రహ్మయనిన భ్రమద్వారా సృష్టింపబడినవి. ఈ గుణములు జీవుల స్వభావమను గుణమునందు లేవు. ఈ స్వభావమను గుణము సాత్త్విక, రాజస, తామస గుణముల యందు లేదు. జీవులకు వాని స్వభావమువలన ఈ ప్రపంచముయొక్క సాంగత్యమున ఈ గుణములు అంటుకొను (సంభవించు)

చున్నవి. ఈ విధముగనున్న దానిని ఏవి సాత్త్విక, రాజస, తామస భావములు కలిగియున్నవో, అవి తనవలన కలిగినవియేయని, అవి తనయందు లేవు, తాను వానియందును లేనని కృష్ణుడు చెప్పినటుల కల్పించి వ్రాసినారు.

శ్లో॥ త్రిభిర్గుణమయైర్భావై రేభిస్సర్వమిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ 13

తా. పైన చెప్పబడిన మూడు గుణముల భావముచేత ఈ ప్రపంచము మోహింపబడినదగుచు, నన్ను ఈ మూడు గుణములకంటె వేరుగను, నాశ రహితునిగను తెలియజాలదు.

వ్యా. ఈ మూడు గుణములు గలవారు ఈ గుణములు లేని జ్ఞాన విజ్ఞానము గల కృష్ణుని ఎరుగజాలరు. ఇందు కృష్ణు డనునది జీవుల స్వభావమను గుణము. ఈ స్వభావమను గుణమునందు గుణములు లేవు. ఇది జీవుల సహజ స్వభావమను గుణము. ఇది నశించునది కాదు. అందువలన దీనిని తానని ఈ మూడు గుణములతో నున్న ప్రపంచము తనను ఎరుగజాలదని కృష్ణుడు చెప్పినటుల కల్పించి వ్రాసినారు. ఇది కృష్ణుడు కాదు. గుణములు జీవుని యందుండునుగాని, ఒక గుణమునందు ఇంకొక గుణముండదు.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే॥ 14

తా. త్రిగుణములతోనున్న నాయొక్క ప్రకృతి దైవసంబంధమైనది, దాటుటకు శక్యము కానిది. ఎవరు "నన్ను" ప్రపత్తిచేయుదురో వారు ఈ మాయనుండి తరించగలరు.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. త్రిగుణములును, ఈ ప్రపంచమును స్వభావముగల కృష్ణుడను జీవుడును, సర్వజీవులును 8 వ అ. 18, 19 శ్లో. లలో చెప్పబడిన ప్రకృతి యను మాయ యందున్నవి. ఇది కృష్ణుని ప్రకృతి కాదు. ఎవరి ప్రకృతియును కాదు. ఇది 16 వ అ. 5 వ శ్లో.లో కర్మబంధమును కలుగజేయునవి యని చెప్పబడిన అసురసంపద యనినట్టి త్రిగుణములు గలది. దీనియందు

పరమపదమును చేర్చునవి దైవసంపదయని చెప్పబడిన జ్ఞానవిజ్ఞానములు లేవు. దైవమనునది కల్పితమేగాని దైవము లేదు.

ఈ జ్ఞాన, విజ్ఞానములు అనగా విజ్ఞానముతో నున్న జ్ఞానము (భావము) నశించనిది, అనాదియై ఈ ప్రపంచముగల ప్రకృతి (మాయ) కంటె వేరుగా నున్నదని 8 వ అ. 20 వ శ్లో.లో ఉన్నది. త్రిగుణములతోనున్న ప్రకృతిని (మాయను) స్వయముగా దాటుటకు ఎవ్వరికిని శక్యముకాదు. కాని, ఎవరైనను దైవసంపదఅనినట్టి జ్ఞాన, విజ్ఞానములను ఇవి యున్నవారి సాంగత్యమున, వారి ద్వారానే వారి నుండియే ఆర్జించి వీనిద్వారా దాటగలరు. అంతియేగాని, ఎవరిని ప్రపత్తి చేసినను, దేనిని ప్రపత్తి చేసినను త్రిగుణములతోనున్న ప్రకృతిని (మాయను) దాటలేరు. కృష్ణుడు జ్ఞాన విజ్ఞానములు గలవాడు. రాగద్వేషాది మాయా గుణములను జయించినవాడు. అందువలన, వానిని ఉత్తమ పురుషుడనినారు. ఎవరైనను అట్టికృష్ణుని సాంగత్యమునవానిసేవచేయుచు కృష్ణునియందున్న జ్ఞాన,విజ్ఞానములను వానిద్వారానే ఆర్జించి వీనిద్వారా త్రిగుణములతోనున్న మాయను దాట (జయించ) గలరు. అందువలన నా ద్వారానే త్రిగుణములతోనున్న మాయను దాటగలరని కృష్ణుడు చెప్పును. జ్ఞాన, విజ్ఞానములు గలవారందరును ఎవరికి వారు వారిద్వారానే దాటగలరని చెప్పుదురు. అనగా, వారియందున్న విజ్ఞానమే సర్వము నెరిగి యిట్లు చెప్పును. ఈ విధముగ కృష్ణునియందున్న విజ్ఞానము చెప్పినదానిని ఈ మాయాగుణములను జీవులకు సంభవింపజేయు జీవుల స్వభావమను గుణమును కృష్ణుడని వ్రాసి, అట్టి కృష్ణుని ప్రపత్తి చేయువారు ఈ మాయను దాటుచున్నారని కల్పించి వ్రాసినారుకాని యథార్థము కాదు.

శ్లో॥ న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ॥ 15

తా. అసుర భావము నాశ్రయించినవారును, దుష్కర్మలు చేయువారు నగు మనుష్యాధములైన మూఢులు మాయచేత నపహరింపబడిన జ్ఞానము గల వారగుచు నన్ను ప్రపత్తి చేయరు.

వ్యా. జ్ఞానము మాయచేత నపహరింపబడునదియని వ్రాసినదియథార్థముకాదు. జ్ఞానమును పొందినచో మాయ వెళ్ళిపోవును. జ్ఞానము లేనివారు జ్ఞానము గలవారి సాంగత్యమున వారియందున్న జ్ఞానమును పొందవలెను. అసురగుణములు గలవారి నాశ్రయించినవారు జ్ఞానముగల కృష్ణునిగాని, అట్టివారినిగాని సేవింప వెళ్ళరు. ఇందు నన్ను ప్రపత్తి చేయరనినది జీవుల స్వభావమను గుణమును. ఈ గుణమును ప్రపత్తి చేయుట యనునది యథార్థము కాదు.

శ్లో॥ చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ 16

తా. అర్జునా ! దుఃఖముతో కూడినవాడును, జిజ్ఞాస గలవాడును, ధనమును కోరువాడును, జ్ఞానియునగు నాలుగు విధముల సుకృతములుగల జనులు నన్ను సేవించుచున్నారు.

వ్యా. ఎన్ని విధములుగనో కృష్ణునితో పూర్వజన్మ సంబంధమను సుకృతము గల జనులు కృష్ణుని సేవించి యుందురు. జ్ఞానియనగా పరమపదము నెరిగిన జ్ఞాన, విజ్ఞానములు గలవాడు. అట్టి జ్ఞానియును, కృష్ణుడును సమానులు. అట్టివాడు కృష్ణుని సేవింప వెళ్ళడు. ఇటుల కృష్ణుడున్నప్పుడు జరిగినదియేకాని కృష్ణుడు శరీరమును విడిచిన తరువాత కృష్ణుని సేవించుట కాదు. ఈ గీతయందు మాయ యందుండి వచ్చిన జీవుల స్వభావమును కృష్ణుడని వ్రాసినారు. జీవుల స్వభావమును కృష్ణుని సేవించుట కాదు.

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమప్రియః ॥ 17

తా. వారిలో జ్ఞానికి నేను మిక్కిలి ప్రియుడను. ఆ జ్ఞానియును నాకు ప్రియుడు. ఎందుచేతననగా జ్ఞాని నిత్యసంబంధము గలవాడును, ఒక్క నా యందు మాత్రమే భక్తి గలవాడును గనుక శ్రేష్ఠుడగుచున్నాడు.

వ్యా. జ్ఞాని కృష్ణునితో సమానుడు. సర్వమును ఎరిగినవాడు. జ్ఞానికృష్ణుని యందు భక్తి గలవాడని యిందు వ్రాసినది యథార్థము కాదు.

శ్లో॥ ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతం।
ఆస్థితస్స హి యుక్తాత్మా మామేవానుత్తమాం
గతిమ్ ॥ 18

తా. పైన చెప్పబడిన వారందరును ఉత్కృష్టులేకాని, జ్ఞానిని నేనని నా యభిప్రాయము. ఎందుచేతననగా జ్ఞాని నాయందే చేర్చిన ఆత్మ గలవాడై నన్నే సర్వోత్తమమైన గతిగా నెంచుచున్నాడు.

వా. కృష్ణుడును జ్ఞానియును సమానులు. అనగా జ్ఞాన విజ్ఞానములు గల వారు. కృష్ణునియందున్న విజ్ఞానమే జ్ఞానియందున్న విజ్ఞానమును "నేనే" ననినది. జ్ఞాని ఆత్మను కృష్ణునియందు చేర్చినవాడని ఈ శ్లోకమునందు వ్రాసినది యథార్థము కాదు. ఆత్మ లేదు. జ్ఞానియందున్న భావము (జ్ఞానము)వానిని పరమపదమునుచూచు నది, చేర్చునదియేగాని, కృష్ణునియందు చేర్చునది కాదు. కృష్ణుని సంబంధులైన వారు కృష్ణునియందున్న భావమును (జ్ఞానమును) పొందువారై యుందురు. అందు చేత వారు ఉత్కృష్టులని చెప్పవలెను.

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః 19

తా॥ జ్ఞానమును పొంద యత్నించువాడు అనేక జన్మములెత్తి తుదకుజ్ఞానియై వాసుదేవుడే సర్వమనుచు వచ్చి నన్ను శరణు పొందు మహాత్ముడు మిక్కిలి దుర్లభుడు.

వ్యా. ఎన్ని జన్మము లెత్తినను యత్నమువలన జ్ఞానమును పొందలేరు.జ్ఞాని కాడు. జ్ఞాన, విజ్ఞానములుగల కృష్ణుని సాంగత్యమునగాని, అట్టివారి సాంగత్యమున గాని, వారి యందుండి, వారి ద్వారానే జ్ఞానమును పొందవలెను. అట్టివారు చాల అరుదుగా నుందురు. ఇందు జ్ఞానియై వాసుదేవుడే సర్వమనుచు వచ్చి కృష్ణునిశరణు బొందువాడని వ్రాసినది యథార్థము కాదు. జ్ఞాన, విజ్ఞానములు గల జ్ఞానియును, కృష్ణుడును సమానులు. అట్టివాడు కృష్ణుని శరణు బొంద వెళ్ళరు.

శ్లో॥ కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్య దేవతాః।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా
నియతాస్స్వయా॥ **20**

తా. వారి సంస్కార కర్మలవలన వారియందున్న ప్రకృతి యనిన స్వభావముచేత అపహరింపబడిన జ్ఞానము గలవారు ఆ స్వభావ కర్మలయందు కోరికచేత నియమింపబడి అన్యదేవతల నారాధించుటకు తగిన నియమముల నేర్పరచుకొని ఆ దేవతలను సేవించు చున్నారు.

వ్యా. అజ్ఞానులు వారి సంస్కారమువలన వారి స్వభావముచేత ప్రవర్తింపబడు కర్మలయందు కోరికతో ప్రవర్తింపబడుచుందురు. వారు ఈ విధముగ కర్మలయందు ప్రవర్తింపబడుచుందురు. జ్ఞానము గలవారియందు కోరిక యుండదు. వారు జ్ఞానము సార్జింపక పూర్వము వారియందున్న కోరికతో చేసిన కర్మవలన ఏర్పడిన సంస్కారము ననుసరించి దేవతారాధనయను కర్మలయందును, యితర కర్మలయందును వారి స్వభావముచేత ప్రవర్తింపబడుచుందురు. వీరి కర్మలయందు కోరిక ఉండదు. వీరు కర్మరహితులగుదురు. కాని, కర్మలచేత బంధింపబడరు. సంస్కార కర్మల నెవ్వరును తప్పించుకొనలేరు. గుణములు వేరుగానుండును. రాగద్వేషాది గుణములు కర్మబంధములకును జ్ఞానవిజ్ఞానములు కర్మరహితులగుటకును కారణము. స్వభావముచేత అపహరింపబడిన జ్ఞానము గలవారని, కోరికచేత నియమింపబడినవారని (కోరిక గలవారని) యిందు వ్రాసినది యథార్థము కాదు. దేవతారాధన, దేవతలను సేవించుట యనునది 12 వ అ. 5 శ్లో.లో చెప్పబడినటుల అధికదుఃఖములకు కారణమగు అవ్యక్తాసక్తితో చేయు అవ్యక్త ప్రవర్తనలేగాని యథార్థము కాదు.

శ్లో. యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు
మిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥

తా. ఏ యే భక్తుడు, ఏ యే దేవతా స్వరూపమును శ్రద్ధతో ఆరాధించుటకు కోరిక గలవాడై యున్నాడో, ఆ యా భక్తునికి దానియందు శ్రద్ధ స్థిరముగా నుండునటుల నేనే చేయుచున్నాను.

వ్యా. ఎవడు ఏ దేవతారాధనయని కోరికతో చేయుచున్నాడో, వాడు దానిని చేయు కర్మవలన వాని స్వభావమునకు వశుడై వాడు దానిని ఆరాధించుట యందు ప్రయత్నము చేయకయే లాగబడి శ్రద్ధగల వాడగుచున్నాడు గాని కృష్ణుని వలన కాదు. జీవుల స్వభావమను గుణము చేయునది "నేనే" చేయుచున్నానని కృష్ణుడు చెప్పినటుల కల్పించి వ్రాసినారు.

శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే ।
లభతే చ తతః కామాన్మయైవ విహితాన్హితాన్॥ 22

తా. ఆ భక్తుడు శ్రద్ధ గలవాడై ఆ దేవతారాధనమును కోరికతో చేయుచు, దానివలన నా చేతనే కలుగ జేయబడునవియు, ఇష్టములైనవియునగు కోరికలను పొందుచున్నాడు.

వ్యా. ఎవరైనను కోరికలతో చేయు కర్మలు మరల వారి స్వభావముచేత చేయబడుచు ఆ కర్మఫలముల ననుభవించుచున్నారు. ఆ కర్మలయందు కోరిక గల వారగుచున్నారు. వారి స్వభావమను గుణమును కృష్ణుడని, కృష్ణుడు తన చేతనే కలుగజేయబడునవియని చెప్పినటుల కల్పించి వ్రాసినారు.

శ్లో॥ అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్ప మేధసాం ।
దేవాన్దేవయజో యాన్తి మద్భక్తా యాంతి మామపి॥23

తా. అల్పబుద్ధిగల వారలు చేయు దేవతారాధన ఫలము అంతము గలది యగుచున్నది. దేవతల నారాధించువారు దేవతలను పొందుచున్నారు. నా భక్తులు నన్ను పొందుచున్నారు.

వ్యా. ఏ ఆరాధనవలనను ఏమియును రాదు. ప్రాణులకు చేయు కర్మఫలము అనుభవింపబడి అంతము గలది యగుచున్నది. దేవతలనుగాని, కృష్ణునిగాని ఆరాధించుట, పొందుట యనునది కాదు. కృష్ణుని సాంగత్యమువలన వాని యందు భక్తి గలవారై కృష్ణుని యందుండి "నేను, నన్ను" అనుచున్న విజ్ఞానమును, భావమును (జ్ఞానమును) పొంది, వానిద్వారా మోక్ష (పరమ) పదమును చేరి అచ్చట అంతము కాని పరమతేజో ఆనంద మనుభవించుచుండు వారగుదురు. ఇది కృష్ణుడు శరీరముతో నున్నపుడు జరిగినదియే కాని, శరీరమును విడిచిన తర్వాత జరుగునది కాదు.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః।
పరం భావమజానంతో మమావ్యయమనుత్తమమ్॥ 24

తా. బుద్ధిలేని వారలు నాశనము లేనిదియు, ఉత్తమోత్తమమైనదియునగు నా యొక్క పరంభావమును తెలియజాలని వారగుచు చక్షురాదీంద్రియములకు గోచరింపని "నన్ను" గోచరత్వము గలవానినిగా తలంచుచున్నారు.

వ్యా. పరంభావము అనగా ఈ కాన్పించు సర్వమును లేని పరమపదముగ నున్న పరమతేజస్సును చూచు 8 వ 20 వ శ్లో.లో చెప్పబడిన భావము(జ్ఞానము). "నన్ను" అనగా సర్వము నెరిగి పవిత్ర ప్రేమభావములతో ప్రవర్తించు విజ్ఞానము. ఈ జ్ఞాన విజ్ఞానములు కృష్ణుని యందును, ఇంక కొందరియందును ఉన్నవి. అట్టి వారిని వారియందున్న విజ్ఞాన ప్రవర్తనద్వారా నెరుగవలయును.

అట్టి కృష్ణునియందున్న విజ్ఞానప్రవర్తన నెరుగనివారు కృష్ణునిశరీర సంబంధమైన సంస్కార కర్మలను చూచి యెరిగినట్లుగా తలంచి యుండవచ్చును గాని విజ్ఞానముగల కృష్ణుని ఎరుగరు. ఈ విధముగ ఉన్నదానిని, ఇట్లుగాక, "నన్ను" అనినది కృష్ణునికిని, సర్వజీవులకును ఉన్న స్వభావమును. దీనికిపరమపదమును చూచు పరంభావము (జ్ఞానము) న్నటులను ఈ స్వభావమును కృష్ణుడని అట్టి కృష్ణుని యందున్న పరంభావమును తెలియ బుద్ధిలేనివారు తనను (తనకును, సర్వజీవులకును ఉన్న స్వభావమును) తెలిసినట్లుగా తలంచుచున్నారని ఈ శ్లోకము నందున్నది కల్పితము. కృష్ణుడనువాడు జీవుడు. అట్టి జీవుని స్వభావమును కృష్ణుడని యీ గీతయందు కల్పించి వ్రాసినారు. పరంభావము (జ్ఞానము) నెరిగినది విజ్ఞానమే గాని యింకేదియు నెరుగదు.

శ్లో॥ నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః।
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమ
వ్యయమ్॥ 25

తా. నేను యోగమాయచే కప్పబడినవాడనై సమస్త జనులకును గోచరించువాడనుకాను. మూఢులైన జనులు జన్మరహితుడనైనట్టియు, నాశరహితుడనైనట్టియు నన్ను నెరుగజాలరు.

వ్యా. నేను యోగమాయచేత కప్పబడినవాడను. అనగా కృష్ణుడు తన పూర్వజన్మ కర్మ (సంస్కారము) ననుసరించి తన ప్రకృతి యనిన స్వభావము చేత ప్రవర్తింపబడుటవలన వానిని అందరును తెలిసికొనలేరు. అట్టి కర్మలయందు తనయందున్న విజ్ఞానము పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించు ప్రవర్తనవలన కొందరు తెలిసికొనగలరు. కర్మరహితుడైనది, జన్మరహితుడును అగునది చూచి ఎరిగి చెప్పునది కాదు. కాని, కామాది గుణముల ప్రవర్తనను, స్వభావమనుగుణము ప్రవర్తనను, విజ్ఞాన ప్రవర్తనను విజ్ఞానము గలవారు విజ్ఞానమువలన ఎరిగి చెప్పుచున్నారు. ఇట్లే, శరీరమును విడిచి పరమపదమును జ్ఞానముద్వారా చూచుచుచేరుట, అచట ఆ తేజో ఆనంద మనుభవించుచుండుననుట పైన చెప్పబడినటుల గుణముల ప్రవర్తనవలనను, ఈ ప్రపంచమునందున్న వెలుతురులుగాక, యీ ప్రపంచము లేని మరియొక తేజస్సు కాన్పించుటవలననేగాని, చూచి చెప్పుటకాదు. కృష్ణుడు యోగమాయ యనినది తన సంస్కారము ననుసరించి తన స్వభావము ప్రవర్తించు కర్మయేగాని యింకొకటి కాదు. గుణరహితుడును, కర్మరహితుడునై జన్మరహితుడైన కృష్ణుడు పరమపదమును జేరి మరల జన్మింపడు. అవతారము లెత్తు కృష్ణుడెవరు? అవతారములనునవి కల్పితము. జన్మించిన కృష్ణుడు అందరివలెనే స్వభావముగల జీవుడు. కృష్ణుని సంస్కారమువలన, బోయవానిద్వారా తనను చంపిన తన స్వభావమును కృష్ణుడని అట్టి కృష్ణుడు పరమాత్మ (పరమ తేజస్సని) యని, భగవంతుడని అవతారము లెత్తుచున్నాడని కల్పించి వ్రాసినారు.

శ్లో॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26

తా. అర్జునా! గడచిపోయినట్టివియు, ఇప్పుడున్నట్టివియు, ముందు రాబోవునవియునైన జీవులను నేనెరుగుదును. ఎవడును నన్ను ఎరుగడు.

వ్యా. జ్ఞాన విజ్ఞానములుగల కృష్ణుడు విజ్ఞానమువలన "నేను, నేను" అను జీవుని, సర్వ జీవులను, జీవుల స్వభావమును ఎరిగి యున్నాడు. కృష్ణునివలెనే జ్ఞాన విజ్ఞానములు గలవారందరును విజ్ఞానమువలన "నేను, నేను" అను జీవుని, కృష్ణుడను జీవుని, సర్వజీవులను, జీవుల స్వభావమును ఎరిగియున్నారు. ప్రకృతి గుణములు గలవారు "నేను, నేను" అను జీవు నెరుగరు, సర్వజీవుల నెరుగరు.

కృష్ణుడను జీవుని నెరుగరు. క్షేత్రము (శరీరము) నెరిగినవాడు క్షేత్రజ్ఞుడని, క్షేత్ర క్షేత్రజ్ఞుల నెరిగినవారు చెప్పుచున్నారని 13 వ అ. 2 వ శ్లో. లోను, సమస్తక్షేత్రముల యందున్న క్షేత్రజ్ఞుని తననుగా నెరుంగుమని, క్షేత్ర క్షేత్రజ్ఞుల నెరిగినదిజ్ఞానమని (విజ్ఞానమని) 3 వ శ్లో. లోను కృష్ణుడు చెప్పెనని ఉన్నది.

విజ్ఞానము గలవారు క్షేత్రక్షేత్రజ్ఞుల నెరిగి క్షేత్రము (శరీరము) నెరిగినవాడు క్షేత్రజ్ఞుడని చెప్పియున్నారు. అందువలన సమస్తక్షేత్రములయందున్న క్షేత్రజ్ఞుని అనగా జీవుల స్వభావమును ఎరిగియున్నారు. జ్ఞాన విజ్ఞానములుగల కృష్ణ నెరిగి యున్నారు. ఇట్లు విజ్ఞానము గలవారెరిగి ఉండగా, ఎవడును తనను ఎరుగడని కృష్ణుడు చెప్పినటుల ఈ 26 వ శ్లో. నందున్నది యథార్థము కాదు. క్షేత్రజ్ఞుడనవిన ఈ కృష్ణుడు విజ్ఞానము లేనివాడు. అందువలన క్షేత్రము (శరీరము) నెరిగినవాడేగాని తనను ఎరుగడు. ఇంకేదియును నెరుగడు. అట్టి కృష్ణుడు గడచిపోయినట్టివియు, ఇప్పుడున్నట్టివియు, ముందురాబోవు నట్టివియునైన జీవులను ఎరుగడు.

శ్లో॥ ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వమోహేన భారత ॥
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప॥ 27

తా. అర్జునా! సకలభూతములు ఇచ్ఛాద్వేషములవలన కలిగిన ద్వంద్వ మోహములచేత సమ్మోహమును జననకాలమందు పొందుచున్నవి.

వ్యా. సర్వభూతములును వానియందున్న యిచ్ఛాద్వేష మోహాది ప్రకృతి గుణములవలనసమ్మోహమును జననకాలమందునుండియును పొందుచున్నవి. పూర్వ జన్మయందు జ్ఞానవిజ్ఞానముల నార్జించినవారు విజ్ఞానమువలన ఇచ్ఛా ద్వేష మోహాది గుణములు లేనివారై, జ్ఞానవిజ్ఞానముల నార్జింపకముందున్న గుణముల కర్మసంస్కారము వలన జన్మించినపుడు, వారు జనన కాలమునుండియును సమ్మోహమును పొందక, వారి సంస్కార కర్మలయందు వారి స్వభావముచేత విధిగా ప్రవర్తింపబడుచుందురు. ఆ కర్మలయందు విజ్ఞానము నిష్కామాది పవిత్ర ప్రేమభావములతో ప్రవర్తించుచుండును.

శ్లో॥ యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణాం
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం
దృఢవ్రతాః ॥ 28

తా. పుణ్యకర్మలు చేసినవారిలో ఎవరి పాపము నశించినదో, వారు సుఖ దుఃఖములకు కారణమైన ద్వంద్వ మోహములచేత విడువబడి దృఢవ్రతము గల వారై నన్ను సేవించుచున్నారు.

వ్యా. పరమపదము నెరిగినకృష్ణుడుగాని, అట్టివారెవరైననుగాని, శరీరమును ధరించి యున్నపుడు, వారి సాంగత్యము గలవారు వారి సంబంధులై వారి వలన ద్వంద్వమోహములగు పాప పుణ్యకర్మలయందు ప్రవర్తింపబడక వారియందు ప్రేమ గలవారై వారిని సేవించియున్నారు. పుణ్య పాప కర్మలవలన సుఖదుఃఖముల నను భవించెదరు. ఇవి రెండును కర్మబంధములు కలిగించునవియే కాని, పుణ్య కర్మల ద్వారా పాపకర్మలు నశింపవు. పాప కర్మలద్వారా పుణ్య కర్మలును నశింపవు. ద్వంద్వమోహములచేత విడువబడరు. పుణ్యకర్మ ద్వంద్వ మోహములలో నొకటి. వ్రతములద్వారా కృష్ణుని సేవించుట యనునది యథార్థము కాదు.

శ్లో॥ జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతంతి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం
కర్మ చాఖిలమ్ ॥ 29

తా. ఎవరు జనన మరణ విముక్తి కొరకు నన్నాశ్రయించి యత్నించు చున్నారో అట్టివారు పరబ్రహ్మమును, ఆత్మను సమస్త కర్మలను ఎరుగుచున్నారు.

వ్యా. కృష్ణుడు చెప్పునటుల చేయుటయే వాని నాశ్రయించి యత్నించుట యనినది. ఇది యత్నించుట కాదు. స్వయముగా యత్నించి చేయునవి ప్రకృతి గుణముల కర్మలు. కృష్ణుడు తనయందున్న జ్ఞానవిజ్ఞానములను తన సాంగత్యమున తాను చెప్పునటుల చేయువారియందును ప్రవేశింప జేయును. వారికిని జ్ఞానముద్వారా పరమపదము కాన్పించి వారు పరమతేజో ఆనంద మనుభవించునపుడు, విజ్ఞానము పరమపదమును, దానిని జ్ఞానము (భావము) ద్వారా చూచి జీవు డానంద మనుభవిం చుటయును ఎరిగి యున్నది. తదుపరి సర్వప్రపంచమును, సర్వ కర్మలను, ఈ సర్వమును సృష్టించిన ప్రకృతి యనిన మాయను ఎరిగి యున్నది. ఈ విధముగా వారు సర్వకర్మలను సర్వమును ఎరిగి యున్నారు. కృష్ణుని సాంగత్యమువలెనే, ఎవరైనను జ్ఞాన, విజ్ఞానములు గలవారి సాంగత్యమున వారిద్వారానే వారియందున్న

జ్ఞాన, విజ్ఞానములను పొందినపుడు వారికి జ్ఞానముద్వారా పరమపద దర్శనమైనపుడు వారు విజ్ఞానముద్వారా పరమపదమును, దానిని చూచు జ్ఞానమను భావమును, జీవుని, జీవుని స్వభావమును సర్వము నెరుగవలెను. ఈ విధముగ నెరిగినవారే (జ్ఞాన విజ్ఞానములు గలవారే) గుణరహితులై సంస్కారకర్మ ననుభవించి, కర్మరహితులై, జనన మరణములనుండి విముక్తులై పరమపదమును చేరుదురని చెప్పవలెను. పరబ్రహ్మమనగా పరమపదముగానున్న పరమతేజస్సేగాని పరబ్రహ్మ మనునది లేదు. ఆత్మ లేదు.

## శ్లో॥ సాధిభూతాధి దైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।
## ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః॥ 30

తా. అధిభూత, అధిదైవ, అధియజ్ఞులతో నున్నవానినిగా నన్ను ఎరిగిన వారు ప్రాణ ప్రయాణ సమయమునందుకూడ మనోనిగ్రహము గలవారై నన్నెరుగ గలరు.

వ్యా. కృష్ణుడనువాడు స్వభావమను గుణముగల జీవుడు. అట్టి కృష్ణుడు భావము (జ్ఞానము), అధియజ్ఞుడను విజ్ఞానమును గలవాడు అందువలన వానిశరీరము అధిభూతము. అధిభూత, అధిదైవ, అధియజ్ఞులతో నున్నవానినిగా "నన్ను" ఎరుంగు మనినది కృష్ణుడను జీవుడు. అట్టి కృష్ణుడు 10 వ అ 10 వ శ్లో.లో చెప్పబడినటుల తనను విడువక సేవ చేయువారికి తనను ఎరుగునట్టి భక్తిని ఇచ్చి యుండును. అట్టి వారు మరణ కాలమందుకూడ కృష్ణుని మరువనివారుగానుండి యుందురు. అటుల కృష్ణునివలెనే పరమపదము నెరిగినవారిని (జ్ఞాన, విజ్ఞానములు గలవారిని) వారికి సేవ చేయు వారెరుగుదురు. కాని యితరులెరుగరు. మనోనిగ్రహము గలవారెరుగ గలరని యిందు వ్రాసినది యథార్థము కాదు. మనోనిగ్రహమనునది లేదు. 8వ అ. 4 వ శ్లో. లో అధిదైవమనునది పురుషుడని (జీవుడని) వ్రాసినారు. ఇందు అధిదైవమను వ్రాసినది జ్ఞానమను భావము. ఈ జ్ఞానమను భావముగాని, జీవుడుగాని, యింకేదియైననుగాని దైవము కాదు. అధిదైవము కాదు. దైవమనునది కల్పితమే గాని యథార్థము కాదు.

ఈ అధ్యాయమున 2 వ శ్లోకములో విజ్ఞానసహితమైన జ్ఞానమును (జ్ఞాన విజ్ఞానములను) నేను నీకు చెప్పుచున్నానని, అట్టి జ్ఞానమును పొందినపుడు మరల పొందవలసినది మరియొకటి లేదని కృష్ణుడర్జునకు చెప్పెను. ఈ జ్ఞాన విజ్ఞానములు పరమపదమును చేర్చును. దైవసంపద అనగా జ్ఞాన విజ్ఞానములు పరమపదమును చేర్చునని 16 వ అ. 5 వ శ్లో. లో ఉన్నది. తత్వ అనగా పరమపదముగా ఉన్న పరమ తేజస్సు దర్శనమైన జ్ఞానుల దరిజేరి వారి సేవ చేయుచు, వారిని పదే పదే అడుగుచుండుము. వారు నీకు జ్ఞానమును ఉపదేశించెదరు. (నీ యందు ప్రవేశింప జేసెదరు) అని 4 వ అ. 34 శ్లో. లోను, నన్ను విడువక సేవించువారలకు నన్ను తెలియునట్టి బుద్ధి (భక్తి) నిచ్చి అట్టి బుద్ధిభావమున నేను (కృష్ణునియందుండి నేను అనుచున్న విజ్ఞానము) వారియందు ప్రవేశించి వారియందున్న అజ్ఞానమను చీకటి పోగలందులకు వారియందు జ్ఞానమును ప్రవేశింపజేసెదనని 10 వ అ. 10, 11 శ్లో. లోను ఉన్నది. ఈ జ్ఞానముతో విజ్ఞానమును ఉండును. అట్టి జ్ఞాన విజ్ఞానములను అవి యున్నవారి సాంగత్యమున వారినుండి వారిద్వారానె పొందవలయునుగాని ఎవరును స్వయముగా నేవిధముగను పొంద (ఆర్జించ) లేరు.

పైన చెప్పబడినటుల విజ్ఞాన సహితమైన జ్ఞానమును పొందవలసి యున్నది. అంతియేకాని, 3 వ శ్లోకమునుండి 30 వ శ్లోకమువరకును 12 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన అధిక దుఃఖములకు కారణమగు అవ్యక్తమార్గమును (గుడ్డివారు పోవు మార్గమును) (ప్రవర్తనను) వ్రాసియున్నారు చెప్పుచున్నాననునది విజ్ఞానప్రవర్తన. వ్రాసినది అసుర గుణముల అవ్యక్త ప్రవర్తన. (గుడ్డివారు పోవు మార్గము). ఇది అధిక దుఃఖములకు కారణమగు ప్రవర్తన. పేరు విజ్ఞాన యోగము (ప్రవర్తన). ఇందు వ్రాసినది అజ్ఞాన ప్రవర్తన (రాగద్వేషాది గుణముల అవ్యక్త ప్రవర్తన).



# గీతా వ్యాఖ్యానము

## అక్షర పరబ్రహ్మ యోగము

## 8 వ అధ్యాయము

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।
అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కి ముచ్యతే ॥ 1

తా. కృష్ణా ! ఆ బ్రహ్మమనగ నెట్టిది ? అధ్యాత్మమన నెట్టిది ? కర్మమన నెట్టిది ? ఏది అధిభూతమని చెప్పబడుచున్నది ? అధిదైవమని దేనినందురు ?

శ్లో॥ అధియజ్ఞః కథంకోఽత్ర దేహేఽస్మిన్మధుసూదన ।
ప్రయాణకాలే చ కథంజ్ఞేయోఽసి నియతాత్మభిః॥ 2

తా. కృష్ణా ! దేహమునందధియజ్ఞుడెవడు ? అతడెట్టివాడు ? ఆత్మ నియమముగలవారిచేత నీవు ప్రాణ ప్రయాణ సమయమునందెట్లు ఎరుగ బడుచున్నావు.

వ్యా. అర్జునుడడిగిన ప్రశ్నలన్నియును పరమపదము నెరిగినవారుమాత్రమే యెరిగి యున్నారు.

అర్జును డడిగిన ప్రశ్నలు :

1. బ్రహ్మమను పరమ తేజస్సు ఎట్టిది ? 2. అధ్యాత్మమన నెట్టిది ? 3. ఉత్తమమైన కర్మ ఏది ? 4. ఉత్తమమైన శరీరమెయ్యది ? 5. అన్ని జీవులకంటె ఉత్తమస్థితిగల జీవుడెవడు ? కర్మలలో ఉత్తమమైన కర్మ చేయు వాడెవడు ? 6. "నిన్ను" అనగా కృష్ణుడుగా నున్న శరీరమును ప్రాణప్రయాణ సమయమునందెట్లు ఎరుగ గలరు ?

శ్రీ భగవాను వాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే।
భూతభావోద్భవ కరో విసర్గః కర్మసంజ్ఞితః॥ 3

తా. బ్రహ్మము పరమపదముగా ఉన్న పరమతేజస్సు. ఉత్తమమైనది. నశించనిది. స్వభావము అధ్యాత్మ మనబడును. ప్రాణులకు భావమును (జ్ఞానమును) సంభవింప జేయు కర్మయే ఉత్తమమైన కర్మ.

వ్యా. బ్రహ్మమనగా నశించనట్టిది, పరమపదముగా ఉన్న పరమ తేజస్సు. అది సర్వోత్కృష్టమైనది. శాశ్వితమైనది. నశించనట్టి ఈ బ్రహ్మము అనునది రాత్రి పగలు గలది, ఈ ప్రపంచముతోసహా నశించునట్టిది యని ఈ అధ్యాయమున 18, 19, 20 శ్లో. లలో చెప్పబడిన బ్రహ్మ అనగా మాయాభ్రమ యను గుణము కాదు. స్వభావము అనగా 4 వ శ్లోకములో అధిదైవముపురుషుడని చెప్పబడినజీవుని సహజ స్వభావమను గుణము. ఇది జీవులతో మాయయందుండి మాయచేత సృష్టింపబడినది. ఇది బ్రహ్మమనిన పరమపదముగా ఉన్న పరమతేజస్సును చూచునదికాదు. ఈ స్వభావమును అధ్యాత్మమని వ్రాసినది యథార్థము కాదు. పరమపదముగా ఉన్న పరమతేజస్సును చూచు జ్ఞానము గలవాడగుట, జ్ఞానముద్వారా ఆ తేజస్సును దర్శించుట అధ్యాత్మ మనబడును. దీనికి వేరైనది అజ్ఞానమని 13 వ అ. 12 వ శ్లో.లో ఉన్నది.

జ్ఞానము (భావము) గలవారు జ్ఞానముద్వారా బ్రహ్మమనిన పరమపదముగా ఉన్న పరమ తేజస్సును చూచు స్థితియే అధ్యాత్మ మనబడును. ఇచ్చట కర్మయనగా ప్రాణులకు ఏది సంభవించిన పరమపదముగా ఉన్న పరమతేజస్సు దర్శనమగునో అట్టిదియగు భావమును (జ్ఞానమును) ప్రాణులకు సంభవింప జేయునట్టి కర్మయే యథార్థమైన, ఉత్తమమైన కర్మయనబడును. ఇది భావము (జ్ఞానము) గలవారి యందున్న విజ్ఞానము చేయు కర్మ. దేవతలను గురించి చేయు యజ్ఞ యాగాదులు ఉత్తమమైన కర్మలు కాదు.

శ్లో॥ అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతం।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాంవర॥ 4

తా. అర్జునా! అధిభూతమనునది నశించునట్టి లక్షణముగల శరీరము. పురుషుడు (జీవుడు) అధిదైవత మనబడును. ఈ శరీరమునందు అధియజ్ఞుడను వాడను నేనే.

వ్యా. అధిభూతమనగా జ్ఞానము (భావము) న్న జీవుడుగల శరీరము. కృష్ణుని శరీరము, జ్ఞానము గలవారి శరీరములు అధిభూతము లనబడును. ఈ జ్ఞానములేని శరీరములు భూతము లనబడును. ఇచ్చటఅధిదైవమనగా జ్ఞానముగల జీవుడు. ఏ జీవుడును అధిదైవము కాదు, దైవములేదు.

అధియజ్ఞుడనగా విజ్ఞానము ఇది భావము (జ్ఞానము) గలవారి యందుండును. ఈ విజ్ఞానమే "అధియజ్ఞుడను నేనే" అని కృష్ణుని యందుండి చెప్పినది. కృష్ణుడును, జ్ఞాన, విజ్ఞానములు గలవారందరును అధియజ్ఞులే. ఈ జ్ఞాన, విజ్ఞానములు అందరియందును లేవు. అధియజ్ఞులచేత (వారి యందున్న విజ్ఞానముచేత) వారి యందున్న భావమును వారి దరిజేరిన వారికి సంభవింపజేయు కర్మయే ఉత్తమమైన కర్మ.

1. బ్రహ్మము అనగా పరమతేజో పదముగా ఉన్న పరమతేజస్సు అది ఈ లోకమునందు లేదు.

2. అధ్యాత్మము అనగా జ్ఞానము (భావము) గలవారికి జ్ఞానముద్వారా పరమ పదము కాన్పించుచున్న స్థితి. స్వభావము అనగా జీవులయందున్న రాగ ద్వేషాది గుణములు చేయునది మరల యింకొకపుడు వానికిచేయు ఆ జీవుల సహజస్వభావము. ఇది అధ్యాత్మ మనబడదు.

3. కర్మ యనగా జ్ఞానము గలవారియందున్న విజ్ఞానము వారియందున్న జ్ఞానమును (భావమును) వారి దరిజేరిన వారికిని సంభవింపజేయు కర్మ.

4. అధి భూతమనగా ఈ జ్ఞాన, విజ్ఞానములుగల జీవుడున్న శరీరము.

5. అధిదైవతమ్ పురుషుడు అనగా జ్ఞాన, విజ్ఞానములు గల జీవుడు.

6. అధియజ్ఞుడనగా జ్ఞానము గలవారియందున్న విజ్ఞానము. ఇవి యన్నియు ఎప్పుడును వేరు, వేరుగా నుండునవియేగాని, ఒకదాని యందొకటి కలిసి పోవునవి కాదు.

ఈ ప్రశ్నలలో మొదటిది బ్రహ్మమనిన పరమతేజోపదముగా ఉన్న పరమ తేజస్సు ఈ లోకమునందు లేదు. అది యిచ్చటికి వచ్చునది కాదు. దానియందీ లోకములేదు; ప్రకృతి (మాయ) లేదు. ప్రకృతి సంబంధమైనదేదియును లేదు. ఈ ప్రపంచము అందుండి వచ్చినది కాదు. ఈ 3, 4 శ్లోకములు పరమపదమును పరమపద దర్శనమైన వారిని గురించి చెప్పినవి.

శ్లో॥ అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరం ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర
సంశయః ॥ 5

తా. ఎవడు మరణ కాలమందు నన్నే స్మరించుచు దేహమును విడిచి పోవు చున్నాడో, వాడు నా భావమును అనగా కృష్ణునియందున్న భావమును(జ్ఞానమును) పొందుచున్నాడు. ఇందు సంశయము లేదు.

వ్యా. కృష్ణుడు దేహధారియై యున్నప్పుడు కృష్ణుని సాంగత్యమున కృష్ణుని సంబంధుడైనవాడు, కృష్ణునియందు ప్రేమ గలవాడై, భక్తి గలవాడై శరీరమును విడుచుటకు ముందే కృష్ణునియందున్న భావమును పొందవలెను. శరీరమును విడిచిన తరువాత పొందుట యనునది యథార్థము కాదు. అటుల కృష్ణుని సంబంధుడై శరీర మును విడిచినవాడు మరల కృష్ణుని సంబంధమునగాని, కృష్ణుని సాంగత్యమున కృష్ణునియందున్న భావమును పొందిన వారిసంబంధమునగాని జన్మించి, శరీరముతో నుండగనే వారిద్వారా (వారియందున్న విజ్ఞానముద్వారా) వారియందు భక్తిగలవాడై ఆ భక్తితో వారియందున్న విజ్ఞానమును పొందును. విజ్ఞానమువలన భావమును(జ్ఞాన మును) పొందును. ఈ విధముగనే ఎవరైనను జ్ఞాన, విజ్ఞానములను అవి యున్న వారి సాంగత్యమున వారినుండియే వారిద్వారానే ఆర్జించవలెను. అట్టివారి శరీరసాంగ త్యమే వారియందున్న విజ్ఞాన సంబంధము. కృష్ణుడును, అట్టివారును శరీరముతో నున్నపుడుగాని, వారు శరీరమును విడిచిన తరువాతగాని, వారిని స్మరించి వారి యందున్న భావమును (జ్ఞానమును) పొందలేరు. స్మరణవలన ఎప్పుడును ఏదియును రాదు. ఈ స్మరణలన్నియును రాగద్వేషాది మాయా గుణముల స్మరణలు.

శ్లో॥ యం యం వాపి స్మరన్భావం త్యజత్యన్తే కళేబరం।
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః॥ 6

తా: అర్జునా! ఎవడు అంత్యకాలమునందు ఏ యే భావమును స్మరించుచు దేహమును విడుచుచున్నాడో, వాడు ఎల్లప్పుడును ఆ యా భావముయొక్క స్మరణ చేత ఆ యాభావమునే పొందుచున్నాడు.

వ్యా. ఎవడే యే భావమును స్మరించినను, ఏయేభావము గలవారిని స్మరించి నను ఆ స్మరణవలన వాడు ఆ యా భావమును పొందలేడు. ఏ భావము గలవారి సాంగత్యమున వానికి ఆ భావము సంభవించును.

శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ॥
మయ్యర్పితమనో బుద్ధిర్మామేవైష్యస్యసంశయః॥ 7

తా. కాబట్టి సర్వకాలములయందును నన్నే స్మరించుచూ, నాయందేమనస్సు బుద్ధియును గలవాడవై యుద్ధము చేయుము. నన్నే పొందగలవు. సంశయములేదు.

వ్యా. కృష్ణుడు శరీరముతో నున్నప్పుడు ఎవరు కృష్ణుని దరి జేరి, సర్వ కాలములయందును కృష్ణునియందు ప్రేమ గలవారై కృష్ణుడు చెప్పినటుల యుద్ధము గాని, ఏ కర్మనైనను గాని చేయుచుందురో, వారు ఆ కర్మలచే బంధింపబడక కృష్ణుని సంబంధులై కృష్ణునిద్వారానే, కృష్ణుని మరువని భక్తి గలవారై ఆభక్తితో కృష్ణుని యందుండి "నన్నే పొందగలవు" అను విజ్ఞానమును పొందగలరు. అంతియేగాని, స్మరణవలన దేనినికూడ పొందలేరు.

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్॥ 8

తా. అర్జునా! అభ్యాసయోగముతో కూడినదియు, ఇతర విషయములందు కోరిక లేనిదియునగు మనస్సుతో చింతించుచున్నవాడు దివ్యమైన పరమ పురుషుని పొందుచున్నాడు.

వ్యా. ఈ శ్లోకము ననుసరించి ఏ అభ్యాసయోగము చేయు వాడైనను, వాడు ఎట్లు చింతించుచున్నను దివ్యమైన పరమతేజస్సుగా నున్న పరమపదమును చూడ లేడు. కోరికయే లేనివాడుకాడు. పరమపదమును చేరలేడు. పరమపురుషుడు(పరమ తేజస్సు) ఈ లోకమునందు లేడు. పరమ పదముగా నున్న పరమ తేజస్సును పరమ పురుషడని వ్రాయుట యథార్థము కాదు.

శ్లో॥ కవిం పురాణమనుశాసితారమణోరణీయాంస
మనుస్మరేద్యః ।
సర్వస్యధాతారమచింత్యరూపమాదిత్యవర్ణం
తమసః పరస్తాత్ ॥ 9

తా. ఎవడు సర్వజ్ఞుడును, పురాతనుడును, జగన్నియామకుడును,సూక్ష్మము కంటె నతి సూక్ష్మమైనవాడును, సమస్తమును రక్షించువాడును చింతింప నలవికాని రూపము గలవాడును, సూర్యుని ప్రకాశమువంటి కాంతి గలవాడును, అజ్ఞానాంధ కారముకంటె అతీతుడును అయిన పరమ పురుషుని స్మరించునో వాడు ఆ పురుషుని పొందుచున్నాడు.

వ్యా. సర్వజ్ఞుడనగా సర్వము నెరిగినదియు, ఎవరినైనను పాపములుచేయు కర్మలనుండి రక్షించునదియు నగు విజ్ఞానము. జనుల (జీవుల) యందున్న కామ రాగద్వేషాది గుణములు చేయు కర్మల ననుసరించి జగన్నియామకుడు, అతిసూక్ష్మ మైనవాడు అనునది జీవుల స్వభావమను గుణము. సూర్యుని ప్రకాశము మాయా ప్రకాశము. దీనిద్వారా ఈ ప్రపంచము కాన్పించును. జ్ఞానము (భావము) ద్వారా పరమతేజోపదము కాన్పించును. అజ్ఞానాంధకారము (యీ ప్రపంచముగల మాయ) కంటె అతీతమైనది పరమపదముగా ఉన్న పరమ తేజస్సు. ఆ తేజస్సునందును, దానిని చూచు జ్ఞానము (భావము) నందును, విజ్ఞానమునందును అజ్ఞానాంధకారము లేదు. జ్ఞానమును (భావమును) విజ్ఞానమును పరమపద దర్శనమైన వారి నుండియే పొందవలెను. జ్ఞానముద్వారా పరమపదము కాన్పించును. విజ్ఞానమువలన గుణరహి తులై కర్మరహితులునైనపుడు పరమపదమును జ్ఞానముద్వారా చూచుచున్నవారై ఆ పదమును చేరుదురు. స్మరణవలన దేనినికూడ పొందలేరు. పరమపురుషునిపొందుట యనునది యథార్థము కాదు.

శ్లో॥ ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేనచైవ ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్ ॥ 10

తా. ఎవడు ప్రాణప్రయాణ కాలమందు నిశ్చలమైన మనస్సుతో, భక్తితో యోగబలముతో కూడుకొనినవాడై, కనుబొమ్మల మధ్యమందు ప్రాణవాయువునుంచి జాగ్రత్తతో పరమపురుషుని స్మరించునో వాడు దివ్యమైన పరమపురుషుని పొందుచున్నాడు.

వ్యా. స్మరణవలన దేనినికూడ పొందలేరు. ఈ స్మరణ యనునది రాగ ద్వేషాది గుణముల అవ్యక్త ప్రవర్తన.

శ్లో॥ యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ 11

తా. వేదములు చదివినవారు దేనిని నాశరహితమైనదని చెప్పుచున్నారో, రాగరహితమైన యతులు దేనిని చేరుచున్నారో దేనిని కోరి బ్రహ్మచర్యము నాచరించుచున్నారో అట్టి స్థానమును సంగ్రహముగా నీకు చెప్పుచున్నాను.

వ్యా. నాశరహితమైనది పరమపదముగా నున్న పరమ తేజస్సు. దానిని వేదములు చదివిన వారెరుగరు. ఎరుగలేరు. అది యున్నదో, లేదో వారు ప్రత్యక్షముగా చూచి చెప్పుటకాదు. జ్ఞాన, విజ్ఞానములు గలవారు ఆ తేజస్సు నెరిగి రాగ ద్వేషాది గుణరహితులై, కర్మరహితులై, ఆ తేజోపదమును చేరుదురు. అట్టి స్థానమును చెప్పుచున్నానని కృష్ణుడు చెప్పెను. కాని, ఈ శ్లోకము నందున్నది కృష్ణుడు చెప్పినది కాదు. భ్రమపై చర్యయే బ్రహ్మచర్యము. భ్రమను జయించిన వారలే బ్రహ్మచారులు. భ్రమను జయించునది విజ్ఞానము. విజ్ఞానముగలవారే బ్రహ్మచారులు. అట్టివారియందు భ్రమ యుండదు. వివాహము చేసికొననంత మాత్రమున బ్రహ్మచారులు కారు. వీరికి భ్రమను జయించు మార్గమే తెలియదు.

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్యచ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగ
ధారణామ్ ॥ 12

తా. సర్వేంద్రియములను నియమించి, మనస్సును హృదయమునందు నిరోధించి, ప్రాణమును ఊర్ధ్వస్థానమునందుంచి యోగధారణను స్థిరముగా చేయుచు,

శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం
గతిమ్ ॥ 13

తా. "ఓం" అనునట్టి ఏకాక్షరమునుచ్చరించుచు నన్ను స్మరించు చున్నవాడై ఎవడు శరీరమును విడిచి పోవుచున్నాడో వాడు పరమపదమును పొందుచున్నాడు.

వ్యా. 12, 13 శ్లోకముల ననుసరించి ఏ విధముగ స్మరించినను శరీరమును విడిచిన పిమ్మట పరమపదమును చేరలేడు. స్మరణ అజ్ఞాన మార్గము. "ఓం" అను శబ్దము మాయాభ్రమచేత మాయయందుండి వచ్చినది. దీనిని స్మరించుట అజ్ఞాన మార్గము (ప్రవర్తన).

శ్లో॥ అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్య యుక్తస్య యోగినః॥14

తా. అర్జునా! యితర చింతలు లేక ఎవడు నన్ను ఎల్లప్పుడును స్మరించుచున్నాడో, అట్లు నిత్యము స్మరించుచున్న యోగికి నేను సులభుడనై యున్నాను.

వ్యా. కృష్ణునెట్లు స్మరించినను సులభుడు కాడు. కృష్ణుడు తనకు సేవచేయు వారిని తనయందు ప్రేమ, భక్తి గలవారినిగా చేయును. అట్టివారికి కృష్ణుడు సులభముగా వశుడగును. ఈ విధముగనే, జ్ఞాన, విజ్ఞానములు గలవారందరును తమకు సేవ చేయువారిని తమయందు ప్రేమ, భక్తి గలవారినిగా జేయుదురు. అట్టి భక్తులకు వారును సులభముగ వశులగుదురు.

శ్లో॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతం।
నాప్నువంతి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః॥15

తా. నన్ను పొందినవారగు మహాత్ములు పరమపదమును పొందుదురు. (చేరుదురు). దుఃఖాలయమైనదియు, అనిత్యమైనదియునగు జన్మమును మరల పొందరు.

వా. కృష్ణుని దరి జేరినవారు 10వ అ. 10,11 వ శ్లో.లలో చెప్పబడినటుల కృష్ణుని సేవ జేయుచు కృష్ణునియందున్న భావమును (జ్ఞానమును) "నన్ను" అను విజ్ఞానమును కృష్ణునిద్వారానే పొందుదురు. అట్టివారు వానిద్వారా పరమపదమునెరిగి గుణరహితులు, కర్మరహితులునై పరమపదమును చేరుదురు. కాని, దుఃఖాలయమైనదియు, అనిత్యమైనదియునగు ఈ లోకమునందు జన్మమునకువచ్చుటయుండదు. కృష్ణునివలెనే పరమపదము నెరిగిన వారి దరిజేరి, వారియందున్న జ్ఞాన, విజ్ఞానము లను వారిద్వారానే పొంది, వానిద్వారా పరమపదము నెరిగి గుణరహితులై, కర్మ రహితులై పరమపదమును చేరవలెను. ఇంకేవిధముగను చేరలేరు.

శ్లో॥ ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున।
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే॥ 16

తా. అర్జునా! బ్రహ్మలోకము మొదలు సకల లోకములును పునర్జన్మమును కలుగ జేయునవి. అర్జునా! నన్ను పొందినవానికి మరల జన్మము కలుగదు.

వ్యా. ఈ లోకమునందు కామ రాగద్వేషాది గుణములు చేసిన కర్మ వలన బ్రహ్మ, విష్ణు మొదలగు లోకములకు వెళ్ళినను, అచ్చట అనుభవించ వలసిన కర్మ ననుభవించి, మరల ఈ లోకమునకు వచ్చి జన్మించెదరు. వారు ఈవిధముగ తిరుగుచుందురు. కృష్ణునియందును, పరమపదము నెరిగిన వారియందును యున్న "నన్ను" అను విజ్ఞానమును పొందినవారు జ్ఞానమును పొంది వానిద్వారా పరమ పదము నెరిగినవారై గుణరహితులు, కర్మరహితులునై పరమ పదమును చేరి మరల జన్మమునకు వచ్చుట యుండదు.

శ్లో॥ సహస్రయుగపర్యంతమహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో
జనాః ॥　17

తా॥ వెయ్యి యుగముల పగటిని, వెయ్యి యుగముల రాత్రిని ఎరిగినజనులు బ్రహ్మ (భ్రమ) యొక్క అహోరాత్రముల నెరిగిన వారలగుదురు.

వ్యా. ఇది అవ్యక్త నిర్ణయము.

శ్లో॥ అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవన్త్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే ॥ 18

తా. కాన్పించెడు సర్వమును బ్రహ్మ (భ్రమ) పగటియొక్క ప్రారంభము నందు కాన్పించని ప్రకృతినుండి పుట్టుచున్నది. రాత్రి అరంభము కాగానే ఆ అవ్యక్తమను పేరుగల ఆ ప్రకృతి యందే లీనమగుచున్నది.

వ్యా. ఈ కాన్పించుచున్న సర్వమును ప్రకృతి (మాయ) యందుండి, దాని భ్రమచేతనే సృష్టింపబడు చున్నది.

శ్లో॥ భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే ॥　19

తా. అర్జునా ! ఈ భూతములన్నియు అనగా అట్టి జీవులు స్వాతంత్ర్యము లేక అనేక జన్మలనెత్తుచు రాత్రి రాగానే ఆ ప్రకృతి (మాయ) యందే కలియు చుండును. పగలు రాగానే మరల ఆ ప్రకృతి (మాయ) యందుండి పుట్టుచుండును.

వ్యా. జీవులు కర్మ చేయునవి కాదు. వానియందున్న గుణములచేత చేయం చునవియు కాదు. వానియందున్న ప్రకృతి (మాయ) దాని గుణములతో కర్మచేయు చుండును. ఆ కర్మ ననుసరించి జీవులు వాని స్వభావమువలన ఈ ప్రపంచము నందనేక జన్మల నెత్తుచు, స్వాతంత్ర్యము లేక తిరుగుచుండును. ఈ విధముగా మాయ జీవులయందు ప్రవేశించి స్వేచ్ఛగా ప్రవర్తించుచు యుండుటకొరకు ఈ ప్రపం మును సృష్టించు కొనినది.

మాయా గుణములచేతను, వాని స్వభావమను గుణముచేతను స్వాతంత్ర్యము లేక ఈ లోకమునందే తిరుగుచుండు జీవులు ఈ లోకమునందు జన్మమునకు రాని పరమపదమును చేరవలెననిన 20వ శ్లోకమునందు చెప్పబడిన భావమును(జ్ఞానమును) పొందవలెను. దీనితో విజ్ఞానమను భావముండును. ఈ జ్ఞాన విజ్ఞానములు మాయ యందు లేవు. ఈ సర్వమును సృష్టించిన బ్రహ్మ (మాయా భ్రమయను గుణము) యందు లేవు. అందువలన మాయయందుండి వచ్చిన ఈ ప్రపంచములో ఎవరి యందును లేవు. ఏ వస్తువునందును లేవు.

శ్లో॥ పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥ 20

తా. ఏ భావము అవ్యక్తమగు మాయకంటె ఇతరమైనదియును, శ్రేష్ఠమైనదియును, కనబడనిదియును అనాదియునై యున్నదో ఆ భావము బ్రహ్మ మొదలగు సమస్తభూతములు నశించినప్పటికిని నశింపదు.

వ్యా. ఈ భావము పరమపదమును చూచునది. దీనిని జ్ఞానము, జ్ఞాననేత్రము అనుచున్నారు. ఇది ప్రకృతి (మాయ) కంటె వేరుగా నున్నది. అనాదియైఉన్నది. కాని ఈ ప్రపంచమునందుండి సృష్టింపబడినది కాదు. ఈ ప్రపంచములో ఎవరి యందును లేదు. దీనితో విజ్ఞానమను భావముండును. ఇది అనాదియై యున్నది. నశించునది కాదు. ఈ ప్రపంచమును సృష్టించిన బ్రహ్మతో సహా ఈ సర్వము నశించి ఆ మాయయందే కలిసినను ఈ భావము నశించునది కాదు. ఎవరైనను ఇట్టి జ్ఞాన విజ్ఞానభావముల నార్జించి వీనిద్వారా పరమపదమును చేరవలెను. ఇవి పరమ పదమును చేర్చు దైవసంపద యని 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన జ్ఞానవిజ్ఞాన భావములు (గుణములు).

శ్లో॥ అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిం।
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ॥ 21

తా. ఏది ఈ కన్నులకు గోచరము కానిదియు, నశించనిదనియు నని చెప్ప బడుచున్నదో, అట్టి పరమపదమును పొంద (చేర) వలసిన సర్వోత్తమమైన స్థాన

ముగా చెప్పుచున్నారు. దేనిని పొందిన (చేరిన) తిరిగి జన్మమునకు రారో అది నా యొక్క పరమ పదము.

వ్యా. పరమపదమునే చేరవలసిన స్థానమని చెప్పవలెను. అది ఈ కన్నులకు కాన్పించనిది, నశించనిది. అచటికి చేరినవారు ఈ లోకమునందు జన్మమునకు రారు. అదియే కృష్ణుడును, పరమపదము నెరిగినవారును చేరునట్టి సర్వోత్తమమైన పరమతేజస్సుగనున్న పరమపదము. 20 వ శ్లోకములో చెప్పబడిన భావము(జ్ఞానము) నార్జించి, దీనిద్వారానే పరమ పదమును చూచుచు చేరవలెను. "పరమ పదమును జ్ఞానముద్వారా చూడవలెను. జ్ఞానముద్వారా చేరవలెను". అని 13 వ అ. 18 వ శ్లోకములో ఉన్నది.

20 వ శ్లోకమునందు చెప్పబడిన భావము (జ్ఞానము), విజ్ఞానమను భావము ఎవరికి సంభవించి ఎవరి యందున్నవో వారిని, వారి ప్రవర్తనద్వారా నెరిగి వానిని వారినుండియే వారిద్వారానే ఆర్జించి వానిద్వారానే పరమపదమును చేరవలెను. అంతియేగాని, యింకొక మార్గము లేదు.

పరమపదము నిరాకార నిర్గుణముగనున్న పరమతేజస్సు. ఈ ప్రపంచము అందు లేదు. అందుండి వచ్చినది కాదు. ఈ ప్రపంచమును మాయ యందుండి సృష్టించి, ఈ ప్రపంచమునందుండి నశించునట్టి బ్రహ్మ మాయా భ్రమయే కాని, నశించని నిరాకార నిర్గుణమై పరమపదముగనున్న పరమతేజస్సు కాదు. ఈ ప్రపంచము పరమతేజస్సు సృష్టి కాదు.

మాయయందుండి వచ్చి, నశించి మాయయందే కలియు ఈ ప్రపంచములో నశించనిది శాశ్వతానందమైనదియునగు పరమపదముగ నున్న పరమ తేజస్సు లేదు. భగవంతుడు లేడు.

ఈ ప్రపంచములో అందరియందును పరమతేజస్సు ఉన్నదని, భగవంతుడున్నాడని నిన్ను నీవు తెలిసికొ, నీవే పరమతేజస్సువు అని చెప్పువారును; జీవుని స్వభావమను గుణమును ఈశ్వరుడని, పరమతేజస్సని, కృష్ణుడని అందువలన కృష్ణుడు వేదములయందును, ఈ లోకమునందును పురుషోత్తముడననబడుచున్నానని కృష్ణుడు చెప్పినట్లుగా 15 వ అ. 17, 18 వ శ్లో.లలో వ్రాసినవారును యథార్థము నెరిగినవారు కాదు.

మాయకంటె వేరుగా నున్నది, నశించనిది, అనాదియై యున్నదియగుభావము (జ్ఞానము) మాయయందు లేదు. మాయయందుండి వచ్చిన ప్రపంచములో ఎవరి యందును లేదు. అందువలన ఈ ప్రపంచమును సృష్టించిన బ్రహ్మతో సహా ఈ సర్వము నశించినను నశించునది కాదు. అట్టి భావము అనగా పరమపదమును చూచు జ్ఞానము అందరియందును ఉన్నదని, దీనిని కామము ఆవరించినదని 3 వ అ. 38, 39, 40 శ్లోకములలోను, జ్ఞానమును అజ్ఞానము ఆవరించినదని 5 వ అ. 15 వ శ్లోకములలోను వ్రాసినవారును, చెప్పువారును యథార్థము నెరిగినవారు కాదు.

శ్లో. పురుషస్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా।
యస్యాంతస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥ 22

తా. అర్జునా! ప్రాణులు ఎవని లోపలనున్నవో, ఎవనిచే ఈ ప్రపంచ మంతయు వ్యాపింపబడి యున్నదో, అట్టి పరమపురుషుడు అనన్య భక్తిచేత పొంద దగినవాడు.

వ్యా. స్వభావముగల ప్రాణులతోను, కామ రాగద్వేషాది గుణములతోనున్న ఈ ప్రపంచము 8 వ అ. 18, 19 శ్లో. లలో చెప్పబడినటుల మాయ యందున్నది. బ్రహ్మ (మాయాభ్రమ)చే మాయ యందుండి వ్యాపింపబడినది. మాయ యందున్న భ్రమ పరమపురుషుడు కాదు. దీనిని పొందుట యనునది లేదు. జీవుల స్వభావము ఆ జీవులకు కామ రాగద్వేషాది గుణముల నంటించునది (సంభవింప జేయునది). ఈ గుణములు చేయునది మరల యింకొకపుడు ఆ జీవులకు చేయుచు వానిని ఈ ప్రపంచమునందు త్రిప్పుచుండునది. అందువలన కామ, రాగ, ద్వేషాది గుణము లును, జీవుల స్వభావమును అసుర సంపదయని కర్మబంధమును కలుగజేయునవి యని 16 వ అ. 5 వ శ్లో. లో చెప్పబడినది. అసుర సంపదయని చెప్పబడిన గుణములలో సర్వజీవులకును యున్న స్వభావమను అసుర గుణము పరమపురుషుడు కాదు. దీనిని పొందుట యనునది లేదు. పొంద (చేర) దగినది పరమతేజస్సుగా ఉన్న పరమపదము. అంతియేకాని పరమపురుషుడు లేడు.

శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః।
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥ 23

తా. అర్జునా! యోగులు ఏ కాలమునందు శరీరమును విడిచిన వృత్తిలేని స్థానమును (పరమపదమును) పొందుచున్నారో ఆ కాలమును, ఏ కాలమున శరీరమును విడిచిన మరల జన్మించెదరో ఆ కాలమును చెప్పుచున్నాను.

వ్యా. ఈ చెప్పబోవు కాలములు యథార్థము కాదు.

శ్లో॥ అగ్నిర్జ్యోతిరహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణం।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో
జనాః॥　24

తా. అగ్నియు, ప్రకాశమునుగల ఉత్తరాయణము ఆరు మాసములలో శుక్ల మార్గమునందు పగటికాలమున పోయిన బ్రహ్మవిదులు బ్రహ్మమును పొందుచున్నారు.

శ్లో॥ ధూమో రాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనం।
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్యనివర్తతే॥　25

తా. అవిధముగనే ధూమమును, రాత్రియును గల దక్షిణాయనము ఆరు మాసములయందు చంద్ర ప్రకాశముగల కృష్ణ మార్గమునందు పోయిన యోగులు పునర్జన్మమునకు వచ్చుచున్నారు.

శ్లో॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తిమన్యయాఽఽవర్తతే పునః॥26

తా. జగత్తునకు పైన చెప్పబడిన శుక్ల కృష్ణములనెడి రెండు మార్గములు శాశ్వతమైనవని నా యభిప్రాయము. ఒకదానిచేత పునర్జన్మ రాహిత్యమును పొందుచున్నాడు. మరియొక దానిచేత మరల పుట్టుచున్నాడు.

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥　27

తా. అర్జునా! ఈ రెండు మార్గముల నెరిగిన యోగి ఎవడును మోహమును పొందడు. కాబట్టి అర్జునా! సర్వకాలములయందును యోగయుక్తుడ వగుము.

వ్యా. 23, 24, 25, 26, 27 శ్లోకములు యథార్థము కాదు. పరమపదము నెరిగిన జ్ఞాన విజ్ఞానములు గలవాడగు జ్ఞాని వానిద్వారా గుణరహితుడు, కర్మరహితుడునై ఎప్పుడు శరీరమును విడిచినను జ్ఞానముద్వారా పరమపదమును చూచుచు, ఆ పదమును చేరుచున్నాడు. రాగద్వేషాది ప్రకృతి గుణములు గలవాడు ఈ గుణముల కర్మలవలన వాని స్వభావమను గుణముచేతకర్మబంధితుడగుచున్నాడు.ఎప్పుడు శరీరమును విడిచినను పునర్జన్మమునకు వచ్చుచున్నాడు. పైన చెప్పబడినటుల ఉత్తర దక్షిణాయనములయందు పోవుట యథార్థము కాదు. పైశ్లోకముల ననుసరించి యత్నమొనరించు ఏ యోగియును ఎప్పుడు శరీరమును విడిచినను వృత్తిలేని అనగామాయా గుణములతో నున్న యీ ప్రపంచము లేని స్థానమును (పరమపదమును) చేరడు.

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం ।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ । 28

తా. యోగి ఈ ఉభయమార్గముల నెరిగినవాడై వేదములయందును, యజ్ఞములయందును, దానములయందును, తపస్సులయందును ఏ పుణ్యఫలము చెప్పబడి యున్నదో అది యంతయు నతిక్రమించి ఆదికారణమైన (జన్మమునకు వచ్చినట్టి) పరమ స్థానమును పొందుచున్నాడు.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. యోగమని చేయునది కామ రాగ ద్వేషాది గుణములతోనున్న మాయా భ్రమ. ఇది చేయు యోగమువలనను, అనేక కర్మలవలనను వారి స్వభావమను గుణమునకు వశులై ఆ యోగమునందును, అనేక కర్మలయందును లాగబడి అనేక జన్మల నెత్తుచు, అనేక సుఖదుఃఖముల ననుభవించుచు ఈ ప్రపంచమునందు తిరుగుచుందురు. కాని, జన్మమునకు రాని పరమ పదమును పొందరు (చేరరు). మొదట వచ్చినట్టి ప్రపంచముగలది యీ అధ్యాయమున 18, 19 శ్లోకములలో చెప్పబడిన ప్రకృతి (మాయా)స్థానము. ఆదికారణము మాయాస్థానమే కాని జన్మమునకు రాని పరమపదము కాదు. ఈ ప్రపంచముమాయ యందున్నది. మాయయును యిచ్చటనే ఉన్నది. పరమపదమునందు మాయ లేదు. యీ ప్రపంచము లేదు.

పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను, చేరవలెనని 13 వ అ. 18 వ శ్లో. లోను, దేనిని పొందిన మరల పొందవలసినది మరియొకటి యుండదో, అట్టి విజ్ఞాన సహితమైన జ్ఞానమును నేను నీకు చెప్పుచున్నానని 7 వ అ. 2 వ శ్లో.లోను 9 వ అ. 1 వ శ్లో.లోను, అట్టి జ్ఞానమును పరమపద దర్శనమైన వారి దరిజేరి, వారి సేవజేయుచు వారిద్వారానే పొందగలవని 4 వ అ. 34 వ శ్లోకములోను చెప్ప బడి యున్నది. ఈ విజ్ఞానముతోనున్న జ్ఞానము (జ్ఞాన,విజ్ఞానములు) పరమపదమును జేర్చును. అంతియేకాని, యోగములని ఉత్తర, దక్షిణాయనములని యింక ననేక విధములగను యీ గీతయందు ఉన్నవి తప్పు మార్గములు (ప్రవర్తనలు).

ఈ అధ్యాయమునందు 3, 4 శ్లో.లలో చెప్పబడినవి వేరు వేరుగా నుండు నవియేగాని, ఒకదాని యందొకటి ఎప్పుడును కలియునవి గావు. ఇందు నశించునది శరీరమేకాని యింకేదియును నశించునది కాదు. బ్రహ్మము అని చెప్పబడిన పరమ పదముగా ఉన్న పరమ తేజస్సు ఈ లోకమునందు లేదు. 18, 19 శ్లోకములలో సర్వ ప్రపంచము ప్రకృతి (మాయ) యందుండియే సృష్టింపబడుచున్నదని చెప్ప బడి యున్నది. 20 వ శ్లోకములో భావమును (జ్ఞానమును) 21 వ శ్లోకములో జన్మమునకు రాని పరమపదమును చెప్పబడి యున్నది. ఈ ప్రపంచముతో నున్న మాయ పరమపదమునందు లేదు. అందుండి వచ్చినది కాదు.

పేరు అక్షర పరబ్రహ్మ యోగము. అనగా, నిరాకార, నిర్గుణమగు పరమ తేజస్సుగా ఉన్న పరమపదమును చేరు ప్రవర్తన. ఇందు రాగ, ద్వేషాది గుణముల అవ్యక్త ప్రవర్తన అధికముగా వ్రాసినారు. దైవసంపద అనగా జ్ఞాన, విజ్ఞాన భావములు (గుణములు) పరమపదమును చేర్చునని 16 వ అ. 5 వ శ్లోకములో ఉన్నది. పరమపదమును జ్ఞానము (భావము)ద్వారా చూడవలెను; జ్ఞానము(భావము) ద్వారా చేరవలెనని 13 వ అ. 18 వ శ్లోకములో ఉన్నది. అట్టి జ్ఞానమును (విజ్ఞాన సహితమైన జ్ఞానమును) తత్వ అనగా పరమపదముగ నున్న పరమ తేజస్సు దర్శన మైన వారి (జ్ఞాన, విజ్ఞానములు) గలవారి సాంగత్యమున వారిద్వారానె పొంద (ఆర్జించ) వలెనని 4 వ అ. 34 వ శ్లో. లో ఉన్నది.

ఇందు కర్మబంధమును కలుగజేయునవి అసుర సంపదయని 16 వ అ. 5 వ శ్లో. లో చెప్పబడిన రాగ, ద్వేషాది గుణములతో చేయు అనేక విధముల ప్రవర్త నలు వ్రాసినారు. అసురగుణములు గలవారు నివృత్తి మార్గము నెరుగరు. ప్రవృత్తి

మార్గము నెరుగరని 16 వ అ. 7 వ శ్లో. లో ఉన్నది. రాగ, ద్వేషాది గుణములు ప్రవర్తన ప్రవృత్తి మార్గమే కాని, పరమపదమును చేర్చు జ్ఞాన, విజ్ఞానములు నివృత్తి మార్గము (ప్రవర్తన) కాదు.

పరమ తేజస్సు ఏ భావమును (గుణమును) లేనిది. అట్టి పరమ తేజస్సును బ్రహ్మమని వ్రాసి, దాని ప్రక్కనే స్వభావో అధ్యాత్మమని ఆ తేజస్సునకు స్వభావమున్నటుల కల్పించి ఈ అధ్యాయమున 3 వ శ్లోకములో వ్రాసినారు. ఇది మాయయందుండి వచ్చినదని 8 వ అ. 18, 19 శ్లో.లలో చెప్పబడిన జీవుల స్వభావము (సహజ గుణము) భూతములకు భావమును (జ్ఞానమును) సంభవింపజేయు కర్మయే ఉత్తమమైన కర్మయని వ్రాసి, దీనిని దేవతల నుద్దేశించి చేయు యజ్ఞాది కర్మలు ఉత్తమమైన కర్మలని 3 వ శ్లో. లోనే కల్పించి వ్రాసినారు. భూతములకు భావమును (జ్ఞానమును) సంభవింపజేయునది అధియజ్ఞుడనునట్టి విజ్ఞానము గలవారిచే చేయబడు కర్మ. జ్ఞాన, విజ్ఞానములు గలవారియందున్న విజ్ఞానముయొక్క ప్రవర్తనను రాగ, ద్వేషాది అజ్ఞాన గుణముల అవ్యక్తప్రవర్తనగా ఈగీతయందు కల్పించి వ్రాసినారు.



# గీతా వ్యాఖ్యానము

## రాజవిద్యా రాజగుహ్య యోగము

## 9 వ అధ్యాయము

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

**శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।**
**జ్ఞానం విజ్ఞానసహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ 1**

తా. దేని నెరిగిన అశుభములనుండి విముక్తుడవు కాగలవో, అట్టి విజ్ఞాన సహితమైనట్టిదియు, అతి రహస్యమైనట్టిదియునగు జ్ఞానమును అసూయా రహితుడ వగు నీకు చెప్పుచున్నాను.

వ్యా. విజ్ఞానముతోనున్న జ్ఞానము (జ్ఞాన విజ్ఞానములు) గలవారే పరమ పదము నెరిగినవారై అశుభములనుండి విముక్తులగుదురు. అట్టి విజ్ఞానముతోకూడి యున్న జ్ఞానమును చెప్పుచున్నానని చెప్పెను. అర్జునుడు అసూయారహితుడుకాదు. జ్ఞాన, విజ్ఞానములను పొంది పరమ తేజోపద దర్శనమైన తదుపరి రాగ, ద్వేష, అసూయాది ప్రకృతి గుణములన్నియును వానిని విడిచి వెళ్ళిపోవును. అప్పుడు అసూయారహితుడనబడును. 7 వ అ. 2 శ్లో. లోను విజ్ఞాన సహితమైన జ్ఞానమును పొందవలసినదిగా చెప్పియుండెను. అశుభములనుండి విముక్తులగుటకు విజ్ఞానముతో నున్న జ్ఞానమును (జ్ఞాన విజ్ఞానములను) ఇవి ఉన్నవారిసాంగత్యమున వారినుండియే పొందవలెను.

**శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమం ।**
**ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ।2**

తా. ఈ జ్ఞానమును పొందువిద్య విద్యలలోకెల్ల రాజ విద్య. ఇది పవిత్ర మైనది. అతి రహస్యమైనది. ఉత్తమమైనది. అనుభవమువలన తెలియదగినది. ధర్మముతో కూడినది. అనుష్ఠించుటకు అతి సుఖమైనది. నాశ రహితమైనదియునై యున్నది.

వ్యా. ఈ జ్ఞానమును పొందు విద్య విద్యలన్నిటిలోకెల్ల రాజ విద్య. ఇది మిక్కిలి సుఖమైనది. పవిత్రమైనది. పరమ ధర్మమైనది. అతి రహస్యమైఉన్నది. ఈ విద్య నెరిగినది విజ్ఞానము. కృష్ణుడును జ్ఞానము గలవారును విజ్ఞానమువలన ఈ విద్య నెరిగి యున్నారు. అట్టివారి సాంగత్యమున వారిద్వారానే వారియందుండియే యీ విజ్ఞానముతోనున్న జ్ఞానము నార్జించవలెను. అంతియేకాని, ఏ విచారణ,ధ్యాన, నామస్మరణలచేతను యింకేవిధమునను ఆర్జించలేరు. ఇట్టి జ్ఞానమును పొందు విద్య గాక మిగిలిన విద్యలన్నియును మాయాశ్రమచేత మాయయందుండి సృష్టింపబడిన అజ్ఞాన విద్యలు. ఇవి మాయా సంబంధమైన విద్యలు. పొట్ట కూటివిద్యలు.

శ్లో॥ అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని ॥ 3

తా. అర్జునా! ఈ ధర్మమునందు శ్రద్ధలేని మానవులు నన్ను పొందక మరణ రూపమగు సంసార మార్గమునందు వర్తించుచుందురు.

వ్యా. పరమ ధర్మమైన ఈ జ్ఞానమును పొందు విద్యయందు శ్రద్ధ లేనివారు కృష్ణునియందు శ్రద్ధ లేనివారై, కృష్ణునియందుండి "నన్ను" అను విజ్ఞానమును పొందక జనన మరణ రూపమగు సంసారమునందు తిరుగుచుందురని చెప్పెను. ఇట్లు కృష్ణుడు శరీరముతోనున్నపుడు జరిగినదియేగాని, శరీరమును విడిచిన తరువాత జరుగునది కాదు.

శ్లో॥ మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥ 4

తా. ఈ ప్రపంచమంతయు అగోచరమూర్తినగు నాచేత వ్యాపింపబడిఉన్నది. సమస్తభూతములు (జీవులు) నా యందున్నవి. నేను ఆ భూతముల యందున్న వాడను కాను.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. ఈ ప్రపంచమంతయు అగోచర మూర్తినగు నాచేత వ్యాపింపబడినదనినది జీవుల స్వభావమను గుణము. ఇదిమాయ యందుండి మాయాభ్రమచేత ఈ ప్రపంచము సృష్టింపబడినపుడే జీవులకు సహజముగ నున్నది. ఇది జీవుల యందున్నదిగాని, దీనియందు జీవులు లేవు; ఈ ప్రపంచము లేదు. ఈ ప్రపంచము ఈ స్వభావముచేత వ్యాపింపబడినది కాదు. ఇది కృష్ణుడు కాదు.

శ్లో॥ న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరం।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః॥ 5

తా. సమస్తభూతములు నా యందున్నవిగావు. ఈశ్వర సంబంధమైన నా యొక్క యోగమును చూడుము. నా యొక్క ఆత్మభూతములను ధరించుచున్నట్టిదియును, భూతములకు భావనను కలుగ జేయునదియునగుచు భూతముల యందున్నది కాదు.

వ్యా. సమస్త ప్రాణులును కృష్ణుని యందు లేవు. కృష్ణునినుండి వచ్చినవి కాదు. మానవ జన్మయందు జీవులయందున్న రాగ, ద్వేషాది గుణముల కర్మల ననుసరించి వాని ననేక జన్మ కర్మ సుఖదుఃఖముల ననుభవింపజేయు జీవుల స్వభావ కర్మలను తనయొక్క ఈశ్వర సంబంధమైన యోగమని కృష్ణుడు చెప్పినటుల వ్రాసినారు. ఇది కల్పితము. తనయొక్క ఆత్మయనినదియును కృష్ణుడను జీవుని స్వభావము. ఇది కృష్ణుడను జీవునకు ఉన్నటులనే సర్వజీవులకును ఉన్నది. ఇది జీవులకు రాగద్వేషాది గుణముల నంటించునది, ఈ గుణముల కర్మల ననుసరించి కర్మలయందు ప్రేరేపించుచు ప్రవర్తించునది. ఇది భావనను అనగా కర్మలను ప్రేరేపించుచు జీవులయందున్నదిగాని భూతముల (జీవుల) యందున్నది కాదని వ్రాసినది యథార్థము కాదు. ఇట్టి స్వభావము జీవులకు సహజముగ ఉన్నది. సర్వ జీవుల స్వభావమును కృష్ణుని ఆత్మ (స్వభావము) అని వ్రాసినది యథార్థము కాదు.

శ్లో॥ యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో
మహాన్।
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ॥ 6

తా. అంతటను సంచరించునట్టి మహావాయువు నిత్యమై యెట్లు ఆకాశము నందున్నదో, అట్లు సమస్త భూతములు నాయందున్నవని తెలిసికొనుము.

వా. సమస్త శరీరములయందును, కృష్ణుడను శరీరమునందును ఒకే విధముగా నున్న స్వభావముగల జీవులు ప్రకృతి (మాయ) యందున్నవి. మాయ యందుండి వచ్చినవి. కృష్ణుడను జీవునియందు లేవు. కృష్ణుడు తన ఆత్మ యనిన స్వభావమునందు లేవు.

శ్లో॥ సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికాం
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥ 7

తా. అర్జునా! సర్వభూతములు కల్పాంతమునందు నాయొక్క ప్రకృతిని పొందుచున్నవి. ఆ భూతములను కల్పాది యందు మరల నేను సృష్టించుచున్నాను.

వ్యా. సర్వజీవులును కల్పాంతమందు అనగా బ్రహ్మ (భ్రమ)కు రాత్రి రాగానే ప్రకృతి (మాయ) యందు కలియుచున్నవి. కల్పాదియందు అనగా భ్రమకు పగలు రాగానే మరల ప్రకృతి (మాయ) యందుండియే వచ్చుచున్నవని ఈసృష్టిని గురించి 8 వ అ. 18, 19 శ్లోకములలో చెప్పబడి యున్నది. కృష్ణునియందు సర్వ భూతములను సృష్టించు భ్రమతో ఉన్న ప్రకృతి (మాయ) యును, కలుపుకొను ప్రకృతి (మాయ)యును లేదు.

శ్లో॥ ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః।
భూతగ్రామమిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్

తా. ప్రకృతి (మాయ) యధీనమువలన స్వాతంత్ర్యము లేని సమస్త జీవులను నా ప్రకృతి (స్వభావము) ననుసరించి మరల మరల వానిని సృజించుచున్నాను.

వ్యా. జీవులు స్వాతంత్ర్యములేనివి. వానియందున్న ప్రకృతి (మాయా) గుణముల కర్మ ననుసరించి, వానిని అనేక జన్మల నెత్తించునది ఆ జీవుల స్వభావము. ఇట్లు కృష్ణుడును అనేక జన్మలనెత్తి రాముని జన్మ యందున్న (ప్రకృతి మాయా) గుణములు వాలిన చంపిన కర్మవలన తన ప్రకృతి యనిన స్వభావము

చేతనే బోయవానిద్వారా చంపబడినాడు. సర్వజీవులను తన ప్రకృతి (స్వభావము) ననుసరించి కృష్ణుడు మరల, మరల సృజించుచున్నానని చెప్పినది కల్పితమేగాని యథార్థము కాదు.

శ్లో॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ ।
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు॥ 9

తా. అర్జునా! కర్మల యందాసక్తి లేనివాడనుగను, ఉదాసీనుడనుగను ఉన్న నన్ను ఆ కర్మలు బంధింపవు.

వ్యా. జీవులయందున్న గుణములు కర్మలు చేయునవి. ఆ కర్మలను మరల చేసి ఆ కర్మఫలములను ఆ జీవులచేత అనుభవింప జేయునది వాని స్వభావము. దీనికి ఆసక్తి లేదు. ఆ కర్మలు దీనిని బంధింపవు. ఇది జీవుల సంస్కారము నను సరించి కర్మ చేయునది, ఆ కర్మఫలమును వానిచేత ననుభవింప జేయునదియే కాని ఉదాసీనుడనునది కాదు. జ్ఞాన విజ్ఞానముగల మానవుడుగా నున్న కృష్ణుడు కర్మల యందు ఆసక్తి లేనివాడు గనుక, ఆ కర్మలు కృష్ణుని బంధింపవు. అట్టి కృష్ణుడు సర్వజీవుల స్వభావమని కల్పించి వ్రాసినారు.

శ్లో॥ మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరం ।
హేతునాఽనేన కౌంతేయ జగద్విపరివర్తతే॥ 10

తా. అర్జునా! ప్రకృతి(మాయ)చరాచర ప్రపంచమంతయును సాక్షిభూతుడ నగు నాచేత సృష్టింపబడుచున్నది. ఈ హేతువుచేతనే ప్రపంచము ప్రవర్తించు చున్నది.

వ్యా. చరాచర ప్రపంచమంతయును ప్రకృతి (మాయాభ్రమ)చేత సృష్టింప బడిన తరువాత, జీవులకు వాని స్వభావమువలన సంభవించిన మాయా గుణములు చేయు కర్మలనుబట్టి జీవులు వాని స్వభావముచేత జనన మరణ కర్మలయందు ప్రవ ర్తింపబడుచున్నవి. ఈ స్వభావమను కృష్ణుడు సాక్షిభూతుడు కాదు. తనచేత ఈ చరాచర ప్రపంచము సృష్టింపబడుచున్నదని, ప్రవర్తింపబడుచున్నదని, తాను సాక్షి భూతుడనని కృష్ణుడు చెప్పినటుల వ్రాసినది యథార్థము కాదు.

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం ।
పరంభావమజానన్తో మమ భూతమహేశ్వరమ్॥ 11

తా. భూతములకు ఈశ్వరుడనగు నా యొక్క పరంభావమును తెలియనట్టి మూఢులు నన్ను మనుష్య సంబంధమైన శరీరమును ఆశ్రయించిన వానినిగాతలంచి అలక్ష్యము చేయుచున్నారు.

వ్యా. భూతములకు ఈశ్వరుడు అనగా జీవుల స్వభావము. దీనికి పరంభావమనునది లేదు. ఈశ్వరుడనగు తనయొక్క పరంభావమని కృష్ణుడు చెప్పినటుల యిందు వ్రాసినది యథార్థము కాదు. పరమపద దర్శనమైన జ్ఞానుల యందున్న పరంభావము కృష్ణుడను జీవునియందును ఉన్నది. అట్టి పరంభావమును అనగా పరమ తేజోపదముగా నున్న తేజస్సును చూచు భావమును (జ్ఞానమును) తెలియని మూఢులు (అజ్ఞానులు) కృష్ణుడు శరీరముతో చేయు కర్మలను చూచి ఆ కర్మలను తెలియలేక సామాన్య మానవులవలెనే తలంచి అలక్ష్యము చేసియుందురు.

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥ 12

తా. వ్యర్థములైన ఆశలు గలవారును, వ్యర్థ కర్మలు చేయువారును, వ్యర్థమైన జ్ఞానము గలవారును, జ్ఞానము లేనివారై మోహమును కలుగజేయు రాక్షస సంబంధమైనదియు, అసుర సంబంధమైనదియునగు ప్రకృతిని ఆశ్రయించుచున్నారు

వ్యా. జ్ఞాన విజ్ఞానములు లేనివారు రాగద్వేషాది గుణములచేత మోహమును కలుగజేయు కర్మలయందు ప్రవర్తింపబడుచు జ్ఞాన విజ్ఞానములను ఆర్జింపనివారై అసుర అనిన మాయా గుణముల నాశ్రయించిన వారగుచున్నారు.

శ్లో॥ మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః।
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్॥ 13

తా. అర్జునా! మహాత్ములు నన్ను దైవ ప్రకృతి గలవానినిగను, సమస్త భూతములకు ఆదికారణునిగను, అవ్యయునిగను ఎరిగి యితర చింతలు లేనివారై భజించు చున్నారు.

వ్యా. కృష్ణుని దరిజేరినవారే, కృష్ణునియందున్న విజ్ఞానముయొక్క ఆచరణ నెరిగినవారై కృష్ణుని సాంగత్యమున యితర చింతలు లేనివారై కృష్ణుని సేవించి యుందురు. ఆ విధముగనే, అట్టి విజ్ఞానము గలవారి దరిజేరి, వారి సాంగత్యమున నున్న వారు ఇతర చింతలు లేనివారై వారిని సేవించెదరు. సమస్త భూతములకు ఆది కారణము మాయాబ్రహ్మ (భ్రమ) యేగాని, కృష్ణుడు కాదు. ఏ మహాత్ము లును (జ్ఞానము గలవారు) కృష్ణుని సేవించుటకు రారు. కృష్ణుడును వారును సమా నులు. దైవము లేదు. దైవ ప్రకృతి యనునది లేదు.

శ్లో॥ సతతం కీర్తయంతో మాం యతన్తశ్చ దృఢవ్రతాః ।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ 14

తా. నన్ను పొందుటకు యత్న మొనరించు దృఢవ్రతము గలవారు నాకే నమస్కారము చేయుచు, ఎల్లప్పుడును నన్ను కీర్తించుచు, ఎల్లప్పుడును నాయందే భక్తి గలవారై నన్ను ఉపాసించుచున్నారు.

వ్యా. కృష్ణునియందున్న "నన్ను" అను విజ్ఞానమును పొందుటకు తన సాంగత్యము చేయువారిని కృష్ణుడే తనయందు భక్తి గలవారినిగా జేసి యుండును. స్వయముగా ఎట్టి ప్రయత్న మొనరించి వ్రతములు చేసినను, కీర్తించినను కృష్ణుని యందు భక్తి గలవారగుదురనునది, ఉపాసన యనునది యథార్థము కాదు. తనను విడువక సేవ చేయువారికి తనను తెలియునట్టి బుద్ధిని (భక్తిని) తాను యిచ్చెదనని 10 వ అ. 10 వ శ్లో.లో కృష్ణుడే చెప్పియుండెను.

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్॥ 15

తా. కొందరు విశ్వరూపుడనగు నన్ను అద్వైతునిగను, ద్వైతునిగను, జ్ఞాన యజ్ఞముచేతను, అనేక విధములుగను పూజించుచు ఉపాసన చేయుచున్నారు.

వ్యా. విశ్వరూపుడనగు 'నన్ను' అనగా సర్వశరీరములయందున్న జీవుల స్వభావము. దీనిని ఈ శ్లోకమునందు చెప్పబడినటుల పూజించుట, ఉపాసన చేయుట యనునది యథార్థము కాదు.

శ్లో॥ అహం క్రతురహం యజ్ఞస్స్వధాఽహమహమౌషధం।
మన్త్రోఽహమహ మేవాజ్యమహమగ్నిరహం
హుతమ్ ॥　　16

తా. క్రతువును నేనే, యజ్ఞమును నేనే, స్వధయును నేనే, ఔషధమును నేనే, మంత్రమును నేనే, ఆజ్యమును నేనే, అగ్నియును నేనే, హోమకర్మమును నేనే అయి యున్నాను.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. ఇందు జ్ఞాన విజ్ఞానములుగల కృష్ణుడు లేడు. మాయయందుండి వచ్చిన జీవుల స్వభావమను గుణమును కృష్ణుడు "నేనే" ననినటుల కల్పించి వ్రాసినారు.

శ్లో॥ పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః।
వేద్యం పవిత్రమోంకార ఋక్సామ యజురేవ చ　17

తా. ఈ జగత్తునకు తండ్రియును, తల్లియును, తాతయును, రక్షకుడును, తెలిసికొనదగినదియును, పవిత్రమైనదియును, ఓంకారమును, ఋగ్వేదమును, సామ వేదమును, యజుర్వేదమును "నేనే" యగు చున్నాను.

శ్లో॥ గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయస్థానం నిధానం బీజమవ్యయమ్॥　18

తా. గతియును, భర్తయును, ప్రభువును, సాక్షియును, ఉనికిపట్టును, ఆశ్రయింపదగినవాడును, ఉపకారము చేయువాడును, ఉత్పత్తి లయములకు స్థానమైన వాడును, నిధానమును, నాశరహితమైన బీజమును 'నేనే'.

శ్లో॥ తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున॥　19

తా. అర్జునా! తపింపజేయువాడను నేనే, వర్షమును కురిపించెడివాడను, నిలిపెడివాడను నేనే, జీవనాధారమును, మరణ కాలమును, సదసత్ పదార్థములు రెండును నేనే.

వ్యా. పై శ్లోకములయందు చెప్పబడినవన్నియును జీవుల యందున్న గుణములు చేయు కర్మల ననుసరించి జీవుల స్వభావమువలన జరుగుచున్నవిగాని, ఇది స్వయముగా ఏమియును చేయునది కాదు. ఇందు జ్ఞాన, విజ్ఞానములుగల కృష్ణుడు లేడు. ఇది సదసత్ పదార్థములు కాదు. పవిత్రమైనది కాదు.

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ॥
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్దివి దేవభోగాన్ ॥ 20

తా. మూడు విద్యలనెడి మూడు వేదములందు చెప్పబడిన యజ్ఞములచేత నన్ను పూజించి సోమపానము చేసినవారు కల్మషరహితులై స్వర్గమును పొందుటకు ప్రార్థన చేయువారు పుణ్యమైన స్వర్గలోకమును పొంది ఆ స్వర్గమునందు దివ్యమైన దేవ భోగముల ననుభవించుచున్నారు.

వా. ఈ శ్లోకమునందున్నవి యథార్థము కాదు. మూడు వేదములయందు చెప్పబడిన యజ్ఞములద్వారా కృష్ణుని పూజించుట, ప్రార్థన చేయుట యనునది యథార్థము కాదు. ఆ యజ్ఞముల హోమమునందు వేయు వానివలనను, అందు పడి చచ్చెడు పురుగులవలనను పాపములు రావచ్చును గాని, సుఖ భోగములు రావు. మానవులు ఇతరులకు సుఖములను కలిగించు కర్మవలననే సుఖముల ననుభవించు వారగుచున్నారు.

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ।
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే ॥ 21

తా. అట్టివారు విశాలమైన స్వర్గలోకము ననుభవించి పుణ్యము క్షీణించిన తరువాత మర్త్యలోకమునందు జన్మించుచున్నారు. ఈ విధముగ వేదముల ననుసరించువారు కామములను కోరువారై రాకపోకలను పొందుచున్నారు.

వ్యా వేదములయందు చెప్పబడిన యజ్ఞములు చేయువారు ఆ యజ్ఞముల యందును, తరువాతను వారు చేయుచున్న కర్మలనుబట్టి సుఖదుఃఖముల ననుభవించు వారగుదురు. వేదముల ననుసరించువారు కోరికలు గలవారై ఈ ప్రపంచమునందు సుఖ దుఃఖముల ననుభవించుచు తిరుగుచుందురు. ఇదియే వేదములయందున్న గతి (మార్గము).

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం యే జనాః
పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం
వహామ్యహమ్ । 22

తా. ఏ జనులు ఇతర చింతలు లేనివారై ఎల్లప్పుడును నన్నే చింతించుచు, ఉపాసించుచున్నారో వారియొక్క యోగక్షేమమును నేను వహించి యున్నాను.

వ్యా. ఈ శ్లోకమునందు వ్రాసిన చింతన, ఉపాసనలవలన వారియొక్క యోగక్షేమమును నేను వహించి యున్నానని కృష్ణుడు చెప్పినటుల వ్రాసినది యథార్థము కాదు. కృష్ణుడు శరీరమును ధరించి యున్నపుడు కృష్ణుని సాంగత్యమున నున్నవారి యోగక్షేమమునే కృష్ణుడు వహించియుండును.

శ్లో॥ యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాఽన్వితాః ।
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధి పూర్వకమ్॥

తా. అర్జునా! ఎవరు ఇతర దేవతలయందు భక్తి గలవారగుచు శ్రద్ధతో కూడినవారై వారినే పూజించుచున్నారో అట్టి వారుగూడ అవిధి పూర్వకముగా నన్నే పూజించుచున్నారు.

వ్యా. ఇతర దేవతలను పూజించుట, యిట్లు పూజించుటవలన కృష్ణుని పూజించుట యనునది యథార్థము కాదు. ఇది అవ్యక్త ప్రవర్తన.

శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ
న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవంతి తే॥　24

తా. ఎందుచేతననగా, సమస్త విధములగు యజ్ఞములయందనుభవించువాడను ప్రభుడను "నేనే" అయినను, నన్ను యథార్థముగా నెరుగరు. అందుచేత వారు జారి పడిపోవు చున్నారు.

వ్యా. సమస్త విధములగు యజ్ఞముల యందనుభవించునది జీవుల స్వభావ మను కృష్ణుడని వ్రాసినారు. ఇది మానవులయందున్న గుణములు చేయునది మరల చేసి వారి ననుభవింప జేయునదియేగాని, అనుభవించునది కాదు.

శ్లో॥ యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి
మామ్ ॥　25

తా. దేవతల నారాధించువారు దేవతలను, పితృదేవతల నారాధించువారు పితృదేవతలను, భూతముల నారాధించువారు నన్ను పొందుచున్నారు.

వ్యా. యజ్ఞములు చేయుట, దేవతలను, పితృదేవతలను, భూతములను ఆరాధించి వానిని పొందుట, కృష్ణుని ఆరాధించి కృష్ణుని పొందుట యనునవి యథార్థము కాదు. ఇవి యన్నియును 12 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడినటుల అధికదుఃఖము లకు కారణమగు అవ్యక్తాసక్తితో చేయు అవ్యక్తగతి అనగా ఎరుగని (తప్పు)మార్గ ములు (ప్రవర్తనలు). ఈ అధ్యాయము మొదట 3 శ్లో. లలో విజ్ఞాన సహితమైన జ్ఞానమును చెప్పుచున్నానని, ఇది పరమ ధర్మమని కృష్ణుడు చెప్పినటుల వ్రాసినారు. కాని 4 వ శ్లో. నుండి 25 శ్లోకమువరకును అజ్ఞాన ప్రవర్తనను వ్రాసినారు. విజ్ఞాన సహితమైన జ్ఞానమును తత్వ (పరమ తేజస్సు) దర్శనమైన వారి సేవ చేయుచు, వారిద్వారా పొందగలవని, 4 వ అ. 34 వ శ్లో. లోను, కృష్ణుడు తనను విడువక సేవ చేయువారి యందున్న అజ్ఞానము పోవుటకు వారియందు జ్ఞానమును ప్రవేశింప జేయుచున్నానని 10 వ అ. 10, 11 శ్లో. లలో ఉన్నది యథార్థము. ఈ కృష్ణుడు శరీరమును ధరించియున్న కృష్ణుడేగాని అగోచర మూర్తియని కల్పించిన అవ్యక్త కృష్ణుడు కాదు. (జీవుల స్వభావము కాదు).

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥ 26

తా. ఎవడు నాకు దళముగాని, పుష్పముగాని, పండుగాని, జలముగాని, భక్తితో నిచ్చుచున్నాడో వాడు పరిశుద్ధమైన భక్తితో నిచ్చినదానిని నేను భుజించు చున్నాను.

వ్యా. ఈ శ్లోకమునందు చెప్పబడినవానిని శరీరరూపముతోనున్న కృష్ణునకు ప్రేమతో నిచ్చినప్పుడు కృష్ణుడు భుజించి యుండును. కృష్ణుడు శరీరమును విడిచిన తరువాత వాని విగ్రహములముందు పెట్టినగాని, కృష్ణార్పణ మనినగాని కృష్ణుడు తినుట లేదు. అది కృష్ణుడు తినక పోవుటచే ఆలాగే యుండును. అందేమియును తరుగదు. కాబట్టి ఇప్పుడు 'కృష్ణా! కృష్ణా!' అనునదియు, కృష్ణునికి పెట్టుట అను నదియును యథార్థము కాదు. ఇది అవ్యక్త ప్రవర్తన. ఇప్పుడు ఎవరైనను విజ్ఞానము గలవారి నెరిగి, కృష్ణునికి పెట్టినటులనే వారికి ఆహారము పెట్టినచో వారును భుజింతెదరు. అంతియేగాని వారు శరీరములను విడిచిన తరువాత వారి విగ్రహములను చేసి వానిముందు పెట్టుట యథార్థము కాదు ఇదియును అవ్యక్త ప్రవర్తన.

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వమదర్పణమ్॥ 27

తా. అర్జునా! ఏది చేయుచున్నావో, దేనినితినుచున్నావో, దేనినిహోమము చేయుచున్నావో, దేనిని దానముగ నిచ్చుచున్నావో, ఏ తప మొనర్చుచున్నావో వానిని నాకర్పింపుము.

వ్యా. అర్జునుడుగాని, కృష్ణుని సాంగత్యము చేయువారుగాని ఏమి చేసినను, ఏమి తినినను, దేనిని దానముగ నిచ్చినను, ఏదియైనను కృష్ణునికి చెప్పి, కృష్ణుడు చెప్పినటుల చేయక కర్తృత్వముతో స్వయముగా చేసినచో కృష్ణుని సంబంధులు కారు. అందువలన కృష్ణునియందున్న విజ్ఞాన సంబంధులు కారు. కాని, రాగ, ద్వేషాది గుణములు గలవారి సంబంధులగుదురు. వారి సంబంధమే రాగ, ద్వేషాది గుణముల సంబంధము. కృష్ణునకు తెలియజేసి కృష్ణుడు చెప్పినటుల చేసినచో

కృష్ణుని సంబంధులగుదురు. ఆ కర్మ భారమును కృష్ణుడు (కృష్ణుని యందున్న విజ్ఞానము) వహించియుండును. విజ్ఞానము గలవాడగు కృష్ణునియందు రాగ, ద్వేషాది ప్రకృతి గుణములుండవు. అందుచేత కృష్ణుడు కర్మబంధితుడు కాడు. కృష్ణుడు చెప్పినటుల చేయువారును కర్మబంధితులుగారు. కృష్ణునియందుండి చెప్పునది విజ్ఞానము. అది కర్మరహితులనుగా జేయునదేగాని, కర్మబంధితులనుగా చేయునది కాదు. ఆ విధముగనే విజ్ఞానము గలవారును, వారి సాంగత్యము చేయువారునుకర్మ బంధితులు కారు.

శ్లో॥ శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తోమాముపైష్యసి 28

తా. ఈ విధముగా నీవు సన్యాసయోగముతోకూడిన ఆత్మ గలవాడవై పుణ్య పాపఫలములుగా గల కర్మబంధములనుండి విడువబడి నన్ను పొందగలవు.

వ్యా. 10 వ అ. 10, 11 శ్లో. లలో చెప్పబడినటుల కృష్ణుడు తన సాంగత్యమున తనకు సేవ చేయువారిని తనయందే ప్రేమ, భక్తి గలవారినిగా జేసి, వారియందును విజ్ఞానముతోనున్నజ్ఞానమును ప్రవేశింపజేయును. ఇది కృష్ణునియందున్న విజ్ఞాన ప్రవర్తన. వారు జ్ఞాన, విజ్ఞానములవలన పరమపదమును, సర్వము నెరిగి, గుణరహితులై కర్మరహితులునై జ్ఞానముద్వారా పరమపదమును చూచుచున్నవారై చేరుదురు. ఆ విధముగనె అర్జునుడును కృష్ణుని సాంగత్యము చేయవలెను. సన్యాస యోగముతోకూడిన ఆత్మయనునది లేదు. ఆత్మగలవాడై కర్మబంధములనుండివిడువబడి "నన్ను" అనగా కృష్ణునియందుండి చెప్పుచున్న విజ్ఞానమును పొందుట యనునది యథార్థము కాదు. అర్జునుడు ఏ యోగముతోను పాప, పుణ్యరహితుడు కాడు. పరమపదమును చేరడు.

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తినప్రియః
యేభజంతి తు మాం భక్త్యా మయితేతేషు చాప్యహమ్29

తా. నేను సమస్త భూతములయందును సమానుడను. నాకు ద్వేషింపదగిన వాడును, ప్రేమింపదగినవాడును లేడు. ఎవరు నన్ను భక్తితో సేవించుచున్నారో వారు నా యందున్న వాడనగుదును.

తా. జ్ఞానము గలవారియందు నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్వము, పవిత్ర ప్రేమభావములుగల విజ్ఞానమును ఉండును. కాని, రాగ, ద్వేష, అహం కార, కర్తృత్వాది ప్రకృతి గుణములుండవు. అందువలన రాగ, ద్వేషములతో ప్రవర్తించుటకు వారిచేత కాదు. కాబట్టి వారికి ద్వేషింపదగినవాడును, ప్రేమింప దగినవాడును లేడు. వారిని సర్వభూతములయందును భేద భావము లేనివారని చెప్ప వలెను. వారు విజ్ఞానముచేత అందరియందును పవిత్రప్రేమభావములతో ప్రవర్తింప బడుచుందురు. అట్టివారు చెప్పునటుల చేయువారిని వారిసంబంధులుగను, వారియందు ప్రేమ గలవారినిగను, భక్తి గలవారినిగను వారే చేయుదురు. అట్టి భక్తితో వారికి విజ్ఞానము గలవారే కాన్పించుచుందురు. వారియందు భక్తి యున్నపుడే వారికాభక్తి గలవారును కాన్పించుచుందురు. విజ్ఞానము, భక్తి యనునవి శరీరరూపములతోనే ఒకరికొకరు కాన్పించుచుందురు. కాని అవి వేరు, వేరుగా కాన్పించవు. భక్తి విజ్ఞానము గలవారియందును, విజ్ఞానము భక్తి గలవారియందును ఉన్నపుడు భక్తులు విజ్ఞానము గలవారియందును, విజ్ఞానము గలవారు భక్తి గలవారియందును ఉన్నవారగుదురు. భక్తి విజ్ఞానమును బంధించుటయందు బలము గలది. అందువలన విజ్ఞానము గలవారు భక్తి గలవారికి వశులగుదురు వారును విజ్ఞానము గలవారికి వశులగుదురు. ఇట్లు భక్తిద్వారా భక్తులయందున్న విజ్ఞానము ఆ భక్తులు చేయు కార్య భారమును వహించి యుండును. అట్టి విజ్ఞానము అందరియందును ఉన్న ఈశ్వరుడను స్వభావము కాదు. అందరియందును ఈ విజ్ఞానమున్నచో విజ్ఞానము గలవారియందు భక్తి యుండుటెందులకు? వారికి సేవ చేయుటెందులకు? ఇది అందరియందును లేదు. ఇది యున్నవారిని ప్రార్థన చేసినను, స్మరణ చేసినను, వారు చెప్పు వాక్యములను పారాయణ చేసినను వారియందున్న విజ్ఞాన సంబంధులుకారు. భక్తులుకారు. జ్ఞానము గలవారు శరీరమును విడిచిన తరువాత వారియందున్న విజ్ఞానముయొక్క నిష్కామాది పవిత్ర ప్రేమభావముల ప్రవర్తనవలన వారిని వారిపేరులతో ధ్యానము,ప్రార్థన నామస్మరణ మొదలగు అనేక విధములుగ అవ్యక్తముగా చేయుచున్నారు. అవ్యక్త ప్రవర్తన తప్పు ప్రవర్తన.

శ్లో॥ అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః॥ 30

తా. గొప్ప దురాచారము గలవాడైనను, అనన్య భావముతో నన్నే సేవించిన యెడల వాడు నాయందు దృఢనిశ్చయము గలవాడగుచున్నాడు. వానిని సాధువుగా తలంచవలెను.

వ్యా. ఎట్టి పాపకర్మలు చేయువాడైనను ఇతర ప్రపంచ సంబంధమును విడిచి కృష్ణుని సాంగత్యమున కృష్ణుని సేవ చేయుచుండినచో వాడు కృష్ణునియందు ప్రేమ గలవాడును దృఢనిశ్చయము గలవాడు నగుచున్నాడు.

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి।
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31

తా. అట్టివాడు శీఘ్రముగ ధర్మాత్ముడగుచున్నాడు. శాశ్వతమైన శాంతిని పొందుచున్నాడు. అర్జునా! నా భక్తుడు నాశము పొందువాడు కాడని ప్రతిజ్ఞ చేసి చెప్పుము.

వ్యా. అట్టివారు భక్తి గలవారై ఆ భక్తితో కృష్ణునియందున్న విజ్ఞానమును, జ్ఞానమును పొందినవారై జ్ఞానముద్వారా పరమ తేజోపద దర్శనమైన తదుపరి విజ్ఞానమువలన గుణరహితులు, కర్మరహితులునై జ్ఞానముద్వారా పరమ తేజోపదమును చూచు శాశ్వతమైన పరమశాంతి ననుభవించుచుందురు. ఆ విధముగనే కామ, రాగ ద్వేషాది గుణములు గలవారు పరమపదము నెరిగినవారిని ప్రవర్తనద్వారా గుర్తించి వారి సాంగత్యమున వారియందున్న జ్ఞాన, విజ్ఞానములను పొంది వీనిద్వారా పరమ శాంతి ననుభవించెదరు. పరమపదమును చేరెదరు. అట్టి వారెన్నటికిని చెడరని ప్రతిజ్ఞ చేసి చెప్పవలయును.

శ్లో. మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః
పాపయోనయః ।
స్త్రియోవైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం
గతిమ్ ॥ 32

తా. అర్జునా! ఎట్టి పాప జన్మములు గలవారైనను, స్త్రీలైనను, వైశ్య శూద్రాదులైనను, నన్నాశ్రయించి పరమగతిని పొందుచున్నారు.

వ్యా. వారందరును కృష్ణుని సాంగత్యమున జ్ఞాన విజ్ఞానముల నార్జించి వాని వలన పరమపదమును చేరుచున్నారు.

శ్లో॥ కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా।
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వమామ్।33

తా॥ పుణ్యులగు బ్రాహ్మణులను, ఆ విధముగనే భక్తులగు రాజర్షులను గురించి మరల చెప్పవలెనా ? అనిత్యమైనదియు, సుఖకరము కానిదియునగు ఈ లోకమును పొందియున్నావు. నన్ను సేవింపుము.

వ్యా. పైన 32 వ శ్లోకమునందు చెప్పబడిన వారివలెనే, పుణ్యులగు, బ్రాహ్మణులును, రాజర్షులును, వారు చేయు కర్మలను విడిచి కృష్ణుని సాంగత్యమునకు వచ్చి కృష్ణునిద్వారానే కృష్ణుని యందున్న విజ్ఞానముతో నున్న జ్ఞానమును (జ్ఞాన, విజ్ఞానములను) ఆర్జించి, వానిద్వారా పరమపదమును చేరగలరు. ఆ విధముగనే, ఎవరైనను జ్ఞాన, విజ్ఞానములు గలవారి సాంగత్యమున వారిద్వారానే జ్ఞాన విజ్ఞానముల నార్జించి వీనిద్వారానే పరమపదమును చేరవలయును. ఈ లోకము దుఃఖాలయము, అనిత్యమునై ఉన్నది. పరమపదముగాఉన్న పరమతేజస్సు శాశ్వత ఆనందము గలదియు, నిత్యమునై ఉన్నది.

శ్లో॥ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః34

తా. నాయందే మనస్సు (ప్రేమ) గలవాడవును, నాయందే భక్తి గలవాడవును, నన్నే పూజించు వాడవునగుము. నాకే నమస్కారము చేయుము. ఈ విధముగా నాయందున్న భక్తి గలవాడవై నన్నే పొందగలవు.

వ్యా. పై శ్లోకములయందు చెప్పబడినవారును, అర్జునుడును ఈ శ్లోకము ననుసరించి యుండవలెను. ఇందు చెప్పబడిన విధముగా, కృష్ణుని సాంగత్యమున కృష్ణునియందున్న విజ్ఞాన సంబంధులగుదురు. విజ్ఞానమే వారియందును జ్ఞాన,విజ్ఞానములు ప్రవేశించుటకు వారియందు కృష్ణుని యందే యుండు భక్తిని ప్రవేశింప జేయును. అట్టి భక్తిచేతనే కృష్ణునియందుండి "నన్ను" అను విజ్ఞానమును పొందు

దురు. నన్నే పొందగలవని కృష్ణునియందుండి చెప్పినది విజ్ఞానము. ఈ విధముగనే ఎప్పుడైనను, ఎవరైనను పరమపదము నెరిగిన వారిసాంగత్యమువలన వారిద్వారానే వారియందే యుండు భక్తిని పొంది, ఆ భక్తిచేతనే వారియందున్న విజ్ఞానమును పొందవలెను. 26 వ శ్లోకమునుండి 34 వ శ్లోకమువరకును జ్ఞాన విజ్ఞానములుగల కృష్ణుడు శరీరమును ధరించి యున్నపుడు వాని సాంగత్యమున నున్నవారిని గురించి చెప్పబడినది. ఇదియే సత్సాంగత్యము.

ఈ అధ్యాయమున మొదట విజ్ఞాన సహితమైన జ్ఞానమును పొందు విద్యను చెప్పుచున్నానని చెప్పెను. ఇది విద్యలలో కెల్ల రాజవిద్య. పవిత్రమైనది, ఉత్తమమైనది, అనుభవమైనది, రహస్యమైనది. సుఖకరమైనది, నాశరహితమైనది యని ఈ అధ్యాయమున 1, 2, 3 శ్లోకములయందు చెప్పబడి యున్నది. వానిని పొందు విద్య అందరును ఎరుగరు. ఎరుగనివారు ఎరిగినటుల ఇతరులకు చెప్పుట అవ్యక్త మార్గము. విజ్ఞానమే ఈ విద్య నెరిగి యున్నది. అందువలన ఈ విద్య విజ్ఞానము గలవారి ద్వారానే తెలియవలెను. ఇంకేవిధముగను తెలియలేరు. ఇంతు 26 వ శ్లోకమునుండి 34 వ శ్లో. వరకు చెప్పినదియే జ్ఞానవిద్య. ఈ ప్రపంచమున సర్వ శరీరములయందును ఉన్న జీవుల స్వభావమును ఈశ్వరుడని, కృష్ణుడని, వానిని ధ్యానించుమని, స్మరించుమని, శరణమనుమని ఈ గీతయందు చెప్పినదంతయును రాగద్వేషాది గుణముల తప్పు ప్రవర్తనయేగాని, జ్ఞాన, విజ్ఞానములను పొందు విద్య కాదు.



# గీతా వ్యాఖ్యానము

## విభూతి యోగము

## 10 వ అధ్యాయము

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి
హితకామ్యయా ॥ 1

తా. అర్జునా! నేను చెప్పునదంతయు ప్రీతితో వినుచున్న నీకు హితము కలుగజేయవలయునను కోరికతో మరల చెప్పబోవుచున్న నాయొక్క పరమ వాక్యమును వినుము.

వ్యా. మరల పరమవాక్యమును చెప్పుచున్నానని యిందు వ్రాసినది యథార్థము కాదు. ఈ చెప్పబోవునది పరమ వాక్యముగాదు. అవ్యక్త ప్రవర్తన. అనగా గ్రుడ్డివారినిగా ప్రవర్తింపజేయు తప్పు ప్రవర్తన. కృష్ణునికి యీ శ్లోకమునందు వ్రాసిన కోరిక లేదు. ఏ కోరికయును లేదు.

శ్లో॥ న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః॥ 2

తా. దేవతలు, మహర్షులు నాయొక్క వ్యుత్పత్తి నెరుగరు. ఎందుచేతననగా నేను అన్ని విధములచేతను, దేవతలకును, మహర్షులకును మొదటివాడను.

వ్యా. ఇందు "నేను" అనునది జీవుల స్వభావమును. ఇది ప్రకృతి (మాయ) యందుండి వచ్చిన జీవుల యందున్నది. ఎవ్వరును ఈ స్వభావము జీవుల యందెట్లున్నదియు నెరుగరు. ఎందుచేతననగా, సర్వజీవులును మాయా భ్రమచేత

మాయయందుండి వచ్చినవని 8 వ అ. 18, 19 శ్లో. లలో ఉన్నది. ఇది కృష్ణుని ఉత్పత్తి కాదు. ఈ స్వభావము జీవులకు మాయయందుండి వచ్చినపుడే యున్నది. దీనినికృష్ణుడు తానని, తానుమొదటి వాడనని చెప్పినటుల వ్రాసినది కల్పితము.

శ్లో॥ యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరం ।
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥ 3

తా. ఎవరు, లోకమునకు మహేశ్వరుడనైన నన్ను పుట్టుక లేనివానిగను, ఆది లేనివానిగను నెరుగుచున్నారో, వారు మనుష్యులలో మోహరహితులై సర్వ పాపములనుండియును విడువబడుచున్నారు.

వ్యా. మహేశ్వరుడనునది బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు అను త్రిగుణములలో ఈశ్వరుడనునది. ఇది జీవులకు దేనినైనను అంటించు, అనుభవింపజేయు జీవుల స్వభావము. దీనినే మహేశ్వరు డనుచున్నారు. ఈస్వభావము జీవులయందు ఉన్నది. పుట్టునది జీవులు. ఇది జీవుల యందుండునదియే గాని పుట్టునది కాదు. ఈ స్వభావమను గుణముయొక్క ప్రవర్తనను విజ్ఞానము గలవారెరుగుదురు. కాని ఇతరులెరుగరు. మోహరహితులను, కర్మరహితులను చేయునది విజ్ఞానమేగాని, మహేశ్వరుడను స్వభావము కాదు.

శ్లో॥ బుద్ధిర్జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాఽభయమేవ చ4

శ్లో॥ అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః॥ 5

తా. బుద్ధియును, జ్ఞానమును, మోహరాహిత్యమును, ఓర్పు, సత్యము, బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, సుఖము, దుఃఖము, పుట్టుకయును, నాశమును, భయమును, భయము లేకపోవుటయును, ప్రాణులకు హింస చేయక పోవుటయును, సమతయును, సంతుష్టియును,తపస్సును, దానమును కీర్తియును, అపకీర్తియునగు నానావిధములైన భావములు నా వలననే కలుగు చున్నవి.

వ్యా. 4, 5 శ్లో.లలో చెప్పబడిన నానావిధములైన భావములు (గుణములు) ఆ గుణములు గలవారి సాంగత్యమున జీవులకు వాని స్వభావమువలననే సంభవించు చున్నవి. జీవులు వానియందున్న గుణములయొక్క కర్మలనుబట్టి మరల యింకొక పుడు ఆ జీవుల స్వభావము ప్రవర్తించు కర్మలవలన నానావిధములైన ఫలముల అనుభవించుచున్నవి. ఇది స్వయముగా ఎవరికిని ఏమియును కలుగజేయునదికాదు. ఈ స్వభావము పరమపదమును చూచు జ్ఞానమను భావమును, విజ్ఞానమను భావమును సంభవింపజేయునది కాదు.

శ్లో॥ మహర్షయస్సప్తపూర్వే చత్వారో మనవస్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః 6

తా. ఈ లోకమునందు ఈ ప్రజలు ఎవరివలన పుట్టిరో, అట్టి పూర్వీకులైన సప్తమహర్షులున్నూ, నలుగురు మనువులున్నూ నా భావము గలవారై నా సంకల్పమునుండి పుట్టి యున్నారు.

వ్యా. ఈ శ్లోకమునందు చెప్పబడిన వారందరును స్వభావము గలవారై ప్రకృతి (మాయ) యందుండి మాయాభ్రమయొక్క సంకల్పమువలన సృష్టింపబడి యున్నారు. ఈ విధముగనే సర్వప్రపంచము ప్రకృతి (మాయ)నుండియే సృష్టింప బడినది. సృష్టించునది బ్రహ్మ అనగా భ్రమ. సృష్టింపబడిన తరువాత జీవులకు గుణములు సంభవించుట, ఆ గుణముల కర్మల ననుసరించి జీవులు అనేక జన్మల యందు తిరుగుచుండుట వానిస్వభావముయొక్క ప్రవర్తనవలననే. నాభావము అనగా కృష్ణుడను జీవుని స్వభావము. ఇది అందరికిని సహజముగనే యున్నది. ఇందు నా భావము గలవారై నాసంకల్పమునుండి అనినది భ్రమయొక్క సంకల్పమునుండి స్వభావము గలవారై పుట్టి యున్నారు. మహేశ్వరుడననిన కృష్ణుడను స్వభావము నందు జీవులకు సంభవించు ఏ భావమును లేదు. ఇది జీవులయందున్న గుణములు చేయు కర్మల ననుసరించి సంకల్పములను ప్రేరేపించి ప్రవర్తించునది. ఈ శ్లోకము నందు చెప్పబడినవారు నా భావము గలవారైనా సంకల్పమునుండి పుట్టియున్నారని వ్రాసినది కల్పితము.

శ్లో॥ ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ।
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః 7

తా. నా యొక్క ఈ విభూతి యోగమును యథార్థముగా నెవడు తెలియునో వాడు చలింపని యోగమును పొందుచున్నాడు. దీనియందు సందేహము లేదు.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. జీవుల సంస్కారము ననుసరించి కర్మలయందు ప్రవర్తించుట, ఆ కర్మఫలమును వానిచేత అనుభవింపజేయుటజీవుల స్వభావ లక్షణము. దీని విభూతి యోగమేమియును లేదు. దీనిని విజ్ఞానముగల వారెరిగి యున్నారు. జీవుల స్వభావము చేయు కర్మలను కృష్ణుడు తన విభూతి యోగమని చెప్పినటుల కల్పించి వ్రాసినారు.

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః। 8

తా. నేను సర్వమునకును ఉత్పత్తి కారణమును, సర్వము నా వలననే ప్రవర్తించు చున్నదని తలంచుచున్న భావము గలవారై పండితులు నన్ను భజించు చున్నారు.

వ్యా. ఈ శ్లోకమునందు వ్రాయబడిన పండితులు ఈ స్వభావము నెరిగిన వారు కాదు. మాయాభ్రమయే ఉత్పత్తికి కారణము. ఈసర్వమునుజీవులయందున్న రాగద్వేషాది గుణముల కర్మల ననుసరించి వాని స్వభావముచేత ప్రవర్తింపబడు చున్నది. ఇది ఒకనియందున్న మాయాగుణములు ఇంకొకనికి చేయు దానిని మరల ఇంకొకపుడు వానికి చేయునది. దీనిని భజించు వారికి ఏదియును రాదు. ఏదియును తెలియదు. ఇది విజ్ఞానము గలవారెరిగి యున్నారు. మాయ యందుండి వచ్చిన జీవుల స్వభావముయొక్క ప్రవర్తనను కృష్ణుని ప్రవర్తనయని వ్రాసినారు. ఇది కల్పితము.

ఈ సర్వమును బ్రహ్మ(భ్రమ)యొక్క పగటికాలమందు ప్రకృతి(మాయ) యందుండి వచ్చుచున్నదని, రాత్రి రాగానే ఆ ప్రకృతి (మాయ) యందే కలియు చున్నదని పగలు రాగానే మరల వచ్చుచున్నదని 8 వ అ. 18, 19 శ్లో. లలో ఉన్నది. ఇది కృష్ణుని ఉత్పత్తి కాదు. మాయాభ్రమయొక్క ఉత్పత్తిని కృష్ణుని యొక్క ఉత్పత్తియని వ్రాసినారు. ఇది కల్పితము.

మాయ కార్యకారణ కర్తృత్వములకు హేతువని, జీవుడు సుఖ దుఃఖముల ననుభవించుటకు హేతువని 13 వ అ. 21 వ శ్లో.లోను, జీవుడు తనయందుమాయా

గుణములుండుటవలన ఈ గుణము లనుభవించుచున్నాడని, వీనివలన అనేక ఉత్కృష్ట, నికృష్ట జన్మల నెత్తుటకు కారణమగుచున్నాడని 22 వ శ్లో. లోను ఉన్నది. జీవులయందున్న కామ రాగద్వేషాది గుణముల కర్మలవలన ఆ జీవులు వాని స్వభావముచేత అనేకజన్మ కర్మసుఖదుఃఖములననుభవించుచున్నవి. ఇట్లుజీవులు వాని సంస్కారము ననుసరించి వాని స్వభావముచేత అనేకజన్మలను, సుఖదుఃఖము లను అనుభవించుచున్నవి. ఇట్టి ప్రపంచమును మాయ తన భ్రమద్వారా తన యందుండి సృష్టించుకొనినది. అంతియేకాని తాను సర్వమునకును ఉత్పత్తి కారణ మని, సర్వమును తనవలననే ప్రవర్తింపబడుచున్నదని జ్ఞాన, విజ్ఞానములు గల కృష్ణుడు చెప్పినటుల ఈ శ్లోకము నందున్నది యథార్థము కాదు.

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరం ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ 9

తా. నా యందే చిత్తమును, ప్రాణమును ఉంచి ఎల్లప్పుడును నన్ను ఒకరి కొకరు బోధించువారును, చెప్పుకొనువారును తృప్తులగుచు ఆనందించుచున్నారు.

వ్యా. కృష్ణుని సాంగత్యము గలవారు కృష్ణునియందు ప్రేమ గలవారై కృష్ణుని గురించి ఒకరికొకరు బోధించుకొనినవారును, చెప్పుకొనినవారును తృప్తులై ఆనందించి యుందురు. ఇది కృష్ణుడున్నపుడు జరిగినదియేగాని, తరువాత కాదు.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకం ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే 10

తా. పైన చెప్పబడినవారు దేనిచేత నన్ను పొందగలరో, అట్టి బుద్ధి యోగ మును ఎల్లప్పుడును విడువక ప్రీతి పూర్వకముగా నన్ను సేవించు వారలకు ఇచ్చు చున్నాను.

వ్యా. ఇందు చెప్పబడిన "నన్ను" అను విజ్ఞానము అందరియందును లేదు. ఎవరైనను అది యున్నవారినుండియే వారియందు భక్తితోనే దానిని పొందవలెను. కృష్ణుడు తనను విడువక సేవ చేయువారలు తనయందున్న "నన్ను" అను విజ్ఞాన మును పొందుటకు వారిని తనయందు బుద్ధి (భక్తి) గలవారినిగా చేయును.

శ్లో॥ తేషా మేవానుకంపార్థమహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥ 11

తా. వారిభావమునందున్న నేను వారిననుగ్రహించి వారియందున్నఅజ్ఞానము వలన కలిగిన అంధకారము నశించుటకు ప్రకాశించుచున్న జ్ఞానమనుదీపమును ప్రవేశింపజేయు చున్నాను.

వ్యా. అట్టి భక్తి యను భావముద్వారా వారియందున్న "నేను" అనిన కృష్ణుడు (విజ్ఞానము) వారియందున్న అజ్ఞానమను అంధకారము పోవుటకు కృష్ణునియందున్న జ్ఞానమను దీపమును వారియందును ప్రవేశింపజేయును. అప్పుడు వారికి జ్ఞానము ద్వారా పరమపదము కాన్పించును. జ్ఞానముద్వారా వారికికాన్పించిన పరమపదమును ఈ సర్వమును విజ్ఞానము ఎరిగి యున్నది. అప్పుడు వారియందున్న అజ్ఞానమువెళ్ళి పోవును. కాని ఇందు వ్రాసిన అజ్ఞానమువలన కలిగిన అంధకారము అనగా సంస్కారకర్మ అనుభవించి నశించును.

10, 11 శ్లో. లు కృష్ణుని సాంగత్యము చేయు వారిని గురించి చెప్పి యున్నవి. కృష్ణుడు శరీరమును విడిచిన తర్వాత కృష్ణుడు లేడు. కృష్ణుని సేవించుట యనునది లేదు.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్॥ 12

శ్లో॥ ఆహుస్త్వామృషయస్సర్వే దేవర్షిర్నారదస్తథా।
అసితోదేవలోవ్యాసస్స్వయం చైవబ్రవీషి మే॥ 13

తా. నీవు పరబ్రహ్మమనియు, పరంధాముడవనియు, పరమపావనుడవనియు శాశ్వతుడవగు దివ్యపురుషుడవనియు, దేవతలలో మొదటివాడవనియు, పుట్టుక లేనివాడవనియు, ప్రభువనియు, నిన్ను దేవర్షియగు నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు, సమస్త ఋషులును చెప్పుచున్నారు. ఆ ప్రకారముగానే, నీవుస్వయముగా నాకు చెప్పుచున్నావు.

వ్యా. కృష్ణుడు పరబ్రహ్మము అనగా పరమతేజస్సు కాదు. పరమ తేజో పదమును చూచు జ్ఞానముగలవాడు. పరమపదమును చేరువాడు. అందువలన జన్మము లెత్తుటయుండదు. అందువలన పరమపావనుడు, శాశ్వతుడు, దివ్యపురుషుడని వ్రాసినారు. ప్రభువనునది జీవుల స్వభావము. ఇది పరమపురుషుడు కాదు. దేవతులలో మొదటివాడవనినదికాదు.

శ్లో॥ సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ।
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః॥ 14

తా. కృష్ణా! నీవు చెప్పినదంతయును సత్యమని తలంచుచున్నాను. భలవంతుడా! నీ యొక్క నిజస్వరూపమును దేవ, దానవులు తెలియజాలకున్నారు.

శ్లో॥ స్వయమేవాఽఽత్మనాఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే॥ 15

తా. ప్రాణులకు భావమును సంభవింపజేయు వాడవును, సకల ప్రాణులను పరిపాలించు వాడవును, దేవదేవుడవును జగన్నాధుడవునైన పురుషోత్తమ! నిన్ను నీ చేత స్వయముగా నీవేయెరిగి యున్నావు.

వ్యా. ప్రాణులకు భావము (జ్ఞానము)ను సంభవింపజేయునది 8వ అ 4వశ్లో లో చెప్పబడిన అధి యజ్ఞుడను "నేను" అనిన కృష్ణుని యందున్న విజ్ఞానము. సకల ప్రాణులను వాని కర్మల ననుసరించి పరిపాలించునది ప్రాణుల స్వభావము. దేవ దేవుడును, జగన్నాథుడును లేడు. జ్ఞాన విజ్ఞానములు గలవారందరును పురుషోత్తములు. జ్ఞాన విజ్ఞానములు గలవాడగుటవలన కృష్ణుడును పురుషోత్తముడు. కృష్ణుడు తనయందున్న విజ్ఞానమువలన తానుజీవుని, తన (జీవుని) స్వభావమును ఎరిగి యున్నాడు. ఈ విధముగ జ్ఞాన, విజ్ఞానములు గలవారందరును విజ్ఞానము వలననే వారిని వారెరిగి యున్నారు. సర్వము నెరిగియున్నాడు. నీ నిజస్వరూపమును దేవ దానవులు తెలియజాలకున్నారని యిందు వ్రాసినది మాయయందుండి వచ్చిన జీవుల స్వభావమును. కృష్ణుడను జీవుడుగాని, జీవుని స్వభావముగాని సర్వజీవుల స్వభావముగాని, ఈ స్వభావముగల జీవులుగాని పరమతేజస్సు కాదు. దేవుడు (భగవంతుడు) కాదు.

శ్లో॥ వక్తుమర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మవిభూతయః।
యాభిర్విభూతిభిర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి॥ 16

తా. నీవు ఏ మహిమలచేత ఈ లోకములను వ్యాపించియున్నావో, అట్టి నీ మహిమలు దివ్యములైనవి. వానిని చెప్పుటకు నీవే తగుదువు.

వ్యా. కృష్ణుడు ఏ మహిమలచేతను ప్రపంచమున వ్యాపించిలేడు. ఈ మహిమలు కృష్ణునియందు లేవు. ఈ సర్వప్రపంచమును, మహిమలుగల గుణములును మాయ యందున్నవి. మాయ యందుండి సృష్టింపబడి యున్నవి. మహిమలు దివ్యములని యిందు వ్రాసినది యథార్థము కాదు. ఇవి యన్నియును హీనములైనవి. నశించునవి. ఇవి జీవుల స్వభావమునందును లేవు.

శ్లో॥ కథం విద్యామహం యోగింస్త్వాం సదా పరిచిన్తయన్।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా॥ 17

తా. భగవంతుడా! నా చేత ఏ యే భావములతో చింతింపదగిన వాడవై యున్నావు? ఓ యోగీ! నేను నిన్ను ఏ రూపము గలవానినిగా, ఎల్లప్పుడును చింతన చేయుచు తెలిసికొనగలను?

శ్లో॥ విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన। ।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తిమేఽ
మృతమ్ ॥ 18

తా. కృష్ణా! నీ యొక్క యోగమును, విభూతులను విస్తారముగా మరల చెప్పుము. ఏలయనగా నీ వాక్యామృతము వినుచున్న నాకు తృప్తి లేకున్నది.

వ్యా. విభూతులనునవి లేవు. ఇందు అర్జునుడడిగినటుల యున్నవన్నియును ఈ గీత వ్రాసినవారి కల్పితములు. కృష్ణుడు యోగి కాదు. భగవంతుడు కాదు. భగవంతుడు లేడు.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ హన్తతే కథయిష్యామి దివ్యాహ్యాత్మ విభూతయః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నాస్త్యన్తోవిస్తరస్యమే॥ 19

తా. అర్జునా! నాయొక్క విస్తారమున కంతము లేదు. అయినను, దివ్యము లైనట్టియు, ముఖ్యములైనట్టియు, నా విభూతులను నీకు చెప్పెదను.

వ్యా. నా విభూతులని, దివ్యములైనవని కృష్ణుడు చెప్పెనని కల్పించి వ్రాసినదియేగాని, యథార్థము కాదు.

శ్లో॥ అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ॥ 20

తా. అర్జునా! సకల భూతములయందున్న ఆత్మ నేను. భూతములయొక్క ఆది, మధ్య, అంతములును నేనే.

వ్యా మాయచేత సృష్టింపబడిన సకల భూతములయందున్న ఆత్మ అనగా జీవుడను నేను అనినను, కృష్ణుడను శరీరమునందున్న జీవుడును, సమస్తశరీరముల యందున్న జీవులును ఒకలాంటివే. లేక జీవుల స్వభావమును "నేను" అనినను కృష్ణుడను జీవుని స్వభావము సర్వజీవులకున్న స్వభావమును ఒకలాంటిదే. స్వభావముతో నున్న సమస్త జీవులును ఒకలాంటివేగాని, ఒకటి కాదు. భూతములు ఉండుటకు, నశించుటకు, మరల పుట్టుటకు జీవునియందున్న గుణముల కర్మల నను సరించి వాని స్వభావమువలన కలుగుచున్నది గాని కృష్ణునివలన గాదు. కృష్ణుడు "నేనే" ననుట యథార్థము కాదు. కృష్ణుడు గాని, సకల భూతములయందున్న జీవులుగాని, జీవుల స్వభావముగాని ఆత్మ కాదు, ఆత్మ లేదు.

శ్లో॥ ఆదిత్యానామహం విష్ణుర్జోతిషాం రవిరంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణా మహం శశీ॥ 21

తా. ఆదిత్యులలో విష్ణువును, ప్రకాశింపజేయు వారిలో కిరణములుగల సూర్యుడను నేనే. మరుత్తులలో మరీచి యనువాడను, నక్షత్రములలో చంద్రుడను నేనేయై యున్నాను.

వ్యా. ఈ శ్లోకమునందు "నేనే" అని వ్రాసినది సర్వ శరీరములయందున్న జీవులను. అవి ఏకలాంటివేగాని కృష్ణుడు కాదు.

శ్లో॥ వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః।
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా 22

తా. వేదములలో సామవేదమును, దేవతలలో దేవేంద్రుడను, ఇంద్రియములలో మనస్సును (జీవుల స్వభావమును) భూతముల లోపల చైతన్యమును నేనే యగుచున్నాను.

శ్లో॥ రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసాం।
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్॥ 23

తా. రుద్రులలో శంకరుడను యక్ష రాక్షసులలో కుబేరుడును, వసువులలో అగ్నియును, పర్వతములలో మేరు పర్వతమును, నేనే యగుచున్నాను.

శ్లో॥ పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిం
సేనానీనామహం స్కన్దస్సరసామస్మి సాగరః॥ 24

తా. అర్జునా! నన్ను పురోహితులలో శ్రేష్ఠుడగు బృహస్పతినిగా నెరుంగుము. సేనా నాయకులలో కుమారస్వామియును, సరస్సులలో సముద్రమును, నేనే యగుచున్నాను.

శ్లో॥ మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరం।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం
హిమాలయః॥ 25

తా. మహర్షులలో భృగుమహర్షియును, వాక్కులలో ఏకాక్షరమగు ఓంకారమును యజ్ఞములలో జపయజ్ఞమును, స్థావరములలో హిమాచలమును నేనే.

శ్లో॥ అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః।
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలోమునిః॥ 26

తా. సమస్త వృక్షములలో రావిచెట్టును, దేవ ఋషులలో నారదుడును, గంధర్వులలో చిత్రరథుడును, సిద్ధులలో కపిల మునియును, నేనే యగుచున్నాను.

శ్లో॥ ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవం।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్॥ 27

తా. నన్ను గుఱ్ఱములలో అమృతములో పుట్టిన "ఉచ్చైశ్శవము"గను, ఏనుగులలో ఐరావతముగను, మనుష్యులలో నరులను పాలించెడు రాజుగను ఎరుంగుము.

శ్లో॥ ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పస్సర్పాణామస్మి వాసుకిః॥ 28

తా. ఆయుధములలో వజ్రాయుధమును, గోవులలో కామధేనువును, ప్రజల వ్యుత్పత్తికి కారణుడైన మన్మథుడను, సర్పములలో వాసుకియును నేనే యగుచున్నాను.

శ్లో॥ అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహం ।
పితౄణామర్యమా చాస్మి యమస్సంయమతా
మహమ్ ॥ 29

తా. నాగుపాములలో అనంతుడను, జలదేవతలలో వరుణుడను, పితృదేవతలలో అర్యముడను, నియమించువారిలో యమ ధర్మరాజును నేనే యగుచున్నాను.

శ్లో॥ ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహం ।
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ
పక్షిణామ్ ॥ 30

తా॥ అసురులలో ప్రహ్లాదుడును, లెక్కపెట్టు వారిలో కాలమును, మృగములలో సింహమును, పక్షులలో గరుత్మంతుడును నేనే యగుచున్నాను.

శ్లో॥ పవనః పవతామస్మి రామశ్శస్త్ర భృతామహం।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మిజాహ్నవీ॥ 31

తా. వేగవంతులలో వాయువును, ధనుర్ధరులలో శ్రీరాముడును, జలచరములలో మకరమును, నదులలో గంగానదియును నేనే యగుచున్నాను.

శ్లో॥ సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా
మహమ్॥ 32

తా. సృష్టికి ఆదియు, మధ్యము, అంతమును నేనే యగుచున్నాను. విద్యలలో అధ్యాతవిద్య, వాద వితండములలో వాదమును నేనే యగుచున్నాను.

శ్లో॥ అక్షరాణామకారోఽస్మి ద్వంద్వస్సామాసికస్య చ।
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః 33

తా. అక్షరములలో 'అ' కారమును, సమాసములలో ద్వంద్వమును, నాశము లేని కాలమును, అంతటను ముఖములుగల బ్రహ్మయును నేనే యగుచున్నాను.

శ్లో॥ మృత్యుస్సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతాం।
కీర్తిశ్శ్రీర్వాక్చనారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా 34

తా. సమస్తమును హరించునట్టి మృత్యుదేవతయును, ఇకముందు కలుగబోవు వారియొక్క పుట్టుకయును, స్త్రీలయొక్క కీర్తియును, సంపదయును, వాక్కును, జ్ఞాపకశక్తియును, మేధాశక్తియును, ధైర్యమును, ఓర్పును నేనే యగుచున్నాను.

శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛంద
సామహం।
మాసానాం మార్గశీర్షోఽహమృతూనాం కుసుమాకరః॥

తా. సామములలో బృహత్సామమును, ఛందస్సులలో గాయత్రియును, ఆలాగుననే మాసములలో మార్గశిర మాసమును, ఋతువులలో వసంత ఋతువును నేనే యగుచున్నాను.

శ్లో॥ ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహం ।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥ 36

తా. మోసగించువానిలో జూదమును నేను, తేజోవంతులయొక్క తేజమును నేను, జయమును, ప్రయత్నమును, సాత్వికులయొక్క సత్వగుణమును నేను.

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః ।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనాకవిః ॥ 37

తా. వృష్ణికులములలో వాసుదేవుడును, పాండవులలో ధనంజయుడును, మునులలో వ్యాసుడును, కవులలో శుక్రాచార్యుడును "నేనే" యగుచున్నాను.

శ్లో॥ దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతాం ।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥ 38

తా. దండించు వారియొక్క దండమును నేను, జయమును గోరువారి నీతిని నేను, రహస్యములలో మౌనమును నేను, జ్ఞానవంతులలో విజ్ఞానమును నేను.

శ్లో॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।
న తదస్తి వినాయత్స్యాన్మయా భూతం చరాచరమ్ ॥

తా. అర్జునా! సమస్తభూతములకు ఉత్పత్తి కారణమేది గలదో అదియంతయును "నేను". నేను లేనట్టి చరాచర భూతమేదియును లేదు.

శ్లో॥ నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥ 40

తా. అర్జునా! నాయొక్క దివ్యములైన విభూతులకు అంతము లేదు. ఇంత వరకు చెప్పబడిన విభూతుల విస్తారము సంగ్రహముగా నాచేత చెప్పబడినది.

శ్లో॥ యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశ సంభవమ్॥ 41

తా. ఏ, యే వస్తువు ఐశ్వర్యవంతమైనదిగను ఉత్సాహము, కాంతియును కలిగియున్నదో ఆ యా వస్తువు నాయొక్క తేజస్సువలన కలిగినదానినిగా నీవు తెలిసికొనుము.

వ్యా. ఈ తేజస్సు పంచభూతములకు, ఈ గుణములకును హితమైనది. ఇది మాయయందున్న తేజస్సు. పరమతేజస్సు కాదు. ఈ తేజస్సు కృష్ణునియందు లేదు. కృష్ణుని తేజస్సు కాదు.

శ్లో॥ అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ 42

తా. విస్తారమైన ఈ జ్ఞానము నీకేమి ప్రయోజనము? అర్జునా! ఈప్రపంచ మంతయును ఒక్క అంశముచేతనే నేను వ్యాపించి యున్నాను.

వ్యా. ఒక్క అంశముచేతనే నేను వ్యాపించి యున్నాననునది మాయ యందుండి మాయ దాని భ్రమద్వారా సృష్టించిన జీవుల స్వభావమును (సహజ గుణ మును). కృష్ణుడు తన సంస్కారమువలన తన స్వభావముచేతనె బోయవానిద్వారా చంపబడినాడు. కృష్ణుని చంపిన తన స్వభావమును కృష్ణుడని వ్రాసినారు. ఇది ఒక లాంటిదే గనుక ఒక్క అంశముచేతనే నేను వ్యాపించియున్నానని వ్రాసినారు. అది యంతయును కల్పితము.

కృష్ణుడు తనకు సేవ చేయు వారియందు తనయందున్న జ్ఞానమును (విజ్ఞాన ముతో యున్న జ్ఞానమును) ప్రవేశింపజేయుదునని ఈ అధ్యాయమున 10, 11 శ్లో. చెప్పబడినటుల ఎవరైనను జ్ఞాన, విజ్ఞానములను అవి యున్నవారి సాంగత్యమున వారిద్వారానే ఆర్జింపవలయును. ఇందు విభూతులనునవి, ఒక్క అంశమునకృష్ణుడు తాను వ్యాపించి యున్నాననునది జీవులయందున్న గుణములు చేయు కర్మలను,

మరల ఇంకొకపుడు ఆ జీవులకు చేయు స్వభావముయొక్క ప్రవర్తన. ఈ స్వభావ మును కృష్ణుడు తానని చెప్పినటుల కల్పించి వ్రాసినారు.

ఈ అధ్యాయమున జీవులును, జీవుల స్వభావమును తానేనని, ఇవి తన విభూతులని చెప్పబడినవన్నియును కృష్ణుడు కాదు. వానిని కృష్ణుడని వ్రాసినచో 4 వ అ. 6 వ శ్లో.లో నా సంస్కారమువలన నా స్వభావముచేత జన్మించుచున్నా ననినవాడును రాముని జన్మయందు వాలిని చంపిన కర్మ (సంస్కారము)వలన తన స్వభావముచేత బోయవానిద్వారా చంపబడినవాడును నగు కృష్ణుడు 8 వ అ. 18,19 శ్లో. లలో చెప్పబడినటుల మాయయందుండి వచ్చి, మాయయందే కలియుచు మరల వచ్చుచు ఈ ప్రపంచమునందు తిరుగుచుండువాడే గాని, జన్మమునకు రాని పరమ పదముగా నున్న పరమతేజస్సు కాదు. భగవంతుడు కాదు. ఈ ప్రపంచములో పరమ తేజస్సు లేదు. భగవంతుడు లేడు. కృష్ణుడు పరమ తేజస్సని, భగవంతుడని ఈ సర్వమును పరమాత్మ (పరమతేజస్సు) స్వరూపములని, భగవంతుని స్వరూ పములని చెప్పుటకొఱకు యిట్లు కల్పించి వ్రాసినారు. ఇట్లు వ్రాయుటవలన అనేకులు తప్పు మార్గమున ప్రవర్తించుచున్నారు.



# గీతా వ్యాఖ్యానము

## విశ్వరూప సందర్శన యోగము

## 11 వ అధ్యాయము

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితం ।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో
మమ ॥ 1

తా. నన్ననుగ్రహించుటకొరకు పరమ రహస్యమైన ఆధ్యాత్మమను పేరు గల వాక్యమును నీవు చెప్పితివి. ఆ వాక్యముచేత నా యొక్క మోహము విడిచి పోయినది.

వ్యా. పరమ తేజోపద దర్శనమైన వారినే మోహము విడుచును. ఎన్ని చెప్పినను అర్జునునియందున్న మోహము అర్జునుని విడువదు. తనయొక్క మోహము విడిచిపోయినదని అర్జునుడు చెప్పినట్లుగా ఈ శ్లోకమునందు వ్రాసినది యథార్థము కాదు.

శ్లో॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్॥ 2

తా. కమల దళనేత్రా! భూతములయొక్క ఉత్పత్తి నాశములను, మహిమయును విస్తారముగా నీ వలన వింటిని.

శ్లో॥ ఏవమేతద్యథాఽఽత్థ త్వమాత్మానం పరమేశ్వర ! ।
ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ!॥ 3

తా. పరమేశ్వరా! నిన్ను గురించి నీవు ఎట్లు చెప్పితివో అదియంతయును యథార్థమే. పురుషోత్తమా! నీయొక్క ఈశ్వర స్వరూపమును దర్శింప కోరిక కలుగుచున్నది.

వ్యా. ఈశ్వర స్వరూపమనునది జీవుల స్వభావముయొక్క ప్రవర్తన. దీనిని కృష్ణునియొక్క ఈశ్వర స్వరూపమని అర్జును డడిగినట్లుగా వ్రాసియున్నారు. కాని, అర్జును డడిగినది కాదు. కృష్ణుడు చెప్పినది కాదు. ఇదివరకు చెప్పినదియును అర్జునునకు తెలిసినట్లుగా వ్రాసియున్నారు. కాని, తెలిసినది కాదు.

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో! ।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన
మవ్యయమ్ ॥ 4

తా. ప్రభువా! దానిని దర్శింప నాకు శక్యమని నీవు తలంచినచో యోగీశ్వరా! నాశరహితమైన నీ రూపమును నాకు చూపుము.

వ్యా. నీ రూపమనునది జీవుల స్వభావముయొక్క ప్రవర్తన.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥ 5

తా. అర్జునా! అనేక విధములైన వర్ణములు, ఆకృతులుగల దివ్యములైన అసంఖ్యాకములగు నా రూపములను జూడుము.

వ్యా. ఇవి జీవుల స్వభావము ప్రవర్తించు కర్మరూపములు. ఇవి కృష్ణుని రూపములని వ్రాసినారు. కాని, కృష్ణుని రూపములు కాదు, ఎవరి రూపములును కాదు.

శ్లో॥ పశ్యాదిత్యాన్వసూన్రుద్రా నశ్వినౌ మరుత స్తథా।
బహూన్యదృష్ట పూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥ 6

తా. అర్జునా! ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీదేవతలను, మరుత్తులను చూడుము. అలాగుననే పూర్వమెన్నడును చూచి యుండనట్టి అనేకము లగు ఆశ్చర్యములను చూడుము.

శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య స చరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి॥ 7

తా. అర్జునా! చరాచర ప్రపంచమంతయును మరియు దేనిని చూడగోరు చున్నావో, దానినికూడ నా దేహమునందు ఇప్పుడు ఒక్కచో నున్న దానినిగా చూడుము.

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్॥ 8

తా. ఈ నేత్రములచేత నన్ను చూచుటకు శక్తుడవు గావు. నీకు దివ్య నేత్ర ముల నిచ్చుచున్నాను. ఈశ్వర సంబంధమగు నా యొక్క యోగ మహిమను జూడుము.

వ్యా. అర్జునుని నేత్రములు ప్రపంచమును కొంతవరకు మాత్రమే చూచు చున్నవి. సర్వప్రపంచమును కృష్ణునియందున్న విజ్ఞానమునకు కాన్పించి అర్జును నకు చెప్పియుండును. అర్జునుడు చూచుట యనునది కాదు. దివ్యనేత్రముల నిచ్చు చున్నాననునదియును యథార్థము కాదు.

సంజయ ఉవాచ ; సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఏవముక్త్వా తతో రాజన్మహా యోగేశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్॥ 9

తా. ధృతరాష్ట్ర మహారాజా! యోగీశ్వరుడగు కృష్ణుడు ఈవిధముగా చెప్పిన పిమ్మట ఉత్తమమగు ఈశ్వర సంబంధమైన రూపమును అర్జునునకు చూపెను.

వ్యా. కృష్ణుడు యోగీశ్వరుడు కాదు. కృష్ణుడు ఈ విశ్వమును అర్జునునకు చూపెనని సంజయుడు చెప్పినది యథార్థము కాదు. విశ్వరూపమనునది జీవుల

యందున్న రాగ ద్వేషాది గుణములు చేయు కర్మలను మరల యింకొకప్పుడు ఆ జీవులకు చేయు జీవుల స్వభావమను గుణముయొక్క ప్రవర్తన. ఇది ఈశ్వరస్వరూపము కాదు. ఈశ్వరుడు లేడు.

శ్లో॥ అనేక వక్త్రనయనమనేకాద్భుత దర్శనం।
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥ 10

తా. అది అనేక ముఖములు, నేత్రములు, అనేకములైన అద్భుత దర్శనములు అనేక దివ్యాభరణములు గలదియు, అనేక దివ్యములైన ఆయుధములు గలదియునై యుండెను.

శ్లో॥ దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనం।
సర్వాశ్చర్యమయం దేవమనన్తం విశ్వతోముఖమ్॥ 11

తా. దివ్యములగు పుష్పమాలికలను, వస్త్రములను ధరించి దివ్యమైన సుగంధములు పూయబడి సర్వమును ఆశ్చర్యకరమైనదిగను, అంతము లేనిదియును, అంతటను ముఖములు గలదియునై యుండెను.

వ్యా. ఇవి యన్నియును ప్రపంచ స్వరూపములు.

శ్లో॥ దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా।
యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః 12

తా. ఆకాశమున సహస్ర సూర్య లొక్కసారిగా ప్రకాశించిన కాంతి ఆ మహాత్ముని కాంతికి సమానమగును.

వ్యా. సహస్ర సూర్యు లొక్కసారిగా ప్రకాశించినను ఈ కాంతి మాయ యందుండి వచ్చిన మాయా సంబంధమైన కాంతియే గాని పరమ తేజో కాంతికాదు.

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా॥ 13

తా. దేవ దేవుడగు కృష్ణుని శరీరమునందొక్కచోటనే బహు విధములుగా విభజింపబడియున్న సమస్త ప్రపంచమును అర్జును డప్పుడు చూచెను.

శ్లో॥ తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః।
ప్రణమ్య శిరసాదేవం కృతాంజలిరభాషత॥ 14

తా. సమస్త ప్రపంచమును చూచిన పిమ్మట అర్జునుడు విస్మయముతో కూడినవాడును, పులకరించిన రోమములు గలవాడునై విశ్వరూపమును ధరించిన దేవునకు శిరస్సుచే నమస్కరించి చేతులు జోడించి యిట్లు పలికెను.

వ్యా. ఇది యంతయును కల్పితము. అర్జునుడు చూచినది కాదు. అర్జునుడు చూచెనని సంజయుడు చూచి చెప్పినది కాదు.

అర్జున ఉవాచ :— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూతవిశేషసంఘాన్।
బ్రహ్మాణమీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్॥ 15

తా. కృష్ణా ! సమస్త దేవతలను, కమలాసనుండైన ప్రభువగు బ్రహ్మను, సమస్త ఋషులను, దివ్యములగు సర్పములను అనేకవిధములైనభూతసమూహము లను చూచుచున్నాను.

శ్లో॥ అనేక బాహూదర వక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్।
నాన్తం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప॥ 16

తా. విశ్వరూపుడవగు కృష్ణా! నిన్ను అనేకములైన బాహువులు, ఉదరములు, ముఖములు, నేత్రములు, అనంతరూపములు గలవానినిగా చూచుచున్నాను. విశ్వేశ్వరా! నీ రూపమునకు ఆది మధ్యాంతములు కనుపించుట లేదు.

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతం।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా-
ద్దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్॥ 17

తా. నిన్ను కిరీటము, గదాయుధము, చక్రాయుధమును గలవానినిగను, తేజోరాశిగను, అంతట ప్రకాశముతో ప్రజ్వలించుచుండెడు సూర్యకాంతి గలవాడవుగను చూడశక్యముగాని వానిగను, పరిమితిలేని వానినిగను చూచుచున్నాను.

శ్లో॥ త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।
త్వమవ్యయశ్శాశ్వత ధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే॥ 18

తా. నీవు తెలియదగిన అక్షరుడవని, ఈ ప్రపంచమునకు ఉత్కృష్టమైన ఆశ్రయమనియు, నాశము లేనివాడవనియు, శాశ్వత ధర్మరక్షకుడవనియు, సనాతన పురుషుడవనియు నా యభిప్రాయము.

శ్లో॥ అనాదిమధ్యాంత మనంత వీర్య-
మనంతబాహుం శశిసూర్యనేత్రం।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపంతమ్॥ 19

తా. నిన్ను ఆది మధ్యాంత రహితునిగను, అనంతవీర్యునిగను, అనంత బాహునిగను, చంద్రసూర్యులే నేత్రములుగా గలవానిగను, అగ్నివలె ప్రజ్వలించు చున్న ముఖములు గలవానిగను, నీ తేజస్సుచేత ఈ ప్రపంచమును తపింపజేయు చున్న వానినిగను చూచుచున్నాను.

శ్లో॥ ద్యావా పృథివ్యోరిదమంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః।

దృష్ట్వాఽద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥ 20

తా. మహాత్మా! భూమ్యంతరిక్షముల మధ్యప్రదేశమంతయును, సర్వ దిక్కులును, నీ చేత వ్యాపింపబడియున్నవి. భయంకరమైనదియును, ఆశ్చర్యకరమైనదియును అయిన నీయొక్క రూపమును చూచి ముల్లోకములును భయపడుచున్నవి.

వ్యా. ఇది కల్పితమేగాని, అర్జునుడు చూచి చెప్పినది కాదు. ముల్లోకములును చూచి భయపడుచున్నవని చెప్పినదియును యథార్థము కాదు. విశ్వరూపమును చూచుటకు దివ్యనేత్రములను అర్జునునకు యిచ్చెనని వ్రాసినారు. ముల్లోకములకు యిచ్చెన దెవరు? ఇది యంతయును కల్పితము.

శ్లో॥ అమీ హి త్వాం సురసంఘా విశన్తి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణన్తి।
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః। 21

తా. దేవతా సమూహములు నిన్ను ప్రవేశించుచున్నవి. కొందరు భీతి గలవారై అంజలి బద్ధులై ప్రార్థించుచున్నారు. మహర్షి సిద్ధ సమూహములు స్వస్తి యని చెప్పుచు నిన్ను సంపూర్ణముగా స్తోత్రములచేత స్తుతించుచున్నారు.

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।
గంధర్వ యక్షాసుర సిద్ధసంఘా
వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥ 22

తా. రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వే దేవతలు, అశ్వినీ దేవతలు, మరుత్తులు, పితృదేవతలు, గంధర్వ, యక్ష, అసుర, సిద్ధ సంఘములు వీరందరును ఆశ్చర్యముతో నిన్ను చూచుచున్నారు,

వ్యా. ఈ శ్లోకములు యథార్థము కాదు.

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహు బాహూరుపాదం।
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వాలోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్॥ 23

తా. మహాబాహూ ! నీయొక్క అనేక ముఖములు, నేత్రములు, చేతులు, తొడలు, పాదములు, కడుపులు, భయంకరములగు అనేకమైన కోరలును గల గొప్పరూపమును చూచి సకల ప్రాణులును భయపడు చున్నవి. అటులనే నేను కూడ భయపడుచున్నాను.

వ్యా. ఇందు వ్రాసిన వారందరును అర్జునుడును విశ్వరూపమును చూచి భయపడుచున్నారని వ్రాసినది యథార్థము కాదు. "నా ఈ రూపమును ఈ కన్నులతో చూడలేవు. నీకు దివ్యనేత్రము లిచ్చుచున్నాను. చూడుమని" కృష్ణుడు చెప్పినట్లు వ్రాసినారు. 20 వ శ్లోకమునుండి 23 వ శ్లోకమువరకు చెప్పబడిన వారందరును ఏ విధముగ చూచి భయపడుచున్నారు ? ఇది కల్పితగాథ.

శ్లో॥ నభస్స్పృశం దీప్తమనేక వర్ణం
వ్యాత్తాననం దీప్త విశాలనేత్రం।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో 24

తా. విష్ణుమూర్తీ ! ఆకాశమునంటియున్నవాడవును, ప్రకాశించుచున్నవాడవును, అనేకమైన రంగులు గలవాడవును, తెరువబడిన నోరుగలవాడవును, జ్వలించుచున్న విశాల నేత్రములు గలవాడవునగు నిన్ను జూచి భయము చెందినవాడనై ధైర్యమును, శమమును పొందజాలకున్నాను.

శ్లో॥ దంష్ట్రాకరాళాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానల
సన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ
జగన్నివాస॥ 25

తా. భయంకరమైన కోరలు గలిగి ప్రళయాగ్నివలె నున్న నీ యొక్క ముఖములను చూచి దిక్కుల నెరుగ లేకున్నాను. సుఖమును పొంద లేకున్నాను. దేవేశా! జగన్నివాసా! ప్రసన్నుడవగుము.

వ్యా. ఈ శ్లోకములయందున్నది కల్పితమే గాని యథార్థము కాదు.

శ్లో॥ అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావని పాలసంఘైః।
భీష్మో ద్రోణస్సూతపుత్రస్తథాఽసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః॥　　26

శ్లో॥ వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాళాని భయానకాని।
కేచిద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాంగైః॥　　27

తా. ఈ ధృతరాష్ట్ర పుత్రులందరును, భూపాలక సమూహములును భీష్మ ద్రోణ, కర్ణులును, యోధవీరులగు నా వారును త్వరపడుచున్న వారగుచు భయంకరములగు కోరలు గల నీయొక్క ముఖములందు ప్రవేశించుచున్నారు. కొందరు నీ పండ్ల సందులయందు జిక్కి నలిగిపోయిన శిరస్సులతో కనబడుచున్నారు.

శ్లో॥ యథా నదీనాం బహవోఽంబువేగాః
స్సముద్రమేవాభిముఖా ద్రవన్తి।
తథా తవామీ నరలోకవీరా
విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి॥　　28

తా. అనేకములైన నదుల ప్రవాహములు సముద్రాభిముఖమై యెట్లు ప్రవహించుచున్నవో ఆ విధముగనే ఈ మానవలోక వీరులందరును ప్రజ్వలించుచున్న నీ ముఖమునందు ప్రవేశించుచున్నారు.

శ్లో॥ యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః।
తథైవ నాశాయ విశన్తి లోకా-
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥ 29

తా. మిడుతలు అతివేగముగా వచ్చి మండుచున్న అగ్నియందు ప్రవేశించి నశించునట్లు, ఈ జనులుకూడ అతివేగముగా వచ్చి నీ వదనములయందు ప్రవేశించు చున్నారు.

వ్యా. ఎటులున్న ప్రపంచము అటులనే యున్నది కాని, కృష్ణుని కోరల యందు, ముఖమునందు ప్రవేశించుచున్నారనునది యథార్థము కాదు.

శ్లో॥ లేలిహ్యసే గ్రసమానస్సమన్తా-
ల్లోకాన్సమగ్రాన్వదనైర్జ్వలద్భిః।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో॥ 30

తా. కృష్ణా! జనులందరిని ప్రజ్వలించుచున్న వదనములచేత మ్రింగుచున్న వాడవై ఆస్వాదించుచున్నావు. నీ యొక్క ఉగ్ర కిరణములు దీప్తులచేత ప్రపంచ మంతట వ్యాపించి తపింప జేయుచున్నవి.

వ్యా. కృష్ణుడు ఈ జనులను మ్రింగువాడు కాదు. ఉగ్ర కిరణములచేత తపింప జేయువాడును కాదు. జ్ఞాన, విజ్ఞానములు గల కృష్ణునియందు విజ్ఞానము యొక్క నిశ్చలమైన శాంతమున్నది గాని, ఉగ్ర కిరణములు లేవు.

శ్లో॥ ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోఽస్తుతే దేవవర ప్రసీద।
విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥ 31

తా. దేవ దేవా! ఉగ్రరూపుడ వగు నీ వెవడవో నాకు చెప్పుము. ఎంతు చేతననగా నీ ప్రవృత్తి నెరుంగ జాలకున్నాను. ఆది పురుషుడవగు నిన్ను తెలియ గోరుచున్నాను. నీకు వందనము చేయుచున్నాను. అనుగ్రహింపుము.

వ్యా. ఇది యంతయును కల్పితము. జ్ఞానవిజ్ఞానములుగల కృష్ణుడు నివృత్తి గలవాడు. ప్రవృత్తి గలది జీవుల స్వభావము.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయ కృత్ప్రవృద్ధో
లోకాన్సమా హర్తుమిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వా న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ 32

తా॥ నేను జననాశము చేయువాడనై ప్రబలిన కాలుడనై యున్నాను. ఈ లోకజనులను సంహరించుటకొరకు ప్రవర్తించువాడను. ఎదిరిసేనయందున్న యోధు లందరు నీ చే విడువబడినను జీవింపజాలరు.

వ్యా. జనుల కర్మలనుబట్టి జననాశము వారియందున్న స్వభావమువలన కలుగుచున్నది. ఎదిరి సేనయందున్న యోధులందరును వారి పూర్వకర్మవలన వారి స్వభావముచేత చంపబడనున్నారు. అందువలన వారు నీచేత విడువబడినను జీవింప జాలరని కృష్ణుడర్జునకు చెప్పెను. కృష్ణుడు వారికి కాలుడైనచో, కృష్ణునికి బోయ వాడు కాలుడని చెప్పవలెను. వారి సంస్కారమువలన వారి స్వభావముచేత చంప బడినవారికి కృష్ణుడు కాలుడు కాదు. తన సంస్కారమువలన తన స్వభావముచేత చంపపడిన కృష్ణునికి బోయవాడును కాలుడు కాదు. చంపబడిన కృష్ణుడును, తనను చంపిన తన స్వభావమును పరమపదముగా ఉన్న పరమతేజస్సు కాదు.

శ్లో॥ తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥ 33

తా. వీరు ఇదివరకే నాచేత చంపబడిరి. కాబట్టి అర్జునా! నీవు నిమిత్త మాత్రమగుము. శత్రువులను జయించి యశస్సును పొందుము. సమృద్ధమగు రాజ్యము ననుభవింపుము. లెమ్ము.

వ్యా. వారు, వారి పూర్వకర్మ సంస్కారమువలన చచ్చుటకు వారియందున్న స్వభావమునకు వశులై అర్జునునిద్వారా చంపబడువారై యున్నారు. అందువలన నీవు నిమిత్తమాత్రుడవై యుండుమని కృష్ణు డర్జునునకు చెప్పును. వారు చచ్చుటకు వారి సంస్కారమను కర్మవలన వారి స్వభావము కారణముగాని, కృష్ణుడు కారణము కాదు. వారి సంస్కారమువలన వారిని చంపు స్వభావమును కృష్ణుడని వ్రాసినారు.

శ్లో॥ ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్॥ 34

తా. నాచే హతులైన భీష్మ, ద్రోణ, కర్ణ, జయద్రథులను, ఇతర యుద్ధ వీరులను నీవు చంపుము. నీవు భయపడకుము. యుద్ధమునందు శత్రువులను జయింప గలవు. యుద్ధము చేయుము.

వ్యా. నాచే హతులైన యుద్ధవీరులను అనగా వారి సంస్కారమువలన వారి స్వభావముచేత చంపబడువారై వారిని వారె చంపుకొనినవారైనారు. ఆ విధముగ వారిని చంపుస్వభావమునే కృష్ణుడని నాచే హతులైన వారని కృష్ణుడు చెప్పినటుల వ్రాసినారు.

సంజయ ఉవాచ : సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలిర్వేపమానః కిరీటీ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య॥ 35

తా. కృష్ణునియొక్క వాక్యమును విని అర్జునుడు వణకుచున్నవాడును, ముకుళిత హస్తుడునై కృష్ణునకు నమస్కరించి మిక్కిలి భయపడినవాడగుచు ప్రణమిల్లి గద్గద స్వరముతో మరల ఇట్లనియెను.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః॥ 36

తా. కృష్ణా ! నీయొక్క గొప్ప కీర్తిని కొనియాడుచు జగత్తు సంతోషించుచున్నది. అనురాగమును పొందుచున్నది. రాక్షసులు భయపడి నాల్గు దిక్కులకును పరుగిడుచున్నారు. సమస్తములైన సిద్ధ సమూహములు నమస్కరించుచున్నవి.

వ్యా॥ ఇందు వ్రాసినవి యథార్థము కాదు.

శ్లో॥ కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే।
అనన్త దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్॥ 37

తా. అనంత దేవేశా ! జగన్నివాసా ! మహాత్మా ! సదసత్ పదార్థముల రెంటికిని పరమైనది ఏది కలదో, అట్టి నాశరహితమైనది నీవే అయియున్నావు. సృష్టికర్తయగు బ్రహ్మకుకూడ ఆదికారణుడవును, గొప్పవాడవునైన నీకు ఏల నమస్కరింపరు ?

వ్యా. సదసత్ పదార్థముల రెండింటికి పరమైనది (ఈ రెండును లేనిది)యగు పరమతేజస్సుగా ఉన్న పరమపదము కృష్ణుడు కాదు. పరమతేజస్సు కృష్ణునియందు లేదు. ఈ లోకమునందు లేదు. ఈ బ్రహ్మ (భ్రమ) యును, స్వభావముగల జీవులును, కృష్ణుడను జీవుడును ప్రకృతి (మాయ) యందున్నవి. మాయాభ్రమచేతనే

మాయయందుండి వచ్చినవి. ఈ స్వభావము బ్రహ్మకు (భ్రమకు) ఆది కారణము కాదు. సృష్టికర్త మాయాభ్రమయే కాని, సర్వమును "నేనే" నని చెప్పినటుల వ్రాసిన జీవుల స్వభావమను కృష్ణుడు కాదు. సర్వజీవుల యందున్నాననిన కృష్ణుడనునది 8 వ అ. 18, 19 శ్లో. లలో చెప్పబడినటుల మాయాభ్రమద్వారా మాయ యందుండి వచ్చి నశించి మాయయందే కలియుచు మరల వచ్చుచు తిరుగుచుండు జీవుల స్వభావమను గుణము. అంతియేగాని నశించనిది, సర్వోత్కృష్టమైనది, చేరవలసిన స్థానమని జన్మమునకు తిరిగిరానిదని 8 వ అ. 21 వ శ్లో.లో చెప్పబడిన పరమతేజస్సుగా ఉన్న పరమపదము కాదు.

శ్లో॥ త్వమాదిదేవః పురుషః పురాణ-
స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనంత రూప॥ 38

తా. అనంతరూపా ! నీవు దేవతలలో మొదటివాడవు, పురాణపురుషుడవు, ఈ ప్రపంచమునకు పరమస్థానమును, సర్వమును ఎరిగినవాడవును, ఎరుగదగినవాడవును, పరమపదమును అయియున్నావు. అనంతరూపములతో నున్న ఈ విశ్వమంతయు నీ చేత వ్యాపింపబడి యున్నది.

వ్యా. ఈ ప్రపంచములో సమస్త శరీరములయందున్నవి స్వభావముగల జీవులు. కృష్ణుడును, ఈ లోకమునందున్నదేదియును, ఎవరును పరమపదముకాదు. జ్ఞాన విజ్ఞానములు గల కృష్ణుడును, అట్టివారును పరమపదము నెరిగినవారు. ఆ పదమును చేరువారు. రాగద్వేషాది గుణములు గలవారు పరమపదము నెరిగినవారి సాంగత్యమున వారు చెప్పినటుల ప్రవర్తించవలయును. 4 వ అ. 5, 6 శ్లో.లలో చెప్పబడినటుల తన సంస్కారము ననుసరించి తన స్వభావముచేత అనేక జన్మలనెత్తినవాడును, రాముని జన్మయందు వాలిని చంపిన కర్మ(సంస్కారము)వలన తన స్వభావముచేత బోయవానిద్వారా చంపబడినవాడును, 8 వ అ. 21 వ శ్లో.లో చెప్పబడినటుల పరమపదమును జేరి ఈ లోకమునకు తిరిగి జన్మమునకురానివాడునగునట్టి కృష్ణుడు ప్రపంచమునకు పరమస్థానము కాదు. పరమపదము కాదు. ఈ ప్రపంచ

ములో పరమతేజస్సు లేదు. స్వభావముగల జీవులతోను, అనేకరూపములతోనుఉన్న ఈ ప్రపంచము కృష్ణునిచేత వ్యాపింపబడలేదు. ఇందు కృష్ణుడును స్వభావముగల జీవుడు. ఈ శ్లోకము యథార్థము కాదు.

శ్లో॥ వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ।
నమో నమస్తేఽస్తు సహస్ర కృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే॥ 39

తా. వాయువును, యముడవును, అగ్నియును, వరుణుడవును, చంద్రుడవును, బ్రహ్మవును, బ్రహ్మకు తండ్రియును నీవే అయియున్నావు. నీకు వేయి నమస్కారములు. మరల నమస్కారము.

శ్లో॥ నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ।
అనంతవీర్యామిత విక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః॥ 40

తా. నీవు అమిత శౌర్యపరాక్రమములు గలిగినవాడవై సర్వమునువ్యాపించి సర్వ స్వరూపుడవగుచు యున్నావు. కాన సర్వస్వరూపా! నీకు ముందు వెనుక నెల్ల దిక్కుల నమస్కారములు.

వ్యా. కృష్ణుడు జ్ఞాన విజ్ఞానములు గలవాడు. సర్వమును వ్యాపించి యున్నవాడు కాదు. సర్వస్వరూపుడు కాదు. సర్వశరీరములయందును ఉన్నవి స్వభావము గల జీవులు.

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ హే యాదవ హే సఖేతి।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాఽపి॥ 41

శ్లో॥ యచ్చాపహాసార్థమసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు।
ఏకోఽథవాఽప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వామహమప్రమేయమ్॥ 42

తా. నీయొక్క ఈ మహిమ నెరుగలేక అజ్ఞానముచేతనో, ప్రేమచేతనో, స్నేహితుడవని తలంచి, నిన్ను కృష్ణా! యాదవా! స్నేహితుడా! యని ప్రమాదమువలన ఆలోచింపక పలికినదియును; విహార, శయ్యాసన, భోజనములందు పరిహాసమున నాచే అవమానింపబడినదియును, అట్లుగాక సమక్షమున అవమానము కలుగునట్లుగా పరాభవించిన అపరాధములను అప్రమేయుడవగు నిన్ను నేను క్షమింప వేడుచున్నాను.

శ్లో॥ పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్।
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ॥ 43

తా. అప్రతిమ ప్రభావా! ఈ చరాచర ప్రపంచమునకు నీవు తండ్రివియును, పూజ్యుడవును, గురువును, శ్రేష్ఠుడవును అయియున్నావు. మూడు లోకములయందును నీతో సమానుడు లేడు. నీకంటె నధికుడెట్లుండును?

వ్యా. ఇందున్నవి యథార్థము కాదు. కృష్ణుడు చరాచర ప్రపంచమునకు తండ్రి కాదు. కృష్ణుడు జ్ఞాన, విజ్ఞానములు గలవాడు. అందువలన శ్రేష్ఠుడు. జ్ఞాన విజ్ఞానములు గలవారందరును శ్రేష్ఠులు. కృష్ణునితో సమానులు. వారితో సమానులు ఈ ప్రపంచములో లేరు.

శ్లో॥ తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యం।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥ 44

తా. కృష్ణా! తండ్రి పుత్రుని, సఖుడు సఖిని, ప్రియుడు ప్రియురాలిని సహించునట్లు సహించుట కర్హుడవు. కాబట్టి నేను సాష్టాంగముగ నమస్కరించి ఈశ్వరుడవును, స్తోత్రార్హుడవునైన నిన్ను క్షమింప వేడుచున్నాను.

వ్యా. ఇందున్నవి కల్పితమేగాని, యథార్థము కాదు.

శ్లో॥ అదృష్ట పూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే।
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస॥ 45

తా. అదృష్టవశమున ఈ విశ్వరూపమును చూచి సంతోషించుచున్నాను. నా మనస్సు భయముచే వ్యథను చెందుచున్నది. దేవా! నాకు మునుపటిరూపమునే చూపుము. దేవ దేవేశ, జగన్నివాసా! ప్రసన్నుడ వగుము.

వ్యా. ఇందున్నవి యథార్థము కాదు. ఈ విశ్వమునందు సంతోషమును, భయమును కలిగించునవి యున్నవి. వానిని చూచుటవలన అర్జునునకు సంతోషము, భయమును కలుగుచున్నవని కల్పించి వ్రాసినారు. కాని, అర్జునుడు చూచినదికాదు, చెప్పినది కాదు. ఇది జ్ఞాన, విజ్ఞానములుగల కృష్ణుని రూపము కాదు. ఎవరి రూపము కాదు.

శ్లో॥ కిరీటినం గదినం చక్రహస్త-
మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే 46

తా. పూర్వమువలె కిరీటము, గద, చక్రముగల నీ రూపమును చూడగోరుచున్నాను. సహస్రబాహూ! విశ్వమూర్తీ! చతుర్భుజములుగల మునుపటిరూపము గలవాడవగుము.

వ్యా, ఇందున్నవి యథార్థము కాదు.

శ్రీ భగవానువాచ : కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్।
తేజోమయం విశ్వమనంతమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్॥ 47

తా. అర్జునా! ప్రసన్నుడనగు నా చేత నా యోగబలమువలన నీకు చూప బడినదేదిగలదో, అట్టి నాయొక్క ఈ శ్రేష్ఠమైన రూపము తేజోమయమైనదియు, అనంతమైనదియు, ఇంతకుముందు నీకంటె నితరునిచే చూడబడనిదియునై యున్నది.

వ్యా. ఈ విశ్వరూపము శ్రేష్ఠమైనది కాదు. పరమ తేజస్సు కాదు. పరమ తేజోమయమైనది కాదు. ఇది యంతయును ప్రకృతి (మాయా) తేజస్సు. ఇది ప్రకృతి(మాయ) యందుండి భ్రమయను గుణముచే సృష్టింపబడిన స్వభావముగల జీవులతోనున్న ప్రపంచరూపము.

శ్లో॥ న వేద యజ్ఞాధ్యయనైర్న దానై-
ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః।
ఏవం రూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥ 48

తా. అర్జునా! ఇట్టి రూపముగల నేను మర్త్యలోకమునందు నీకంటె నితరు నెవ్వనిచేతను, వేదాధ్యయనములచేతను, యజ్ఞములచేతను, దానములచేతను, కర్మల చేతను, ఉగ్రతపస్సులచేతను చూడబడువాడను కాను.

వ్యా. ఈ విశ్వము జీవులయందున్న రాగద్వేషాది గుణముల కర్మలను మరల ఇంకొకపుడు వాని స్వభావము వానికి చేయు కర్మలరూపము. ఇది కృష్ణుని రూపము కాదు. ఈ స్వభావ ప్రవర్తనను జ్ఞాన విజ్ఞానములు గలవారు విజ్ఞానము వలన ఎరిగియున్నారు. ఇంకెవ్వరును యిందు వ్రాసినటుల ఎరుగలేరు. ఇంకేవిధము గను ఎరుగలేరు. అర్జునుడును ఎరిగినది కాదు.

శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వారూపం ఘోరమీదృఙ్మమేదమ్।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య॥ 49

తా. ఇట్టి భయంకరమైన నా యీ రూపమును చూచి నీకు భయమువలదు. మూఢభావము వలదు. నీవు నిర్భయుడవును, సంతోషమైన మనస్సు గలవాడవునై నాయొక్క ఈ సహజ రూపమును చూడుము.

వ్యా. ఇది యంతయును కల్పితము. విశ్వరూపము జీవుల సంస్కారము ననుసరించి ప్రవర్తించు జీవుల స్వభావముయొక్క ప్రవర్తన రూపమేగాని, కృష్ణుని రూపము కాదు. ఎవరి రూపమును కాదు.

సంజయ ఉవాచ ; సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః।
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా॥ 50

తా. కృష్ణు డర్జునునితో ఇట్లు చెప్పి, మరల తన మునుపటి రూపమును చూపెను. మహానుభావుడగు కృష్ణుడు మరల సౌమ్యరూపమును తాల్చినవాడై భయ పడుచున్న అర్జును నోదార్చెను.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. ఇందు వ్రాసినది సంజయుడు చూచి ధృతరాష్ట్రునకు చెప్పినట్లుగా కల్పించి వ్రాసియున్నారు. ఇది యంతయును కల్పిత గాధ.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన।
ఇదానీమస్మి సంవృత్తస్సచేతాః ప్రకృతిం గతః 51

తా. కృష్ణా! సౌమ్యమైన నీ యీ మానుషరూపమును చూచి శాంత చిత్తుడను, పూర్వ స్వభావము గలవాడనైతిని.

వ్యా. ఇది యథార్థము కాదు.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః॥ 52

తా. నీవు చూచినట్టి నాయొక్క విశ్వరూప దర్శనము కడు దుర్లభము. దేవతలు సహితము ఈ రూపమును ఎల్లప్పుడును దర్శింప గోరుచున్నారు.

వ్యా. దేవతలును చూడగోరు చున్నారనునదియును కల్పితము.

శ్లో॥ నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥

తా. నీవు నన్నే రూపముతో చూచితివో అట్టి రూపముగల నేను వేదముల చేతను, తపస్సుచేతను, దానముచేతను, యజ్ఞములచేతను చూచుటకు శక్యుడను కాను.

వ్యా. ఈ విశ్వమును జ్ఞాన, విజ్ఞానములు గలవారు విజ్ఞానమువలన ఎరిగి యున్నారు. అంతియేకాని, వేదములచేతను, యజ్ఞములచేతను ఇంకేవిధముగను చూడజాలరు, ఇది జ్ఞాన, విజ్ఞానములుగల కృష్ణుని రూపముకాదు. అర్జునునకు చూపినదియును కాదు.

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥54

తా. అర్జునా! ఇట్టిరూపమును ధరించిన నేను అనన్య భక్తిచేతనే యథార్థముగా నెరుగుటకును, చూచుటకును, ప్రవేశించుటకును, శక్యుడ నగుచున్నాను.

వ్యా. ఈ విశ్వమునందున్న సర్వభూతములయందున్నవి స్వభావముగల జీవులు. అట్టి విశ్వమునంతను కృష్ణుడెరిగి అర్జునునకు చెప్పియుండును గాని, చూపలేదు. నేను అనన్య భక్తిచేతనే యథార్థముగ నెరుగుటకును, ప్రవేశించుటకును శక్యుడ నగుచున్నానని చెప్పినది సర్వము నెరిగిన కృష్ణునియందున్న విజ్ఞానము. మాయయందుండి వచ్చిన సర్వజీవులకున్న స్వభావమును ఇట్టి రూపముగల నేను అని కృష్ణుడు చెప్పినటుల కల్పించి వ్రాసినారు. విశ్వమునందున్న జీవుల స్వభావమునందు భక్తులు ప్రవేశించుట యనునది యథార్థము కాదు. అందరియందును, కృష్ణునియందును ఉన్న స్వభావముకొరకు ఎవరును కృష్ణునియందు భక్తి గలవారు కారు కానవసరము లేదు.

శ్లో॥ మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాండవ॥ 55

తా. అర్జునా! నాయొక్క కర్మలు చేయువాడును, నా పరముగా నున్నవాడును, ప్రపంచ సంబంధమును విడిచినవాడును, సర్వప్రాణులయందును వైరము లేనివాడును ఎవడో, అట్టి నా భక్తుడు నన్ను పొందుచున్నాడు.

వ్యా. 10 వ అ. 10, 11 శ్లో. లలో చెప్పబడినటుల కృష్ణుని విడువక సేవ చేయుచు కృష్ణుడు చెప్పునటుల చేయువాడు కృష్ణునిద్వారానే కృష్ణునియందు భక్తి గలవాడై కృష్ణుని పరముగా గలవాడును, ప్రపంచ సంబంధమును విడిచినవాడును, సర్వ ప్రాణులయందును వైరము లేనివాడై ఆ భక్తి వలననే కృష్ణునియందుండి "నన్ను" అను విజ్ఞానమును పొందు (తనయందు ప్రవేశింప జేసికొనినవాడగు) చున్నాడు. అట్టి విజ్ఞానము వానియందున్న అజ్ఞానము పోవుటకు కృష్ణునియందున్న జ్ఞానమును వానియందును ప్రవేశింప జేయును ఈ జ్ఞానముతో విజ్ఞానమునుఉండును. అట్టివానికి జ్ఞానముద్వారా పరమపద దర్శనమగును. ఇది వానియందున్న విజ్ఞానము ఎరిగియున్నది. కామ రాగద్వేషాది గుణములన్నియును వానిని విడిచి వెళ్ళును. వాని సంస్కారము ననుసరించి వాని స్వభావము ప్రవర్తించు కర్మలయందు విజ్ఞానము నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించుచుండును. వాడు జ్ఞానముద్వారా పరమపదమును చూచుచు ఆ పదమును చేరును. జ్ఞానముద్వారా పరమపదము చూడవలెను, చేరవలెనని 13 వ అ. 18 వ శ్లో.లో ఉన్నది. జ్ఞాన విజ్ఞానములు

గల కృష్ణుడనువాడును; అట్టివారును పరమపదమును చేరువారు. కాని కృష్ణుడేపరమ పదమని అర్జునుడు చెప్పినటుల ఈ 11 వ అ. 38 వ శ్లో. లో ఉన్నది యథార్థము కాదు.

ఒక్క దీపము తాను వెలుగుచునే అనేక దీపములను వెలిగించుచుండును. అటులనే జ్ఞాన, విజ్ఞానములగల జ్ఞాని విజ్ఞానముతో ప్రకాశించుచూ (ప్రవర్తింపబడుచు) అనేకులయందును విజ్ఞానముతో నున్న జ్ఞానమును ప్రవేశింపజేయునని జ్ఞాన విజ్ఞానములు గలవారు చెప్పుదురు.

ఈ అధ్యాయమునందు మాయాభ్రమచేత మాయయందుండి సృష్టింపబడినవియును, మాయా ప్రభావముచేత ప్రకాశింపుచున్నవియును, రాగద్వేషాది మాయా గుణముల కర్మలవలన వాని స్వభావముచేత సుఖ, దుఃఖముల ననుభవించుచున్నవియును ఇట్లు ఘోరమైన భయంకరరూపములుగ నున్నదియునగు ఈ విశ్వమును జ్ఞానము గలవాడగు కృష్ణుడనువాడు విజ్ఞానమువలన చూచుచు చెప్పియుండవచ్చును. కృష్ణుని దగ్గరున్న అర్జునుడుగాని ఇంకెవరైననుగాని విని యుండవచ్చును. అంతియేగాని, అర్జునునకు చూపలేదు. ఇంకెవరికిని చూపలేదు. ఇందున్నటులఅర్జునుడడిగినదియును కాదు. కృష్ణుడు చెప్పినదియును కాదు. ఇది యంతయును కల్పితము. ఇట్లు వ్రాసి దీనిని కృష్ణుని విశ్వరూప సందర్శనమని వ్రాసినారు. విశ్వమును చూచునది జ్ఞానము గలవారియందున్న విజ్ఞానము. అట్టి విజ్ఞానమును అర్జునునకు కృష్ణు డిచ్చునది కాదు. 10 వ అ. 10, 11 శ్లో. లలో కృష్ణుడు నన్ను విడువక సేవ చేయువారలకు కృష్ణుని యందుండి "నన్ను" అను విజ్ఞానమును పొందు బుద్ధి (భక్తి) నిచ్చెదనని చెప్పబడినటుల అర్జునుడు కృష్ణుని సేవ చేయలేదు. కృష్ణుడర్జునునకు బుద్ధి (భక్తి) యను భావము నివ్వలేదు. ఆ బుద్ధి భావమున కృష్ణుని యందున్న విజ్ఞానము అర్జునునియందు ప్రవేశింపలేదు. విజ్ఞానము కృష్ణునియందున్న జ్ఞానమును అర్జునునియందు ప్రవేశింప జేయలేదు. ఈ విశ్వము మాయ యందుండి వచ్చిన గుణముల రూపమేగాని కృష్ణుని రూపము కాదు. ఎవరి రూపమును కాదు. ఇందు అర్జునుడడిగినటులను కృష్ణుడు చెప్పినటులను వ్రాసినదంతయును వ్రాసినవారి కల్పితమేగాని యథార్థము కాదు. కృష్ణుడు అర్జునునకు దివ్య నేత్రమను విజ్ఞానమును యిచ్చినచో విజ్ఞానము కృష్ణునియందున్న జ్ఞానమును అర్జునుని యందు ప్రవేశింప జేయును. అర్జునునకు జ్ఞానముద్వారా పరమ పద దర్శనమగును. అర్జునుడు విజ్ఞానమువలన పరమపదమును జ్ఞానముద్వారా చూచినదియును,

ఆ పదమును చేరు మార్గమును (ప్రవర్తనను) ఎరిగి యుండును. రాగద్వేషాది గుణములతోనున్న అజ్ఞానము వానిని విడుచును. అప్పుడు అర్జునుడును, కృష్ణుడును సమానులు. అర్జున కేమియును చెప్పనవసరము లేదు. ఈ 11 వ అధ్యాయమునుండి 18 వ అధ్యాయము వరకును అర్జునుడు దుఃఖించుచుండు టెందులకు? దుఃఖపడకుమని అర్జునునకు కృష్ణుడు చెప్పు టెందులకు ? సర్వధర్మములను విడిచి తనను శరణ్యా మనుమని చెప్పు టెందులకు ? ఇది కల్పిత గాథ.

8 వ అ. 18, 19 శ్లో.లలో ఈ ప్రపంచము మాయయందుండి వచ్చి మాయ యందే కలియుచు మరల వచ్చుచు తిరుగుచున్నదని యున్నది. ఇట్లు తిరుగు చుండుటకు మాయ యందుండి వచ్చిన కామ రాగ ద్వేషాది గుణములును, జీవుల సహజ స్వభావము (గుణము)ను కారణము. జీవులకు స్వభావము ప్రవర్తించు చున్నదని 5 వ అ. 14 వ శ్లో.లో ఉన్నది. ఈ స్వభావము ప్రవర్తించుటకు 13 వ అ. 21, 22 శ్లో.లలో చెప్పబడినటుల రాగద్వేషాది గుణముల ప్రవర్తన కారణము. వీనిని అసుర సంపద కర్మబంధమును కలుగజేయునవి యని 16 వ అ. 5 శ్లో.లో చెప్పియున్నారు. మాయాభ్రమచేత మాయ యందుండి వచ్చిన అసురగుణముల చేత అనగా రాగద్వేషాది గుణముల కర్మల ననుసరించి జీవుల స్వభావమనుగుణము చేత బంధింపబడి అనేక ఉత్కృష్ట, నికృష్ట జన్మలను, సుఖదుఃఖములను అనుభ వించుచున్న జీవులతోనున్న ఈ ప్రపంచమును కృష్ణుడు తనవలననే సృష్టింపబడు చున్నదని, తనవలననే ప్రవర్తింపబడుచున్నదని, తన విభూతులని 10 వ అధ్యా యములోను, తన విశ్వరూపమని, ఈశ్వర స్వరూపమని 11 వ అధ్యాయములోను ఉన్నది సుతరాం అబద్ధం. అర్జునుడు విశ్వరూపమును చూచి చెప్పినదియును, అందు నీవే (కృష్ణుడే) పరమపదమని చెప్పినదియును యిది యంతయును సంజయుడు చూచి చెప్పినదియును అబద్ధము.

ఈ విశ్వమును అర్జునుడు కృష్ణుని శరీరమునందు ఒక్కచోటనే చూచెనని నచో అర్జునునకు చెప్పిన కృష్ణుడనువాడు ఒకడున్నాడు. 4 వ అ. 5, 6 శ్లో.లలో చెప్పబడినటుల అర్జునుడును, కృష్ణుడును వారి సంస్కారమువలన వారి స్వభావము చేత అనేక జన్మలనెత్తినారు. కృష్ణుడు రాముని జన్మయందు చేసిన కర్మవలన వాని స్వభావముచేత పుట్టినవాడు. వాలిని చంపిన కర్మ యను సంస్కారమువలన తన స్వభావముచేతనే బోయవానిద్వారా చంపబడినాడు. అంతియేగాని కృష్ణుడు విశ్వ

రూపమును ధరించుట యనునది లేదు. నీవే ప్రపంచమునకు పరమస్థానమును, నీవె పరమపదమును అయియున్నావని అర్జునుడు చెప్పినది కృష్ణునియందు పరమపదమును చూచియేనా ? ప్రపంచమునకు పరమస్థానము (పరమపదము) చంపబడిన కృష్ణుడా ? కృష్ణుని చంపినదియా ? చంపబడిన కృష్ణుడుగాని, కృష్ణుని చంపిన తన స్వభావముగాని ఈ ప్రపంచమునకు పరమస్థానమని అనగా పరమతేజస్సుగా ఉన్న పరమపదమని అర్జునుడు చెప్పినటుల వ్రాయుట ఎంత యథార్థమో యోచించిచూడుడు. ఈ విధముగా వ్రాసి నిరాకార నిర్గుణమని చెప్పుచున్న పరమతేజస్సుగా ఉన్న పరమపదమునందు ఈ సర్వ ప్రపంచమున్నదని, పరమతేజస్సే ఈ ప్రపంచమును సృష్టించి సర్వమును ప్రవర్తింపజేయుచున్నదని చెప్పుటకొరకు, కృష్ణుడు పరమతేజస్సని, భగవంతుడని ఇది భగవంతుడు కృష్ణుడు చెప్పిన భగవద్గీత యని కల్పించి వ్రాసినారు. తన సంస్కారమువలన తనకు కాలుడనునట్టి స్వభావముచేత పుట్టినవాడును, చంపబడినవాడునగు కృష్ణుడుగాని, కృష్ణుని చంపిన కాలుడనునట్టి స్వభావముగాని జన్మమునకు రానిదని 8 వ అ. 21 వ శ్లో.లో చెప్పబడిన నిరాకారనిర్గుణమైయున్న పరమపదము ఎట్లగును ? పరమతేజస్సు ఎట్లగును ? ఇది 16 వఅ. 7 వ శ్లో.లో నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరుగరని చెప్పబడిన అసురగుణములుగల అజ్ఞాన విద్యాపండితుల కల్పితము. జనులను చంపుస్వభావమునే కృష్ణుడు తాను జననాశనము చేయు కాలుడనని చెప్పినటుల ఈ అధ్యాయమున 32 వ శ్లో.లో వ్రాసినారు. కృష్ణుని యందున్న కాలుడనునట్టి స్వభావమే కృష్ణుని చంపినది. ఇందుచెప్పబడిన విశ్వరూపము కాలుని స్వరూపమేగాని పరమతేజస్సు స్వరూపము కాదు. భగవంతుని స్వరూపము కాదు. భగవంతుడు లేడు.

విష్ణులోకమునందున్న విష్ణువు భగవంతుడని, రాముడుగను, కృష్ణుడుగను అవతారము లెత్తినాడని చెప్పునది యథార్థము కాదు. 4 వ అ. 5, 6 శ్లో.లలోచెప్పబడినటుల అనేక జన్మలనెత్తుచు రాముని పూర్వజన్మయందు చేసిన కర్మవలన విష్ణులోకమునకు వెళ్ళి అచ్చట కొంత సంస్కారము ననుభవించి తిరిగి ఈ లోకమునందు అనేక యితర జన్మలనెత్తి రాముడుగా జన్మించియుండునని చెప్పవలెను. అటులనే రాముని జన్మయందు చేసిన కర్మవలన మరల విష్ణులోకమునకు వెళ్ళి కృష్ణుడుగా జన్మించి యుండునని చెప్పవలెను. రాముని జన్మయందు విజ్ఞానముతో

నున్న జ్ఞానము (జ్ఞాన విజ్ఞానముల) నార్జించుటవలన అట్టి జ్ఞానము గలవాడై జన్మించి యుండును. జ్ఞానముద్వారా పరమపద దర్శనమైనవాడై విజ్ఞానమువలన సర్వము నెరిగి రాగద్వేషాది గుణరహితుడై సంస్కార కర్మరహితుడై జ్ఞానముద్వారాపరమ పదమును చేరును. అచ్చటికి చేరినవాడు మరల జన్మమునకు వచ్చుట యుండదు.

విష్ణువు భగవంతుడని, రాముడును, కృష్ణుడును విష్ణ్వవతారములనినచో విష్ణువు విష్ణులోకమునందున్నప్పుడు ఈ లోకములో విష్ణువు లేడు. రాముడుగావచ్చి తిరిగి విష్ణులోకమునకు వెళ్ళినప్పుడును ఈ లోకములో విష్ణువు లేడు. కృష్ణుడుగా వచ్చి పరమపదమును చేరి మరల జన్మించుట యుండదు. అపుడు ఈ లోకములోను విష్ణులోకములోను విష్ణువు లేడు. కృష్ణుడు లేడు. 7 వ అ. 7 వ శ్లో.లో ఉన్నటుల మణుల దండయందు దారమువలె ఈ లోకములో అందరియందును ఉన్న కృష్ణు డెవరు ? విశ్వరూపమును ధరించిన కృష్ణు డెవరు ? విష్ణువు అవతారము లెత్తు భగ వంతుడనినచో రాముని జన్మమువరకును 16 వ అ. 5 వ శ్లో. లో చెప్పబడినటుల అసురసంపదయనిన రాగద్వేషాది గుణములవలనను, స్వభావమను గుణమువలనను కర్మబంధితుడై అనేక జన్మలనెత్తినాడు. రాముని జన్మయందు చేసిన సంస్కారము వలన కృష్ణుడుగా పుట్టినాడు. రాముని జన్మయందు దైవసంపదయనిన జ్ఞాన విజ్ఞాన ముల నార్జించుటవలన, కృష్ణుని జన్మయందు జ్ఞాన విజ్ఞానములద్వారా పరమపదమును చేరి ఈ లోకమునందు మరల జన్మించుట యుండదు. అప్పుడు ఈ లోకములోకాని విష్ణులోకములో కాని విష్ణువు లేడు. బ్రహ్మలోకము మొదలుగాగల ఏ లోకమునకు వెళ్ళినను మరల ఈ లోకమునందు జన్మించెదరని "నన్ను" అనగా కృష్ణుని యందుండి "నన్ను" అను విజ్ఞానమును పొందినవాడు మరల జన్మింపడని 8 వ అ. 16 వ శ్లో.లో ఉన్నది. విజ్ఞానమును పొందినవాడు విజ్ఞానమువలన జ్ఞానమునుకూడ పొందినవాడై వీనివలన పరమపదమును చేరి మరల జన్మింపడు. రాముని జన్మము వరకును రాగద్వేషాది గుణములవలన వానిద్వారా అనేక జన్మల నెత్తుచు తిరుగు చుండు రాముడు భగవంతు డెట్లగును ? జ్ఞాన విజ్ఞానముల నార్జించుటవలన వీనిద్వారా

పరమపదమును చేరి మరల జన్మింపని కృష్ణుడు భగవంతు డెట్లగును? భగవంతుని అవతారము లెట్లగును? భగవంతుడనునది నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరుగరని 16 వ అ. 7 వ శ్లో. లో చెప్పబడిన అసురగుణములు గలవారి ప్రకృతి (మాయా) విద్యచేత కల్పింపబడినదియే కాని యథార్థము కాదు. విశ్వరూపమనునది కర్మబంధమును కలుగజేయునవి అసురసంపదయని 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన కామ రాగద్వేషాది గుణముల కర్మల ననుసరించి జీవుల స్వభావమను అసుర గుణముయొక్క ప్రవర్తనరూపము. ఇది కృష్ణుని రూపము కాదు. ఎవరిరూపమును కాదు.

# గీతా వ్యాఖ్యానము

## భక్తియోగము

## 12 వ అధ్యాయము

అర్జున ఉవాచ :— అర్జునుడు చెప్పెను.

శ్లో॥ ఏవం సతత యుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః 1

తా. 11 వ అధ్యాయమున 55 వ శ్లోకమునందు చెప్పబడినవిధముగా, ఎల్లప్పుడును నిన్ను ఉపాసించుచున్న నీభక్తులలోను, ఇంద్రియములకుగోచరింపని, నాశ రహితమైన దానిని అనగా పరమపదముగా ఉన్న పరమతేజస్సును ఉపాసన చేయుచున్నవారిలోను, అనగా ఈ రెండు తెగలలో ఏ తెగవారు యోగము నెరిగినవారు?

వ్యా. విజ్ఞానముతోనున్న జ్ఞానము గలవాడగు కృష్ణుడు "నన్ను" (కృష్ణుడను శరీరమును) విడువక సేవ చేయువారలకు "నన్ను"(కృష్ణునియందుండి నన్ను) అని చెప్పుచున్న విజ్ఞానమును తెలియునట్టి (పొందునట్టి) బుద్ధి (భక్తియనుభావము) నిచ్చుచున్నానని 10 వ అ. 10 వ శ్లోకములో ఉన్నది. ఆ విధముగ కృష్ణుడుభక్తి భావము నిచ్చిన భక్తి గలవారి ప్రవర్తనయే 11 వ అ. 55 వ శ్లోకములో చెప్పబడిన ప్రవర్తన. 10 వ అ. 11 వ శ్లోకములో ఉన్నటుల అట్టి బుద్ధి (భక్తి) భావమున కృష్ణునియందుండి నన్ను పొందుచున్నారని చెప్పుచున్న విజ్ఞానమువారియందు ప్రవేశించినదై వారియందున్న అజ్ఞానమను అంధకారము పోవుటకు వారియందు జ్ఞానమను దీపమును వెలిగించును. అనగా వారియందును జ్ఞానమును ప్రవేశింప జేయును. ఈ జ్ఞానముతో విజ్ఞానమును ఉండును. వారికి జ్ఞానముద్వారా పరమపదముగా ఉన్న పరమతేజస్సు కాన్పించును. అప్పుడు విజ్ఞానము వారు ఆ తేజస్సును

చూచుచు ఆనందమనుభవించుట ఎరిగియున్నది. తదుపరి ఆ తేజోపదమును చేరు మార్గమును, ఈ సర్వ ప్రపంచమును ఎరిగి యున్నది. ఈ విధముగా పరమ పద మార్గము నెరిగిన వారగుదురు.

నిన్ను (కృష్ణుని) విడువక సేవ చేయు నీ (కృష్ణుని) భక్తులలోను అని వ్రాయవలసిన విధమును "ఎల్లప్పుడును నిన్ను (కృష్ణుని) ఉపాసించుచు ఉపాసన ద్వారా నీ (కృష్ణుని) భక్తులైన వారలలోను" అని ఉపాసన యనునది కల్పించి వ్రాసినారు. అటులనె యింద్రియములకు గోచరించనిది, నశించనిదియగు పరమపద ముగా ఉన్న పరమతేజస్సును ఉపాసన చేయు వారలలోను ఎవరు యోగము(పరమ పదమును చేరు మార్గము) నెరిగినవారని అర్జునుడు కృష్ణుని అడిగినటుల ఈశ్లోకము నందువ్రాసినారు. ఉపాసనయనునపుడు, కృష్ణుని ఉపాసచేయునది. పరమతేజస్సును ఉపాస చేయునది ఈ అధ్యాయమున 5 వ శ్లో.లో చెప్పబడినటుల అధిక దుఃఖము లకు కారణమగు అవ్యక్తాసక్తి, అవ్యక్త మార్గము (ప్రవర్తన). ఇది కర్మ బంధ మును కలుగజేయునవి అసుర సంపదయని 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన కామ రాగద్వేషాదిగుణములును, జీవులస్వభావమను గుణమును ప్రవర్తించుఅవ్యక్త ప్రవర్తన.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాస్తేమే యుక్తతమా మతాః॥ 2

తా. ఎవరు నాయందే యున్న మనస్సు (ప్రేమ) గలవారై నిత్యయుక్తులై మిక్కిలి శ్రద్ధతో కూడినవారై నన్ను ఉపాసించుచున్నారో, అట్టివారు శ్రేష్ఠులని నా యభిప్రాయము.

వ్యా. ఎవరు తనయందు శ్రద్ధ, ప్రేమ గలవారై తన సేవ చేయుచున్నారో, అట్టివారు తనయందు భక్తిగలవారై శ్రేష్ఠులగుదురని కృష్ణుడు చెప్పెను. ఆ విధము గనే పరమపదము నెరిగిన వారిసేవ చేయువారు వారియందు భక్తి గలవారై శ్రేష్ఠ లగుదురు. ఉపాసన చేయువారు శ్రేష్ఠులు కారు. కృష్ణునియందే యున్న ప్రేమయే

గాని మనస్సు అనునది వేరుగా లేదు. ఉపాసన చేయుట ఈ అధ్యాయమున 5 వ శ్లో.లో చెప్పబడిన అవ్యక్త (గుడ్డివారు పోవు) మార్గము.

శ్లో॥ యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్॥ 3

శ్లో॥ సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః॥ 4

తా. ఎవరు నాశరహితమైనదియు, నిర్దేశింపనలవిగానిదియు, ఇంద్రియములకు కాన్పించనిదియు, అంతటను వ్యాపించినదియు, చింతింపనలవికానిదియు,కూటస్థము, అచలము, నిత్యమునైన దానిని ఉపాసన చేయుచు, ఇంద్రియములను నియమించి అంతటను సమబుద్ధి గలవారును, సర్వభూతములయొక్క హితమునందు ప్రేమ గలవారు నగుచున్నారో, అట్టివారు నన్నే పొందుచున్నారు.

వ్యా. ఈ 3, 4 శ్లోకములు యథార్థము కాదు. ఇందు చెప్పబడిన పరమ తేజోపదము ఇంద్రియములకు కాన్పించదు. ఇంద్రియములకు కాన్పించని దానిని, చింతింప నలవిగానిదానిని ఉపాసన చేయునది ప్రకృతి గుణములు. వారు ఈగుణములతో ఇంద్రియములను నియమించి సమబుద్ధి గలవారును, సర్వభూతహితమునందు ప్రేమగలవారును ఎట్లగుదురు? ఉపాసన చేయునది, ఇంద్రియములను నియమించుటనునది ప్రకృతి గుణములే గాని, వారియందు పరమతేజోపదమును చూచుజ్ఞానము అచటికి చేరుట కర్తలగు కర్మరహితమార్గము (ప్రవర్తన) నెరిగి ప్రవర్తించు విజ్ఞానము అను కన్నులు లేవు. వారికి ఈ కన్నులు అనువానిని పొందు మార్గముకూడ తెలియదు, ఉపాసన చేయు ప్రకృతి గుణములద్వారా ఎవరును సమబుద్ధి గలవారు కారు. సర్వభూతములయొక్క హితమునందు ప్రేమ గలవారును కారు. సమత్వ బుద్ధి, సర్వభూతహితమునందు ప్రేమ అనగా పవిత్రప్రేమ గలది విజ్ఞానము. ఇది వారియందు లేదు. ఇది సర్వమును ఎరిగియున్నది. ఉపాసన చేయు గుడ్డివియగు ప్రకృతి గుణములు విజ్ఞానము గలవారి యందుండవు. విజ్ఞానము గలవారును,కృష్ణుడును సమానులు. పరమతేజస్సు “నన్ను, నేను అనదు. కృష్ణునియందు పరమ తేజస్సు లేదు; ఆ తేజోపదమును చూచు జ్ఞానమున్నది. ఈ జ్ఞానము పరమతేజస్సు

కాదు. ఆ తేజస్సు ఈ లోకమునందంతటను వ్యాపించి యుండునది కాదు. ఈ 3,4 శ్లోకములయందు వ్రాసినది జ్ఞానమును, విజ్ఞానమును పొందు మార్గము కాదు. పరమ పద మార్గము కాదు. "నన్ను, నేను" అనునది లేని నిర్గుణమగు పరమ తేజోపద మును ఉపాసనచేసి, కృష్ణునియందుండి "నన్ను" అను విజ్ఞానమును పొందుచున్నా రని వ్రాసినది యథార్థము కాదు. అంతటను వ్యాపించినదియని యిందు వ్రాసినది 8 వ అ. 18, 19 శ్లో.లలో చెప్పబడినటుల మాయయందుండి వచ్చి నశించి మాయ యందే కలియుచు మరల వచ్చుచు తిరుగుచుండు ప్రపంచములో జీవులస్వభావమను గుణమును. ఇది కర్మబంధమును కలుగజేయునవి అసుర సంపదయని 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన అసురగుణములలోని అసుర గుణము. ఇది ఈ లోకము నందు జన్మమునకు రాని పరమపదముగా ఉన్న పరమతేజస్సు కాదు.

శ్లో॥ క్లేశో౽ధికతరస్తేషామవ్యక్తాసక్త చేతసాం।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే॥ 5

తా. కాన్పించని దానియందు (పరమ పదమునందు) ఆసక్తి గలవారలకు అధిక కష్టము. ఎందుచేతననగా, కనబడని మార్గము దుఃఖము. దేహాభిమానులు పొందలేరు.

వ్యా. ఈ కన్నులకు కాన్పించని పరమపదమును చూడవలయును, చేర వలయునను ఆసక్తి గలవారలు స్వయముగా చేయునది తప్పుదారి. వారు అధిక కష్టములకు పోవుదురు. ఎందుచేతననగా, పరమపదమును, అచటికి చేరుమార్గము నెరుగు కన్నులు లేనివారికి ఆ మార్గము కనబడదు. అట్టివారు దానిని గురించి అవ్యక్తముగా చేయునవన్నియును కష్ట దుఃఖములు గలిగించు రాగద్వేషాది మాయా గుణముల కర్మలేగాని, దాని నెరుగునవి కాదు. అచ్చటికి చేర్చునవి కాదు. ప్రకృతి (మాయా) గుణములు గ్రుడ్డివి. ఈ గుణములు గలవారు పరమపదమును అచటికి చేరు మార్గము నెరుగరు. అందుచేత రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వ, వాంఛాది ప్రకృతి గుణములు వారిని అనేక విధములుగ తప్పుమార్గమున కర్మలయందు ప్రవ ర్తింపజేసి, కర్మబంధితులనుగా జేసి అనేక కష్ట దుఃఖముల ననుభవించువారినిగా జేయుచున్నవి. ఊరున్నది. దారి యున్నది. చూచి నడచు కన్నులు లేవు. వారు

ఎక్కడికి వెళ్ళునది వారికి తెలియదు, జ్ఞాన విజ్ఞానములనునట్టి కన్నులను పొందిన (ఆర్జించిన) వారికి జ్ఞానముద్వారా పరమపద దర్శనమగును. తదుపరి విజ్ఞానమువలన వారియందున్న రాగద్వేషాది ప్రకృతి గుణములు వారిని విడిచి వెళ్ళిపోవును. అట్టి వారికి వారి శరీరమును స్వయముగా పోషించుకొనుటకు హక్కులేదు. అనగా నాది యనునది యుండదు. వారు వృత్తి రహితులైనప్పుడు దేహాభిమానము వారిని విడు చును. అట్టి కన్నులు లేనివారగు ప్రకృతి గుణములు గలవారు ఆ తేజోపదమును గురించి (లేక) భగవంతుని కొరకని, కొందరు యజ్ఞములని, మంత్రములని, తపస్సు లని, కొందరు ధ్యానమని, కొందరు సగుణోపాసన, నిర్గుణోపాసన, పార్థనయని, కొందరు ఆత్మానాత్మ విచారణయని, కొందరు గీతాపారాయణయని, నామస్మరణయని యింకననేక విధములుగా చేయుచున్నారు. ఇవి మోక్ష మార్గములని యితరులకు బోధించుచున్నారు. ఇవి యన్నియును గ్రుడ్డివారు గ్రుడ్డివారికి బోధించు ప్రకృతిగుణ ముల అవ్యక్త మార్గములు. వీనిద్వారా కర్మబంధితులై, అధిక కష్ట దుఃఖముల నను భవించెదరు. ఇవి యన్నియును అంధ పరంపరా వచ్చుచున్న అవ్యక్త మార్గములు. గ్రుడ్డివారి ప్రవర్తనలు. సాకారములు అనగా పరమపదమును, అచటిచేరుమార్గము నెరిగి, ఆ మార్గమున విజ్ఞానముచేత నడుప (ప్రవర్తింప)బడువారు. అట్టివారి దరిచేరి వారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయుటయే సాకారమార్గము(ప్రవర్తన) వారి ద్వారానే పరమపదమును చూచు జ్ఞానమును, అచటికి చేరుమార్గము నెరుగు విజ్ఞాన మును పొందగలరు. వారి విగ్రహములను చేసి వానివి సాకారములని ఆ విగ్రహ ముల రూపమున చేయునది ప్రకృతి గుణముల అవ్యక్త మార్గము. ఇది సాకార మార్గము కాదు. అందువలన కన్నులు లేనివారు కన్నులున్నవారి చేయి పట్టుకొను టయే అనగా జ్ఞాన విజ్ఞానములు లేనివారు అవి యున్నవారి సాంగత్యముననుండి వారు చెప్పునటుల చేయుటయే సాకారమార్గము. విగ్రహములకును, విగ్రహముల రూపమున చేయు వారికిని పరమపదమును చూచు జ్ఞానము, సర్వము నెరిగి నిష్కా మాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించు విజ్ఞానము అను కన్నులు లేవు. అవి సంభవించవు.

సగుణారాధనయనగా పరమపదము నెరిగిన వారియందు సగుణములు (జ్ఞాన విజ్ఞానములు) ఉండును. రాగ, ద్వేషాది ప్రకృతి గుణములుండవు. రాగ ద్వేషాది ప్రకృతి గుణములు గలవారు సగుణములు గలవారి సాంగత్యమున వారు చెప్ప

నటుల చేయుటయే సగుణారాధన. అందువలన వారియందున్న సగుణములను (జ్ఞాన విజ్ఞానములను) వారిద్వారా వీరును పొందగలరు.

వీరికిని జ్ఞానముద్వారా పరమపదము కాన్పించును. విజ్ఞానము సర్వము నెరిగి వీరియందున్న కామ రాగద్వేషాది గుణములను వెడలగొట్టి వీరి సంస్కారము ననుసరించి వీరి స్వభావము ప్రవర్తించు కర్మలయందు నిష్కామము, సమత్వబుద్ధి నిత్యసత్వము, పవిత్ర ప్రేమాది పవిత్రభావములతో ప్రవర్తించి వీరిని కర్మరహితులనుగా జేసి, తానును (విజ్ఞానము) వీరిని విడుచును. వీరు జ్ఞానముద్వారా పరమ తేజోపదమును చూచుచు ఆ పదమును చేరుదురు. దైవసంపద (జ్ఞాన విజ్ఞానములు) పరమపదమును చేర్చునని, అసురసంపద (రాగద్వేషాది గుణములు) కర్మ బంధమును కలుగజేయునవియని 16 వ అ. 5 వ శ్లో. లో ఉన్నది. అంతియేగాని, సగుణారాధన, సగుణోపాసన, నిర్గుణారాధన, నిర్గుణోపాసన యనునవి కల్పితమేగాని యథార్థము కాదు.

శ్లో॥ యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్యమత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥ 6

శ్లో॥ తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్॥ 7

తా. అర్జునా! ఎవరు సర్వకర్మలను నాకర్పించి నా పరము (వశము) నందున్నవారై, యితర కర్మలేవియును లేని కర్మయోగముతో నన్నే ధ్యానించుచు, ఉపాసించుచున్నారో, అట్లు నాయందే యున్న భావము (ప్రేమ) గలవారలను నేను శీఘ్రముగా మృత్యురూపమగు సంసార సముద్రమునుండి ఉద్ధరించువాడ నగుచున్నాను.

వ్యా. ఎవరైనను జ్ఞాన విజ్ఞానములు గలవారి దరిజేరి, సర్వ కర్మలును స్వయముగా చేయక, వారు చెప్పునటుల చేయువారు ప్రపంచ సంబంధమైన కర్మలను విడిచి, విజ్ఞానము గలవారి వశము నందున్నవారై వారిద్వారానే వారియందే యుండు ప్రేమ, భక్తి గలవారై మృత్యురూపమగు సంసార సముద్రమునుండి ఉద్ధరించు జ్ఞాన, విజ్ఞానములు గలవారగుదురు. ఈ విధముగ కృష్ణుని ద్వారాను ఉద్ధ

రించబడి యుందురు. ఇందు వ్రాసిన ధ్యానము, ఉపాసన యనునవి యథార్థములు గావు.

శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥ 8

తా. నాయందే మనస్సు నుంచుము. నాయందే బుద్ధిని నిలుపుము. అటు పిమ్మట నాయందే నివసింపగలవు. సందేహము లేదు.

వ్యా. కృష్ణునియందు మనస్సు నుంచుటయును, బుద్ధి నిలుపుటయును, ఇట్లు కృష్ణునియందు నివసించుటయును యథార్థము కాదు. కృష్ణుని విడువక కృష్ణుని సేవ చేయువారికి కృష్ణుడే తనను తెలియు బుద్ధి (భక్తి) నిచ్చెదనని 10 వ అ. 10 వ శ్లో. లో ఉన్నది. అటుల వారు కృష్ణునియందు భక్తిగల వారైనపుడు వారికి కృష్ణుడును కాన్పించుచుండును. వారు కృష్ణుని యందున్నవారని చెప్పవలెను. ఇట్లు కృష్ణుడున్నప్పుడు జరిగినదియే కాని, శరీరమును విడిచిన తరువాత జరుగునది కాదు.

శ్లో॥ అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరం।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ।॥ 9

తా. అర్జునా ? అటుల నాయందు మనస్సును స్థిరముగా నిలుపుటకు నశక్తుడవైతివేని అభ్యాస యోగముచేత నన్ను పొందుటకు ఆసక్తి గలవాడవై యుండుము.

వ్యా. ఇందు వ్రాసినది యథార్థము కాదు. అర్జునుడు ఏ అభ్యాసముచేతను కృష్ణునియందున్న "నన్ను" అను విజ్ఞానమును పొందలేదు.

శ్లో॥ అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మ పరమో భవ।
మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి॥ 10

తా. అభ్యాసము చేయుటయందు నసమర్థుడవైతివేని నా కొరకు కర్మలను చేయుటయే ఉత్తమమని చేయుము. నా కొరకు కర్మలను చేయుచునైనను, సిద్ధిని పొందగలవు.

వ్యా. కృష్ణుని సాంగత్యమున కృష్ణుడు చెప్పినటుల కర్మ చేయుటయే కృష్ణునికొరకు కర్మ చేయుట. అటుల చేసినచో వానిని కృష్ణుడే తనయందు ప్రేమయును, భక్తియును గలవానినిగా చేయును. ఆ భక్తితోనే కృష్ణునియందున్న విజ్ఞానమును, జ్ఞానమును పొందగలడు. ఇదియే కర్మఫలసిద్ధి.

శ్లో॥ అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః ।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥

తా. అట్లు చేయుటకు నసమర్థుడవైతివేని నన్ను పొందు యోగము నాశ్రయించి, చంచలము లేనివాడవై సర్వ కర్మఫలమును విడిచిపెట్టుము.

వ్యా. కృష్ణునికొరకు కృష్ణు నాశ్రయించి కృష్ణుడు చెప్పినటుల చేయుచున్నచో, కృష్ణుడే తనయందు ప్రేమ, చంచలములేని భక్తి గలవానినిగను, సర్వ కర్మఫలముల యందపేక్ష లేనివానినిగను చేయును. ఇదియే కృష్ణుని యందున్న "నన్ను" అను విజ్ఞానమును పొందుకర్మ. అర్జునుడు యోగముద్వారాను, ఇంకే విధముగను చంచలము లేనివాడు కాడు. ఫలాపేక్షలేని కర్మ చేయువాడు కాడు.

శ్లో॥ శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మ ఫలత్యాగస్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్॥ 12

తా. అభ్యాసముకంటె జ్ఞానము, జ్ఞానముకంటె ధ్యానము, ధ్యానముకంటెను కర్మఫలత్యాగము శ్రేష్ఠములైనవి. కర్మ ఫలత్యాగమువలన శాంతి కలుగును.

వ్యా. స్వయముగా చేయు అభ్యాసము, ఈ ప్రపంచ జ్ఞానము, ధ్యానము, కర్మ ఫలత్యాగము నొకదానికంటె నొకటి శ్రేష్ఠమైనవని వ్రాసినది యథార్థము కాదు. ఎవరైనను జ్ఞానము గలవారి సాంగత్యమువలన వారి సంబంధులై వారి ద్వారానే వారియందు ప్రేమ, భక్తి గలవారై ఏ ఆసక్తియును లేని వారగుదురు. ఇదియే కర్మ ఫలత్యాగము. అట్టివారు శాంతిగ నుందురు.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥ 13

శ్లో॥ సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనో బుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః ॥

తా. సర్వభూతములయందు ద్వేషము లేనివాడును, మిత్రభావముగలవాడును దయ గలవాడును, మమత్వము లేనివాడును, నిరహంకారుడును, సుఖ, దుఃఖముల యందు సమబుద్ధి గలవాడును, ఓర్పు గలవాడును, ఎల్లప్పుడును సంతోషముగ నుండువాడును, ఆత్మయందు దృఢనిశ్చయము గలవాడును, నాకర్పించిన మనస్సు బుద్ధియును గలవాడును అగు కర్మయోగి నాకు భక్తుడును, ప్రియుడు నగుచున్నాడు.

వ్యా. 13, 14 శ్లోకములలో చెప్పబడినవి కృష్ణుని సాంగత్యమునగాని, జ్ఞాన విజ్ఞానములు గలవారి సాంగత్యమునగాని వారు చెప్పునటుల చేయు వారి లక్షణ ములు. కృష్ణుడు చెప్పునటుల చేయువారికే నాకర్పించు మనస్సు, ((ప్రేమ) బుద్ధి (భక్తి) గలవారని కృష్ణుడు చెప్పను. కాని, యింకొకవిధమున నాకర్పించిన మనస్సు, (ప్రేమ) బుద్ధి, (భక్తి) యనునవి లేవు. ఆత్మ లేదు. ఆత్మయందు అని వ్రాసినది యథార్థము కాదు.

శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్సచ మే ప్రియః॥15

తా. ఎవనివలన ప్రజలు భయము నొందరో, ఎవడు ప్రజలవలన భయము నొందడో, ఎవడు హర్షామర్షములయందు భయోద్వేగములను పొందడో అట్టివాడు నాకు ప్రియుడు.

శ్లో॥ అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గత వ్యథః।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః॥ 16

తా. అపేక్ష లేనివాడును, శుచి గలవాడును, కార్యదీక్ష గలవాడును, ఉదా సీనుడును, వ్యాకులత లేనివాడును, స్వయముగా కర్మ చేయవలయునను కోరికలేని వాడునగు నా భక్తుడు నాకు ప్రియుడు.

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః॥ 17

తా. ఎవడు ఇష్టానిష్ట వస్తువులయందు సంతోషమును, ద్వేషమును లేక యున్నాడో, ప్రియ వస్తువుల వియోగము కలిగినపుడు దుఃఖింపక, దేనిని గోరక, శుభాశుభ కర్మలను పరిత్యాగము చేసి యున్నాడో అట్టి నా భక్తుడు నాకు ప్రియుడు.

శ్లో॥ సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః
శీతోష్ణ సుఖ దుఃఖేషు సమస్సంగ వివర్జితః॥ 18

తా. శత్రువునందును, మిత్రునియందును, మానావ మానములయందును, శీతోష్ణ సుఖ దుఃఖములయందును సమానుడునై సర్వ సంగ వర్జితుడును,

శ్లో॥ తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్।
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః॥ 19

తా. నిందాస్తోత్రములయందు సమానుడును, మౌనియును, లభించిన ఆహారముతో తృప్తుడైనవాడును, నియమింపబడిన నివాసము లేనివాడును అనగా కృష్ణ ననుసరించి యుండువాడేగాని, వేరుగా నుండుటకు ఒక స్థలమును నియమించుకొనని వాడును, నిశ్చయబుద్ధి గలవాడును నాయందు భక్తి గలవాడు నగు నరుడు నాకు ప్రియుడు.

వ్యా. కృష్ణుడు తన సాంగత్య సంబంధము గలవారిని తనయందు భక్తి గల వారినిగా చేసియుండును. 13 వ శ్లో. నుండి 19 వ శ్లోకమువరకును చెప్పబడినవి అట్టి భక్తి గలవాని లక్షణములు. ఆ విధముగనే జ్ఞాన విజ్ఞానములు గలవారి సాంగత్యమున ఉన్న వారి లక్షణములు. ఇచ్చట మౌని యనగా కృష్ణుని సంబంధమైనవి గాక యితర విషయములను మాట్లాడనివాడు. జ్ఞాన, విజ్ఞానములు గలవారికిని, వారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయు వారికిని స్థిర నివాసమనునది యుండదు. జ్ఞాన విజ్ఞానములు గలవారు కోరికయే లేనివారు గనుక, వారి సంస్కార కర్మల యందు వారి స్వభావముచేత ప్రవర్తింపబడుచుందురు. ఆ కర్మలయందు విజ్ఞానము నిష్కామాది పవిత్ర ప్రేమభావములతో నుండును. అట్టివారి ననుసరించిన వారు వారియందు ప్రేమ గలవారై, వారు చెప్పునటుల చేయుచు ఫలమునందు కోరిక లేని వారై యుందురు.

శ్లో॥ యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః 20

తా. ఎవరు నన్నే పరమగతిగా తలంచి, యిప్పుడు నేను చెప్పిన అమృత సమానమైన ధర్మమును శ్రద్ధతో విధిగా ఆచరించుచున్నారో అట్టి నా భక్తులు నాకు మిక్కిలి ప్రియులు.

వ్యా. సర్వమును విడిచి కృష్ణునివద్దకు జేరినవారు కృష్ణుడే పరమగతి యని తలంచి కృష్ణునియందు ప్రేమ గలవారగను ఈ అధ్యాయమున 13 వ శ్లో. నుండి 20 వ శ్లో. వరకు చెప్పబడిన అమృత సమానమైన పరమ ధర్మమును ఆచరించు వారుగను కృష్ణుడే చేయును. ఆ విధముగనే పరమపదము నెరిగిన వారివద్దకుజేరిన వారు ఆ పదము నెరిగిన వారియందు ప్రేమ గలవారై అమృత సమానమైన పరమ ధర్మమును ఆచరించువారినిగా వారే చేయుదురు. అనగా జ్ఞానముగల వారియందున్న విజ్ఞానమే వారివద్దకు వచ్చినవారిని పరమ ధర్మమగు పరమపద మార్గమున ప్రవర్తించు వారినిగా జేయును.

11 వ అధ్యాయమున కడపటి 55 వ శ్లోకమునందు కృష్ణుని సాంగత్యమున కృష్ణు ననుసరించి కర్మచేయు భక్తుని లక్షణములను చెప్పియున్నాడు. ఆ శ్లోకము నందు చెప్పబడిన సాకార మార్గమున అనగా జ్ఞాన విజ్ఞానములు గలవాడై సాకార ముతో నున్న కృష్ణుని సాంగత్యమువలన భక్తులైనవారలా (లేక) అవ్యక్త మార్గ మున అనగా ఇంద్రియములకు కాన్పించని పరమతేజోపదముగా ఉన్న తేజస్సును ఉపాసన చేయువారలా! అనగా ఈ రెండు తెగలవారలలో, ఏ తెగవారు పరమ తేజోపద మార్గము నెరిగిన వారలగుదురని 12వ అధ్యాయమున 1 వ శ్లోకమునందు అర్జునుడు కృష్ణు నడిగినట్లుగా వ్రాసియున్నారు. చూడవలసినది, చేరవలసినది యగు పరమపదమునుకన్నులున్నవారుచూడగలరుచేరగలరు. గ్రుడ్డివారుచూడలేరు.చేరలేరు. గ్రుడ్డివారు జ్ఞాన విజ్ఞానములనునట్టి కన్నుల నార్జింపవలెను. అందులకు వారు పరమ పదమును చూచు కన్నులు గలవారి నుండియే వారిద్వారానే జ్ఞాన విజ్ఞానములనునట్టి కన్నులు నార్జింపవలెను. జ్ఞానవిజ్ఞానములద్వారా పరమపదమును, పరమపదమార్గము నెరిగి వెళ్ళుట నిజమగు మార్గము. గ్రుడ్డియగు రాగద్వేషాది గుణములు గలవారు జ్ఞాన విజ్ఞానములు గలవారి దరిజేరి వారు చెప్పునటుల చేయుటయే సాకారమార్గము.

రాగద్వేషాది గుణములు పరమపదమును, పరమపద మార్గమును చూడలేవు. ఎరుగవు. జప, తప, యజ్ఞ, ధ్యాన, ఉపాసన, నామస్మరణాది మార్గములు ఈ అధ్యాయమున 5 వ శ్లోకములో చెప్పబడినటుల అధిక దుఃఖములకు కారణమగు అవ్యక్త మార్గములు. ఇవి రాగద్వేషాది ప్రకృతి (మాయా) గుణముల అంధమార్గములు. (ప్రవర్తనలు).

పేరు భక్తి యోగము. ఇందు వ్రాసినది ఉపాసన యోగము. 10 వ అ. 10 వ శ్లోకములో చెప్పబడినటుల కృష్ణుని విడువక సేవ చేయువారిని కృష్ణుడే తన యందు భక్తి గలవారినిగా చేయుననునది భక్తి యోగము. "నన్ను విడువక సేవించుచున్న నా భక్తులలోను అని వ్రాయవలసినదానిని నన్ను ఉపాసించుచున్న నా భక్తుల లోను అని కృష్ణుడు చెప్పినట్లు కల్పించి వ్రాసినారు. ఉపాసన యనునది రాగ ద్వేషాది గుణముల అవ్యక్త (గ్రుడ్డివారి) మార్గము (ప్రవర్తన).



# గీతా వ్యాఖ్యానము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

## 13 వ అధ్యాయము

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ।
ఏతద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ॥ 1

తా. 1. ప్రకృతి 2. పురుషుడు 3. క్షేత్రము 4. క్షేత్రజ్ఞుడు 5. జ్ఞానము 6. జ్ఞేయము వీనిని తెలిసికొన గోరుచున్నాను.

వ్యా. ప్రకృతి యనునదెట్టిది? పురుషుడనగ నెట్టివాడు? క్షేత్రమనగనెట్టిది? క్షేత్రజ్ఞుడనువాడెవడు? జ్ఞానమనగ నెట్టిది? జ్ఞేయము అనగా చేరవలసిన పరమపద మనునది ఏది? వీనిని అర్జునుడు తెలిసికొనవలెనని అడిగినటుల వ్రాసినారు.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే॥
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ 2

తా. అర్జునా! ఈ శరీరము క్షేత్రమని, దీని నెరిగినవాడు క్షేత్రజ్ఞుడని వాని నెరిగినవారు చెప్పుదురు.

వ్యా. జ్ఞాన, విజ్ఞానములు గలవారు విజ్ఞానముద్వారా ఇందు వ్రాసిన క్షేత్ర మును, క్షేత్రజ్ఞుడను జీవుల స్వభావమును ఎరిగియున్నారు.

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత॥
క్షేత్ర క్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతంమమ॥ 3

తా. అర్జునా! సమస్త శరీరముల యందుండెడి క్షేత్రజ్ఞుని నన్నుగా నెరుంగుము. క్షేత్ర క్షేత్రజ్ఞుల నెరిగినదానినే జ్ఞానమని నా మతము.

వ్యా. ప్రకృతి అనగా ఈ కాన్పించు సర్వమును ఉన్నది, ఈ సర్వమును సృష్టించునది, దాని గుణములద్వారా జీవుల యందుండి ప్రవర్తించి జీవులు జనన మరణ సుఖ దుఃఖముల ననుభవించుటకు కారణమగునదియగు మాయ. పురుషుడనగా సుఖ దుఃఖముల ననుభవించు జీవుడు. క్షేత్రమనగా శరీరము.

క్షేత్రజ్ఞుడనగా జీవులయందున్న మాయాగుణముల కర్మల ననుసరించిమరల యింకొకపుడు ఆ కర్మలయందు ప్రవర్తించి వానిని జనన మరణ సుఖదుఃఖముల ననుభవింపజేయు జీవుల సహజ స్వభావము(గుణము). కృష్ణుడను జీవునియందును, సర్వజీవులయందును ఉన్న క్షేత్రజ్ఞుడనునట్టి స్వభావము ఒకలాంటిదే గనుక, జీవుల స్వభావమును నన్నుగా నెరుంగుమని కృష్ణుడు చెప్పినటుల వ్రాసినారు. కృష్ణుడను జీవుడును, సర్వజీవులును ఒకలాంటివేగాని, ఒకటి గాదు. కృష్ణుడను జీవుని స్వభావమును, సర్వజీవుల స్వభావమును ఒకలాంటిదేగాని ఒకటిగాదు. మాయయందుండి, మాయచేత సృష్టింపబడిన స్వభావముగల జీవులను గాని, లేక జీవుల స్వభావమును గాని "నేనే" నని లేక నన్నుగా నెరుంగుమని ఎవ్వరనినను జీవులు సుఖ దుఃఖముల ననుభవించునవి. జీవుల స్వభావము ఆ జీవులను వాని సంస్కారమువలనసుఖ దుఃఖముల ననుభవింపజేయునది. జ్ఞాన విజ్ఞానములు గలవాడు విజ్ఞానమువలన స్వభావముతో నున్న "నేన"ను జీవుని, సర్వజీవులను ఎరిగియున్నాడు. వాడు సర్వ జీవులును నాలాంటివే, లేక ఒకలాంటివే అనవలసినవానిని (ఆ జీవులను) "నేనే" నని యుండవచ్చును. కాని, జీవుల స్వభావమును "నేనే"నని (లేక) నన్నుగా నెరుంగుమని చెప్పడు. ఈ స్వభావముగల సర్వజీవులును నాలాంటివే యనినపుడు వాడు సర్వజీవులను తనతో సమముగా చూచును. అటుల చూచుటకు వానియందున్న సర్వమును ఎరిగిన విజ్ఞానమే కారణము. సమస్త క్షేత్రములయందున్నది "నేనే" నని నపుడు సమానత్వ ధర్మముండదు. జ్ఞేయమనగా పరమపదము. అచ్చటికి చేరినవారు ఈ లోకమునందు జన్మమునకు రారు.

జ్ఞానమనగా పరమపదమును చూచు భావము.

క్షేత్రము నెరిగినది క్షేత్రజ్ఞుడు (జీవుల స్వభావము). క్షేత్ర క్షేత్రజ్ఞుల నెరిగినది విజ్ఞానము. ఇది క్షేత్ర క్షేత్రజ్ఞులను, ఈ సర్వమును ఎరిగి యున్నది. 3 వ

శ్లోకములో జ్ఞానమని వ్రాసినది విజ్ఞానము. ఇది పరమపదమును చూచు జ్ఞానమున్న వారి యందుండునది. జ్ఞానము పరమపదమును చూచునదియేగాని, క్షేత్ర క్షేత్రజ్ఞుల నెరుగదు. ఈ లోకము నెరుగదు.

శ్లో॥ తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చయత్
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు 4

తా. క్షేత్రమననేదియో, ఏలాంటిదో, ఎట్టి వికారములు గలదియో, దేని వలన పుట్టినదో, క్షేత్రజ్ఞుడెట్టి ప్రభావము గలవాడో దానిని సంగ్రహముగా చెప్పెదను వినుము.

శ్లో॥ ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః॥ 5

తా. అనేక విధములుగా ఋషులచేతను, నానా విధములగు వేదములచేతను ప్రత్యేకముగను, యుక్తి యుక్తములుగను నిశ్చయించబడినవియునగు బ్రహ్మసూత్ర పదములచేతను చెప్పబడి యున్నది.

వ్యా. 4 వ శ్లోకమునందు చెప్పబడిన క్షేత్రజ్ఞుడు (జీవుల స్వభావము) ఋషులచేతను, వేదములచేతను, బ్రహ్మసూత్ర పదములచేతను, యుక్తియుక్తముగను, ప్రత్యేకముగను ఎరిగి చెప్పబడునది కాదు వానిద్వారా తెలియబడునదికాదు. పరమపదము నెరిగినవారి (జ్ఞాన, విజ్ఞానములు గలవారి) యందున్న విజ్ఞానముచేత నెరిగి చెప్పబడునది. అందువలన విజ్ఞానముద్వారానే ఎరుగదగినది.

శ్లో॥ మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ।
ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః॥ 6

శ్లో॥ ఇచ్ఛాద్వేష స్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనాధృతిః।
ఏతత్క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్॥ 7

తా. పంచభూతములు, అహంకారము, బుద్ధి, కాన్పించని ప్రకృతి, దశేంద్రియములతో కూడియున్న జీవుడును, పంచేంద్రియములకు గోచరించు విషయము

లును, ఇచ్ఛయును, ద్వేషమును, సుఖమును, దుఃఖమును, తెలివి, ధైర్యము ఈ అన్నిటియొక్క వికారములతో కూడియున్నది క్షేత్రమని సంగ్రహముగా చెప్ప బడినది.

వ్యా. 6, 7 శ్లోకములయందు వ్రాసియున్న క్షేత్రము పంచభూతములు, రాగద్వేషాది ప్రకృతి (మాయా) గుణములు, ఈ గుణముల కర్మలవలనను తన స్వభావమువలనను వికారముల ననుభవించు జీవుడుగల శరీరము. ఇందు వ్రాసిన వన్నియును జీవుని యందుండుటవలన ఆ జీవుడున్న శరీరము నందున్నవి. ఇందు జ్ఞాన, విజ్ఞానములు లేవు. భక్తియను భావమును లేదు. ఇందు కాన్పించని ప్రకృతి యనునది పంచభూతములు, మాయాగుణములు, స్వభావముగల జీవులును ఉన్న మాయ. ఇది 7 వ అ. 4 వ శ్లో.లో ఉన్న ప్రకృతి జీవుల స్వభావమును కృష్ణుని యొక్క శ్రేష్ఠమైన ప్రకృతియని 7 వ అ. 5 వ శ్లో.లో కల్పించి వ్రాసినారు.

శ్లో॥ అమానిత్వమదంభిత్వమహింసా క్షాంతిరార్జవం।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః॥ 8

తా. అమానిత్వము, అదంభిత్వము, అహింస, సహనము, సరళత్వము గురుని (జ్ఞాన విజ్ఞానములు గలవారిని) ఉపాసించుట, శుచిగా నుండుట, స్థైర్యము, ఆత్మ నిగ్రహము.

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్॥ 9

తా. ఇంద్రియ విషయములయందు వైరాగ్యము, అహంకారము లేకుండుట, జననము, మరణము, జరా, వ్యాధి, దుఃఖదోషముల నెరుంగుట,

శ్లో. అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు।
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోప పత్తిషు॥ 10

తా. అసక్తి లేకుండుట, పుత్రదార గృహాదులయందు మోహము లేకుండుట, ఎల్లప్పుడును ఇష్టా నిష్టములయందు సమబుద్ధి గలిగియుండుట,

శ్లో॥ మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ।
వివిక్తదేశ సేవిత్వమరతిర్జన సంసది॥ 11

తా. నా యందనన్యయోగముతో అనగా కృష్ణుని యందనన్య ప్రేమతో ఇతరములగు సర్వకర్మలను విడిచి కృష్ణుని సాంగత్యమున కృష్ణుడు చెప్పునటుల చేయు భక్తి గలిగియుండుట. కృష్ణుని విడిచి ఇతర స్థలములకు వెళ్ళకుండుట.

వ్యా. 8, 9, 10 శ్లో.లయందు గురుని అనగా 4 వ అ. 34 శ్లో.లో చెప్పబడినటుల జ్ఞాన విజ్ఞానములుగల (పరమపద దర్శనమైన) జ్ఞానుల దరిజేరి వారికి సేవ చేయువారి ప్రవర్తనను వ్రాసియున్నారు. 11 వ శ్లో.లో ఉన్నది 10 వ అ. 10 వ శ్లో. లో ఉన్నటుల కృష్ణుని దరిజేరి కృష్ణుని యందనన్య ప్రేమతో సేవ చేయుచు కృష్ణుడు చెప్పునటుల చేయువారి ప్రవర్తనను వ్రాసియున్నారు. పరమపద దర్శనమైన జ్ఞానులును, కృష్ణుడును సమానులు. అట్టి జ్ఞానులను సేవించువారు కృష్ణుని సేవించుటకు వెళ్ళరు. వారు సేవచేయు జ్ఞానులద్వారానే భక్తిని పొంది,వారి యందు భక్తి గలవారై, ఆ భక్తితో ఆ జ్ఞానులయందున్న విజ్ఞానమును పొంది (ఆర్జించి) విజ్ఞానమువలన జ్ఞానమును పొందుదురు. 8 వ శ్లో. లో గురుని సేవ చేయుటయేగాని ఉపాసన చేయుట యనునది కాదు. ఆత్మ నిగ్రహమనునది యథార్థము కాదు. ఆత్మలేదు. ఆత్మనిగ్రహమనునది లేదు.

శ్లో॥ అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనం।
ఏతత్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా॥ 12

తా. ఎల్లప్పుడును పరమపదముగా ఉన్న తేజస్సును దర్శించు జ్ఞానము గలవాడగుటయు, ఆ జ్ఞానముద్వారా ఆ తేజోపద దర్శనమగుటయు, ఇది జ్ఞానమని చెప్పబడినది. దీనికి వేరైనది అజ్ఞానము. అనగా ప్రకృతి (మాయా) గుణముల చేత చేయబడు అవ్యక్త ప్రవర్తన.

వ్యా. పైన 8, 9, 10 శ్లో.లలోను, 11 వ శ్లోకములోను చెప్పబడినటుల జ్ఞాన విజ్ఞానములు గలవారి సాంగత్యమునగాని, అట్టి కృష్ణుని సాంగత్యమునగాని జ్ఞాన విజ్ఞానములను పొందినపుడు 12 వ శ్లోకమునందు చెప్పబడినటుల జ్ఞానము గల

వారును, జ్ఞానముద్వారా పరమపద దర్శనమైనవారును అగుదురు. రాగ ద్వేషాది ప్రకృతి (మాయా) గుణములు లేనివారును అగుదురు. ఇది జ్ఞానము అనగా జ్ఞాన విజ్ఞానములుగల జ్ఞానులప్రవర్తన. అట్టిజ్ఞానము గలవారిని వారియందున్న విజ్ఞానము యొక్క నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్వము, పవిత్రప్రేమాది పవిత్ర భావముల ప్రవర్తనవలన తెలిసికొని వారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయుచు వారిద్వారా విజ్ఞానముతోనున్న జ్ఞానము నార్జించి జ్ఞానము గలవారగుదురు. ఇట్లుగాక యింకేవిధముగను స్వయముగా చేయు ప్రయత్నముతో అట్టి జ్ఞానము నార్జించలేరు. జ్ఞానము గలవారు కారు.

6, 7 శ్లోకములయందు చెప్పబడిన పంచభూతములు, రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వ, వాంఛాది గుణములుగల ప్రకృతి (మాయ) యును గలిగి, ఆ గుణముల వికారముల ననుభవించుచున్న జీవునితోనున్న శరీరము క్షేత్ర మనబడు చున్నది. 8, 9, 10, 11 శ్లో. లలో చెప్పబడినవి సర్వకర్మలను విడిచి, సర్వజన సంబంధమును లేనివారై జ్ఞాన, విజ్ఞానములు గలవారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయుచు వారివలన వారియందు భక్తి గలవారైన వారి ప్రవర్తన. అట్టి భక్తి ద్వారానె వారు సేవచేయు వారియందున్న విజ్ఞానము నార్జించి, విజ్ఞానమువలనజ్ఞానము నార్జించినవారై 12 వ శ్లో. నందు చెప్పబడిన జ్ఞానము గలవారగుదురు. జ్ఞానము ద్వారా పరమపదముగా ఉన్న తేజస్సు దర్శనమైనవారును అగుదురు. వీరియందు కామ, రాగ, ద్వేషాది గుణములుండలేక వెళ్ళిపోవును. వీరి శరీరములు విజ్ఞాన క్షేత్రము లనబడుచున్నవి.

ఈ ప్రపంచములో జ్ఞాన, విజ్ఞానములు గలవారి శరీరములు విజ్ఞాన క్షేత్రము లనబడుచున్నవి. కామ, రాగ, ద్వేషాది గుణములుగల శరీరములు అజ్ఞాన క్షేత్రము లనబడుచున్నవి. అజ్ఞాన క్షేత్రములనబడువారు విజ్ఞానక్షేత్రము లనబడువారి సాంగత్యమునకు వెళ్ళి, వారు చెప్పునటుల చేయుచున్నచో, వారిని విజ్ఞాన క్షేత్రము లనబడువారు తమయందు ప్రేమగల వారగునటుల ప్రవర్తింపజేయుచు, భక్తిగలవారిని గను జేయుదురు. అప్పుడు అజ్ఞాన క్షేత్రము లనబడువారు భక్తిగల క్షేత్రములనబడుదురు. కాని అట్టి భక్తిగల వారివలన ఎవరును భక్తులుకారు. అట్టి భక్తి గలవారు ఆ భక్తిచేతనే వారున్న విజ్ఞాన క్షేత్రములనునట్టి శరీరములయందున్న విజ్ఞానము నార్జించి, విజ్ఞానమువలన జ్ఞానమునార్జించినపుడు వీరికిని జ్ఞానముద్వారా పరమతేజస్సు

కాన్పించును. వీరిని రాగద్వేషాది గుణములు విడుచును. విజ్ఞానము పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించుచుండును. ఈ విజ్ఞానముయొక్క ప్రవర్తనవలన వీరును జ్ఞాన, విజ్ఞాన క్షేత్రము లనబడుదురు. రాగద్వేషాది గుణములు స్వయముగా ఏ విధముగ ప్రవర్తించినను ఇవి కర్మబంధమును గలిగించి సుఖ, దుఃఖములకు కారణమగునవియేగాని, కర్మబంధ రహితమగు విజ్ఞాన ప్రవర్తన గలవికాదు. అందువలన రాగద్వేషాది అసుర అను ప్రకృతి గుణములుగల అజ్ఞాన క్షేత్రము లనబడువారు విజ్ఞాన క్షేత్రము లనబడు వారివద్దకు వెళ్ళవలెను.

విజ్ఞాన క్షేత్రము లనబడువారు శరీరములను విడిచిన తరువాత వారు నివసించిపోయిన స్థలములను భగవత్ క్షేత్రము లనుచున్నారు. వారి విగ్రహములను బెట్టి ఆ స్థలములను భగవత్ క్షేత్రము లనుచున్నారు. ఇవి విజ్ఞానక్షేత్రములుకాదు. పుణ్యక్షేత్రములు కాదు. భగవత్ క్షేత్రములనునవి లేవు. ఇవి యన్నియును ధనమును దోచుకొనుట కనుకూలమైన అజ్ఞాన క్షేత్రములు. ధనమును దోచుకొనుటకే ఈ ప్రపంచమునందు పుణ్యక్షేత్రములనునవి, భగవత్ క్షేత్రములనునవి అజ్ఞానక్షేత్రము లనునట్టి ప్రజలచేత అధికముగా నిర్మింపబడినవి. నిర్మింపబడుచున్నవి. ఈ క్షేత్రములయందున్న మానవులు రాగ,ద్వేషాది అసుర అనుప్రకృతి గుణములు గలవారేగాని, జ్ఞాన,విజ్ఞానములు గలవారుకాదు. ఈ క్షేత్రములయందు ధనమును దోచుకొను అజ్ఞాన(తప్పు) ప్రవర్తనయే యున్నదిగాని, విజ్ఞానప్రవర్తనలేదు. విగ్రహరూపమున నిర్మింపబడి యున్న భగవంతుడనునది ఆ తప్పు ప్రవర్తననుండి వారిని తొలగించునది కాదు. వారి పాపములను పోగొట్టునది కాదు. ఇంకేమియును చేయునది కాదు.

ఈ విధముగా విగ్రహ రూపమున భగవంతుడనునది ప్రజల పాపములను పోగొట్టుననుట, పాపములు పోగొట్టుమని వానిని కోరి వెళ్ళుట యిట్టివి యన్నియును రాగద్వేషాది ప్రకృతి గుణముల అజ్ఞాన ప్రవర్తనలేగాని, విజ్ఞాన ప్రవర్తన కాదు. ఏ గుణములు గల క్షేత్రమునకు వెళ్ళిన ఆ గుణములే సంభవించును. అందువలన ఎవరైనను విజ్ఞానముయొక్క నిష్కామాది పవిత్ర ప్రేమభావముల ప్రవర్తన గల వారిని వెదకి వారి సాంగత్యమునకు వెళ్ళినచో వారియందున్న జ్ఞాన, విజ్ఞానములను వారిద్వారానే పొంది జ్ఞాన, విజ్ఞానములు గలవారగుదురు. జ్ఞానముద్వారా వీరికిని పరమపద దర్శనమగును. ఇదియే 12 వ శ్లోకమునందు చెప్పబడిన జ్ఞానము గల వారగుట, జ్ఞానముద్వారా పరమపద దర్శనమైనవారగుట యనునది. 8, 9, 10, 11

శ్లోకములలో నున్నది జ్ఞాన విజ్ఞానములను అవి యున్నవారి సాంగత్యమున వారి ద్వారానే ఆర్జించు మార్గము (ప్రవర్తన).

విజ్ఞాన క్షేత్రములనబడు వారి సాంగత్యమున ఉన్నవారు వారియందు ప్రేమ చేత వారి ఫోటోలను తీయించినారు. వారు శరీరములను విడిచినపుడు ఆ శరీరములను భూమియందుంచి, అచ్చట సమాధులని ఆలయములను కట్టించి, అందు వారి విగ్రహములను పెట్టినారు. వారిని, వారి ప్రవర్తనను ఇతరులకు తెలియజేయుటకు వాడ చెప్పిన ప్రవర్తన వాక్యములను, వారి ప్రవర్తనను చరిత్రలద్వారా ప్రకటించినారు. అట్టి ప్రవర్తన గలవారిని (జీవించి యున్నవారిని) వెదకి తెలిసికొని, వారిద్వారానే జ్ఞాన, విజ్ఞానముల నార్జించి వీనిద్వారా పరమపదమును, సర్వమును ఎరిగి, గుణ రహితులై శిష్యులయొక్క నిష్కామాది పవిత్ర ప్రేమభావముల ప్రవర్తనవలన కర్మరహితులై పరమపదమును చేరవలయుననునది ఎరుగుటకే వారి చరిత్రలను వ్రాసి యున్నారు. అంతియేగాని వారు ఆ విగ్రహములకు పూజలు చేయరు. వాటికి కొబ్బరికాయలు కొట్టరు. నైవేద్య ఫలహారములు పెట్టరు. ఎందుచేతననగా వారు జీవించియున్నపుడు వారికి పెట్టినది తిని యున్నారు. గాని, వారి విగ్రహములకు పెట్టినది వారు తినరని వీరికి తెలియును.

కొంతకాలము జరిగిన తరువాత కొందరు ఆ విగ్రహములకు పూజలుచేయుట కొబ్బరికాయలు కొట్టుట, నైవేద్య ఫలహారములు పెట్టుట కల్పించినారు. వానికి ఉత్సవములు ఏర్పరచి మంత్రములని కల్పించినారు. వానిద్వారా ధనమార్జించి జీవితములు గడుపుకొనుచు వచ్చుచున్నారు. ఈ తప్పు ప్రవర్తనలను ఆచరిత్రలయందు ప్రకృతి విద్యా పండితులే వ్రాసినారు. అట్టి చరిత్రలు చదువుటయేగాని, అనేకులు అందు అవ్యక్తముగ వ్రాసిన తప్పు మార్గములను తెలిసికొనలేకున్నారు. సర్వము నెరిగిన విజ్ఞానము గలవారు చెప్పినటుల ప్రవర్తించవలెనను బుద్ధియును చాలమందికి కలుగుటలేదు. బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు అని, అమ్మవార్లని అనేక పేరులతో విగ్రహములు చేసి, వానికి ఆలయములు కట్టించి వానిని భగవంతులను పేరులతో ధనమార్జించుచు అవ్యక్తముగ ప్రవర్తించుచున్నారు. ఈ విధముగా భగవంతులని కల్పించి, వారి పేరులతో అనేకులు తప్పు మార్గముల (ప్రవర్తనల) ననుసరించు చున్నారు. అంతియేగాని భగవంతుడు లేడు.

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వాఽమృత
మశ్నుతే ।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥ 13

తా. ఏది ఎరుగదగినదో దేని నెరిగిన అమృతమనెడు సుఖము ననుభవించెదరో, అట్టి అనాదియగు పరబ్రహ్మము (పరమతేజస్సు) సత్ కాదనియు, అసత్ కాదనియు చెప్పబడుచున్నది. దానిని చెప్పుచున్నాను.

వ్యా. పరమపదముగా ఉన్న తేజస్సు దర్శనమైన వారే అమృతమను ఆ శ్లో ఆనంద మనుభవించువారు. అట్టివారు ఆ తేజస్సునందు సత్, అసత్ అనునవి లేవని చెప్పి యున్నారు. ఇప్పుడును చెప్పుచున్నారు. ఇది యథార్థము. సత్, అసత్ లేని పరమతేజస్సునందు సత్, అసత్ ఉన్నవనినను, ఈ ప్రపంచము అందుండి వచ్చినదనినను యథార్థము కాదు.

శ్లో॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖం।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥ 14

తా. ఆ పరమతేజస్సు పాణి, పాదములు, కన్నులు, శిరస్సులు, ముఖములు కర్ణములు గలదియై ఈ లోకమంతయు వ్యాపించి యున్నది.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. పరమతేజస్సునకు ఈ శ్లోకమునందు చెప్పబడినవన్నియును ఉన్నచో, అది సత్, అసత్ అనునవి గలదియని చెప్పవలెను. అది సత్, అసత్ అనునవి కలది కాదు. ఈ శ్లోకమునందు చెప్పబడిన వన్నియును కలదిగాదు. ఈ లోకమందు వ్యాపించి లేదు. చేతులు, కాళ్ళు, అవయవములు గుణములు కలది నిరాకారమెట్లగును? నిర్గుణ మెట్లగును? అదిఅంతయును పరమతేజో లోకము. ఆ తేజోలోకమునందేమియును లేదు. ఆతేజస్సు ఈలోకమునందు లేదు.

శ్లో॥ సర్వేన్ద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితం।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ॥ 15

తా. సర్వేంద్రియ గుణములను ప్రకాశింపజేయునదియు, సర్వేంద్రియములు లేనిదియు, దేనిని అంటనిదియు, సర్వమును భరించునట్టిదియు, గుణములు లేనిదియు, గుణముల ననుభవించునదియునై యున్నది.

వ్యా. సర్వేంద్రియ గుణములను ప్రేరేపింప జేయునది ప్రకృతి (మాయ). దేనిని అంటకయే సర్వజీవుల యందున్నదియు, గుణములు లేనిదియును మాయ యందుండి వచ్చిన జీవుల స్వభావము. గుణములను, గుణములు చేయు కర్మననుసరించి మరల యింకొకపుడు వాని స్వభావము చేయు కర్మను, కర్మఫలమును అనుభవించునది జీవులు. ఇందు పరమతేజస్సు లేదు.

శ్లో॥ బహిరన్తశ్చ భూతానామచరం చరమేవ చ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥

తా. అది భూతములయొక్క లోపలను, బయటను ఉండునదియు, చరాచరమైనదియు, సూక్ష్మమైనదగుటచేత కనబడనిదియు, దూరముగనుండునదిగను,దగ్గరగనుండునదిగను ఉన్నది.

వ్యా. జీవులయందున్నది, సూక్ష్మమైనది, కనబడనిది 8 వ అ. 18, 19 వ శ్లో.లో చెప్పబడినటుల మాయయందుండి వచ్చిన జీవుల స్వభావము. ఇది జీవుల యందే యున్నది గాని, దూరముగ నుండునదికాదు. బయటనుండునది కాదు. ఇది జీవుల సంస్కారము ననుసరించి ప్రవర్తించునదియేగాని, స్వయముగా ప్రవర్తించునది కాదు. విజ్ఞానము గలవారు దీనిని దీని ప్రవర్తనవలన ఎరిగియున్నారు.

శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితం।
భూతభర్తృ చ తత్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥ 17

తా. అది విభజింపబడనిదియు, భూతములయందు విభజింపబడిన దానివలెనుండునట్టిదనియు, భూతములను భరించునట్టిదనియు, భూతములను లయమొనర్చునదనియు, పుట్టించునదనియు నెరుగదగినది.

వ్యా. ఈ స్వభావము విభజింపబడనిది కాదు. ఇది మాయయందుండి మాయచేత సృష్టింపబడిన జీవుల సహజ స్వభావము (గుణము). ఇది ఈ అధ్యాయమున

2 వ శ్లో.లో చెప్పబడిన క్షేత్రము నెరిగిన క్షేత్రజ్ఞుడనునది. మానవజన్మయందుజీవుల యందున్న రాగద్వేషాది గుణములు క్షేత్రముల (శరీరముల) ద్వారా చేయు కర్మల ననుసరించి ఈ అధ్యాయమున 27 వ శ్లో.నందు చెప్పబడినటులక్షేత్రములఅనగాస్త్రీ, పురుష శరీరములద్వారా సంయోగము చేయునది. వానిని అనేక జన్మలనెత్తించుచు జీవులకున్నది గాని వేరుగా లేదు. ఇది భూతములను ధరించునది కాదు. భరించునది కాదు.

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥

తా. అది ప్రకాశించువానికి ప్రకాశమిచ్చునది, అజ్ఞానమగు తమస్సుకంటె వేరుగా నున్నట్టిది, జ్ఞానముచేత చూడదగినది, జ్ఞానముద్వారానే చేరదగినది సకల ప్రాణుల హృదయముల యందున్నది యని చెప్పబడుచున్నది.

వ్యా. ఈ ప్రపంచమునందు ప్రకాశించుచున్నవన్నియును ప్రకృతి(మాయ) చేతనే ప్రకాశించుచున్నవి. అజ్ఞానమగు తమస్సుకంటె అనగా రాగద్వేషాదిగుణము లతో నున్న ఈ ప్రపంచముగల మాయ లేక వేరుగా నున్నది, జ్ఞానముచేతనే చూడ దగినది, జ్ఞానముద్వారానే చేరదగినది పరమ తేజోపదముగా ఉన్న పరమ తేజస్సు. సకల ప్రాణులయందున్నది 8 వ అ. 18, 19 వ శ్లో. లో చెప్పబడినటుల మాయ యందుండి వచ్చి మాయయందే కలియుచు మరల వచ్చుచు తిరుగుచున్నదనిన ఈ ప్రపంచములో జీవుల స్వభావమను గుణము. ఇది పరమతేజస్సుగా ఉన్న పరమ పదము కాదు. పరమ తేజస్సు కాదు. మాయయందుండి వచ్చిన జీవుల స్వభావ మును కృష్ణుడు తన ఆత్మయని, ప్రకృతియని 4 వ అ. 6 వ శ్లో.లోను, 7 వ అ. 5 వ శ్లో.లో తన శ్రేష్ఠమైన ప్రకృతియని, 11 వ అ. 32 వ శ్లో. లో తన స్వభా వమునే తానని, తానుకాలుడనని. 18 వ అ. 59 వ శ్లో.లో అర్జునుని ప్రకృతియని 60 వ శ్లో.లో అర్జునుని స్వభావమని, 61 వ శ్లో.లో ఈశ్వరుడని, 15 వ అ. 17, 18 శ్లో.లో ఉత్తమ పురుషుడు, పరమాత్మ, (పరమతేజస్సు), ఈశ్వరుడు కృష్ణుడని అవ్యక్తముగ వ్రాసినారు. ఇది జీవుల సహజ స్వభావమను గుణము. దీనిని పరమ తేజస్సని, దీనిని జ్ఞానముతోనే చూడదగినదని, చేరదగినదని అవ్యక్తముగ వ్రాసి

నారు. ఇది తప్పు. తప్పు మార్గము (ప్రవర్తన). కృష్ణునియందును, ఎవరియందును ఆత్మలేదు, ఈశ్వరుడు లేడు. పరమతేజస్సు లేదు.

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే॥ 19

తా. ఇట్లు క్షేత్రమును, జ్ఞానమును, జ్ఞేయమును సంగ్రహముగా చెప్పితిని. నా భక్తుడు దీని నెరింగినవాడై నా భావమును పొందుటకు అర్హుడగుచున్నాడు.

వ్యా. ఈ శ్లోకము నందున్నటుల చెప్పినది ఎరిగి కృష్ణునియందున్న భావమును (జ్ఞానమును) పొందినవారు ఎవ్వరును ఉండరు. ఈ శ్లోకము నందున్నది యథార్థము కాదు. 10 వ అ. 10, 11 వ శ్లో.లో యందున్నటుల కృష్ణుడు తనకు సేవ చేయువారలకు కృష్ణునియందుండి "సన్ను" అను విజ్ఞానమును పొందునట్టిభక్తి భావమును ఇచ్చుచున్నానని, తాను ఆ భక్తిభావమున వారియందున్నవాడై వారియందున్న అజ్ఞానము పోవుటకు వారియందు జ్ఞానమును (భావమును) ప్రవేశింప జేయుచున్నానని చెప్పినదియే యథార్థము.

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్ ॥20

తా.. ప్రకృతి, పురుషుడు ఇవి రెండును అనాదియని ఎరుంగుము. గుణములును, వికారములును ప్రకృతివలననే పుట్టిన వానినిగా నెరుంగుము.

వ్యా. సృష్టింపబడు ఈ ప్రపంచముగల ప్రకృతి (మాయ) యును, ఈ ప్రకృతి (మాయ)యందు స్వభావముతో నున్న పురుషుడను జీవుడును అనాది. జీవులును వికారములుగల గుణములును ప్రకృతి (మాయ) యందుండియే సృష్టింపబడి యున్నవి. ఈ గుణములు జీవులకు వాని స్వభావమువలన ఈ గుణములుగల ప్రపంచ సంబంధమునసంభవించుచున్నవి. జీవులు గుణములవలనను వానిస్వభావము వలనను వికారములను పొందుచున్నవి. అట్టి స్వభావము జీవులకున్నది.

శ్లో॥ కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే 21

తా. ప్రకృతి (మాయ) కార్యకారణ కర్తృత్వములకు హేతువని చెప్పబడు చున్నది. పురుషుడు (జీవుడు) సుఖదుఃఖముల ననుభవించుటకు హేతువని చెప్ప బడుచున్నది.

వ్యా. జీవులయందున్న రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వ వాంఛాది గుణములతోనున్న ప్రకృతి (మాయ) వాని శరీరములద్వారా కార్యకారణ కర్తృ త్వములతో కర్మలయందు ప్రవర్తించుచుండును. ఆ కర్మల ఫలమగు సుఖదుఃఖము లను ఆ జీవులనుభవించుటకు కారణమగుచున్నది జీవుల స్వభావము. ఇట్లు జీవుల ననుభవింపచేయు స్వభావము జీవులకు సహజముగనే యున్నది.

శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్
కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు॥ 22

తా. ప్రకృతి (మాయ) యున్న జీవుడు ప్రకృతి గుణముల ననుభవించు చుండును. వానికి గుణముల సంబంధము ఉత్కృష్ట, నికృష్ట జన్మములు కలుగు టకు కారణమగుచున్నది.

వ్యా. జీవుడు కర్మ చేయువాడుకాదు. ప్రకృతి గుణములున్నవారు(జీవులు) ఈ గుణముల ననుభవించుచుందురు. వారికి ఈ గుణములవలన అనగా ఈగుణములు చేయు కర్మల ననుసరించి ఉత్కృష్ట, నికృష్ట జన్మములు వారి స్వభావమువలన కలుగుచున్నవి. ఇట్లు మంచి గుణములు మంచి జన్మములకును, సుఖములకును, చెడ్డ గుణములు హీన జన్మములకును, కష్ట దుఃఖములకును కారణమగుచున్నవి. ఈ గుణములు గలవారు జ్ఞాన విజ్ఞానముల నార్జించినచో, వారికి జ్ఞానముద్వారా పరమ పద దర్శనమగును. విజ్ఞానమువలన వారియందున్న రాగద్వేషాది గుణములు వారిని విడిచి వెళ్ళును. వారి సంస్కారము ననుసరించి వారిస్వభావము ప్రవర్తించుకర్మల యందు విజ్ఞానము నిష్కామాది పవిత్ర ప్రేమభావములతో ప్రవర్తించుచుండును. వారు కర్మరహితులైనవారై పరమపదమును జ్ఞానముద్వారా చూచుచున్నవారగుదురు. జ్ఞానముద్వారానే చేరుదురు. పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను. జ్ఞానము ద్వారా చేరవలెనని ఈ అధ్యాయమున 18 వ శ్లో.లో ఉన్నది. ఏ జీవునియందు ఏ గుణములున్నవో ఆ గుణములు ఆ జీవునియందుండి శరీరముద్వారా కర్మలయందు

ప్రవర్తించుచుండును. ప్రకృతి గుణములకు పరమపద మార్గమగు జ్ఞాన విజ్ఞానముల ప్రవర్తన చేతకాదు. జ్ఞాన విజ్ఞానములకు కర్మబంధములను కలిగించు రాగద్వేషాది గుణముల ప్రవర్తనచేతకాదు. దైవసంపద (జ్ఞాన విజ్ఞాన భావములు) (గుణములు) పరమపదమును జేర్చునని, అసురసంపద (కామ రాగద్వేషాది గుణములు) కర్మ బంధమును కలుగజేయునవి యని 16 వ అ. 5 వ శ్లో.లో ఉన్నది. ఈ ప్రపంచ ములో దైవసంపద, అసురసంపదలనునట్టి రెండు విధములగు గుణముల సృష్టి లున్నవని 6 వ శ్లో. లో ఉన్నది. అంతియెకాని, ఏ భగవంతుడును సృష్టింప బడ లేదు. భగవంతుడు లేడు.

శ్లో॥ ఉపద్రష్టాఽను మన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్పురుషః పరః 23

తా. ఈ దేహమునందున్న పరమపురుషుడు సాక్షీభూతుడుగా చూచుచుండెడి వాడును, ఆమోదించువాడును, భరించువాడును, అనుభవించువాడును, మహేశ్వరు డును, పరమాత్మయునని చెప్పబడుచున్నాడు.

వ్యా. పైన చెప్పబడిన రాగద్వేషాది గుణములవలన సుఖదుఃఖముల నను భవించు జీవునినో, లేక అటుల సుఖదుఃఖములను జీవునిచేత అనుభవింపజేయు జీవుని స్వభావమునో ఈ 23 వ శ్లో.లో పరమపురుషుడని, మహేశ్వరుడని పర మాత్మయని కల్పించి వ్రాసినారు. ఇది యథార్థము కాదు. ఈ శరీరమునందున్న జీవుడుగాని, జీవునిస్వభావముగాని పరమపురుషుడు కాదు. మహేశ్వరుడుకాదు. పర మాత్మ (పరమతేజస్సు) కాదు. జీవులయందున్న గుణముల కర్మల ననుసరించి వానిని అనేక సుఖదుఃఖముల ననుభవింపజేయు జీవుల స్వభావము సాక్షీభూతుడుగా చూచుచుండెడివాడు కాదు. భరించువాడును, అనుభవించువాడును జీవుడు. ఆమోదించు వాడు లేడు. ఆమోదించనివాడును లేడు.

శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥24

తా. ఎవడు ఇట్లు పురుషుని, గుణములుగల ప్రకృతిని ఎరుగునో వాడు ఎల్లప్పుడును ఎచ్చటనున్నను, ఎచ్చట కర్మచేయుచున్నవాడైనను మరలజన్మించడు.

వ్యా. పరమపద దర్శనమైనవారే పరమపదమును, అచటికి చేరుమార్గమును, భావమును (జ్ఞానమును), శరీరమును, జీవుని, జీవుని స్వభావమును, పవిత్రభావములను, రాగద్వేషాది గుణములుగల ప్రకృతిని (మాయను) ఈ గుణములవలన కలిగెడు జన్మ కర్మలను, సర్వమును విజ్ఞానముచేతనే ఎరిగియున్నారు. వారు విజ్ఞానముచేతనే రాగద్వేషాది ప్రకృతి గుణములును, ప్రకృతియును లేనివారై నిష్కామాది పవిత్ర ప్రేమభావములతో వారిస్వభావము ప్రవర్తించు సంస్కారకర్మలయందు ప్రవర్తింపబడుచుందురు. అట్టి వారెచ్చటనున్నను, ఎచ్చట కర్మ చేసినను కర్మ రహితులై పరమపదమును జేరి ఈ లోకమునందు జన్మింపరు. ప్రకృతి గుణములు గలవారు ఇందేదియును ఎరుగలేరు.

## శ్లో॥ ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా।
## అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥ 25

తా. కొందరు తనయందున్న ఆత్మను ధ్యానముచేతను, కొందరు ఆత్మను ఆత్మచేతను కొందరు సాంఖ్యయోగముచేతను, కొందరు కర్మయోగముచేతనుచూచుచున్నారు.

వ్యా. ఈ కాన్పించు సర్వమును బ్రహ్మకు (మాయాభ్రమకు) పగటి కాలమందు కాన్పించని ప్రకృతి (మాయ)యందుండి వచ్చుచున్నదని, రాత్రి రాగానే ఆ మాయయందే కలియుచున్నదని 8 వ అ. 18 వ శ్లో. లోను, అట్టి జీవులు స్వాతంత్ర్యము లేనివై అనేక జన్మలనెత్తుచు రాత్రి రాగానే ఆమాయయందేకలియుచున్నవని పగలు రాగానే, మరల వచ్చుచున్నవని 19 శ్లో. లోను ఉన్నది. మాయయందుండి వచ్చిన ఈ ప్రపంచములో స్వభావముగల జీవులును, కామరాగద్వేషాది గుణములును ఉన్నవి. ఈ గుణములు అసుర సంపదయని, కర్మబంధమునుకలుగజేయునవి యని 16 వ అ. 5 వ శ్లో.లో ఉన్నది. జీవులు మానవజన్మయందు వానియందున్న రాగద్వేషాది గుణముల కర్మలవలన వాని స్వభావమునకు వశులై అనేక జన్మలనెత్తుచు సుఖదుఃఖముల ననుభవించుచు ఈ ప్రపంచమునందు తిరుగుచున్నవి. నశించనిది, సర్వోత్కృష్టమైనది చేరవలసిన స్థానమని, అచ్చటికి జేరినవారుజన్మమునకు తిరిగిరారని 8 వ అ. 21 వ శ్లో. లో చెప్పబడిన పరమపదముగా ఉన్న పరమ తేజస్సు ఈ లోకమునకు వచ్చునది కాదు. ఈ లోకములో ఎవరియందును లేదు.

అట్టి పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను. జ్ఞానముద్వారా చేరవలెనని ఈ అధ్యాయమున 18 వ శ్లో.లో ఉన్నది. అట్టి జ్ఞానమను భావము నశించనిదని మాయకంటె వేరుగా అనాదియై యున్నదని బ్రహ్మ (మాయాభ్రమ)తో సహా ఈ సర్వ ప్రపంచము నశించినను ఈ భావము (జ్ఞానము) నశించునది కాదని 8 వ అ. 20 వ శ్లో. లో ఉన్నది.

ఈ భావము (జ్ఞానము) అనాదియై యున్నదిగాని మాయయందు లేదు. మాయ యందుండి వచ్చిన ఈ ప్రపంచములో ఎవరియందును లేదు. ఎవరైనను అట్టి జ్ఞానమును అది యున్నవారి సాంగత్యమున వారినుండియే వారిద్వారానే ఆర్జించి ఆ జ్ఞానమను భావముద్వారానే పరమపదమును చూచుచు అచటికి చేరవలెను. మాయ యందుండి వచ్చి స్వాతంత్ర్యము లేక అనేక జన్మలనెత్తుచు మాయయందే కలియుచు మరల వచ్చుచు నుండు జీవులయందు ఈ భావము (జ్ఞానము) లేకపోవుట చేతనే జీవులు పరమపదమును చేరక కామ రాగద్వేషాది మాయాగుణములవలనను, వాని స్వభావమువలనను అనేక జన్మల నెత్తుచు ఈ ప్రపంచమునందు తిరుగు చున్నవి.

మాయయందుండి వచ్చి, నశించి మాయయందే కలియుచు మరలవచ్చుచున్న దనిన ఈ ప్రపంచములో ఎవరియందును ఆత్మ లేదు. కొందరు వారియందున్న ఆత్మను ధ్యానముద్వారా చూచుట అనునదియును లేదు. కొందరు వారియందున్న ఆత్మను ఆత్మచేత చూచుటనునదియును లేదు. కొందరు సాంఖ్యయోగము చేతను అనగా కామ రాగద్వేషాది గుణముల విచారణచేతను, కొందరు కర్మయోగము చేతను అనగా రాగద్వేషాది గుణములు చేయు కర్మయోగముచేతను వారియందున్న ఆత్మను చూచుటనునదియును యథార్థము కాదు. ఎవరియందును ఆత్మలేదు.

తనకు నశించని ఆత్మ అనగా స్వభావమున్నదని, ఆత్మమాయయా అనగా తన సంస్కారమువలన తన స్వభావము ప్రవర్తించు ప్రవర్తనయను మాయచేత తన ప్రకృతి (స్వభావము) ననుసరించియే తాను పుట్టుచున్నానని కృష్ణుడు చెప్పి నటుల 4 వ అ. 6 వ శ్లో.లో ఉన్నది. ఇందు ఆత్మ, ప్రకృతి యనునది కృష్ణుడను జీవుని స్వభావము. ఇది పరమతేజస్సు కాదు. అటులనే అందరికిని (సర్వ జీవులకును) ఉన్నది స్వభావమే గాని పరమతేజస్సు లేదు. ఆత్మలేదు.

బ్రహ్మము అనగా పరమతేజస్సు యని, స్వభావము అధ్యాత్మమని 8 వ అ. 3 వ శ్లో.లో ఉన్నది. ఈ స్వభావము జీవుల స్వభావమేగాని బ్రహ్మమనిన పరమతేజస్సు కాదు. కృష్ణుడు తన ఆత్మయనిన స్వభావమును తానని, తాను జనులను చంపు కాలుడనని 11 వ అ. 32 వ శ్లో. ఉన్నది. క్షేత్రము నెరిగిన క్షేత్రజ్ఞుడని, క్షేత్రజ్ఞుడు కృష్ణుడని ఈ 13 వ అ. 2, 3 శ్లో.లలోను, క్షేత్రజ్ఞుడు క్షేత్రముల ద్వారా సంయోగము చేయువాడని 27 వ శ్లో.లోను ఉన్నది. దీనిని అర్జునుని ప్రకృతి యని, అర్జునుని స్వభావమని 59. 60 శ్లో. లలోను, సర్వజీవులను ఈశ్వరుడు (జీవుల స్వభావము) వానియందుండి తన మాయచేత యంత్రములను త్రిప్పునటుల త్రిప్పుచున్నాడని 18 వ అ. 61 వ శ్లో.లోను ఉన్నది. ఈ సర్వమును కృష్ణుడు తనవలననే ప్రవర్తింపబడుచున్నదని చెప్పినటుల 10 వ అ. 8 వ శ్లో.లో ఉన్నది. సర్వజీవులకును, కృష్ణుడను జీవునికిని యున్న స్వభావమును కృష్ణుడని, ఈశ్వరుడని వ్రాసినారు. ఇది జ్ఞాన, విజ్ఞానములు లేనివారి కల్పితము. కృష్ణుడు తన ఆత్మ మాయయా'' అనినది, ఈశ్వరమాయయా యనినది జీవులను వానియందున్న రాగ ద్వేషాది గుణముల కర్మయను సంస్కారము ననుసరించి ఈ ప్రపంచము నందనేక జన్మలను, సుఖదుఃఖములను అనుభవింపజేయుచు త్రిప్పుచున్న జీవుల స్వభావము యొక్క ప్రవర్తన. అటులనే కృష్ణుడును తాను నశించని ఆత్మ (స్వభావము) గలవాడనని, "ఆత్మ మాయయా'' అనగా తన సంస్కారము ననుసరించి తన ఆత్మ యనిన స్వభావముచేతనే అనేక జన్మల నెత్తినాడు. రాముని జన్మయందున్న కామ రాగద్వేషాది గుణములు చేసిన కర్మ (సంస్కారము) వలన తన స్వభావముచేత కృష్ణుడుగా పుట్టినాడు. వాలిని చంపిన కర్మ (సంస్కారము) వలన తన స్వభావము చేతనే బోయవానిద్వారా చంపబడినాడు. పైన చెప్పబడిన విధమున తన స్వభావము చేత ప్రవర్తింపబడిన కృష్ణుడు ఈ సర్వమును తనచేతనే సృష్టింపబడుచున్నదని, తనచేతనే ప్రవర్తింపబడుచున్నదని ఎట్లు చెప్పును? ఇది జ్ఞాన, విజ్ఞానములు లేని వారి కల్పితమే గాని యథార్థము కాదు. జ్ఞాన, విజ్ఞానములుగల కృష్ణుడు చెప్పినది కాదు.

ఈ విధముగనే జీవుల స్వభావమును ఉత్తమ పురుషుడని, వాడే పరమాత్మ (పరమతేజస్సు)యని, వాడే ముల్లోకములయందున్న ఈశ్వరుడని 15 వ అ. 17 వ శ్లో.లోను, అట్టి వాడనగుటవలన వేదమునందును, ఈ లోకమునందును నేను అనగా

కృష్ణుడు పురుషోత్తముడననబడున్నానని కృష్ణుడు చెప్పినటుల 18 వ శ్లో. లోను అవ్యక్తముగ కల్పించి వ్రాసినారు.

ఉత్తమ పురుషుడు, పరమాత్మ, ముల్లోకములయందున్న ఈశ్వరుడు అనునది మాయయందుండి వచ్చి స్వాతంత్ర్యము లేక అనేకజన్మలనెత్తుచు మాయయందే కలియుచు మరల వచ్చుచు, ఈ ప్రపంచమునందు తిరుగుచున్నవని 8 వ అ. 18, 19 శ్లో.లో చెప్పబడిన జీవుల స్వభావమను గుణము. దీనిని పరమతేజస్సని,పరమ తేజస్సును ఆత్మయని, కల్పించి వారియందున్న ఆత్మను ధ్యానముచేతను, సాంఖ్య యోగముచేతను, కర్మయోగముచేతను చూచుచున్నారని ఈ 25 శ్లో.లో ఉన్నది యథార్థము కాదు.

శ్లో॥ అన్యే త్వేవమజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥26

తా. పై శ్లోకమునందు చెప్పబడిన యోగముల నెరుగనివారు ఇతరులవలన విని ఉపాసన చేయుదురు. అట్లు వినుటయందు ఆసక్తి గలవారు కూడ మృత్యు రూపమగు సంసార సాగరమును తప్పక దాటుదురు.

వ్యా. పై శ్లోకమునందు చెప్పబడిన యోగముల నెరిగినను, వానిని ఇతరుల వలన విని ఉపాసన చేసినను, వినుట యందాసక్తి యుండినను, ఇందెవ్వరును మృత్యురూపమగు సంసార సాగరమును దాటలేరు. కాని, పరమపద దర్శనమైన వారి సాంగత్యమున వారియందున్న దైవసంపద, మోక్ష(పరమ)పదమును చేర్చునని 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన జ్ఞాన విజ్ఞానముల నార్జించినచో వీనిద్వారానే దాటగలరు.

శ్లో॥ యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజఙ్గమం।
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్తద్విద్ధి భరతర్షభ!॥ 27

తా. అర్జునా! స్థావర జంగమ రూపమగునేదియైనను ఎంతవరకున్నదో అది క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగమువలన కలిగినదిగా నెరుంగుము.

వ్యా. 8 వ అ. 18, 19 శ్లో.లలో చెప్పిబడినటుల మాయయందున్న భ్రమ చేత మాయయందుండి ఈ ప్రపంచము సృష్టింపబడిన తరువాతనే, జీవులకు వాని

యందున్న గుణముల కర్మలద్వారా కలిగిన సంబంధమగు సంస్కారము ననుసరించి జీవులయందున్న క్షేత్రజ్ఞుడను స్వభావము జీవులు ధరించియున్న శరీరములతో చేయు సంయోగమువలననే భూతములు పుట్టుచున్నవి. శరీరములద్వారా సంయోగము చేయు క్షేత్రజ్ఞుడను జీవులస్వభావమును పరమపురుషుడు, మహేశ్వరుడు, పరమాత్మ(పరమ తేజస్సు)అనుచున్నారు. ఇటుల శరీరములద్వారా సంయోగము చేయు క్షేత్రజ్ఞుడను స్వభావమేనా పరమపురుషుడు, పరమేశ్వరుడు, పరమతేజస్సు అనునది? దానిని పరమతేజస్సు అనినచో, పరమతేజస్సు మాయాశ్రమద్వారా మాయయందుండి జీవులతో వచ్చి స్త్రీ, పురుష శరీరములద్వారా సంయోగము చేయునది, జీవులను శరీరమును ధరింప జేయునది అని చెప్పవలెను. మాయయందుండి వచ్చిన జీవులకున్న క్షేత్రజ్ఞుడనిన స్వభావమును నిరాకార నిర్గుణమగు పరమతేజస్సు అనుట ఎంతతప్పో యోచించి చూడుడు. లేక ఇటుల సంయోగము చేయు క్షేత్రజ్ఞుడను స్వభావముతో నున్న జీవులను పరమతేజస్సు అనినచో పరమ తేజస్సునకు సంయోగము చేయు క్షేత్రజ్ఞుడను స్వభావము (గుణము) ఉన్నదని చెప్పవలయును. ఇది ఎంత తప్పో యోచించి చూడుడు.

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం।
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి॥ 28

తా. సమస్త భూతములయందుండునట్టి పరమేశ్వరుని ఆ భూతములు నశించినను నశింపనివానినిగాను సమముగాను ఎవ్వడు చూచుచున్నాడో వాడే చూచుచున్నాడు.

వ్యా. ఇందు పరమేశ్వరుడని వ్రాసినది యథార్థము కాదు. పరమపదము నెరిగినవారే విజ్ఞానముద్వారా స్వభావముతోనున్న "నేను, నేను" అను జీవుడును సర్వభూతములయందున్నట్టి జీవులును సమానమే అనగా ఒకలాంటివేయని; భూతములు (శరీరములు) నశించినను జీవులు నశించునవి కాదని ఎరిగియున్నారు. సర్వ శరీరములయందున్న జీవులును, జీవుల స్వభావమును పరమేశ్వరుడు కాదు. పరమేశ్వరుడు లేడు.

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం।
న హిన స్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం
గతిమ్ ॥ 29

తా. సర్వజీవులయందును సమముగా నున్నట్టి ఈశ్వరుని (స్వభావమును) సమముగా చూచుచున్నవాడు తన్ను తనచేత హింసించుకొనడు. అందువలన పరమ పదమును పొందు (చేరు) చున్నాడు.

వ్యా. పరమపద దర్శనమైనవాడు "నేను" అను జీవునియందును, సర్వ జీవులయందును ఒకే విధముగా నున్న ఈశ్వరుడనిన స్వభావమును తన యందున్న విజ్ఞానముద్వారా ఎరిగి యున్నాడు. తనయందున్న ప్రకృతి గుణములు ఇతరులను హింసించినచో తనయందున్న ఈశ్వరుడనిన స్వభావము మరల తనను హింసించు నని విజ్ఞానము ఎరిగి తన హింసకు కారణమగు తనయందున్న రాగద్వేషాదిగుణము లను వెడలగొట్టును. వాడు కామ, రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వాది ప్రకృతి గుణములు లేనివాడై నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్వము, పవిత్ర ప్రేమ భావములతో విజ్ఞానముచేత వాని స్వభావము ప్రవర్తించు సంస్కార కర్మలయందు ప్రవర్తింపబడుచు కర్మరహితుడై పరమపదమును జ్ఞానముద్వారా చూచుచు చేరు చున్నాడు. అట్టివాడే తన్ను తనచేత హింసించుకొననివాడు. గుణములు జీవుని యందుండును గనుక గుణములు చేయు కర్మలు ఆ జీవునికే వర్తించును. సర్వ జీవులకును యున్న స్వభావమును ఈశ్వరుడని వ్రాసినది కల్పితమే కాని యథార్థము కాదు. ఈశ్వరుడు లేడు.

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః।
యః పశ్యతి తథాఽఽత్మానమకర్తారం స పశ్యతి॥ 30

తా. సర్వకర్మలు ప్రకృతిచేతనే చేయబడుచున్నవని ఎవ్వడుచూచుచున్నాడో, వాడు ఆత్మను కర్త కాని వానినిగా చూచుచున్నాడు.

వ్యా. సర్వకర్మలును ప్రకృతి గుణములతో ప్రకృతియే చేయుచున్నదని, జీవుడు చేయువాడు (కర్త) కాదని, కర్త కాని వాడైనను ఆ గుణములు చేయుకర్మ ఫలము ననుభవించువాడు జీవుడేనని విజ్ఞానము గలవారెరిగి యున్నారు. వారు విజ్ఞా నముచేత ప్రకృతి గుణములు లేనివారై, వారి సంస్కార కర్మల ననుసరించి వారి స్వభావముచేత ప్రవర్తింపబడు కర్మలయందు నిష్కామాది పవిత్ర భావములతో కర్మ బంధ రహిత మార్గమున ప్రవర్తింపబడుచున్నారు. ఇటుల జ్ఞాన, విజ్ఞానములు లేని వార లెరుగలేరు. కర్మబంధ రహితులు కాలేరు. జీవుడు కర్తకాని వాడైనను రాగ

ద్వేషాది గుణములు జీవుని యందున్నంతవరకును గుణములు చేయుకర్మలు, కర్మ ఫలములును ఆ జీవునకే వర్తించుచుండును. జ్ఞాన, విజ్ఞానములు గలవారియందు వారి స్వభావము వారి సంస్కార కర్మలయందు ప్రవర్తించుచుండును గాని, మరల సంస్కారమునకు కర్తలుగా ప్రవర్తించు ప్రకృతి గుణములుండవు. గనుక ఆ గుణముల కర్మ యుండదు. అట్టి వారి కర్మలకు సంస్కారమను బంధములుండవు.

ప్రకృతి గుణములు గలవారు కొందరు ఈ గుణములతోకర్మలయందు ప్రవర్తింపబడుచు, ఈ గుణములను జయించలేక, యిటువంటి శ్లోకములు చదువుకొని యథార్థము నెరుంగలేక "నేను కర్మచేయుటయందు కర్తనుగాను, గుణములే కర్మ చేయుచున్నవి. ఆ కర్మలు నన్నంటవు". అని చెప్పుచు, వారు ఆ గుణములకర్మల వలన ఆ గుణములను అనుభవించుచు అనేక జన్మ కర్మ సుఖదుఃఖముల ననుభవించువారగుచున్నారు.

శ్లో॥ యదా భూతపృథగ్భావమేకస్థ మనుపశ్యతి।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా॥ 31

తా. ఎవడు ఎప్పుడు స్వభావముతో వేరువేరుగా నున్న భూతములను ఒక్కదానియందున్నవానిగను, దానివలననే విస్తరింపబడుచున్నవానిగను చూచుచున్నాడో అప్పుడు వాడు బ్రహ్మమును పొందుచున్నాడు.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. పరమపదము నెరిగినవారే వారి యందున్న విజ్ఞానమువలన స్వభావముతో వేరువేరుగా నున్న సర్వ జీవులను ప్రకృతి (మాయ) యందున్నవానినిగను, మాయాశ్రమచేత విస్తరింపబడినవానిని గను, జీవులయందున్న ప్రకృతి గుణముల కర్మలవలన జీవులు వాని స్వభావము చేత ఈ ప్రపంచమున జనన మరణ కర్మలయందు తిరుగుచున్నవానినిగను, ఈ స్వభావము రాగద్వేషాది గుణములు చేయునది మరల ఆ జీవులకు చేయునదియేగాని విస్తరింపజేయునది కానిదిగను ఎరిగియున్నారు. అట్టివారియందు ప్రకృతి గుణము లుండలేక వారిని విడిచి వెళ్ళిపోవును. వారు కర్మరహితులై పరమపదమును చేరుదురు. వేరువేరుగా నున్న భూతములు మాయయందున్నవిగాని ఒక్కదానియందు ఉన్నవనిన జీవుల స్వభావమునందు లేవు. ఇది ప్రకృతి గుణములు గలవారెరుగరు.

శ్లో॥ అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాఽయమవ్యయః ।
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే॥ 32

తా. అర్జునా! అనాదియును, నాశరహితమైనదియునగు ఈ పరమాత్మ శరీరము నందున్నదైనను కర్మ చేయునది కాదు. గుణరహితమగుటవలన కర్మలచేత నంటబడదు.

వ్యా. మాయయందుండి వచ్చిన శరీరమునందున్నదేదియును పరమాత్మ (పరమతేజస్సు) కాదు. పరమతేజస్సు ఈ లోకమునందు లేదు. స్వభావముతోనున్న జీవుడు 8 వ అ. 18, 19 శ్లో. లలో చెప్పబడినటుల మాయయందుండి వచ్చి, మాయయందే కలియువాడు. జీవుని స్వభావము జీవునియందున్న ప్రకృతి గుణముల కర్మల ననుసరించి కర్మ చేయునదియేగాని, కర్మ చేయనిది కాదు.

అట్టి జీవుడు జ్ఞానము నార్జించినవాడైనచో వానికి జ్ఞానముద్వారా పరమ పద దర్శనమగును. అప్పుడు వానియందున్న రాగద్వేషాది గుణములు వానిని విడిచి వెళ్ళును. అట్టివానిని గుణరహితు డనవలెను. వాడు వాని స్వభావముచేత పూర్వ సంస్కార కర్మలయందు ప్రవర్తింపబడినను ఆ కర్మలచేత అంటబడడు. కర్మ బద్ధుడు కాడు. జీవుడును, వాని స్వభావమను గుణమును ఇవి రెండును పరమాత్మ అనగా పరమతేజస్సు కాదు. ఆ తేజస్సును చూచు భావము (జ్ఞానము) కాదు. ఈ స్వభావమనునది జీవుల సహజ గుణము. ఈ స్వభావమను గుణమునందు గుణము లుండవు. ఇది గుణరహితుడగుటయును కాదు. ఇది జీవుల సంస్కారము ననుసరించి ప్రవర్తించునది. ఆ కర్మను, కర్మఫలమును ఆ జీవులచేత అనుభవింపజేయునది. అంతియెకాని, ఆ కర్మచేత అంటబడదు.

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే॥ 33

తా. ఆకాశము అంతటను వ్యాపించి యుండి సూక్ష్మమగుటవలన ఎట్లు అంటబడదో, అట్లే ఆత్మ సమస్త శరీరములయందున్నను అంటబడదు.

వ్యా. సమస్త శరీరములయందున్న జీవులు అంటించుకొను, అనుభవించు స్వభావము గలవి. వాని స్వభావము వానికి గుణములనంటించి ఈ గుణముల కర్మ

లను మరల ఇంకొకపుడు చేయుచు ఆ కర్మఫలములను వానిచేత అనుభవింపజేయు నది. మానవులు జ్ఞాన విజ్ఞానముల నార్జించినచో వానిద్వారా గుణరహితులును, కర్మ రహితులును అగుదురు. కాని వారికేదియును అంటదు. విజ్ఞానమే ఈ ప్రపంచము నందు జీవులకు దేనినికూడ అంటనీయనిది. ఇందు వ్రాసిన ఆత్మ అనగా జీవుల స్వభావమను గుణము. ఈ గుణమునకు గుణములుండవు. ఏదియును అంటుకొనదు. జీవుడు, జీవుని స్వభావము ఇవి రెండును పరమతేజస్సు కాదు. పరమతేజస్సు ఈ ప్రపంచమునందు లేదు. ఆత్మ లేదు. ఆత్మ యనునది కల్పితము. 4 వ అ. 6 వ శ్లో.లో కృష్ణుడను జీవుని స్వభావమును నశించని ఆత్మయని, ప్రకృతియని, దీని ప్రవర్తనను ఆత్మ మాయయని వ్రాసినారు. ఈ స్వభావమను గుణము ఆత్మ కాదు. ఆత్మలేదు. మాయ లేదు. ప్రకృతి(మాయ)కాదు. దీనిని 18 వ అ. 61 వ శ్లో.లో ఈశ్వరుడని, ఈశ్వర మాయయాయని వ్రాసినారు గాని ఈశ్వరుడు లేదు. ఈశ్వర మాయ లేదు. ఈ శ్లోకమునందు వ్రాసిన ఆకాశ ఉపమానము యథార్థము కాదు.

శ్లో॥ యథా ప్రకాశ యత్యేకః కృత్స్నం లోకమిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥34

తా. అర్జునా! ఎట్లు ఒక్క సూర్యుడు ఈ సమస్త ప్రపంచమును ప్రకాశింప జేయుచున్నాడో, అట్లే శరీరములయందున్న క్షేత్రి సమస్త శరీరములయందుండి ఆ శరీరములను ప్రకాశింప జేయుచున్నాడు.

వ్యా. సూర్యుని ప్రకాశమువలన ఈ ప్రపంచము కాన్పించుచున్నది. శరీర ములయందు జీవులుండుటచేత శరీరములు నిలిచియుండును. ఆ శరీరములు జీవుల యందున్న గుణముల కర్మలవలనను, ఆ కర్మలనుబట్టి జీవులస్వభావము ప్రవర్తించు కర్మలవలనను, సుఖములుగను, హీనస్థితిగను ఉండుచుండును. క్షేత్రి అను జీవుల స్వభావము ఆత్మ కాదు. పరమతేజస్సు కాదు. ఈ స్వభావము శరీరములను ప్రకా శింపజేయునది కాదు. సూర్యుని ఉపమానము యథార్థము కాదు.

శ్లో॥ క్షేత్ర క్షేత్రజ్ఞయోరేవమన్తరం జ్ఞానచక్షుషా।
భూత ప్రకృతి మోక్షం చ యే విదుర్యాంతి తే
పరమ్ ॥ 35

తా. ఈ విధముగా, ఎవరు క్షేత్ర క్షేత్రజ్ఞులయొక్క భేదమును, భూతముల (జీవులు) ప్రకృతినుండి విముక్తి బొందునదియును జ్ఞాననేత్రములచేత నెరుగుదురో వారు పరమపదమును పొందు (చేరు) చున్నారు.

వ్యా. జ్ఞాన నేత్రము లనునట్టి జ్ఞాన విజ్ఞానములు గలవారు జ్ఞానముద్వారా పరమ తేజోపదముగా ఉన్న తేజస్సు దర్శనమైనవారై, విజ్ఞానముచేత ఆ తేజోపద మును, క్షేత్ర క్షేత్రజ్ఞులయొక్క భేదమును, జీవులు ప్రకృతినుండి విముక్తి పొందు మార్గమును ఎరిగియున్నారు. పరమపదమును జేరు వారగుచున్నారు. క్షేత్రజ్ఞుడు క్షేత్రము నెరిగినవాడు. క్షేత్రము నెరుగు లక్షణముగల క్షేత్రజ్ఞుడు ఏ లక్షణమును, ఏదియును లేక ఒక్కటిగా ప్రకాశించుచున్న పరమ తేజోపదముగా ఉన్న పరమ తేజస్సు కాదు. క్షేత్రము నెరుగు ఎరుకగల క్షేత్రజ్ఞుడు ఎరుక లేని పరమతేజస్సు కాదు. క్షేత్రజ్ఞుడను స్వభావముగల జీవుడును పరమతేజస్సు కాడు.

ఈ అధ్యాయము క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము అనగా క్షేత్రము(శరీరము) నెరిగి క్షేత్రజ్ఞుని (జీవుని స్వభావమును) విభజించి చెప్పు యోగము. క్షేత్రజ్ఞుడను స్వభావము శరీరములయందున్న సర్వజీవులకును యున్నది. అట్టి జీవులు 8 వ అ. 18, 19 శ్లో.లలో చెప్పబడినటుల మాయాభ్రమద్వారా మాయయందుండివచ్చి, స్వాతంత్ర్యము లేక అనేక జన్మల నెత్తుచు మాయయందే కలియుచు మరల వచ్చుచు తిరుగుచున్నవి. ఇట్లు తిరుగుటకు జీవులయందున్న గుణములును జీవుల కున్న క్షేత్రజ్ఞుడను స్వభావమును కారణము. మాయయందుండి వచ్చి నశించిమాయ యందే కలియు ఈ స్వభావమును క్షేత్రజ్ఞుడని, పరమాత్మ (పరమతేజస్సు) అని, పరమ పురుషుడని, అందరియందును యున్నాడని పరమతేజస్సునకు కాళ్ళు,చేతులు ముఖము సర్వమును యున్నవని కృష్ణుడు చెప్పెనని వ్రాయుట ప్రకృతి విద్యా కవుల కల్పితము. ఈ కృష్ణుడు జ్ఞాన, విజ్ఞానములు గలవాడై సర్వము నెరిగి గుణరహితుడు, కర్మరహితుడునై జన్మమునకు తిరిగిరాని పరమపదమును నా పద మని అనగా తానును జేరుదునని 8 వ అ. 21 వ శ్లో.లో చెప్పిన కృష్ణుడా? లేక శరీరము నెరిగిన క్షేత్రజ్ఞుడనునదియే గాని, తనను ఈ సర్వమును ఎరుగు విజ్ఞా నములేని తనకును సర్వజీవులకును ఉన్న స్వభావమను కృష్ణుడా? రాముని జన్మ యందు వాలిని చంపిన కర్మవలన తనను చంపినది తన స్వభావమే కదా! అట్టి కృష్ణుడు తనను చంపిన తన స్వభావమును తానని చెప్పునా? పరమాత్మ (పరమ

తేజస్సు) అని చెప్పునా ? చెప్పడు. జ్ఞాన,విజ్ఞానములుగల కృష్ణుడు సర్వమునెరిగిన వాడు. అట్టి కృష్ణుడు భగవంతుడని, ఈ గీత అర్జునకు చెప్పిన భగవద్గీతయని ఈ ప్రపంచము నమ్మగలందులకు కృష్ణుడు చెప్పినవి కొన్ని వ్రాసి, ఇందు అసుర గుణములు అవ్యక్తముగ ప్రవర్తించు అనేక తప్పు మార్గములను వ్రాసినారు. ఈ గీతను చదివినవారును, వినినవారును ఈ గీత మూలకముగా అధిక దుఃఖములకు కారణమగు అసుర గుణముల అజ్ఞాన ప్రవర్తన గలవారగుదురు గాని, జ్ఞాన, విజ్ఞానములు గలవారు కారు. నిష్కామభావము, సమత్వబుద్ధి, నిత్యసత్వము, పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించు విజ్ఞానము గలవారు కారు.



# గీతా వ్యాఖ్యానము

## గుణత్రయ విభాగ యోగము

## 14 వ అధ్యాయము

శ్రీ భగవానువాచ : కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమం।
యద్ జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతాః 1

తా. దేని నెరిగి మునులందరును సిద్ధిని పొందిరో, అట్టి జ్ఞానములన్నిటిలో పరమోత్కృష్టమైన జ్ఞానమును మరల చెప్పుచున్నాను.

వ్యా. పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను, చేరవలెనని 13 వ అ. 18 వ శ్లో.లో చెప్పబడినట్టి జ్ఞానమే పరమోత్కృష్టమైన జ్ఞానము. ఇది 16 వ అ. 5 వ శ్లో.లో పరమపదమును చేర్చునవి దైవసంపదయని చెప్పబడిన జ్ఞాన విజ్ఞానములలోని జ్ఞానము. ఇది కర్మబంధమును కలుగజేయునవి అసురసంపదయని చెప్పబడిన గుణత్రయ విభాగములోని జ్ఞానము కాదు.

శ్లో॥ ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ॥ 2

తా. ఈ జ్ఞానము నాశ్రయించి నా సమాన ధర్మమును పొందినవారు ప్రళయ కాలమందు దుఃఖమును పొందరు. సృష్టి కాలమందు జన్మింపరు.

వ్యా. ఈ జ్ఞానముగలవారి సాంగత్యమున వారియందున్న జ్ఞానమును, నా సమాన ధర్మమని చెప్పిన కృష్ణునితో సమాన ధర్మమగు విజ్ఞానమును పొందిన వారు కృష్ణునివలెనే కర్మబంధరహితమగు పరమధర్మము గలవారై మరల జన్మముసకు

రాని పరమపదమును చేరుదురు. వారు శరీరమును విడుచు కాలమందు దుఃఖమును పొందరు. మరల జన్మించుట యుండదు.

శ్లో॥ మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహం
సంభవస్సర్వభూతానాం తతో భవతి భారత॥ 3

తా. అర్జునా! నాయొక్క గొప్పదియగు భ్రమయేయోని. నేను దానియందు బీజము నుంచుచున్నాను. అందువలన సమస్తభూతము లుత్పత్తి యగుచున్నవి.

వ్యా. కృష్ణుడు భ్రమ రహితమైన బ్రహ్మచారి. సృష్టించుమాయనుఖండించు విజ్ఞానము గలవాడు. భ్రమవలననే సమస్త భూతములును మాయయందుండిసృష్టింప బడుచున్నవి. సృష్టింపబడిన తదుపరిజీవులను, వానియందున్న గుణములు చేయుకర్మ (సంస్కారము)ననుసరించి జీవులయందున్న ప్రకృతి, ఆత్మ, కాలుడు, ఈశ్వరుడు, క్షేత్రజ్ఞుడుఅని ఈ గీతయందు చెప్పబడిన జీవులస్వభావము 13 వ అ. 27 వ శ్లో.లో చెప్పబడినటుల క్షేత్రముల అనగా స్త్రీ,పురుషుల శరీరములతో చేయు సంయోగసంబం ధమువలన ఏర్పడిన బీజమునందు యింకొక శరీరమునందున్న జీవుడు వాని సంస్కా రమువలన వానిస్వభావముచేత ప్రవేశింపబడుచున్నాడు. ఈవిధముగ భూతములుపుట్టు చున్నవి. ఇటులజీవులను ప్రవేశింపజేయు జీవులస్వభావమను గుణమునే నేనుఅందు బీజము నుంచుచున్నానని కృష్ణుడు చెప్పినటుల కల్పించి వ్రాసియున్నారు. కృష్ణుడు "నేను" అనిన జీవుల స్వభావమునకు బ్రహ్మయనిన భ్రమలేదు. ఈ స్వభావము జీవులయందు భ్రమతోయున్న గుణములు చేయునది మరల యింకొకపుడు ఆ జీవు లకు చేయునది.

శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ మూర్తయస్సంభవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోనిరహం బీజప్రదః పితా॥ 4

తా. అర్జునా! సకల యోనులందు పుట్టునట్టి శరీరములకు గొప్పదగు బ్రహ్మ (భ్రమ)యే ఆధారము. నేను బీజప్రదుడనగు తండ్రిని.

వ్యా. మాయాభ్రమద్వారానే మాయయందుండి సర్వజీవులును సృష్టింప బడుచున్నవి. సృష్టింపబడిన తరువాత, జీవులయందున్న భ్రమచే చేయబడుగుణముల

కర్మయే వాని జన్మలకు కారణము. అనగా అట్టి కర్మల ననుసరించి జీవులను వాని స్వభావము అనేక శరీరములను ధరింపజేయుచున్నది. ఈ స్వభావమునే ''నేనుబీజ ప్రదుడనగు తండ్రిని'' అని కృష్ణుడు చెప్పినట్లుగా కల్పించి వ్రాసినారు. అంతియె కాని, బ్రహ్మయను భ్రమయు, ఈ ప్రపంచమును మాయయందున్నవిగాని జీవుల స్వభావమునందు లేవు. జీవుల స్వభావము ఈ ప్రపంచమును సృష్టించునది కాదు. ఈ కాన్పించు సర్వమును బ్రహ్మ(మాయా భ్రమ)యొక్క పగటికాలమందు కాన్పిం చని ప్రకృతి (మాయ) యందుండి వచ్చి ప్రకృతియందే కలియుచున్నది యని 8 వ అ. 18, 19 శ్లో.లలో ఉన్నది. ఈ విధముగా మాయా భ్రమద్వారా సృష్టింప బడినదానిని ఈ దిగువ చెప్పబడిన విధముగ కల్పించి వ్రాసినారు. కృష్ణునికి ఈ ప్రపంచముగల ప్రకృతి (మాయ) ఉన్నదని 7 వ అ. 4 వ శ్లో.లోను, ఇదిగాక జీవుల స్వభావమును కృష్ణునియొక్క మరియొక శ్రేష్ఠమైన ప్రకృతియని, ఈ ప్రకృతియే సృష్టికి కారణమని, యిట్లు ఈ ప్రపంచ ఉత్పత్తికిని, లయమునకును తాను కారణమని 7 వ అ. 5, 6 శ్లో.లలోను, ఈ సర్వమును తనయందున్నదని 7 వ శ్లోకములోను కృష్ణుడు చెప్పినటుల వ్రాసినారు. తనకు బ్రహ్మ(భ్రమ)యను యోని యున్నదని, అందు తాను బీజమునుంచుచున్నానని అందువలన భూతములు పుట్టుచున్నవని ఈ అధ్యాయమున 3 వ శ్లో.లో వ్రాసినారు. సకల యోనులయందు పుట్టుచున్న శరీరములకు భ్రమయే ఆధారము. అనగా, భ్రమ రాగద్వేషాది గుణము లతో చేయు కర్మయే కారణము.

జీవులు వానియందున్న భ్రమతో చేయు కర్మ ననుసరించి, వానిస్వభావము శరీరములద్వారా సంయోగము చేయుటవలన శరీరములు పుట్టుచున్నవి. కృష్ణుడు (తన ప్రకృతియనిన స్వభావము) తనయందున్న భ్రమచేత సమస్త భూతములను సృష్టించి, వానికి భ్రమాది గుణములను సంభవింపజేసి, ఈ గుణముల కర్మల నను సరించి శరీరములద్వారా సంయోగము చేయుచు వానిని అనేక జన్మల నెత్తించుచు సుఖదుఃఖముల ననుభవింపజేయుచు ఈ ప్రపంచమునందు ప్రవర్తింప చేయుచున్నా డని కల్పించి వ్రాసినారు. ఈ సర్వమును తనవలననే సృష్టింపబడుచున్నదని, తన వలననే ప్రవర్తింపబడుచున్నదని కృష్ణుడు చెప్పినటుల 10 వ అ. 8 వ శ్లో. లో కల్పించి వ్రాసినారు. ఇట్లు ప్రవర్తింపబడు ఈ ప్రపంచము తనయందున్నదని, తన స్వరూపమని, కృష్ణుడు చెప్పినట్లు 11 వ అధ్యాయములోను, తన విభూతులని 10వ

అధ్యాయములోను వ్రాసినారు. ఇట్లు అందరియందును ఉండి ప్రవర్తింపజేయుచున్నా ననిన కృష్ణుడు మాయయందుండి వచ్చి నశించి మాయయందే కలియుచు, మరల వచ్చుచు తిరుగుచుండు జీవుల స్వభావము. ఈ కృష్ణుడు(జీవుల స్వభావము)క్షేత్రము నెరిగిన క్షేత్రజ్ఞుడనువాడే గాని, యింకేదియు నెరుగడు. ఈ కృష్ణుడను జీవులస్వభావము అనేక జన్మల నెత్తినవాడును క్షేత్ర క్షేత్రజ్ఞులను, సర్వమును ఎరిగిన విజ్ఞానముతో నున్న జ్ఞానముగలవాడునగు కృష్ణుడు కాదు. జీవులయందున్న గుణములు ఎన్ని విధములుగ చేయునో, అన్ని విధములుగ మరల ప్రవర్తించి ఆ జీవుల నను భవింపజేయు జీవుల స్వభావమును పరమతేజస్సని, భగవంతుడని ఈ విశ్వము భగవంతునిచేత సృష్టింపబడి ప్రవర్తింపబడుచున్నదను అర్థము వచ్చునటుల వ్రాయుచు, ఇది సర్వము నెరిగిన జ్ఞాన విజ్ఞానములు గల కృష్ణుడు అర్జునునకు చెప్పినది యని, ఇది భగవంతుడు చెప్పిన భగవద్గీతయని కల్పించి వ్రాసినారు.

బ్రహ్మ సృష్టించువాడు. విష్ణువు పోషించువాడు. ఈశ్వరుడు లయకారుడు. (అనుభవింప జేయువాడు) ఈ మూడును భ్రమ, యిష్టము, జీవుల స్వభావము అను త్రిగుణములు. ఈ మూడు గుణములును ప్రకృతియను మాయలోనివి. మాయ యందుండి వచ్చినవి. ఈశ్వరుడను స్వభావమను గుణమునందు భ్రమయెట్లుండును? నాయొక్క బ్రహ్మ (భ్రమ)యని 3 వ శ్లోకములో ఎట్లువ్రాసినారు? భ్రమతోనున్న రాగద్వేషాది గుణములు గల ప్రకృతి యను మాయ జీవుల యందుండుట వలన జీవులు వాని స్వభావముచేత ఈ గుణముల కర్మలవలన బద్ధులగుచున్నవి. ఈగుణములతోనున్న ప్రకృతి (మాయ) విజ్ఞానముచేత రహితమగును. ఈ స్వభావము (గుణము) ఎప్పుడును జీవుని విడుచునది కాదు.

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః।
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్॥ 5

తా. అర్జునా! ప్రకృతివలన సంభవించిన సత్వ, రజ, స్తమోగుణములు నాశరహితుడైన జీవుని దేహమునందు బంధించుచున్నవి.

వ్యా. మాయయందుండి వచ్చిన యీ ప్రపంచ సంబంధమున జీవులకు వాని స్వభావమువలన సంభవించిన సత్వ, రజ, స్తమోగుణములు జీవులను కర్మ రూపమున దేహములందు బంధించుటకు హేతువగుచున్నవి.

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశకమనామయం।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ॥ 6

తా. అర్జునా! ఆ మూడు గుణములలో సత్వగుణము నిర్మలమైనదియు, ప్రకాశింపజేయునదియు, ఆరోగ్యకరమైనదియునై సుఖము నిచ్చు ప్రపంచ జ్ఞానము గలది యగుటచేత బంధించుచున్నది.

శ్లో॥ రజోరాగాత్మకం విద్ధి తృష్ణాసంగ సముద్భవం।
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్॥ 7

తా. అర్జునా! రజోగుణము తృష్ణా సంబంధమును కలుగ జేయునదియు, రాగమును కలుగజేయునదియునగుటచేత దేహమునందున్న జీవునిని కర్మసంగముతో బంధించు చున్నది.

శ్లో॥ తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినాం।
ప్రమాదాలస్య నిద్రాభిస్తన్నిబధ్నాతి భారత॥ 8

తా. అర్జునా! తమోగుణము అజ్ఞానముతో పుట్టినది. అది సర్వప్రాణులకు మోహమును కలుగజేసి ప్రమాదము, ఆలస్యము, నిద్ర మొదలగు వానిచే జీవులను బంధించుచున్నది.

శ్లో॥ సత్త్వం సుఖే సంజయతి రజః కర్మాణి భారత।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత॥ 9

తా., అర్జునా! సత్వగుణము సుఖమును కలుగజేయుచున్నది. రజోగుణము కర్మలను, తమోగుణము జ్ఞానము నావరించి ప్రమాదమును కలుగజేయుచున్నది.

వ్యా. ఈ మూడు గుణములును జీవుల యందుండి కర్మరూపమున సుఖ భోగములను. కష్టములను, ప్రమాదమును జీవులనుభవించుటయందు బంధించుటకు హేతువగుచున్నవి. ఈ 9 వ శ్లోకమునందు తమోగుణము జ్ఞానము నావరించినదని వ్రాసినది యథార్థము కాదు. జ్ఞానమును పొందిన వారియందు ఈ మూడు గుణము

లుండలేక వారిని విడిచి వెళ్ళిపోవును. ఈ గుణములలో ఏదియునుగూడ జ్ఞానమును ఆవరింపలేదు.

శ్లో॥ రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత।
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా॥ 10

తా. అర్జునా! సత్వగుణము రజస్తమోగుణములను, రజోగుణము సత్వ తమో గుణములను, తమో గుణము సత్వ రజోగుణములను అణచివేయ గలుగుచున్నవి.

వ్యా. సత్వగుణ మధికమైన రజస్తమో గుణముల కర్మలు తక్కువగా నుండును. రజోగుణ మధికమైన సత్వత గుణముల కర్మలుతక్కువగానుండును. తమోగుణ మధికమైన సత్వరజో గుణముల కర్మలు తక్కువగా నుండును. జీవుల యందున్న గుణములలో ఏ గుణమధిక మగుచుండునో ఆ గుణము ఎక్కువగా ప్రవర్తించుచుండును. ఇవి యన్నియును ప్రకృతి గుణములు. ఇవి ఒకదానితో నొకటి కలహించుకొనవు. ఒకదాని నొకటి అణచి వేయవు. వానిలో దేనికి సమయము వచ్చినప్పుడది ప్రవర్తించుచుండును. ఒకటి ప్రవర్తించునప్పుడు దానికి ఇంకొకటేది యును అడ్డురాదు.

శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదాతదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత॥11

తా. ఈ దేహమునందు సమస్త ద్వారములద్వారా జ్ఞానము ప్రకాశించుచున్నప్పుడు సత్వగుణము వృద్ధి యగుచున్నదని యెరుంగవలెను.

వ్యా. ఇందు వ్రాసిన జ్ఞానము సుఖభోగములకు కారణమగు సత్వ గుణ సంబంధమైన జ్ఞానము. ఇది నిత్యసత్వముగల విజ్ఞానముతోనున్న జ్ఞానముకాదు.

శ్లో॥ లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమస్స్పృహా।
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ!॥ 12

తా. అర్జునా! రజోగుణము వృద్ధి యగునపుడు లోభముచే కార్యములు ప్రారంభించుటయు, ఆ పనులయందే ప్రవర్తించుటయు, స్పృహచే శాంతి లేకుండుటయు కలుగుచుండును.

శ్లో॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన॥ **13**

తా. అర్జునా! తమోగుణము వృద్ధి నొందునపుడు బుద్ధి మాంద్యమును, ఐద్ధకమును ప్రమాదమును, మోహమును కలుగుచున్నవి.

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్
తదోత్తమవిదాం లోకానమలాన్ప్రతి పద్యతే॥ **14**

తా. దేహధారియగు జీవుడు సత్వగుణ మభివృద్ధి నొందుచున్నప్పుడు మరణము పొందినచో ఉత్తమ విధమున నిర్మలమైన లోకములను పొందుచున్నాడు.

శ్లో॥ రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే॥ **15**

తా. రజోగుణ మభివృద్ధి నొందుచున్నప్పుడు మరణము నొందినచో కర్మాసక్తులగు మనుష్యులలో జన్మించును. తమోగుణ మధికమగు చున్నప్పుడు శరీరమును విడిచినచో జ్ఞానములేని హీన యోనులయందు జన్మించుచున్నాడు.

శ్లో॥ కర్మణ స్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలం ఫలం।
రజసస్తు ఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్॥ **16**

తా. సత్వగుణమునకు సుకృత కర్మలు సుఖము ఫలమని, రజోగుణమునకు దుఃఖము, తమోగుణమునకు అజ్ఞానము ఫలమని చెప్పుచున్నారు.

శ్లో॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ॥ **17**

తా. సత్వగుణమువలన జ్ఞానమును (ప్రపంచ జ్ఞానమును) రజోగుణమువలన లోభమును, తామస గుణమువలన అజ్ఞానము, ప్రమాదము, మోహమును కలుగుచున్నవి.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః॥
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛన్తి తామసాః॥ 18

తా. సత్వగుణము గలవారు ఊర్ధ్వ లోకమును, రజోగుణము గలవారు మధ్యలోకమును, తమోగుణ వృత్తులు గలవారు అధమ జన్మములను పొందు చున్నారు.

వ్యా. సత్వ, రజ, స్తమోగుణములు మాయా సంబంధమైనవి. సత్వగుణము సుఖ భోగములను, రజస్తమో గుణములు కష్టదుఃఖములను కలిగించునవి. వీనిలో జ్ఞాన, విజ్ఞానముల సంబంధమైనదేదియును లేదు. ఈ గుణములు జీవులకు కష్ట దుఃఖములను, సుఖ భోగములను, అనేక జన్మలను కలిగించునవి యగుచున్నవి. భగవంతుని కొరకని జప, తప, ధ్యాన, యజ్ఞ, దాన, నామస్మరణాది అనేక విధము లగు కర్మలచే మానవులను బంధించు చున్నవి.

ఈ విధముగా మానవులు జన్మ కర్మలయందు తిరుగుచుందురు. జన్మకర్మల యందు తిరుగుచుండుటకు కారణమగు ఈ గుణములు భగవంతుని కొరకని, మోక్ష మార్గమని శాస్త్రములయందు అవ్యక్తముగా వ్రాయబడిన పాఠములు చదివి, అవియే యథార్థమని అవ్యక్తముగా చెప్పుచు, ఆ శాస్త్ర కర్మలయందు ప్రవర్తించుచు,అనేకు లను ప్రకృతియందు బంధించుచున్నవి. ఎంతో అందముగ ఈ గుణములు వర్ణించు అవ్యక్త పాఠములు వినిన ఈ గుణములు గలవారిని ఈ గుణములు ఇవియే యథార్థ మని చెప్పుచు కర్మలయందు ప్రవర్తించుచు బంధించుచున్నవి. ఈ సత్వ రజస్తమో గుణములు చెప్పునవి యథార్థము కాదని వారు తెలియజాలకున్నారు.

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥ 19

తా. ఎప్పుడు పైన చెప్పబడినవి ఎరిగి గుణములే కర్తలుగాని, గుణముల కంటె వేరైన కర్తలేదని చూచుచున్నాడో, తనను గుణములకు వేరుగా నెరిగి యున్నాడో వాడు నా భావమును పొందుచున్నాడు.

వ్యా. పైన చెప్పబడినటుల త్రిగుణములు గలవాడు ఈ గుణముల కర్మల నెరిగి ఈ శ్లోకమునందు చెప్పబడినటుల చూచుచున్నవాడు నా భావమును పొందు

చున్నాడని వ్రాసినది యథార్థము కాదు. పరమపదమును చూచు భావము (జ్ఞానము) గలవారి సాంగత్యమునగాని, అట్టి కృష్ణుని సాంగత్యమునగాని వారియందున్న భావమును (జ్ఞానమును), విజ్ఞానమును పొందిన వారికిని భావము (జ్ఞానము) ద్వారా పరమపదముగా ఉన్న తేజస్సు కాన్పించును. వీరు విజ్ఞానముద్వారా పైన చెప్ప బడిన సత్వ రజస్తమో గుణముల కర్మల నెరిగి గుణములే కర్తలుగాని, గుణముల కంటె వేరైన కర్తలేడని ఎరుగుదురు. ఇటుల జ్ఞాన విజ్ఞానములు గలవారందరును ఎరిగి యున్నారు. వారియందు రాగ ద్వేష సత్వ రజస్తమాది త్రిగుణము లుండలేక వెళ్ళిపోవును. త్రిగుణములు గలవారు ఎరుగలేరు.

శ్లో॥ గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే॥ 20

తా. జీవుడు దేహములను ధరించుటకు కారణభూతములగు ఈ త్రిగుణము లను విడిచి జనన, మరణ జరా దుఃఖములనుండి విడువబడినవాడై మోక్షమునుపొందు (చేరు) చున్నాడు.

వ్యా. త్రిగుణములు గలవాడు స్వయముగా ఈ త్రిగుణములచేత విడువబడి మోక్షమును పొంద (చేర) లేడు. 10 వ అ. 10, 11 వ శ్లో.లలో చెప్పబడినటుల కృష్ణుడు తనను విడువక సేవ చేసిన వారియందు తనయందున్న భావమును (జ్ఞాన మును) ప్రవేశింప జేసినప్పుడు వారికి జ్ఞానముద్వారా మోక్షమనునట్టి పరమ తేజోపద దర్శనమగును. వారు విజ్ఞానమువలన త్రిగుణ రహితులు, కర్మరహితులునై పరమ పదమును భావము (జ్ఞానము) ద్వారా చూచుచు చేరుదురు. అంతియెకాని, త్రిగుణ ములు గలవాడు గుణములే కర్తలుగాని, తాను కర్తను కానని ఎరిగినవాడని, నా భావమును పొందుచున్నాడని 19 వ శ్లో.నందు చెప్పబడినది, వాడు 20 వ శ్లో.నందు చెప్పబడినటుల మోక్షమును పొందుచున్నాడనునది యథార్థము కాదు. ఈ త్రిగుణ ములు గలవారెవరైనను భావము (జ్ఞానము) గలవారి సాంగత్యమున వారిద్వారానె వారియందున్న భావమును (జ్ఞానమును) పొంది (ఆర్జించి) భావముద్వారా పరమపద దర్శనమైనవారై విజ్ఞానమువలన త్రిగుణములచేత విడువబడి జనన మరణ జరా దుఃఖములనుండి విడువబడినవారై భావము (జ్ఞానము) ద్వారా మోక్షపదమును(పరమ పదమును) చూచుచు చేరవలెను గాని యింకేవిధముగను చేరలేరు.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ కైర్లింగై స్త్రీన్గుణానేతానతీతో భవతి ప్రభో।
కిమాచారః కథం చైతాంస్త్రీన్గుణానతివర్తతే॥ 21

తా. కృష్ణా! ఏ లక్షణములు గలవాడు ఈ మూడు గుణములు లేనివాడగు చున్నాడు. వాని ఆచరణ ఎట్టిది? ఈ మూడు గుణముల నెట్లు త్రోసివేయు(విడుచు) చున్నాడు?

వ్యా. ఏ లక్షణములు, (ఏ ఆచరణ గలవాడు) ఈ మూడు గుణముల నెట్లు విడుచుచున్నాడని అర్జునుడడిగినటుల వ్రాసియున్నారు.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి॥ 22

తా. అర్జునా! ఎవ్వడు తనకు సంభవించిన ప్రకాశమును, ప్రవృత్తిని, మోహమును ద్వేషింపడో, అవి లేకపోయిన వానిని కోరడో,

వ్యా. భావమును (జ్ఞానమును) పొందినవాడు పరమపదముగా ఉన్న తేజస్సు దర్శనమైనవాడై త్రిగుణములచేత విడువబడి అంతకు పూర్వము చేసిన కర్మవలన తనకు సంభవించిన కర్మలను ద్వేషింపడు. అవి లేకపోయినవానిని కోరుటయుండదు. ప్రకృతి గుణముల ప్రవృత్తిగాని, మోహముగాని వాని యందుండదు. విజ్ఞానము యొక్క నిష్కామాది పవిత్ర ప్రేమభావముల ప్రవర్తనయే వానియందు కాన్పించు చుండును. వానియందు కోరిక యుండదు, ద్వేషముండదు.

శ్లో॥ ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే॥ 23

తా. ఎవడు గుణములే ప్రవర్తించుచున్నవని ఉదాసీనునివలె నున్నవాడై గుణములచేత చలింపక నిశ్చలుడై దృఢముగా నున్నాడో,

వ్యా. పూర్వ జన్మయందు త్రిగుణముల కర్మలవలన వానికి సంభవించిన సంస్కారము ననుసరించి వాని స్వభావము ప్రవర్తించు కర్మలయందు విజ్ఞానము చేత గుణములు లేనివాడై నిష్కామము, సమత్వ బుద్ధి, నిత్యసత్వము, పవిత్రప్రేమ భావములతో ప్రవర్తింపబడవలయును గాని, గుణములు గలవాడుగుణములే ప్రవర్తించు చున్నవని, ఉదాసీనునివలె నుండుట, గుణములచేత చలింపక నిశ్చలుడై దృఢముగా నుండుటయని ఈ శ్లోకమునందు వ్రాసినది తప్పు, తప్పు మార్గమునకు దారి చూపుట యగును. అట్టివాడు నిశ్చలుడు కాదు.

శ్లో॥ సమదుఃఖ సుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మ కాంచనః।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిన్దాత్మ సంస్తుతిః॥ 24

తా. ఎవడు స్వస్థత గలవాడై సుఖ దుఃఖములయందు సమబుద్ధియును, మట్టి గడ్డ, రాయి, బంగారము వీనిని సమముగా చూచువాడును, ధీరుడును, ఇష్టానిష్టముల యందు సమభావము గలవాడును,

శ్లో॥ మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారంభ పరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే॥ 25

తా. మానావమానములయందు, శత్రుమిత్రులయందు సమానుడును, ఆరంభ కర్మలు లేనివాడును, గుణాతీతుడని చెప్పబడుచున్నాడు.

వ్యా. ఈ రెండు శ్లోకముల యందున్నది భావము (జ్ఞానము) విజ్ఞానము గల వారి విజ్ఞాన ప్రవర్తన. వారు కోరికయే లేనివారగుటవలన వారియందు రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వములగు త్రిగుణములుండవు. అందుచేత ఈ గుణముల కర్మలు (ఆరంభ కర్మలు) ఉండవు. అట్టివారినే గుణాతీతులని చెప్పవలెను. గుణములు లేక పోవలెను గాని, గుణములే ప్రవర్తించుచున్నవని ఉదాసీనునివలెచూచుచు నిశ్చలుడై యుండుట యని 23 వ శ్లోకమునందు వ్రాసినది యథార్థము కాదు.

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥

తా. ఎవడు సర్వప్రపంచమును మరచిన భక్తియోగముచేత నన్నే సేవించుచున్నాడో, వాడు ప్రయాసము లేకయే ఈ ప్రకృతి గుణములను అనుసరించక బ్రహ్మమును చూచుట కర్హుడగుచున్నాడు.

వ్యా. భక్తి యోగమనునది కల్పితమేగాని యథార్థము కాదు. కృష్ణుడున్నపుడు తనను విడువక సేవ చేయువారికి తనను తెలియుబుద్ధి (భక్తి) నిచ్చెదనని, భక్తి భావమున వారియందు తాను (కృష్ణునియందున్న విజ్ఞానము) ప్రవేశించి, వారియందు త్రిగుణములతో నున్న అజ్ఞానము (ప్రకృతియను మాయ) పోగలందులకు వారియందు జ్ఞానము (భావము)ను ప్రవేశింప జేయుచున్నానని 10 వ అ 10, 11వ శ్లోకములో నున్నది యథార్థము. అటుల జ్ఞానము (భావము) ప్రవేశింపబడిన వారికి ప్రయాసము లేకయే జ్ఞానముద్వారా బ్రహ్మమనినట్టి పరమపదముగా ఉన్న తేజస్సు దర్శనమగును. వారిని ఈ త్రిగుణములును విడుచును. కాని, ప్రకృతి త్రిగుణముల గలవాడు త్రిగుణముల ననుసరించక బ్రహ్మమును చూచుట కర్హుడగుచున్నాడనునది యథార్థము కాదు.

శ్లో॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాऽహమమృతస్యావ్యయస్య చ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ॥ 27

తా. నేను నశించని మోక్షస్థానమునకును (పరమ పదమునకును) మార్పు చెందని పరమ ధర్మమునకును, నిత్యానందమైన పరమతేజస్సగు పరబ్రహ్మమునకు ఆధారమును.

వ్యా. ఒకే విధముగా ప్రకాశమానమైనది, శాశ్వితానందమైనది, నాశనము లేనిదియగు పరమ స్థానమనునట్టి పరమ తేజోపదమును చేరుటకు కారణమగు జ్ఞానమను భావమును, శాశ్విత ధర్మమనునట్టి పరమధర్మముగల విజ్ఞానమును కృష్ణునియందున్నవి. ఇంక కొందరియందును ఉన్నవి. కృష్ణుడును, అట్టివారును వారియందున్న పరమ ధర్మమగు విజ్ఞానముతో నున్న జ్ఞానమును వారి సాంగత్యము చేయు వారియందును ప్రవేశింప జేయుదురు. అందువలన రాగద్వేషాది గుణములు గలవారు నిత్యానందమైన పరమపదమును చేరుటకు జ్ఞాన, విజ్ఞానములు గలవారందరు ఆధారమని చెప్పవలయును. అంతియేకాని, రాగద్వేషాది గుణముల ప్రవర్తన సర్వమును అజ్ఞాన ప్రవర్తన.

ఈ అధ్యాయము గుణత్రయ విభాగ యోగము. అనగా త్రిగుణములగుసత్వ రజస్తమో గుణముల ప్రవర్తన. ఈ గుణములు మానవులను సుఖ, దుఃఖములనను భవింపజేయుటయందు బంధించుచున్నవని ఈ అధ్యాయమునందున్నది. ఇటులనె మాయాగుణములు కార్యకారణ కర్తృత్వములకు హేతువని, జీవులు సుఖ, దుఃఖ ముల ననుభవించుటకును, అనేక ఉత్కృష్ట, నికృష్ట జన్మముల నెత్తుటకును హేతు వని 13 వ అ. 21, 22, శ్లో.లలో ఉన్నది. జీవులు వానియందున్న ఈ గుణముల కర్మల ననుసరించి సుఖ, దుఃఖముల ననుభవించుచు, అనేక జన్మల నెత్తుచుండు స్వభావము (గుణము) జీవులకు సహజముగనె ఉన్నది. అందువలననె జీవులకు స్వభావము ప్రవర్తించుచున్నదని 5 వ అ. 14వ శ్లో.లో ఉన్నది. మాయయందుండి వచ్చిన జీవులు స్వాతంత్ర్యములేనివై అనేక జన్మల నెత్తుచు, మాయయందే కలి యుచు, మరల వచ్చుచున్నవని 8 వ అ.19 వ శ్లో.తో ఉన్నది. మాయయందుండి వచ్చిన కామ, రాగ, ద్వేషాది సత్వ, రజ, స్తమోగుణములును, జీవులస్వభావమను గుణమును జీవులను అనేక జన్మల నెత్తించుచు, సుఖ, దుఃఖముల ననుభవింప జేయుచు ఈ ప్రపంచమునందు త్రిప్పుచున్నవి. ఈ గుణములు అసుర సంపద (రాక్షస గుణములు) అని, కర్మబంధమును కలుగజేయునవియని, జ్ఞాన, విజ్ఞాన భావములు (గుణములు) దైవసంపదయని, పరమపదమును జేర్చునవియని 16 వ అ. 5 వ శ్లో.లో ఉన్నది. ఇట్లు దైవసంపద, అసురసంపదయను రెండు సృష్టులు ఈ ప్రపంచమునందున్నవని 6 వ శ్లో.లో ఉన్నది. అసుర జనులు (అసుర గుణ ములు గలవారు) ఈ రెండు విధములగు గుణముల నివృత్తి, ప్రవృత్తి మార్గముల (ప్రవర్తనల) నెరుగరని 7 వ శ్లో.లో ఉన్నది. ఈ విధముగనున్న గుణములప్రవ ర్తనలను సర్వమును తనవలననే ప్రవర్తింపబడుచున్నదని 10 వ అ. 8 వ శ్లో. లోను, సర్వజీవులను ఈశ్వరుడు వానియందుండి తన మాయచేత యంత్రములను త్రిప్పునటుల త్రిప్పుచున్నాడని 18 వ అ. 61 వ శ్లో.లోను, అట్టి ఈశ్వరునిశరణు వేడుకొనుము. వాని అనుగ్రహమువలన మోక్ష (పరమ) పదమును జేరుదువని 62 వ శ్లో.లోను ఉన్నట్టిది నివృత్తి, ప్రవృత్తి ప్రవర్తనల నెరుగని అసుర గుణ ములు గలవారి కల్పిత వ్రాతయే కాని, ఈ రెండు ప్రవర్తనల నెరిగిన విజ్ఞానముగల కృష్ణుడు చెప్పినది కాదు; చెప్పడు. అట్టి వారెవ్వరును చెప్పరు. సత్వ రజస్తమో గుణములు గలవారి ప్రవర్తన సుఖ దుఃఖ కర్మబంధమగు ప్రవర్తనయే గాని, కర్మ రహితమగు ప్రవర్తన కాదు.

కామ రాగద్వేషాది సత్వ రజస్తమో గుణములును, జీవులస్వభావమను గుణమును కర్మబంధమును కలుగజేయునవి. జ్ఞాన విజ్ఞానములనునట్టి భావములు (గుణములు) పరమపదమును చేర్చునవి. ఈ ప్రపంచములో రెండు విధములగు ప్రవర్తనలుగల గుణములున్నవి. అంతియేకాని, ఈ గీతయందు చెప్పబడినటుల సర్వము నందుండి సర్వమును ప్రవర్తింపజేయుచు మోక్ష (పరమ) పదమును జేర్చు కృష్ణుడు లేడు. ఈశ్వరుడు లేడు. ఈ ప్రపంచములో అందరియందును కృష్ణుడును, ఈశ్వరుడును ఉన్నారని, ఈ ప్రపంచము వారిచేత ప్రవర్తింప బడుచున్నదని చెప్పువారు 16 వ అ. 7 వ శ్లో.లో చెప్పబడినటుల నివృత్తి, ప్రవృత్తి మార్గముల ప్రవర్తించు గుణముల ప్రవర్తనల నెరుగని అసుర గుణముల గలవారే గాని యథార్థము నెరిగిన వారు కాదు.

ఇది గుణత్రయ విభాగ యోగము. అనగా, సత్వరజస్తమో గుణములు సుఖ, కష్ట, దుఃఖముల ననుభవింపజేయు ప్రవర్తన. ఈ గుణముల ప్రవర్తనను వ్రాసినారు కాని గుణములే కర్తలు కాని, గుణములకంటె వేరైన కర్త లేదని, తాను కర్తను కానని చూచువాడని, గుణములే ప్రవర్తించుచున్నవని ఉదాసీనునివలె నున్నవాడై గుణములచేత చలింపక నిశ్చలుడై యున్నవాడని వ్రాసినది యథార్థముకాదు. విజ్ఞానముయొక్క నిష్కామాది పవిత్రప్రేమ గలవారి ప్రవర్తనను రాగ ద్వేషాది గుణములు గలవారి ప్రవర్తనయని వ్రాసినారు. ఇదియును యథార్థము కాదు.



# గీతా వ్యాఖ్యానము

## పురుషోత్తమ ప్రాప్తి యోగము

## 15 వ అధ్యాయము

శ్రీ భగవానువాచ : కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయం।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్॥ 1

తా. పైన వేరులును, క్రింద కొమ్మలును, వేదములు ఆకులుగాగల అశ్వత్థ వృక్షము అవ్యయమైనదిగా చెప్పుదురు. అట్టి అశ్వత్థ వృక్షము నెవడెరిగియున్నాడో వాడే వేదముల అనగా వేదములయందు చెప్పబడిన ప్రకృతి గుణములను, వాని కర్మలను నెరిగియున్నాడు.

వ్యా. రాగ ద్వేష మోహాది గుణములతోనున్న కోరికయే అశ్వత్థ వృక్షము. ఈ గుణములు వేరులవలె పైన (యింద్రియములుద్వారా ఈ ప్రపంచమున) విషయములయందు కర్మరూపమున ప్రవర్తించుచు వ్యాపించుచుండును. ఈ అశ్వత్థ వృక్షమునకు వేదములే ఆకులు. ఎందుచేతననగా వేదములయందు ఈ వృక్షము యొక్క స్వరూపమగు త్రిగుణముల సంబంధమైన కర్మలే చెప్పబడి యున్నవి. అందువలన, ఈ ప్రకృతి గుణములు వేదములయందు చెప్పబడిన కర్మలయందు ప్రవర్తించుచు కర్మబంధములనునట్టి సుఖ దుఃఖములకు కారణమగుచున్నవి. ఈ గుణములు వేదములయందు చెప్పబడిన కర్మలద్వారాను కోరికయను అశ్వత్థ వృక్షమును పోషించుచు వృద్ధి చేయుచుండును. జ్ఞాన, విజ్ఞానములు గలవారే అశ్వత్థవృక్షమనునట్టి కోరికనెరిగియున్నారు. వేదముల నెరిగియున్నారు. రాగద్వేషాది ప్రకృతి గుణములు గలవారు ఈ చెట్టును ఎరుగరు. వేదములను ఎరుగరు. కోరిక అను

అశ్వత్థ వృక్షము నశించునట్టిదియేకాని నశించనిది కాదు. ఈ చెట్టునకు ఆకులువలె యున్న వేదములును నశించునట్టివియేకాని నశించనివి కాదు.

శ్లో॥ అధశ్చోర్ధ్వం ప్రసృతా స్తస్యశాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః।
అధశ్చ మూలాన్యను సంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే॥ 2

తా. మనుష్య లోకమునందు వేరులు కర్మబద్ధములై క్రిందనే నాటుకొని యున్నవి. దానియొక్క శాఖలు గుణములచే వృద్ధి నొంది విషయవాసనలు గలవియై క్రిందికిని, పైకిని వ్యాపించుచున్నవి.

వ్యా. మానవజన్మయందు పైన వేరులనునట్టి రాగద్వేషాదిగుణములు ఇంద్రియములద్వారా ఈ ప్రపంచమునందు చేయుకర్మలు జీవులకు వాని స్వభావమువలన వాసనలనునట్టి కర్మబంధములు గలవియై చేయవలసినవియుగను, అనుభవించునవియుగను నగు కర్మలు అను కొమ్మలు క్రిందికి అనగా జీవులయందుండును. ఈ విధముగా జీవులయందున్న రాగద్వేషాది గుణములు విషయములయందు ప్రవర్తించు కర్మలు వాసనలు గలవియై వాని స్వభావముచేత చేయబడునవియును, అనుభవించవలసినవియును యగుచున్నవి. ఈ కర్మలు అను కొమ్మలు జీవులలోపల వ్యాపించి యుండును. లోపల వ్యాపించియున్న ఈ కొమ్మలు అను కర్మలును విషయవాసనలు గలవియగుటచేత, వాని స్వభావముచేత ఇంద్రియములద్వారా మరలపైన ఈలోకమునందు చేయబడుచున్నవి. ఈ కర్మలయందు వానియందున్న రాగద్వేషాదిగుణములు మరల యింద్రియములద్వారా ప్రవర్తించుచుండును. ఈ విధముగా ఈ గుణముల కర్మలు మరల వాసనలనునట్టి కర్మలు అను కొమ్మలుగలోపల వ్యాపించుచుండును. ఈ విధముగ అశ్వత్థ వృక్షమను కోరిక గుణములద్వారా ఈ ప్రపంచమునందుకర్మద్వారా ప్రవర్తించుచు వెలుపలను, లోపలను వ్యాపించుచు వృద్ధియగుచుండును. ఈ విధముగ మానవులు వారియందు కామ రాగద్వేషాది గుణములున్నంతవరకు ఈ గుణములవలనను వారి స్వభావమువలనను ఈప్రపంచమునందు అనేక జన్మలనెత్తుచు సుఖదుఃఖముల ననుభవించుచు తిరుగుచుందురు. అంతియేకాని యిట్లు ప్రవర్తింపజేయువాడెవడును, ఏ భగవంతుడును లేడు.

శ్లో॥ న రూపమస్యేహ తథోపలభ్యతే
నాన్తో న చాదిర్నచ సంప్రతిష్ఠా।
అశ్వత్థమేనం సువిరూఢమూల-
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్వా॥ 3

శ్లో॥ తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్గతా న నివర్తంతి భూయః।
తమేవ చాఽద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥ 4

తా. ఈ వృక్షముయొక్క రూపము గోచరింపదు. అంతమును, మొదలును, స్థితియును తెలియబడదు. దృఢముగా పాతుకొనియున్న వేరులుగల ఈ అశ్వత్థ వృక్షమును దృఢమైన "అసంగ శస్త్రేణ" అనగా కోరిక లేని విజ్ఞానము అనుసట్టి కత్తిచేత ఛేదించవలెను. పిమ్మట ఏ స్థానమందు చేరినవారు తిరిగి జన్మమునకు రారో ఆ స్థానము వెదుకబడదగినది. దేనివలన అనాదియైన ప్రవృత్తి విస్తరిల్లెనో, అట్టి ఆదిపురుషుని ప్రపత్తి చేయవలెను.

వ్యా. రాగ ద్వేష వాంఛాది గుణములతో నున్న కోరికయను ఈ చెట్టు యొక్క రూపము కాన్పించదు. మొదలును అంతమును తెలియబడదు. దాని లక్షణము మాత్రము ప్రవర్తన రూపమున కాన్పించుచుండును. జీవులను కర్మ బద్ధులనుగా చేయుటకు కారణములైన గుణములుగల యీ చెట్టును నరికి (తీసి) వేయుటకు జ్ఞాన, విజ్ఞానములను సంపాదించిన వారికి జ్ఞానముద్వారా పరమపద దర్శనమగును. అప్పుడు అసంగ శస్త్రమను విజ్ఞానమువలన అశ్వత్థమను ఈ చెట్టు (కోరిక) వారి యందుండలేక వారిని విడిచి వెళ్ళిపోవును. తదుపరి వారు కర్మరహితులై జన్మము నకు రాని పరమపదమును చేరుదురు. అంతియేగాని, యీ చెట్టును నరికి తిరిగి జన్మమునకు రాని స్థానమును (పరమపదమును) వెదుకవలయుననునది యథార్థము కాదు. పరమపద దర్శనము కానంతవరకును ఈ చెట్టు నరకబడదు. జ్ఞాన విజ్ఞానముల నార్జింపనంతవరకును పరమపద దర్శనము కాదు. అనాదియైన ప్రవృత్తి ప్రకృతి (మాయ) యందున్నది. ప్రకృతి (మాయ) యందుండి వచ్చిన భ్రమాది గుణముల

చేతనే విస్తరింపబడినది. సర్వమును విస్తరింపజేసిన ఆదిపురుషుడనినది మాయా భ్రమయను గుణము. దీనిని ప్రపత్తి చేయవలెనని ఈ శ్లోకమునందు వ్రాసినది యథార్థము కాదు. అసంగ శస్త్రమను విజ్ఞానముకొరకు పరమపదము నెరిగిన వారి సాంగత్యము చేయవలయును. కోరికయను అశ్వత్థ వృక్షమును వేరులతో సహా అసంగ శస్త్రము (విజ్ఞానము) చేత నరికి వేసినపుడు అది నశించును. నశించునదికాదని 1 వ శ్లో.లో నున్నది యథార్థము కాదు. నశించుట అనగా వారినుండి వెడలి పోవుట. జ్ఞానముద్వారా పరమతేజస్సును చూచి ఆనందమనుభవించువానిని కామాదిగుణములు విడుచునని 2 వ అ. 55 వ శ్లో.లోను; ఆహారమును మానివేసిన పురుషునికి వాని యందున్న వాంఛ (కోరిక) నశించదు. జ్ఞానముద్వారా పరమతేజస్సు కాన్పించగనే వాంఛయే (కోరిక)వానిని విడుచునని 2 వ అ. 59 వ శ్లో.లోను ఉన్నది యథార్థము. కోరికయను అశ్వత్థ వృక్షమును వేరులతోసహా నరికివేసిన తదుపరి పరమపదమును వెదుకవలయునని యిందు వ్రాసినది యథార్థము కాదు.

శ్లో॥ నిర్మానమోహా జితసఙ్గదోషా
　　అధ్యాత్మనిత్యా వినివృత్త కామాః।
ద్వన్ద్వైర్విముక్తా స్సుఖదుఃఖ సంజ్ఞై
　　ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్॥　　5

తా. మోహము లేనివారును, సంగదోషములు జయించిన (లేని) వారును, ఎల్లప్పుడును ఆత్మస్థితి యందున్నవారును, కామాదివృత్తులు లేనివారును, సుఖదుఃఖ సంబంధములగు ద్వంద్వములచేత విడువబడినవారునగు అజ్ఞాన రహితులు నాశము లేని ఆ పరమపదమును పొందు (చేరు) చున్నారు.

వ్యా. ఈ శ్లోకమునందున్నవి జ్ఞాన, విజ్ఞానములు గలవారి లక్షణములు. వారు పరమపద దర్శనమైనవారై విజ్ఞానమువలన అజ్ఞానమగు రాగ, ద్వేష, కామ, మోహాది ప్రకృతి గుణములచేతవిడువబడినవారును, కర్మరహితులునైనపుడు అసంగ శస్త్రమను విజ్ఞానము వారిని విడిచి వెళ్ళును. వారు జ్ఞానముద్వారా పరమపదముగా ఉన్న పరమతేజస్సును చూచుచున్నవారై ఆ తేజోపదమును చేరుచున్నారు. పరమ

పదమును జ్ఞానముద్వారా చూడవలెను, జ్ఞానముద్వారానే చేరవలెనని 13 వ అ. 18వ శ్లోకమువందున్నది. ఆత్మస్థితి యనునది యథార్థము కాదు. ఆత్మ లేదు.

శ్లో॥ న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః।
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ॥ 6

తా. దేనిని పొందిన తిరిగి జన్మమునకు రారో దానిని సూర్యుడు, చంద్రుడు ప్రకాశింప జేయజాలరు. అగ్నియును ప్రకాశింప జేయజాలదు. అదియే నాయొక్క (కృష్ణడను జీవుడు చేరునట్టి) పరమపదము.

వ్యా. 5, 6 శ్లోకములయందు చెప్పబడిన పరమపదమును జేరినవారు తిరిగి జన్మమునకు రారు. దానిని ఈ ప్రకృతి ప్రపంచ సంబంధమైన సూర్య చంద్రులు గాని, ప్రపంచములోనున్న ఏ తేజస్సులుగాని ప్రకాశింపజేయు (చూపు) నవిగావు. జ్ఞానముద్వారానే పరమపదము కాన్పించుచుండును. కాన్పించుచున్న పరమపదమును జ్ఞానముద్వారా చేరుదురు. పరమపదమే కృష్ణడను జీవుడును చేరునట్టి పదము. కృష్ణునియందుండి ప్రవర్తించుచున్న "నేనను" విజ్ఞానము ఆ స్థానమునకు పోదు. పరమపదమును విష్ణులోక (వైకుంఠ)మని కొందరు చెప్పునది యథార్థము కాదు. విష్ణులోకమునకేగినను, ఇంకేలోకమునకేగినను తిరిగి ఈలోకమునందుజన్మించెదరు. బ్రహ్మలోకము మొదలగు లోకముల కేగినను తిరిగి ఈ లోకమునకు వచ్చెదరని 8 వ అ. 16 వ శ్లోకమునందున్నది. పరమతేజస్సుగా ఉన్న పరమపదము కృష్ణ డను జీవుడు చేరునట్టి పదమేగావి కృష్ణుని పదముకాదు. పరమ పదము కృష్ణుడు కాదు.

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః।
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥ 7

తా. అనాదియైన జీవుడనునట్టి నా అంశమే జీవుడుగా ఈ లోకమునందుండి ప్రకృతి స్థానములగు మనస్సు, ఆరవదిగాగల యింద్రియములను ఆకర్షించుచున్నది

వ్యా. అనాదియైన జీవుడనునట్టి నా అంశమనినది ప్రకృతి (మాయ) యందున్నది. మాయాశ్రమచేత మాయయందుండి జీవులను, గుణములను, ఈ సర్వమును

సృష్టించినది. జీవులకు వాని స్వభావమువలన ఈ ప్రపంచసంబంధమున రాగద్వేషాది ప్రకృతి (మాయా) గుణములు సంభవించినవి. అనాదియైయున్న జీవుడనునట్టి అంశము కృష్ణునియంశము కాదు. ఎవరి అంశమును కాదు, ఇది కృష్ణునియందును అందరియందును ఒకే స్వరూపముగ నున్న జీవుడు. జీవులు ఈ లోకమునందు ప్రకృతి గుణములను పొందినవి యగుటవలన, ఈ గుణములచేత నింద్రియముల ద్వారా ఈ ప్రపంచమున ప్రకృతి స్థానముల నాకర్షింపబడుచున్నవి.

శ్లో॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్॥ 8

తా. జీవుడు శరీరములను విడుచునప్పుడును, శరీరములయందు ప్రవేశించునపుడును, వాయువు పుష్పములనుండి పరిమళమును గ్రహించునట్లు వానియందున్న గుణములను తీసికొని పోవుచున్నాడు.

వ్యా. జీవుడు శరీరములను విడుచునపుడును, శరీరములయందు ప్రవేశించునపుడును వానియందున్న గుణములు వానిని విడువవు. జీవుడు యీశ్వరుడని ఇందు వ్రాసినది యథార్థము కాదు. ఈశ్వరుడు లేడు.

శ్లో॥ శ్రోత్రం చక్షుస్స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే॥ 9

తా. జీవుడు చెవి, కన్ను, చర్మము, నాలుక, ముక్కు, మనస్సు అనువాని నధిష్ఠించి విషయముల ననుభవించుచున్నాడు.

వ్యా. జీవుడు తనయందున్న గుణములచేత ఇంద్రియములద్వారా విషయముల ననుభవించువాడగుచున్నాడు. అటుల అనుభవించుస్వభావము జీవునకున్నది. ఇచ్చట మనస్సనునది జీవుని స్వభావము.

శ్లో॥ ఉత్క్రామన్తం స్థితం వాఽపి భుంజానం వా గుణాన్వితం।
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః॥ 10

తా. జ్ఞానదృష్టి (జ్ఞానము) గలవారు ఈ జీవునిని శరీరమునుండి బయలు దేరునపుడును, శరీరమునందుండునపుడును, విషయముల ననుభవించునపుడునుగుణము లతో కూడియున్నవానినిగా చూచుచున్నారు. జ్ఞానము లేనివారు చూడలేరు.

వ్యా. జ్ఞానము గలవారు విజ్ఞానము గలవారును అగుటవలన వారు విజ్ఞానము చేతనే జీవునిని వారియందున్న గుణములను వాని ప్రవర్తనవలన ఎరిగి యున్నారు. అందువలన ఈ గుణములు వారి (ఆ జీవుల) యందుండలేక వారిని విడిచి వెళ్ళి పోవును. వారి సంస్కారము ననుసరించి వారి స్వభావము విషయములయందు ప్రవర్తించు చుండును. ఆ విషయములను వారు వారి స్వభావమువలననే అను భవించుచుందురు. ఆ విషయములయందును విజ్ఞానము నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించుచుండును. వారు ప్రవర్తించు విషయములయందును, అనుభ వించు విషయములయందును ఈ గుణములుండవు. ఇది జ్ఞానములేని వారెరుగరు. జ్ఞానము గలవారియందు ఈ గుణములుండవు. అట్టి వారియందు ఈగుణములున్నటు లను. వారు జీవునిని శరీరమునందున్నపుడును, విషయముల ననుభవించునపుడును, శరీరమును విడుచునపుడును గుణములు గలవానినిగా చూచుచున్నారని ఈ శ్లోకము నందున్నది యథార్థము కాదు.

శ్లో॥ యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితం।
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్య
చేతసః॥ 11

తా. యత్న మొనరించుచున్న యోగులు తనయందున్నట్టి ఆత్మను చూచు చున్నారు. ఆత్మను చూచు విజ్ఞానము లేనివారు యత్న మొనరించుచున్నను ఆత్మను చూడజాలరు.

వ్యా. జ్ఞానములేని వారియందు విజ్ఞానమును ఉండదు. వారియందు యత్న మొనరించునవి ప్రకృతి గుణములు. అందువలన యత్న మొనరించు ఏ యోగుల కును పరమపద దర్శనము కాదు. వారు జీవుని, జీవుని స్వభావమును ఎరుగలేరు. జ్ఞానము గలవారు జ్ఞానముద్వారా పరమపద దర్శనమైనవారై జీవుని, స్వభావమును సర్వమును విజ్ఞానముచేత ఎరిగియున్నారు. వారు దేనికొఱకును యత్న మొనరించు

వారు కాదు. జ్ఞానము గలవారును, జ్ఞానము లేనివారును రెండు విధములుగ ఈ ప్రపంచము నందున్నారు. ఇందు ఆత్మ యనునది జీవుని స్వభావము. ఆత్మ లేదు.

శ్లో॥ యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥

తా. సూర్యునియందున్న ఏ తేజస్సు సమస్త ప్రపంచమును ప్రకాశింపజేయు చున్నదో, ఏ తేజస్సు చంద్రునియందును, అగ్నియందును ఉన్నదో, దానినినాదిగా నెరుంగుము.

వ్యా. సూర్యునియందును, చంద్రునియందును, అగ్నియందునుఉన్న తేజస్సు ప్రకృతి (మాయ) యందున్న తేజస్సు. ఇది ఈ ప్రపంచమునందు ఉపయోగపడు నట్టిది. ఈ తేజస్సును కృష్ణుడు నాదిగా నెరుంగుమని వ్రాసినది యథార్థము కాదు. కృష్ణుడు జ్ఞాన విజ్ఞానముల నార్జించుటవలన వానియందున్నవి పరమ తేజోపదమును చూచు జ్ఞానము, సర్వము నెరిగి ప్రవర్తించు విజ్ఞానము. పరమ తేజస్సు కృష్ణుని యందు లేదు. ఈ ప్రపంచమునందు లేదు.

శ్లో॥ గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా।
పుష్ణామి చౌషధీస్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః13

తా. నేను భూమిని ప్రవేశించి బలముచేత భూతములను ధరించుచున్నాను. రస స్వరూపుడగు చంద్రుడనై సర్వ ఓషదులను వృద్ధి పొందించుచున్నాను.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥

తా. నేను జఠరాగ్నినై ప్రాణుల శరీరముల నాశ్రయించి ప్రాణా పాన వాయువులతోగూడి నాలుగు విధములైన ఆహారమును జీర్ణము చేయుచున్నాను.

వ్యా. ఇవి యన్నియును జీవులయందున్న గుణముల కర్మలనుబట్టి వాని స్వభావమువలన జరుగుచుండును. ఇది స్వయముగా ఏదియును చేయునది కాదు.

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతిర్జ్ఞానమపోహనం చ
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్॥ 15

తా. నేను సమస్త ప్రాణుల హృదయమునందున్నాను. స్మృతియును, జ్ఞానమును, మరుపును, నా వలననే గలుగుచున్నవి. సమస్త వేదములచేత నెరుగబడదగిన వాడను నేనే. వేదాంతమును చేసినవాడను, వేదము నెరిగినవాడను నేనే.

వ్యా. సకల ప్రాణులకును ఉన్నది స్వభావమను గుణము. స్మృతియును, జ్ఞానమును, మరుపును జీవులయందున్న గుణములు చేసిన కర్మలనుబట్టి జీవులకు వాని స్వభావమువలననే గల్గుచున్నవి. ఇది సమస్త వేదములచేత నెరుగబడదు. వేదముల నెరుగదు. వేదాంతమును చేసినది కాదు. ఈ స్వభావమును, వేదములను, ఈ సర్వమును ఎరిగినది, వేదాంతమును చెప్పునది కృష్ణునియందున్న విజ్ఞానము. ఈ విజ్ఞానము ఎరిగినవి జీవుల స్వభావము ఎరిగినట్లుగాను, ఈ స్వభావమునుకృష్ణుడు "నేనే"నని చెప్పినట్లుగాను, కల్పించి వ్రాసియున్నారు.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥ 16

తా. లోకమునందు క్షరుడనియు, అక్షరుడనియు పేర్లుగల యిరువురు పురుషులు గలరు. సమస్త భూతములు (శరీరములు) క్షరముల (నశించునవి) అనియు, శరీరములయందున్న జీవుడు అక్షరుడు (నశించనివాడు) అనియు చెప్పబడుచున్నాడు.

వ్యా. ఈ లోకమునందంతటను నశించునట్టి శరీరములు, శరీరములందు నశించని స్వభావముగల జీవుడు అను ఇరువురు పురుషులున్నారు.

శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః। 17

తా. ఈ యిరువురికంటె, అన్యమైన ఉత్తమ పురుషుడు ఒకడు గలడు. అతడు పరమాత్మ (పరమతేజస్సు). వాడే ముల్లోకములను వ్యాపించి భరించు నాశ రహితుడైన ఈశ్వరుడు.

వ్యా. ముల్లోకములయందు నశించు శరీరములును, శరీరములయందు నశించని స్వభావముగల జీవులును ఉన్నవి. పరమాత్మ యనునది పరమపదముగా ఉన్న పరమతేజస్సు. ఇది ముల్లోకములలో ఎవరియందును లేదు. ఎచ్చటను లేదు. సర్వ జీవులకున్న స్వభావము ఉత్తమ పురుషుడు కాదు, పరమతేజస్సు కాదు. జీవులస్వభావమునే ఉత్తమపురుషుడు, పరమాత్మ (పరమతేజస్సు), ఈశ్వరుడు అని కల్పించి వ్రాసినారు. ఈశ్వరుడు లేడు.

శ్లో॥ యస్మాత్క్షరమతీతోఽహమక్షరాదపిచోత్తమః।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥ 18

తా. నేను క్షరునికంటెను అక్షరుని (జీవుని) కంటెను అతీతముగా ఉత్తముడనై యున్నాను. అందువలన లోకమునందును, వేదమునందునుపురుషోత్తముడనని ప్రసిద్ధి జెందితిని.

వ్యా. ఈ ప్రపంచమునందున్న నశించు శరీరములకంటెను, నశించని స్వభావముగల జీవునికంటెను కృష్ణుడు జ్ఞాన, విజ్ఞానములు గలవాడగుటవలన విజ్ఞానము యొక్క ఆచరణనుబట్టి అప్పటి జనులచేత పురుషోత్తముడని చెప్పబడియుండును. కృష్ణునివలెనే జ్ఞాన, విజ్ఞానములు గలవారందరును పురుషోత్తములని చెప్పబడుదురు. జ్ఞానము లేనివారు కామ రాగద్వేషాది గుణములు గలవారగుటవలన పురుషోత్తములనబడరు. మాయయందుండి వచ్చిన జీవుల స్వభావము పురుషోత్తము డనబడదు. సమస్త శరీరములయందున్నవి స్వభావమను గుణముగల జీవులుగాక యింకొకటి లేదు. క్షరుడను శరీరముకంటెను, అక్షరుడను జీవునికంటెను తాను ఉత్తము డనునది మాయయందుండి వచ్చిన జీవుల స్వభావమను గుణమును. దీనిని ఉత్తమ పురుషుడు, పరమతేజస్సు, ఈశ్వరుడు, కృష్ణుడు యని కల్పించి వ్రాసినారు.

శ్లో॥ యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమం।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత॥ 19

తా. అర్జునా! ఎవడు ప్రపంచ సంబంధమైన మోహము లేనివాడై, అన్ని విధములచేతను నన్ను సేవించుచున్నాడో, వాడు నన్ను పురుషోత్తమునిగా నెరుంగుచున్నాడు. సర్వము నెరిగిన వాడగుచున్నాడు.

వ్యా. కృష్ణుడు తనను విడువక సేవ చేయువారలకు తనను తెల్సియు బుద్ధి (భక్తి) నిచ్చెదనని, ఆ భక్తిభావమున తాను అనగా కృష్ణుడను జీవుని యందుండి చెప్పుచున్న విజ్ఞానము కృష్ణుని రూపమున వారియందుండి వారియందున్న అజ్ఞానమను చీకటి పోగలందులకు వారియందు జ్ఞానమను దీపమును ప్రవేశింపజేయుచున్నా నని 10 వ అ. 10, 11 వ శ్లో.లో చెప్పినది మానవుడుగానున్న కృష్ణునియందున్న విజ్ఞానము. కృష్ణునికి సేవచేయు వారియందు జ్ఞాన విజ్ఞానములు లేకపోవుటచేతనె వారు అజ్ఞానమను చీకటి గలవారై యున్నారు. కృష్ణునియందున్న విజ్ఞానము వారిని కృష్ణునియందు భక్తి గలవారినిగా జేసి కృష్ణునియందున్న విజ్ఞానముతోనున్న జ్ఞానమును వారియందును ప్రవేశింప జేసియుండును. ఈ కృష్ణుడు జ్ఞాన విజ్ఞానములులేని సమస్త క్షేత్రముల (శరీరముల) యందున్న క్షేత్రజ్ఞుడనునట్టి జీవుల స్వభావమను కృష్ణుడు కాదు. సర్వము నెరిగినది విజ్ఞానము. జీవులస్వభావము క్షేత్రము(శరీరము) నెరిగిన క్షేత్రజ్ఞుడనునదియేగాని యింకేదియు నెరుగడు. కృష్ణునియందున్న విజ్ఞాన ప్రవర్తనవలన కృష్ణుడు పురుషోత్తముడనినారు. జ్ఞాన విజ్ఞానములుగలవారును, వారి ప్రవర్తనవలన పురుషోత్తము లనబడుదురు జీవుల స్వభావము పురుషోత్తముడుకాదు. కృష్ణుడు కాదు.

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయాఽనఘ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్కృత కృత్యశ్చ
భారత॥ 20

తా. పాపరహితుడవగు అర్జునా! యిట్లు నాచే చెప్పబడిన అతి రహస్యమైన ఈ శాస్త్రము నెరిగి అర్జునా! బుద్ధిమంతుడవును, కృతార్థుడవునగుము.

వ్యా. జ్ఞాన విజ్ఞానములు గలవాడగు కృష్ణునిచే చెప్పబడిన విజ్ఞానవాక్యములే శాస్త్రము. ఆ విధముగనే, జ్ఞాన, విజ్ఞానములు గలవారిచే చెప్పబడిన వాక్యములే యథార్థ శాస్త్రములు. ఎవరైనను అట్టివారి సాంగత్యమున వారిచే చెప్పబడిన అతి రహస్యమైన జ్ఞానమును అనగా విజ్ఞానముతోనున్న జ్ఞానమును వారిద్వారానే, వారి నుండియే ఆర్జించి జ్ఞానవిజ్ఞానములద్వారా బుద్ధిమంతులును, కృతార్థులును కావలెను. అటులగాక కృష్ణుడు చెప్పెనని, లేక యింకెవరైనను చెప్పెనని ఏ విధముగనైనను వ్రాయబడిన శాస్త్రముల (పుస్తకముల) యందు జ్ఞానము లేదు. విజ్ఞానము లేదు.

అట్టి శాస్త్రములు ఎన్ని చదివినను, వినినను వానిద్వారా అనేకములైన బుద్ధులు పుట్టునుగాని, ఆ శాస్త్రములనుండి జ్ఞాన విజ్ఞానములను పొందలేరు. స్వయముగనూ పొందలేరు. అర్జునుడు రాగద్వేషాది గుణరహితుడు కాడు. పాపరహితుడుకాడు. కృష్ణునియందున్న జ్ఞాన విజ్ఞానముల నార్జించినచో వానివలన గుణరహితుడై, పాప రహితుడగును.

ఈ అధ్యాయమున ఎచటికి చేరిన మరల జన్మమునకు రారో ఆ పదమును వెదుకవలయునని చెప్పబడి యున్నది. ఈ లోకము జన్మములనెత్తు మాయాస్థానము. జన్మమునకు రాని స్థానమనునట్టి పరమపదమును (తేజో లోకమును) చేరవలయు ననిన పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను. జ్ఞానముద్వారా చేరవలెనని 13వ అ. 18 వ శ్లోకమునందు చెప్పబడిన జ్ఞానము (భావము)ను విజ్ఞానమును నార్జించవల యును. అంతియేకాని, 8 వ అ. 18, 19 వ శ్లో.లలో చెప్పబడినటుల మాయ యందుండి వచ్చి నశించి మాయయందే కలియుచు, మరల మాయయందుండివచ్చుచు తిరుగుచుండు ఈ ప్రపంచములో జీవుల స్వభావమను గుణమును ఆదిపురుషుడని, వానిని ప్రపత్తి చేయవలయునని యిందు వ్రాసినది యథార్థము కాదు. ఇది 13 వ అ. 2 వ శ్లో.లో ఉన్నటుల క్షేత్రమునెరిగిన క్షేత్రజ్ఞుడనునది. అంతియేకాని తనను ఎరుగదు. పరమపదము నెరుగదు. ఇంకేమియును నెరుగదు. 13 వ అ. 27వశ్లో.లో ఉన్నటుల క్షేత్రములద్వారా సంయోగము చేయునది. ఇట్టి దానిని పరమపురుషుడని, పరమాత్మ అనగా నిరాకార నిర్గుణమగు పరమపదముగా ఉన్న పరమతేజస్సు అని కృష్ణుడని అందువలన కృష్ణుడు తాను పురుషోత్తముడనని వేదముచేతను,ఈలోకము చేతను చెప్పబడుచున్నానని చెప్పినటుల వ్రాసినది. భగవద్గీతయని వ్రాసినవారి కల్పి తమేగాని కృష్ణుడు చెప్పినది కాదు.

జ్ఞాన, విజ్ఞానముల నార్జించిన కృష్ణుడనువాడు ఉంపీ యుండును. వాడువిజ్ఞాన ప్రపత్తివలన ఈ లోకములో పురుషోత్తముడని అప్పటి ప్రజలలో కొందరిచేత చెప్పబడియుండునుగాని, మాయయందుండి వచ్చిన జీవుల స్వభావము పురుషోత్త ముడు కాదు. అనేకమైన తప్పు ప్రవర్తనలను వ్రాసి దీనిని భగవంతుడు కృష్ణుడు చెప్పిన భగవద్గీతయని వ్రాసినారు. ఈ గీతవలన అందరియందును భగవంతుడున్నా డను మూఢనమ్మకములతో అనేకులు తప్పు మార్గముల ప్రవర్తించువారగుచున్నారు

ఇట్లు ప్రవర్తించు అనేక శాస్త్రములు వ్రాసియున్నారు. వీనివలన అనేకులు అవ్యక్తముగ తప్పు ప్రవర్తన గలవారగుచున్నారు.

ఈ 15 వ అధ్యాయము పురుషోత్తమ ప్రాప్తియోగము. అనగా పురుషులలో ఉత్తమ పురుషుడు అను వానిని పొందు (ఆర్జించు) ప్రవర్తన. పరమ పదమును జ్ఞానముద్వారా చూడవలెను. జ్ఞానముద్వారా చేరవలెను అని 13 వ అ. 18వ శ్లో.లో చెప్పబడిన జ్ఞానము (భావము)ను, పరమపదమును, ఆ పదమును జేరు మార్గమును (ప్రవర్తనను), ఈ సర్వప్రపంచ ప్రవర్తనను ఎరిగి నిష్కామ భావము, సమత్వ బుద్ధి, నిత్యసత్వము, పవిత్ర ప్రేమభావములతో ప్రవర్తించు విజ్ఞానమను భావమును గలవారందరును పురుషోత్తము లనబడుదురు. అట్టి వారియందున్న జ్ఞాన, విజ్ఞానము అను వారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయుచు, వారిద్వారా నార్జించుటయే పురుషోత్తమ ప్రాప్తి యోగము (ప్రవర్తన). ఇట్టి జ్ఞాన, విజ్ఞానములు 16 వ అ. 5 వ శ్లో.లో దైవసంపదయని, పరమపదమును జేర్చునని యున్నది. ఇది యథార్థము. ఇట్లుగాక కర్మబంధమును కలుగజేయునవి అసురసంపదయని 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన కామ, రాగ, ద్వేషాది అసురగుణములలో జీవుల స్వభావమను అసుర గుణమును పొందుట యనునది లేదు. పురుషోత్తమ ప్రాప్తియోగమని వ్రాసి జీవుల స్వభావమను అసురగుణమును పొందుట యని వ్రాసినారు. కాని,దీనిని పొందుట యనునది లేదు.



# గీతా వ్యాఖ్యానము

## దైవాసుర సంపద్విభాగ యోగము

## 16 వ అధ్యాయము

శ్రీ భగవానువాచ : కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చస్వాధ్యాయస్తప ఆర్జవమ్॥ 1

తా. భయము లేకుండుట, సత్వశుద్ధి గలిగియుండుట, జ్ఞానయోగమందుండుట దానము, నిగ్రహము, యజ్ఞము, అధ్యయనము, తపస్సు, కపటము లేకుండుటయు,

శ్లో॥ అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాన్తిరపైశునం।
దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్॥2

తా. అహింస, సత్యము, క్రోధము లేకుండుట, త్యాగము, శాంతము, కొండెములు చెప్పకుండుట, సమస్త భూతములయందు దయ గలిగియుండుట, విషయములకు లోబడకుండుట, మృదు స్వభావము, లజ్జ గలిగి యుండుట, చాంచల్యము లేకుండుట,

శ్లో॥ తేజః క్షమా ధృతిశ్శౌచమద్రోహోనాతిమానితా।
భవన్తి సంపదం దైవీమభిజాతస్య భారత!॥ 3

తా. తేజస్సు, ఓర్పు, ధైర్యము, శుచియు, ద్రోహము చేయకుండుట, అభిమానము లేకుండుట, అర్జునా! యివి దైవీసంపదతో పుట్టినవానికి కలుగుచున్నవి.

వ్యా. ఈ మూడు శ్లోకములయందున్నవి ప్రకృతి; గుణములలో సత్వ గుణ సంబంధమైనవి. నిత్యానిత్యములగల విజ్ఞానము గలిగి ఉండవలయునుగావి, సత్వశుద్ధి

యనునది లేదు. జ్ఞాన యోగమందుండుట అనునది లేదు. తేజస్సు కలుగుట అను నది లేదు. దైవము లేదు. దైవమునకు సంపద యనునది లేదు. జ్ఞాన,విజ్ఞాన భావము లను దైవసంపదయని వ్రాసినారు. భావము (జ్ఞానమను గుణము) అనాదియై యున్న దని 8 వ అ. 20 వ శ్లో.లో ఉన్నది. దీనితో విజ్ఞానమను భావము (గుణము)ను ఉండును. దానము, నిగ్రహము, యజ్ఞము, అధ్యయనము, తపస్సు అనునవి రాగ, ద్వేషాది గుణముల ప్రవర్తన. ఇవి దైవసంపదయనిన జ్ఞాన, విజ్ఞానముల ప్రవర్తన కాదు.

శ్లో॥ దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్॥ 4

తా. అర్జునా! అసురసంపద (ప్రకృతి గుణముల)తో పుట్టినవానికి దంభము, గర్వము, అభిమానము, కోపము, పారుషము, అజ్ఞానమును గలుగుచున్నవి.

వ్యా. పైన చెప్పబడినవియును, ఇవియును అసుర సంపదయనిన రాగ, ద్వేషాది ప్రకృతి గుణములు గలవారి లక్షణములు.

శ్లో॥ దైవీ సంపద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా।
మాశుచస్సంపదం దైవీమభిజాతోఽసి పాండవ॥ 5

తా. దైవసంపద (జ్ఞాన, విజ్ఞానభావములు) (గుణములు) ప్రకృతి బంధ విముక్తుని జేసి పరమపదమును జేర్చును. అసురసంపద (రాగ, ద్వేషాదిగుణములు) కర్మబంధములను కలుగజేయునవి. అర్జునా! నీవు దైవీభావముల సంబంధమున పుట్టినవాడవు. దుఃఖింపకుము

వ్యా. దైవసంపద (జ్ఞాన, విజ్ఞాన భావములు) అసుర సంపదయనిన రాగ ద్వేషాది గుణములను వెడలగొట్టి కర్మబంధ రహితులనుగా జేసి పరమపదమును జేర్చును. అసుర (రాగద్వేషాది) గుణములు కర్మబంధములను గలిగించి సుఖ దుఃఖముల ననుభవించు వారినిగా జేయును. అర్జునుడు జ్ఞానవిజ్ఞానములుగల కృష్ణుని సంబంధము గలవాడై పుట్టియున్నాడు. అందువలన జ్ఞాన విజ్ఞానములను కృష్ణుని నుండి పొందగలవాడగును. మోక్ష (పరమ) పదమును చేరుటకు జ్ఞాన, విజ్ఞానములు కారణము. రాగద్వేషాది ప్రకృతి గుణములు,సుఖ, దుఃఖములకును, అనేకజన్మము

లకును కారణము. అందువలన రాగద్వేషాది గుణములు గలవారు జ్ఞానవిజ్ఞానభావము లను ఇవి యున్నవారినుండి వారి సాంగత్యమున వారిద్వారానేపొందవలెను. అసుర గుణములు గలవారు మోక్షమార్గమని భగవంతుని కొరకని ఏమిచేసినను దానిద్వారా కర్మబంధములగు సుఖ, దుఃఖములను, అనేక జన్మములను అనుభవించెదరు. ఎవరి యందును ఈ రెండు సంపదలనునవి కలిసియుండవు. ఎవరియందేగుణములుండునో అవియే కర్మలయందు ప్రవర్తించుచుండును. ఎవరును గుణములను స్వాధీనము జేసి కొని నడువలేరు. ప్రవర్తనయే మార్గము. కన్నులు మూసికొని కూర్చుండిధ్యానము చేయుట అసుర గుణముల మార్గము. జ్ఞాన, విజ్ఞానములు గలవారియందు అసుర (ప్రకృతి) గుణముల ప్రవర్తన యుండదు. అసుర గుణముల గలవారియందు జ్ఞాన, విజ్ఞాన భావముల ప్రవర్తన యుండదు.

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు॥ 6

తా. అర్జునా! ఈ లోకమునందు సృష్టింపబడిన భూతములు దైవీభావము లనియు, అసుర గుణములనియు రెండు విధములగ నున్నవి. దైవీభావములనువిస్తా రముగ ఈ అధ్యాయమునందు పైన చెప్పియున్నాను. అసుర గుణములను చెప్పె దను వినుము.

వ్యా. పైన చెప్పబడినవి అసురయనిన ప్రకృతి త్రిగుణములలో సత్వగుణ ప్రవర్తనయేగాని, దైవీభావములనిన జ్ఞాన, విజ్ఞానముల ప్రవర్తన కాదు. మానవులు జ్ఞాన, విజ్ఞానములనునట్టి భావముల (గుణముల) ప్రవర్తనవలన పరమపదమును చేరు దురు. కామ రాగ ద్వేషాది గుణముల ప్రవర్తనవలన వారి స్వభావముచేత ఈ లోకమునందు బంధింపబడుదురు. అసురగుణములు గలవారు జ్ఞాన, విజ్ఞానములను ఇవి యున్న వారి సాంగత్యమున వారినుండియే వారిద్వారానే పొంది వానివలనకామ రాగద్వేషాది గుణరహితులై, కర్మరహితులునై పరమతేజోలోకమును చేరవలయును గాని, అసురయనిన కామ రాగద్వేషాది గుణములతో ఎవరిని, దేనిని భగవంతుడని ఏమి చేసినను అది యంతయును ఈ లోకమునందు బంధించు అసురయనిన కామ గుణముల ప్రవర్తనయే యగును. ఈ లోకములో దైవసంపద, అసురసంపదయను రెండు విధములగు ప్రవర్తనలుగల గుణములున్నవి. అంతియేకాని, ఇంకొక ప్రవ ర్తన గలవాడెవడును లేడు.

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥ 7

తా. అసుర గుణములుగల జనులు నివృత్తి మార్గము నెరుగరు. ప్రవృత్తి మార్గము నెరుగరు. వారియందు శౌచము, మంచి ఆచరణ, సత్యము ఉండదు.

వ్యా. అసుర గుణములు గలవారు జ్ఞాన విజ్ఞానములనునట్టి కన్నులు లేని వారు గనుక నిష్కామాది పవిత్ర ప్రేమభావములతో ప్రవర్తించు విజ్ఞానముయొక్క నివృత్తి అనగా కర్మరహితమగు మార్గము (ప్రవర్తన) నెరుగరు. కర్మబద్ధులై సుఖ దుఃఖముల ననుభవించుటకు కారణమగు కామ రాగ ద్వేషాది గుణముల ప్రవృత్తి మార్గము (ప్రవర్తన) నెరుగరు. వారియందు విజ్ఞానముయొక్క నిష్కామము. సమత్వబుద్ధి, నిత్యసత్వము, పవిత్ర ప్రేమభావముల ప్రవర్తన యుండదు. వారు అసుర గుణములచేత ప్రవృత్తి మార్గమున ప్రవర్తింపబడుచున్నారు. జ్ఞాన విజ్ఞానములు అను కన్నులున్నవారు జ్ఞానముద్వారా పరమపద దర్శనమైన వారగుటవలన విజ్ఞానమువలన ఈ రెంశుమార్గముల నెరిగినవారై నివృత్తి మార్గమున ప్రవర్తింపబడుచుందురు. అట్టి జ్ఞాన విజ్ఞానములు గలవారె యీరెండు విధములగు ప్రవర్తనలు గల గుణములను చెప్ప యున్నారు.

శ్లో॥ అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరం।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్॥ 8

తా. అసుర గుణములు గలవారు ప్రపంచ మసత్యమనియు, దేనిచేతను, సృజింపబడలేదనియు, ఈశ్వరుడులేడనియు, స్త్రీ,పురుషుల సంబంధమువలననే పుట్టినదిగాని, మరియొక విధమున కాదనియు, అందులకు కామమే హేతువనియు చెప్పుదురు.

శ్లో॥ ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మనోఽల్ప బుద్ధయః।
ప్రభవన్త్యుగ్ర కర్మాణః క్షయాయ జగతోఽహితాః॥ 9

తా. ఇటువంటి దృష్టి నవలంబించినవారు, నష్టముకలుగజేయువారును,అల్ప బుద్ధి గలవారునై, ప్రపంచనాశము కలుగజేయుటకొరకు శత్రువులుగను, క్రూర కర్మలు చేయువారుగను పుట్టుచున్నారు.

వ్యా. సర్వజీవులును స్వభావమును పొందుచున్నవి. అనగా సర్వజీవులకును వాని సంస్కారమువలన వాని స్వభావము ప్రవర్తించుచున్నది. జ్ఞానముగల (నార్జించిన) వాడైనను తన సంస్కారమువలన తనస్వభావముచేత ప్రవర్తింపబడుచున్నాడు. అని 3 వ అ. 33 వ శ్లోకములో ఉన్నది. కృష్ణుడును తన స్వభావముచేత తన సంస్కారము ననుసరించియే జన్మింపబడుచున్నాడని 4 వ అ. 6 వ శ్లోకములో ఉన్నది. అర్జునుడును తన సంస్కారమువలన తన స్వభావమునకు వశుడై యున్నాడని, చేయవలసినది దేనినైనను పరవశుడై చేయునని అనగా తన స్వభావమే చేయునని 18 వ అ. 59, 60 వ శ్లో.లో ఉన్నది. మాయయందుండి వచ్చిన సర్వజీవులకును వానియందున్న కామ రాగద్వేషాది గుణములు చేసిన కర్మను (సంస్కారమును) అనుసరించి ప్రవర్తించు స్వభావమున్నదిగాని ఈశ్వరుడు లేడు.

జీవులు సుఖ దుఃఖముల ననుభవించుటకును, అనేక ఉత్కృష్ట, నికృష్ట జన్మలనెత్తుటకును కామ రాగద్వేషాది మాయాగుణములు కారణమని 13 వ అ. 21, 22, శ్లోకములలో ఉన్నది. ఎట్లనగా ఈ గుణముల కర్మల ననుసరించి ప్రవర్తించు జీవుల స్వభావ ప్రవర్తనవలన జీవులు అనేక ఉత్కృష్ట, నికృష్ట జన్మలనెత్తుచున్నవి. సుఖదుఃఖముల ననుభవించుచున్నవి. ఈశ్వరుడు జీవులకు కర్తృత్వమును, కర్మలను, కర్మఫలములతోటి సంబంధమును సృజింపడు. జీవులకు స్వభావము ప్రవర్తించుచున్నదని 5 వ అ. 14 వ శ్లో.లో ఉన్నది. జీవులకు ప్రవర్తించు స్వభావమున్నదిగాని ఈశ్వరుడు లేడు.

సర్వభూతములును క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగముచేతనే పుట్టుచున్నవని 13వ అ. 27 వ శ్లో.లో ఉన్నది. జీవులు వానియందున్న కామగుణముల ప్రవర్తన వలన క్షేత్రజ్ఞుడు అనగా జీవుల స్వభావము క్షేత్రముల అనగా స్త్రీ, పురుషులనునట్టి శరీరములద్వారా చేయు సంయోగమువలననే పుట్టుచున్నవి. అంతియేకాని ఈశ్వరుని వలన పుట్టుట లేదు. ఈశ్వరుడు లేడు.

8 వ అ. 18, 19, 20 శ్లో.లో చెప్పబడినటుల రాత్రి పగలు గలది ఈ ప్రపంచమును మాయయందుండి సృష్టించి, ఈ ప్రపంచముతో నశించునట్టిదియగు బ్రహ్మయను మాయాభ్రమచేత మాయయందుండి వచ్చిన ఈ ప్రపంచములోజీవులు స్వాతంత్ర్యములేక అనేక జన్మలనెత్తుచు నశించి మాయయందే కలియుచు మరల

వచ్చుచు తిరుగుచుండుటకు వానియందున్న రాగ, ద్వేషాది గుణముల ప్రవర్తన నను సరించి మరల ఇంకొకప్పుడు ఆ జీవుల స్వభావము ప్రవర్తించు ప్రవర్తన కారణము. అంతియేకాని, ఈశ్వరునివలన ప్రవర్తింపబడుటలేదు. ఈశ్వరుడు లేడు. మాయ యందుండి వచ్చి అనేక జన్మలనెత్తుచు నశించి మాయయందే కలియుచు మరల వచ్చుచు తిరుగుచుండు జీవుల స్వభావమను గుణమును ఈశ్వరుడని నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరుగని అసురగుణములు గలవారు కల్పించినారు. అంతియేకాని ఈశ్వరుడు లేడు.

అసుర సంపద అనగా మాయయందుండి వచ్చిన కామ, రాగ, ద్వేషాదిగుణము లును, జీవుల స్వభావమను గుణమును కర్మబంధమును కలుగజేయునవియని, దైవ సంపద అనగా జ్ఞాన, విజ్ఞానములనునట్టి భావములు (గుణములు) మోక్ష (పరమ) పదమును జేర్చునని ఈ అధ్యాయమున 5 వ శ్లోకములో ఉన్నది. ఈ భావములు 8 వ అ. 20 వ శ్లోకములో సర్వోత్కృష్టమైనది, మాయకంటె వేరుగా అనాదియై యున్నది, బ్రహ్మతోసహా ఈ సర్వప్రపంచము నశించినను నశించనిదియని చెప్ప బడిన భావము అనగా జ్ఞానమను భావము. ఈ భావముతో విజ్ఞానమను భావమును ఉండును. ఇవి విజ్ఞానముతోనున్న జ్ఞానమని 7 వ అ. 2 వ శ్లోకములోను చెప్ప బడినవి. ఇట్లు దైవసంపద అసురసంపదలనునట్టి రెండువిధముల సృష్టులు ఈ ప్రపం చమునందున్నవని ఈ అధ్యాయమున 6వ శ్లోకములో ఉన్నది. ఈ ప్రపంచమునందు రెండు విధములగు ప్రవర్తనలుగల గుణములున్నవిగాని, ఈ ప్రపంచమునందు ప్రవ ర్తించు ఈశ్వరుడు లేడు. ఇంకే శక్తులును లేవు.

ఇట్లు చెప్పినది నివృత్తి, ప్రవృత్తిమార్గముల నెరిగిన జ్ఞాన, విజ్ఞానములుగల కృష్ణుడు. ఈ విధముగనే జ్ఞాన, విజ్ఞానములు గలవారందరును విజ్ఞానముచేత నివృత్తి ప్రవృత్తి మార్గముల నెరిగి చెప్పుచుందురు. నివృత్తి మార్గమున ప్రవర్తింపబడు చుందురు. ఈ ప్రపంచములో ఉన్నవి రెండు విధములుగ ప్రవర్తించు గుణములు, అంతియేకాని, ఆత్మ లేదు పరమాత్మ (పరమతేజస్సు) లేదు ఈశ్వరుడు లేడు. ఏ శక్తియును లేదు. ఈ ప్రపంచ ప్రవర్తనకు అసుర సంపదయనిన కామ గుణము లును, జీవుల స్వభావమును (గుణమును) కారణముగాని మరియొకటి కారణ మను నది లేదు. ఈశ్వరుడు లేడు. ఇది నివృత్తి, ప్రవృత్తి మార్గముల నెరిగిన విజ్ఞానము గలవారు చెప్పినది. వీరిని నాస్తికులనుచున్నారు. సర్వభూతములును క్షేత్రక్షేత్రజ్ఞుల

అనగా క్షేత్రజ్ఞుడను స్వభావము స్త్రీ, పురుష శరీరములతో చేయు సంయోగమువలన పుట్టుచున్నవని 13 వ అ. 27 వ శ్లో.లో కృష్ణుడు చెప్పెనవి యున్నది. అంతియె కాని, ఈశ్వరునివలన పుట్టుటలేదు. ఈశ్వరుడు లేడు. ఇట్లు చెప్పిన కృష్ణుడును నాస్తికుడు. ఈశ్వరుడులేడని చెప్పువారు నష్టము కలుగజేయువారని, ప్రపంచనాశము కలుగజేయుటకొరకు శత్రువులుగను, క్రూరకర్మలు చేయువారుగను పుట్టుచున్నారని 8, 9 శ్లో.లలో ఉన్నది నివృత్తి, ప్రవృత్తి మార్గములనెరుగని కామ,రాగ,ద్వేషాది అసుర గుణములు గలవారు కల్పించి వ్రాసినదియే కాని, కృష్ణుడు చెప్పినది కాదు. మాయాశ్రమవలన మాయయందుండి వచ్చినదని 8 వ అ. 18, 19 శ్లో.లో చెప్పబడిన జీవుల స్వభావమను గుణమును ఈ ప్రపంచములో ఉత్తమ పురుషుడొకడున్నాడని వాడె పరమాత్మ (పరమతేజస్సు) ఈశ్వరుడు, కృష్ణుడని 15 వ అ. 17, 18 శ్లో.లలోను, ఈ సర్వమును తన (కృష్ణుని) వలననే ఉత్పత్తి యగుచున్నదని, ప్రవర్తింపబడుచున్నదని 10 వ అ. 8 వ శ్లో.లోను, ఈశ్వరుడు యంత్రములనునట్టి శరీరములను ధరించియున్న సర్వజీవులను యంత్రములను త్రిప్పునటుల వానియందుండి తన మాయచేత త్రిప్పుచున్నాడని 18 వ అ. 61 వ శ్లో.లోను, అట్టి ఈశ్వరుని శరణు వేడికొనుము. వాని అనుగ్రహమువలన శాశ్వితమగు మోక్ష (పరమ) పదమును జేరుదువని 62 వ శ్లో.లోను కృష్ణుడు అర్జునునికి చెప్పినటుల వ్రాసి దీనిని భగవంతుడు కృష్ణుడు చెప్పిన భగవద్గీతయని కల్పించి వ్రాసినవారును, ఈశ్వరుడున్నాడని ఈ సర్వమును ఈశ్వరునివలన పుట్టుచున్నదని, ప్రవర్తింపబడుచున్నదని చెప్పువారును ఈ 16 వ అ. 7 వ శ్లో.లో చెప్పినటుల నివృత్తి,ప్రవృత్తిమార్గముల నెరుగని అసురగుణములు గలవారు. వీరు నివృత్తి ప్రవృత్తి మార్గముల నెరుగు జ్ఞానము లేనివారగుటవలన ఈ మార్గముల (రెండు విధములగు గుణముల ప్రవర్తనల) నెరుగక 9 వ శ్లో.లో చెప్పబడినటుల నష్టము కలుగజేయువారును, ప్రపంచనాశము కలుగజేయుటకొరకు శత్రువులుగను, క్రూరకర్మలు చేయువారుగను పుట్టునారు. వీరు బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు అను భగవంతు లున్నారని చెప్పుచున్నారు. వారి విగ్రహములను చేసి వానిని పూజింప జేయుచున్నారు. వారి నామములతోను, ఇంక ననేక భగవంతులను పేరులతోను 12 వ అ. 5 వ శ్లో.లోచెప్పబడినటుల అధిక కష్ట దుఃఖములకు కారణమైన మూఢనమ్మకమగు అవ్యక్తాసక్తిని

కలిగించి వారిని అవ్యక్తగతిని అనగా గ్రుడ్డివారినిగా ప్రవర్తింపజేయుచు అధిక కష్ట దుఃఖముల ననుభవించువారినిగా జేయుచున్నారు. ఈ అధ్యాయమున 12 వ శ్లో.లో చెప్పబడినటుల అన్యాయ మార్గమున అనగా భగవంతులను పేరులతో ప్రజలను మోసగించి వారిని గ్రుడ్డివారినిగా ప్రవర్తింపజేయుచు వారినుండి ధనమును దోచుకొని జీవించుచున్నారు. వీరు అస్థికులు. వీరు ఈ అధ్యాయమున 7 వ శ్లో.లో చెప్పబడినటుల ప్రవృత్తి నివృత్తి మార్గముల నెరుగని అసుర గుణములు గలవారు. వీరు నివృత్తి ప్రవృత్తి మార్గముల నెరిగి నివృత్తి మార్గమున ప్రవర్తించు విజ్ఞానముతో నున్న జ్ఞానము (జ్ఞాన విజ్ఞానములు) కలవారు కాదు. అందువలన వీరిని కామ రాగ ద్వేషాది గుణములు భగవంతులను పేరులతో అవ్యక్తముగ ప్రవర్తింపజేయుచున్నవి. వీరిద్వారా అనేకులను అవ్యక్తముగ ప్రవర్తింపజేయుచున్నవి.

జ్ఞాన విజ్ఞాన భావములు (గుణములు) అనాదిగాయై యున్నవికాని, దైవము నుండి వచ్చినవి కావు. దైవములేదు. దైవ సంపదయని వ్రాసినది కల్పితము. మాయయందుండి వచ్చినవనిన కామ రాగద్వేషాది గుణములను, జీవుల స్వభావమను గుణమును అసుర సంపదయని వ్రాసినారు. కాని అసురయను రాక్షసి లేదు. రాక్షసులును లేరు.

శ్లో॥ కామమాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచి
వ్రతాః ॥ 10

తా. వారు మితిలేని కోరికల నాశ్రయించి దంభ, మాన, మదములతోగూడినవారలై మోహమువలన అయోగ్యవృత్తుల నవలంబించి అపవిత్ర వ్రతాచరణము గలవారలై ప్రవర్తించుచున్నారు.

శ్లో॥ చింతామపరిమేయాం చ ప్రళయాంతాముపాశ్రితాః।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః॥ 11

శ్లో॥ ఆశాపాశ శతైర్బద్ధాః కామ క్రోధపరాయణాః।
ఈహంతే కామభోగార్థమన్యాయేనార్థ సంచయాన్॥ 12

తా. కామ భోగముల ననుభవించుటకంటె ఉత్తమమైనది వేరొండు లేదను నిశ్చయము గలవారై, ప్రళయాంతమువరకు విడువని పరిమితిలేని ప్రపంచచింత నాశ్రయించి, అనేకవిధములగు ఆశాపాశములచేత బంధింపబడి కామ క్రోధగుణములు ననుసరించి కామ భోగముల ననుభవించుటకు అన్యాయమార్గమున ధనమును సంపాదింపగోరుచున్నారు.

వ్యా. వీరు ఈశ్వరుడు, అనేక భగవంతులు ఉన్నారని ప్రజలను మోసగించి వారినుండి ధనమును అన్యాయ మార్గమున దోచుకొను ఆస్తికులు.

శ్లో॥ ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథం।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్॥ 13

తా. ఇప్పుడు నాకు ఈ ద్రవ్యము లభించినది. నా మనోరధమును పొందబోవుచున్నాను. ఇప్పుడీ ఆస్తి యున్నది. ఈ ధనముకూడ మరల నాకు రాబోవుచున్నది.

శ్లో॥ అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ 14

తా. ఈ శత్రువు నా చే హతము చేయబడినాడు. ఇతర శత్రువులనుగూడ హతము చేసెదను. నేను ఈశ్వరుడను. నేను భోగిని. నేను సిద్ధుడను. బలవంతుడను, సుఖిని.

శ్లో॥ ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః 15

తా. నేను ధనాఢ్యుడను. గొప్పవంశమున పుట్టినవాడను. నాతో సమానుడు అన్యుడెవడు గలడు? యజ్ఞములు చేసెదను, దానమిచ్చెదను, సంతోషించెదను అని అజ్ఞానముచే మోహితులైనవారును,

శ్లో॥ అనేక చిత్త విభ్రాన్తా మోహజాల సమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥ 16

తా. అనేక చిత్త విభ్రాంతులు గలవారును, మోహ జాలమనెడి వలలో చిక్కినవారును, కామభోగముల యందాసక్తి గలవారునై అసహ్యమగు నరకమందు పడుచున్నారు.

శ్లో॥ ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః।
యజన్తే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్॥ 17

తా. వారు తమ్ము తామే పొగడుకొనుచు, స్తబ్ధతగానుండి ధన, మాన, మదములతో గూడినవారై దంభముతో విధి పూర్వకముగ ననుసరింపక, పేరునకు మాత్రము యజ్ఞములను చేయుదురు.

శ్లో॥ అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం చ
సంశ్రితాః ।
మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః॥18

తా. దురహంకారమును, బలమును, గర్వమును, కామమును, కోపము నాశ్రయించినవారై యితర దేహములందుండెడి ఆత్మయగు నన్ను అసూయాపరులై ద్వేషింతురు.

శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు॥ 19

తా. అట్లు ద్వేషించుచున్న క్రూరులను, అనాచారులునగు నరాధములను, నేను ఎల్లప్పుడు సంసారములయందు అసుర యోనులయందు జన్మించునట్లు చేయుచున్నాను.

వ్యా. ఇతర దేహములయందుండెడి ఆత్మయగు నన్ను అని కృష్ణుడు చెప్పినటుల యిందు వ్రాసినది 8 వ అ. 18, 19 శ్లో.లలో చెప్పబడినటుల మాయయందుండి వచ్చి మాయయందే కలియుచు, మరల వచ్చుచు తిరుగుచుండు జీవుల స్వభావమును. ఇది ఈ అధ్యాయమున 5వ శ్లో.లో కర్మబంధమును కలుగజేయునవి అసుర సంపదయని చెప్పబడిన అసుర గుణములలోని జీవుల స్వభావమను అసుర

గుణము. ఈ అసుర గుణము కృష్ణుడను జీవుడు కాదు. ఈ స్వభావము నెరిగిన విజ్ఞానము గలవాడు ఇది తనకును సమస్త జీవులకును ఉన్న సహజ స్వభావము (గుణము) అని ఎరిగియున్నాడు. అందువలన వాడు 'ఈశ్వరుడు లేడు, ఆత్మలేదు' అని సర్వము నెరిగి చెప్పును. నేను నశించని ఆత్మ (స్వభావము) గలవాడనని 4 వ అ. 6 వ శ్లో.లో ఉన్నది. కృష్ణుడు తన ఆత్మ అనిన స్వభావము కృష్ణుడు కాదు. కృష్ణుడను జీవుని స్వభావమునె ఆత్మయని వ్రాసినారు. అంతియేకాని,ఆత్మ లేదు. సర్వజీవులకును ఉన్న స్వభావమును ఆత్మయగు నన్ను దూషించుచున్నారని 18 వ శ్లో.లో ఉన్నదియును, అటుల దూషించు నరాధములను అసుర యోనుల యందు జన్మించునట్లు జేయుచున్నానని 19 వ శ్లో.లో ఉన్నదియును అసుర గుణములు గలవారి కల్పితమే కాని కృష్ణుడు చెప్పినది కాదు.

రాముని జన్మయందు వాలిని చంపిన కర్మవలన తన స్వభావముచేత బోయ వానిద్వారా చంపబడిన కృష్ణుడు ఇతర దేహములయందున్న "ఆత్మయగు నన్ను" దూషించువారిని అసుర యోనులయందు జన్మించునట్లు చేయుచున్నానని ఎట్లుచెప్పును, ఇవి కల్పితమేకాని యథార్థము కాదు.

శ్లో॥ ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని।
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం
గతిమ్॥ 20

తా. అర్జునా! అసుర యోనులయందు జన్మించిన మూఢులు నన్నుపొందక ప్రతి జన్మమునందును అంతకంటె అధమగతిని పొందుచున్నారు.

వ్యా. నన్ను అనగా, ఇతర శరీరములయందున్న "నన్ను" పొందక యను నది మాయయందుండి వచ్చిన సర్వజీవులకును ఉన్న స్వభావమును. దీనినిపొందుట యనునది లేదు. దీనినిపొందక అధమగతిని పొందుట యనునదియును లేదు. అజ్ఞానులును, జ్ఞానము గలవారును వారి సంస్కారము ననుసరించి వారి స్వభావమువలన జన్మించుచున్నారు. అసుర యోనులయందు జన్మించిన వారు మూఢులని, నన్ను పొందక ప్రతిజన్మమునందును అంతకంటె అధమగతిని పొందుచున్నారని ఈశ్లోకము నందున్నది వ్రాసినవారి తప్పు వ్రాత.

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః।
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేత త్త్రియం త్యజేత్॥

తా. కామము, క్రోధము, లోభము అను మూడు విధములును నరక ద్వారములు. వీనివలన ఆత్మ (జీవునకు) నాశము (కష్టములు) కలుగును. అందువలన ఈ మూడింటిని విడువవలెను.

వ్యా. కామ, క్రోధ, లోభములు నరక ద్వారములు అనగా జీవులకు అనేక కష్ట దుఃఖములను కల్గించునవి. అందువలన ప్రతి మానవుడును ఈ గుణములచేత విడువబడినవాడు కావలెను. అంతియేకాని, ఈ గుణములను నిగ్రహించుటయనునది యథార్థము కాదు. ఇంద్రియములను (గుణములను) నిగ్రహించవలెనని ఈ గీత యందు ఎచ్చట వ్రాసినను యథార్థము కాదు. ఈ గుణములు చేయునవి నరకద్వార ములు. ఇవి అసురసంపద కర్మబంధమును కలుగజేయునవియని ఈ అధ్యాయమున 5 వ శ్లోకములో చెప్పబడిన రాగ, ద్వేషాది గుణములలోనివి. అందువలన ఈ గుణములను విడువవలెను.

శ్లో॥ ఏతైర్విముక్తః కౌన్తేయ తమోద్వారై స్త్రిభిర్నరః।
ఆచరత్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాంగతిమ్॥ 22

తా. అర్జునా! నరక ద్వారములైన ఈ మూడు గుణములచేత విడువబడిన నరుడు తనకు శ్రేయస్సు నొనగూర్చునట్టి కర్మను ఆచరించుచున్నాడు. అందువలన పరమగతిని (పరమపదమును) పొందుచున్నాడు.

వ్యా. జ్ఞానము గలవారికి జ్ఞానముద్వారా పరమపదముగా ఉన్న పరమ తేజస్సు కాన్పించినపుడు వారు విజ్ఞానమువలన నరకద్వారములగు ఈ మూడు గుణములచేత విడువబడినవారై వారి స్వభావము ప్రవర్తించు సంస్కార కర్మలయందు నిష్కామ భావము, సమత్వబుద్ధి నిత్యసత్వము, పవిత్ర ప్రేమ భావములతో ప్రవర్తింపబడుచు కర్మరహితులైన తదుపరి పరమపదమును జ్ఞానముద్వారా చూచుచు, జ్ఞానముద్వారానే చేరుచున్నారు. కర్మరహితులగుటయేగాని, తనకు శ్రేయస్సు నొనగూర్చు కర్మ నాచరించుట యనునది కాదు.

శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిమ్॥ 23

తా. ఎవడు శాస్త్రవిధిని విడిచి యిచ్ఛ వచ్చినటుల ప్రవర్తించుచున్నాడో వాడు సిద్ధిని బొందడు. సుఖమును బొందడు. పరమపదమును జేరడు.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. జ్ఞాన, విజ్ఞానములు గలవారి సాంగత్యమున, వారి ద్వారాగాక, వ్రాయబడిన శాస్త్రములవలన కర్మబంధితులగుదురు. అంతియేగాని జ్ఞానమును పొందలేరు. పరమపదమును చేరలేరు.

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి॥ 24

తా. శాస్త్రములను చదువుటవలన కార్యాకార్యములు నిర్ణయము చేయుటయందు నీకు శాస్త్రము ప్రమాణమగును. శాస్త్రమునందు చెప్పబడిన విధము నెరిగి, ఈ ప్రపంచమునందు కర్మ చేయుట కర్హుడవగుదువు.

వ్యా. పరమపదమును చూచు జ్ఞానము, సర్వమును ఎరుగు విజ్ఞానము అను కన్నులు శాస్త్రములయందు లేవు. అందు దొరకవు. శాస్త్రములు చదివి ప్రవర్తించునది రాగ ద్వేషాది ప్రకృతి గుణములు. ఈ గుణములు శాస్త్రములు చదివి ఎట్లు ప్రవర్తించినను కర్మబంధములు గలవియే యగును. వేద శాస్త్రములు ద్వంద్వములగు సుఖ దుఃఖములు కలిగించునవి యని 2 వ అధ్యాయము 45 వ శ్లో.లో ఉన్నది.

ఈఅధ్యాయమునందు చెప్పబడినవి దైవసంపద అనగా జ్ఞాన, విజ్ఞాన భావములు. విజ్ఞానముయొక్క నిష్కామము, సమత్వబుద్ధి, నిత్యసత్వము, పవిత్ర ప్రేమాదిభావముల ప్రవర్తన గలవారిని విజ్ఞాన ప్రపంచమని, అసురసంపద అనగా రాగ, ద్వేషాహంకార కర్తృత్వ వాంఛాది ప్రకృతి గుణములు గలవారిని అజ్ఞాన ప్రపంచమని ఈ ప్రపంచము రెండు విధములుగ ఉన్నదని చెప్పవలయును. ఎవరు, ఏ గుణముల చేత ప్రవర్తింపబడుచున్నారో, వారు వారి ప్రవర్తనద్వారా తెలియబడుదురు. ప్రవర్తనయే యథార్థమైన ప్రమాణము. ఈ అధ్యాయమున నరక ద్వారములగు కామ, క్రోధ, లోభములను విడువవలయునని 21 వ శ్లోకమునందును, ఈ గుణములచేత విడువబడినవాడు విధిగా చేయవలసిన కర్మలయందు విధిగా ప్రవర్తింపబడుచు కర్మరహితుడై పరమపదమును చేరునని 22 వ శ్లోకమునందును చెప్పబడి యున్నదియే యథార్థము. మానవులయందున్న ప్రకృతి (మాయా) గుణములు శాస్త్రములను చదివి, వారు సుఖదుఃఖముల ననుభవించుటకు కారణమగు కర్మలయందు ప్రవర్తించు

చుండును. ఇంకననేకులకు అనేక విధములుగ చెప్పి. యింక నెందరినో ఈ తప్పు మార్గమున ప్రవర్తింపజేయుచుండును. గ్రుడ్డివారు గ్రుడ్డివారి నాశ్రయించినచో అందరును గోతిలో బడునటుల, యథార్థమును ఎరుగని, ఎరుగలేని గ్రుడ్డిపైన అసుర గుణములు గలవారు చెప్పునవి నమ్మి అనేకులు తప్పుమార్గమున ప్రవర్తించుచున్నారు ధ్యానము, తపస్సు, నామస్మరణ, యజ్ఞములు, భజనలు, మంత్రములు, గీతా పారాయణ, వేద పారాయణ మొదలగునవి యన్నియును రాగ, ద్వేషాదిగుణములఅవ్యక్త ప్రవర్తనలు. వేదములయందు ద్వంద్వములగు సుఖ, దుఃఖములను కలిగించు కామ, రాగ, ద్వేషాది త్రిగుణముల కర్మలవరకే యున్నదని 2 వ అ. 45 వ శ్లో.లో ఉన్నది. వేదములు చదివి అందున్న అర్థమును పువ్వులవలె అందముగా చెప్పుఅజ్ఞానుల పలుకులు విని భోగముల నాశించి కర్మలలో చిక్కు భోగులకు నిశ్చయ బుద్ధి కలుగదని 2 వ అ. 42, 43, 44 శ్లో.లలో ఉన్నది. చెట్టును ఆకులు పోషించునటుల వేదములు కోరికయను అశ్వత్థ వృక్షమును పోషించుచున్నవని 15 వ అ. 1 వ శ్లో.లో ఉన్నది. వేదాది శాస్త్రములవలన ప్రవృత్తి మార్గము సంభవించును గాని, నివృత్తి మార్గము సంభవించదు. పేరు దైవాసుర సంపద్విభాగ యోగము. అనగా జ్ఞాన, విజ్ఞాన భావముల (గుణముల) ప్రవర్తన, కామ, రాగ, ద్వేషాదిగుణముల ప్రవర్తన. ఇందు వ్రాసినది అసుర సంపదయనిన కామ, రాగ, ద్వేషాదిగుణముల ప్రవర్తన.



# గీతా వ్యాఖ్యానము

## శ్రద్ధాత్రయ విభాగ యోగము

## 17 వ అధ్యాయము

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

**శ్లో॥ యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః।**
**తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః॥1**

తా. కృష్ణా ! ఎవరు శాస్త్రవిధిని విడిచి శ్రద్ధ గలవారై పూజింతురో, వారల యొక్క ప్రవర్తన ఎట్టిది? అది సాత్త్వికమా, రాజసమా, తామసమా ?

వ్యా. 16 వ అధ్యాయమునందు చివర 23, 24 శ్లోకములలో శాస్త్రవిధిని విడిచి కర్మ చేయువారు సుఖమును పొందరు. పరమపదమును చేరరని వ్రాసి, శాస్త్రములయందు వ్రాసియున్న విధమునగాక, శ్రద్ధతో ధ్యానము, ఆరాధన, యజ్ఞములు, విగ్రహములను పూజించుట మొదలగునవి చేయువారి ప్రవర్తన సాత్త్వికమా రాజసమా, తామసమా యని అర్జునుడడిగినటుల యిందు వ్రాసినారు. శాస్త్రవిధినను సరించినను, అనుసరించక పోయినను, భగవంతుడని విగ్రహములను పూజించుట, ధ్యాన, నామస్మరణ, యజ్ఞ, దాన, తపస్సులు చేయుట మొదలగునవి చేయు వారి ప్రవర్తన హెచ్చు తగ్గులుగా సాత్త్విక, రాజస, తామసములతోనుండును. శాస్త్రవిధిని విడిచి జ్ఞాన విజ్ఞానములు గలవారి సాంగత్యము చేయువారి ప్రవర్తన సాత్త్విక,రాజస తామస గుణముల సంబంధములేనిదై, విజ్ఞానము గలవారి సంబంధమున విష్వా- మాది పవిత్ర ప్రేమభావములసంబంధముతోనుండును. త్రిగుణములు గలవారియందు త్రిగుణముల కర్మలు హెచ్చు తగ్గులుగా నుండుచుండును. అర్జును డడిగినట్లుగా వ్రాసినది త్రిగుణముల సంబంధమేగాని, విజ్ఞాన సంబంధమైన పవిత్ర ప్రేమ భావ

ముల ప్రవర్తన కాదు. శాస్త్రములను చదివి అవ్యక్తముగా ప్రవర్తించుటకొరకును త్రిగుణముల సంబంధమైన శాస్త్రముల ననుసరించుటకొరకును ఈ అధ్యాయమును వ్రాసినారు.

శ్రీ భగవానువాచ :- కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥ 2

తా. ప్రాణులకు శ్రద్ధ యనునది స్వభావమువలననే కలిగినది. అది సాత్త్విక రాజస, తామసములతో మూడు విధములు అగుచున్నది వినుము.

వ్యా. మానవులకు శ్రద్ధయనునది వారియందున్న కామాది గుణముల కర్మ ననుసరించి వారి స్వభావమువలన కలుగుచున్నది. ఇది సాత్త్విక, రాజస తామసము లతో కూడి మూడు విధములుగను ఉండును.

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।
శ్రద్ధామయోఽయం పురుషో యోయచ్ఛ్రద్ధస్స ఏవసః3

తా. అర్జునా! సమస్త ప్రాణులకును శ్రద్ధ యనునది సత్వరూపమున కల్గుచున్నది. పురుషుడెట్టి శ్రద్ధ గలవాడై యున్నాడో అట్టి శ్రద్ధతోకూడిన సత్వముగల వాడగుచున్నాడు.

వ్యా. సర్వజీవులకును సత్వగుణ కర్మవలన సాత్విక శ్రద్ధయును, సాత్విక శ్రద్ధవలన అట్టి సత్వగుణమును అధికమగుచుండును. ఈ విధముగా, ఏ గుణము కర్మవలన ఆ గుణము శ్రద్ధయును, అట్టి శ్రద్ధవలన ఆ గుణమును అధికమగు చుండును.

శ్లో॥ యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజన్తే తామసాజనాః॥ 4

తా. సత్వగుణము గలవారు దేవతలను, రజోగుణము గలవారు యక్షరాక్షసులను, తమోగుణము గలవారు ప్రేతములను, భూతగణములను ఆరాధించుచున్నారు.

శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః।
దంభాహంకారసంయుక్తాః కామ రాగ బలాన్వితాః॥ 5

శ్లో॥ కర్శయన్తశ్శరీరస్థం భూతగ్రామమ చేతసః।
మాం చైవాంతశ్శరీరస్థం తాన్విద్ధ్యాసుర
నిశ్చయాన్॥ 6

తా. ఏ జనులు, దంభ అహంకారములతోకూడినవారును, కామ, రాగముల బలముతో నున్నవారునై శాస్త్రవిధి ననుసరించక ఘోర తపస్సు చేయుచున్నారో, అట్టి మూఢులు శరీరములతోనున్నట్టి భూత సముదాయమును, ఆ శరీరముల యందున్న నన్నును కృశింప జేయుచున్నారు. అట్టివారిని అసుర నిశ్చయము గల వారినిగా నెరుంగుము.

వ్యా. శాస్త్రవిధి ననుసరించినను, అనుసరించకపోయినను ఈ మూడు గుణముల శ్రద్ధయును జీవులను సుఖదుఃఖములయందు బంధించుచున్నది. ఈ గుణములచేత కృశింప జేయుచున్నారని ఇందున్నది. శరీరములతోనున్నట్టి భూత సముదాయమును జీవులను, ఆ శరీరములయందున్న "నన్నును" అనిన కృష్ణుడనునది జీవుల స్వభావమును. దీనిని కృశింపజేయుచున్నారనునది యథార్థము కాదు.

శ్లో॥ ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు॥ 7

తా. సమస్త ప్రాణులకు ఆహారము మూడు విధములుగ ఇష్టమై యున్నది. ఆ విధముగనే యజ్ఞము, తపస్సు, దానము మూడు విధములుగ నున్నవి. వాని భేదములను చెప్పెదను వినుము.

శ్లో॥ ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః।
రస్యాస్స్నిగ్ధాః స్థిరా హృద్యాఆహారాస్సాత్త్వికప్రియాః॥ 8

తా. ఆయుస్సును, సత్వబలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రీతినివృద్ధి పొందించునవియు, రసవంతములైనవియు, చమురు గలవియు, స్థిరముగ నిలుచునవియు, హృదయమున కింపైనవియునగు ఆహార పదార్థములు సత్వగుణ మధికము గలవారికి ప్రియములై యుండును.

శ్లో॥ కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకాఽమయప్రదాః॥ 9

తా. చేదు, పులుపు, ఉప్పు, కారము, వేడినికలిగించునవియు,ఘాటుగలవియు సారము లేనివియు, దాహమును గలిగించునవియు, దుఃఖమును, శోకమును కలిగించునవియునగు ఆహార పదార్థములు రజోగుణ మధికము గలవారి కిష్టములై యుండును.

శ్లో॥ యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్॥10

తా. చల్లారినదియు, రసము లేనిదియు, దుర్వాసన గలదియు, చలిదియు, ఎంగిలిదియునగు అపవిత్ర పదార్థములు తామసగుణ మధికము గలవారికి ప్రియమగుచున్నవి.

వ్యా. మానవులకు వారి సంస్కారము ననుసరించి ఆహార పదార్థములు ఇష్టము లగుచున్నవి.

శ్లో॥ అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధి దృష్టో య ఇజ్యతే।
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః॥ 11

తా. విధి పూర్వకమగు యజ్ఞము చేయదగినదియని, మనస్సును సమాధాన పరచి ఫలాపేక్ష లేని వారిచేత చేయబడు యజ్ఞము సాత్వికమైనది.

శ్లో॥ అభిసంధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్।
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్॥ 12

తా. అర్జునా! ఫలాపేక్షతోను, దంభముతోను చేయబడు యజ్ఞము రాజస యజ్ఞమని యెరుంగుము.

శ్లో॥ విధిహీనమసృష్టాన్నం మంత్రహీనమదక్షిణం।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥ 13

తా. విధ్యుక్తము కానిదియు, అన్నదానము లేనిదియు, మంత్రము లేనిదియు దక్షిణ యివ్వనిదియు, శ్రద్ధా భక్తితో చేయబడనిదియునగు యజ్ఞము తామస యజ్ఞమని చెప్పుదురు.

వ్యా. సాత్త్విక, రాజస, తామస గుణములు గలవారెవ్వరిచేతనైనను స్వంతముగా చేయబడు యజ్ఞములు ఫలాపేక్షలేనివి గావు. ఎందుచేతననగా, ఈ త్రిగుణములు అహంకార కర్తృత్వములు గలవి. కర్మబంధములను, కర్మఫలములను గలిగించునవి. ఈ గుణములు గలవారు విజ్ఞానము గలవారి సాంగత్యమున వారు చెప్పినటుల చేయు కర్మయే ఫలాపేక్షలేని కర్మ. ఇందు మంత్రములు, అన్నదానములు, దక్షిణలు, ఇంకేవియును లేవు. ఏవియును చేయనవసరము లేదు. యజ్ఞములు యథార్థములు కాదు.

శ్లో॥ దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచమార్జవం।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే॥ 14

తా. దేవతలను, బ్రాహ్మణులను, జ్ఞానులను పూజించుటయు, పవిత్రతయు, మంచి ప్రవర్తన, బ్రహ్మచర్యము ననుసరించుట, హింస చేయకుండుట, ఇవి శరీరముతో చేయవలసిన తపస్సని చెప్పుచున్నారు.

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥

తా. ఉద్వేగకరముకానిదియు, సత్యమైనదియు, ప్రియముగను, హితముగ నుండునట్టిదియునగు వాక్యమును అధ్యయనము చేయుట వాచక తపస్సని చెప్పబడుచున్నది.

శ్లో॥ మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః।
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే॥ 16

తా. మనస్సుయొక్క నిర్మలత, సౌమ్యభావము, మౌనము, ఆత్మనిగ్రహము గలిగియుండుట, శుద్ధమైన భావము ఇవి మానసిక తపస్సని చెప్పబడుచున్నవి.

వ్యా. ఇవి త్రిగుణములలోని సత్వగుణ కర్మలు. మనస్సనునది వేరుగా లేదు. మానసిక తపస్సు లేదు. ఆత్మ లేదు. ఆత్మ నిగ్రహమనునది లేదు.

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః।
అఫలాకాంక్షిభిర్యుక్తైస్సాత్త్వికం పరిచక్షతే॥ **17**

తా. ఫలమును కోరక చేయువారిచేత, పరమశ్రద్ధతో చేయబడిన పైన చెప్ప బడిన మూడు విధములగు తపస్సులు సాత్విక తపస్సులని చెప్పుచున్నారు.

వ్యా. పైన చెప్పబడినవి చేయు కర్మలవలన కొంచెము సుఖముగను,సంతో షముగను ఉండును. ఈ సత్వగుణము ఏ విధముగను కోరికలేక చేయునది కాదు. కోరికలేక కర్మచేయుట త్రిగుణములకుచేతకాదు. ఇవి సత్వగుణ కర్మలేగాని, తప స్సనునది లేదు.

శ్లో॥ సత్కారమానపూజార్థం తపో దంభేన చైవ యత్।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్॥ **18**

తా. ఈ లోకమునందు ఇతరులచేత సత్కరింపబడుటకును, గౌరవింపబడుట కును, పూజింపబడుటకును, దంభముచేత చేయబడు తపస్సు రాజస తపస్సని చెప్ప బడుచున్నది.

శ్లో॥ మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః।
పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్॥ **19**

తా. ఏ తపస్సు ఇతరుల నాశముకొరకు మూఢమైన పట్టుదలతో తనను కష్ట పెట్టుకొనుట చేతనైనను చేయబడుచున్నదో అది తామస తపస్సని చెప్పబడు చున్నది.

శ్లో॥ దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్

తా. దేశ, కాల, పాత్రలయందు ఏ దానము చేయదగినదో ఎరిగి, ప్రత్యుప కారము చేయలేని వారికివ్వబడు దానము సాత్విక దానమని చెప్పబడుచున్నది.

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥ 21

తా. ప్రత్యుపకారార్థమై, మరల ఫలము నుద్దేశించిగాని, దుఃఖముతో గాని ఇవ్వబడు దానము రాజస దానమని చెప్పబడుచున్నది.

శ్లో॥ అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్॥ 22

తా. దేశ, కాల పాత్రములు గుర్తెఱుంగకుండ నిచ్చుదానము, సత్కారము లేక, తిరస్కార భావముతో ఇవ్వబడు దానము తామస దానమని చెప్పబడుచున్నది.

వ్యా. ఈ అధ్యాయమునందు 1 నుండి 22 వ శ్లోకమువరకు ప్రకృతి త్రిగుణములను గురించి వ్రాసియున్నది. ఇవియన్నియు కర్తృత్వము గలవియును,సుఖ, దుఃఖములనునట్టి కర్మబంధము గలిగించునవియునై యున్నవి.

శ్లో॥ ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥23

తా. బ్రహ్మము ఓం, తత్, సత్ అని మూడు విధములుగా నిర్దేశించిచెప్ప బడినది వానిచేత బ్రాహ్మణులును, వేదములును, యజ్ఞములును పూర్వము నిర్మింప బడినవి.

వ్యా. రాత్రి పగలు గలదియని 8వ అ. 18, 19 శ్లో॥లలోను, ఈ ప్రపంచ ముతో నశించునట్టిది యని 20వ శ్లో॥లోను చెప్పబడిన బ్రహ్మ అనగా మాయా భ్రమచేత మాయయందుండి శబ్దముతోనున్న యీ ప్రపంచము సృష్టింపబడినది. తరువాత మానవులయందున్న భ్రమచేతనే వేదములు, అందు ఓమ్ తత్, సత్ అను శబ్దములతో చేయు యజ్ఞ, దాన, తపస్సులు నిర్మింపబడినవి. ఇవి చేయువారు బ్రాహ్మణులని నిర్మించిరి. ఈవిధముగ మాయా భ్రమచేత మానవులద్వారా నిర్మింప

బడినవి. పరమపదముగా ఉన్న పరమ తేజస్సును బ్రహ్మము అని బ్రహ్మము ఓమ్ తత్, సత్‌లుగా చెప్పబడుచున్నదని, ఆ బ్రహ్మముచేత బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞ, దాన, తపస్సులు నిర్మింపబడినవని ఈ శ్లోకమునందు తప్పుగా వ్రాసినారు. ఇట్లు అనేకులు చెప్పుచున్నారు. అందువలన అనేకులు 16వ అ, 5వ శ్లో॥లో కర్మ బంధమును కలుగజేయునవి అసురసంపదయని చెప్పబడిన కామ, రాగ, ద్వేషాది గుణములచేత చేయబడు యజ్ఞ, దాన, తపస్సులవలన కర్మబంధితులై సుఖ, దుఃఖముల ననుభవించు వారగుచున్నారు.

శ్లో॥ తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః।
ప్రవర్తంతే విధానోక్తాస్సతతం బ్రహ్మవాదినామ్॥ 24

తా. అందువలన, వేదములయందు చెప్పబడిన యజ్ఞము, దానము, తపస్సు లనెడి కర్మలయందు భ్రమ గలవారు వానిని వేదములయందు చెప్పబడినటుల ఎప్పుడును ఓంకారము నుచ్చరించి భ్రమచేతనే ప్రారంభించుచున్నారు.

వ్యా. ఇవి భ్రమ గలవారి భ్రమచేతనే నిర్మింపబడినవి. కర్మబంధములు గలవి. 16 వ అ. 5 వ శ్లో.లో అసుర సంపదయని చెప్పబడిన త్రిగుణముల కర్మలు.

శ్లో॥ తదిత్య నభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః॥ 25

తా. మోక్షాపేక్ష గలవారు నానావిధములైన యజ్ఞములు, తపస్సులు, దానములు ఫలమును కోరకయే "తత్" నుచ్చరించి చేయుచున్నారు.

శ్లో॥ సద్భావే సాధుభావే చ సదిత్యే తత్ప్రయుజ్యతే।
ప్రశస్తే కర్మాణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే॥ 26

తా. అర్జునా! సత్ అనునది సద్భావమును, సాధుభావమును తెలుపుట యందు ప్రయోగింపబడుచున్నది. అందువలన ప్రశస్తమైన కర్మయందును సత్ అను శబ్దము ప్రయోగింపబడుచున్నది.

శ్లో॥ యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే।
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే॥ 27

తా. యజ్ఞ, దాన, తపస్సులందుగల స్థితి సత్ అని చెప్పబడుచున్నది. దాని కొరకు చేయు కర్మయును సత్ అనియే చెప్పబడుచున్నది.

వ్యా. యజ్ఞ, దాన, తపస్సులయందుగల స్థితి యథార్థమైన సత్ అనబడదు. వేదములయందు చెప్పబడిన కామ, రాగ, ద్వేషాది, సత్వ, రజ స్తమోగుణములతో ఓం, తత్, సత్ అని ఉచ్చరించి చేయబడిన యజ్ఞములు, తపస్సులు, దానములు సుఖదుఃఖముల ననుభవించు కర్మబంధములు గలవియై కర్మఫల మనుభవింపజేయు నవి. ఇవి అవ్యక్త ప్రవర్తనలు.

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ॥ 28

తా. అర్జునా! అశ్రద్ధతో చేయబడు హోమము, దానము, తపస్సు, ఇతర కర్మలన్నియును అసత్ అని చెప్పబడుచున్నవి. ఇవి యిహలోకమునందుగాని పర లోకమునందుగాని సుఖము నిచ్చునవి గావు.

వ్యా. శ్రద్ధతో చేయు కర్మలవలన వారికి సుఖమును, కష్టమును హెచ్చు తగ్గులుగా సంభవించును. హోమ తపస్సులవలన సుఖమేమియును రాదు గాని, ఆ హోమములయందు బడి చచ్చెడి ప్రాణుల కర్మ సంభవింప వచ్చును. అందువస్తువు లను వేసి వృధాగా పాడుచేయుటవలనను పాపమును, నష్టమును సంభవింపవచ్చును ఈ అధ్యాయమునందు వ్రాసిన ఓం, తత్, సత్ అని ఉచ్చరించి చేయు యజ్ఞ దాన తపస్సులు 16 వ అ. 7 వ శ్లో.లో చెప్పబడిన నివృత్తి ప్రవృత్తి మార్గముల నెరు గని అసుర గుణములు గలవారిచే నిర్మింపబడినవి. అసుర గుణములు గలవారి ప్రవర్తనలు.

ఈ అధ్యాయమునందు శాస్త్రములను అనుసరించి ప్రవర్తించు త్రిగుణముల కర్మలను వ్రాసియున్నారు. ఇవి సుఖదుఃఖముల ననుభవింపజేయునవి.

భ్రమయను గుణమును బ్రహ్మము అని, ఓం, తత్, సత్ అను శబ్దములు బ్రహ్మము నందున్నవని రాగద్వేషాది గుణములు గలవారి భ్రమచేత నిర్దేశింప బడినవి. ఇది శబ్దముగల భ్రమయను గుణమేగాని శబ్దమును, గుణములును, ఆకారమును లేని పరమపదముగా ఉన్న పరమతేజస్సు కాదు. పై విధముగా యజ్ఞ, దాన, తపస్సులను మానవులద్వారా వ్రాసి వానికి వేదములని కల్పించినది. మానవులద్వారా యజ్ఞములు చేయుచు వారిని బ్రాహ్మణులని కల్పించినది. ఈ వృత్తివలననే వారిని పూర్వము బ్రాహ్మణులనినారు గాని, ఆ శరీరములయందున్న జీవులు బ్రాహ్మణులు కాదు. ఆశరీరములుబ్రాహ్మణులు కాదు. ఇప్పుడు అనేకులు వేదముల ననుసరించి యజ్ఞ, దాన, తపస్సులను ఆ విధముగనే చేయుచున్నారు. వీరందరును భ్రమచేతనే త్రిగుణములద్వారా యిటుల చేయబడుచు అధిక కోరికలు గలవారగుచున్నారు. వీని వలన బంధితులై సుఖ దుఃఖముల ననుభవించు వారగుచున్నారు. వేదములయందున్న యజ్ఞములయందును, కర్మలయందునుఅజ్ఞానమగు భ్రమను పెంచుభ్రమయేయున్నది. అంతియెగాని నివృత్తి ప్రవృత్తి మార్గముల నెరిగి భ్రమ రహితులను జేసి నివృత్తి మార్గమున ప్రవర్తించు విజ్ఞానము లేదు. విజ్ఞాన సంబంధమైనదేదియును లేదు.

వేదములను వ్రాసినటులనే ఉపనిషత్తులని, బ్రహ్మ సూత్రములని యింక ననేక విధములుగా అనేక శాస్త్రములను వ్రాసియున్నారు. ఎవడు శాస్త్రవిధిని విడిచి యిచ్ఛ వచ్చినటుల ప్రవర్తించుచున్నాడో వాడు సిద్ధిని పొందడు. సుఖమును పొందడు. పరమపదమును చేరడని 16 వ అ. 23 వ శ్లో.లోను, శాస్త్రములను చదువుటవలన కార్యా కార్యములు నిర్ణయములు చేయటయందు శాస్త్రము నీకు ప్రమాణమగునని, శాస్త్రమునందు చెప్పబడిన విధము నెరిగి ఈ ప్రపంచమునందు కర్మచేయుట కర్హుడవగుదువని 16 వ అ. 24 వ శ్లో. లోను వ్రాసినారు. ఇది కల్పితము.

వేద శాస్త్రములు చదివి అందలి అర్థమును పుష్పములవలె అందముగాచెప్పు చున్న పలుకులు విని భోగములను ఆశించి, అనేక విధములుగ కర్మలయందు ప్రవర్తించుచున్నారు. అజ్ఞానులగు వేదవాదుల పలుకులు నమ్మి మోసపోవు భోగులకు నిశ్చయబుద్ధి ఎట్లు కలుగును? కలుగదు అని 42, 43, 44 శ్లో.లోను, వేదములయందు సుఖ దుఃఖములకు కారణమగు విషయ సంబంధమైన కర్మలు చెప్పబడి

యున్నవి. అట్టి శాస్త్ర కర్మలను విడిచి ఆత్మ (జ్ఞానము) గలవాడవై నిత్యసత్వము (విజ్ఞానము) గలవాడవగుమని 45 వ శ్లో.లోను ఉన్నది. రాగద్వేషాది గుణములతో నున్న కోరికయను అశ్వత్థ వృక్షమును వేదములు ఆకులవలె పెంచుచున్నవని 15 వ అ. 1 వ శ్లో.లోను, అట్టి వేదములతోనున్న కోరికయను అశ్వత్థవృక్షమును వేరులతోసహా అసంగశస్త్రము అనగా నిష్కామ భావముగల విజ్ఞానముచేత నరికి వేయవలెనని 3 వ శ్లో.లోను ఉన్నది. ఈ భగవద్గీతయును, వేదాది సర్వశాస్త్రములును 12 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడినటుల అధిక దుఃఖములకు కారణమగు అవ్యక్త ఆసక్తిని (కోరికను) కలిగించి, అవ్యక్తగతిని అనగా గ్రుడ్డివారినిగా ప్రవర్తింపజేసి అధిక దుఃఖముల ననుభవించు వారినిగా చేయుచున్నవి.



# గీతా వ్యాఖ్యానము

## మోక్ష సన్యాస యోగము

## 18 వ అధ్యాయము

అర్జున ఉవాచ :_ అర్జునుడు చెప్పెను.

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుం।
త్యాగస్య చ హృషీకేశ। పృథక్కేశినిషూదన॥ 1

తా. మహాబాహో ! కేశినిషూదనా ! కృష్ణా! సన్యాసము, త్యాగముయొక్క యథార్థ స్థితులను వేరువేరుగా తెలియగోరుచున్నాను.

శ్రీ భగవానువాచ : కృష్ణుడు చెప్పెను.

శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥ 2

తా. కామ్య కర్మలను వదలుట సన్యాసమని పండితు లెరిగియున్నారు. విచక్షణ గలవారు సర్వ కర్మ ఫలములను త్యజించుట త్యాగమని చెప్పుచున్నారు.

వ్యా. కామ్యము (కోరికయే) లేనివాడు సన్యాసి. అట్టివాడు చేయుసంస్కార కర్మలయందు కోరిక ఉండదు. కామ్యము లేకపోవలెను గాని చేయవలసిన కర్మలను వదలుట యనునది లేదు. కోరిక లేనివానిని సన్యాసి, జ్ఞానియని చెప్పవలెను. కోరిక గలవారు ప్రపంచ సంబంధమైన కర్మలను విడిచి అట్టి జ్ఞానులు చెప్పునటుల చేయు కర్మయే ఫలత్యాగ కర్మ యనబడును. కోరిక గలవారు కోరికతోనే గుణములచేత కర్తృత్వ ప్రయత్నములతో కర్మ చేయబడుదురు. వీరు స్వయముగా కర్తృత్వము లేక కర్మచేయుట ఉండదు. కర్మఫలమును త్యజించుటయును ఉండదు.

శ్లో॥ త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః।
యజ్ఞదాన తపః కర్మ న త్యాజ్యమితి చాపరే॥ 3

తా. కర్మలు దోషము గలవియని తలంచి త్యజింపబడదగినవని కొందరు బుద్ధిమంతులును; యజ్ఞ, దాన, తపస్సులనెడి కర్మలు విడువబడదగినవిగావని మరి కొందరును చెప్పుచున్నారు.

వ్యా. రాగద్వేషాది గుణములు గలవారు ఆ గుణములచేత స్వయముగా చేయబడు సమస్త కర్మలును, యజ్ఞ, దాన, తపో కర్మలును కర్మబంధములనునట్టి దోషములు గలవి యగుచున్నవి. అట్టి కర్మలయందు రాగద్వేషాది గుణములుండ కూడదు. అందువలన రాగద్వేషాది గుణములు లేనివారై ఉండవలెను. కర్మ చేయనిచో జీవించుటకు ఆధారము లేదు. అట్టి కర్మలు విడువదగినవి కాదు. కాని యజ్ఞములు, తపస్సులు మొదలగు భగవంతుడని చేయు సర్వకర్మలును విడువదగినవి, విడువవలయును.

శ్లో॥ నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః॥ 4

తా. అర్జునా! అట్టి త్యాగ విషయమైన నా నిశ్చయమును వినుము. త్యాగము మూడు విధములుగ నున్నదని చెప్పబడి యున్నది.

శ్లో॥ యజ్ఞ దానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥ 5

తా. బుద్ధిమంతులకు యజ్ఞ, దాన, తపస్సులు పవిత్రములైనవి. యజ్ఞ,దాన, తపోకర్మలు విడువదగినవి కావు. అవి తప్పక చేయవలసినవి.

శ్లో॥ ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ।
కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మతముత్తమమ్॥ 6

తా. అర్జునా! పైన చెప్పబడిన కర్మలు ఆసక్తిని, ఫలములను విడిచిచేయ దగినవియని ఉత్తమమైన నాయొక్క నిశ్చయమైన అభిప్రాయము.

వ్యా. ఈ 4, 5, 6 శ్లోకములు యథార్థము కాదు. ఎందుచేతననగా యజ్ఞ, దాన, తపస్సులు కర్మబంధములు గలవి. పవిత్రములైనవి కావు. చేయదగినవికావు ఇవి సంస్కారముగలవియై చేయవలసి యున్నను రాగద్వేషాది గుణములు గల వారెవ్వరును ఆ కర్మలను స్వయముగా ఆసక్తి లేకయును, కర్తృత్వము లేకయును చేయలేరు. కర్మఫలమనుభవించనివారును కారు.

శ్లో॥ నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః॥ 7

తా. నియమింపబడిన కర్మలు విడువదగినవి కావు. మోహమువలన అట్టి కర్మలయొక్క పరిత్యాగము తమోగుణ పరిత్యాగమని చెప్పబడుచున్నది.

వ్యా. నియమింపబడిన అనగా సంస్కార కర్మలను విడువవలెననినను విడువలేరు, తమోగుణ పరిత్యాగమనునది లేదు. త్రిగుణములు గలవారెవరైనను ఆ కర్మలను జ్ఞాన విజ్ఞానములు గలవారి దరిజేరి వారు చెప్పుటద్వారా చేయుటవలన కర్మఫల త్యాగులగుదురు.

శ్లో॥ దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశ భయాత్త్యజేత్।
స కృత్వా రాజసం త్యాగంనైవ త్యాగఫలం లభేత్॥ 8

తా. ఏ కర్మను దుఃఖము కలుగజేయునదియని, దేహ ప్రయాస భయము చేత విడిచి పెట్టుచున్నాడో, అది రజోగుణ సంబంధమైన త్యాగము. అట్టి త్యాగము వలన ఫలమును పొందడు.

వ్యా, సంస్కార కర్మలనెవ్వరును విడువలేరు. కోరిక గలవారు చేయు కర్మను కష్టమని విడిచినచో ఆ కర్మఫలమును పొందరు.

శ్లో॥ కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున।
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగస్సాత్త్వికో
మతః॥ 9

తా. అర్జునా! నియమింపబడిన కర్మ చేయదగినదియని ఆసక్తియును ఫలమును విడిచి చేయబడుచున్నదో, అట్టి త్యాగము సాత్విక త్యాగమని నా యభిప్రాయము.

వ్యా. నియమింపబడిన కర్మ అనగా సంస్కార కర్మను ఈ త్రిగుణములు ఆసక్తియును, ఫలమును విడిచి చేయునవి కాదు.

శ్లో॥ న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వ సమావిష్టో మేధావీ ఛిన్న సంశయః॥10

తా. సత్వగుణ మధికము గలవాడగు త్యాగి సంశయ రహితుడును, మేధావియునై అకుశల కర్మను ద్వేషింపడు. కుశల కర్మయందాసక్తుడు కాడు.

వ్యా. సత్వగుణ మధికము గలవాడైనను త్యాగి యనబడడు. సంశయరహితుడునుగాడు. వాడు సత్వగుణ సంబంధమైన మేధావి. అకుశల కర్మను ద్వేషించువి వాడును, కుశల కర్మ యందాసక్తుడుగానివాడును కాడు. ఈ 10 వ శ్లోకమునందు వ్రాసినవి ఈ త్రిగుణములు లేని నిత్యసత్వముగల విజానము గలవారి లక్షణములు.

శ్లో॥ న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే॥ 11

తా. ఎందుచేతననగా కర్మలను నిశ్శేషముగా త్యజించుట దేహధారికి శక్యము గాదు. ఎవడు కర్మఫలమును త్యజించుచున్నాడో వాడు త్యాగియని చెప్పబడుచున్నాడు.

వ్యా. పూర్వ సంస్కార కర్మవలననే దేహమును ధరించియున్నాడు. ఈ త్రిగుణములున్నంతవరకును దేహధారికి సంస్కార కర్మలను త్యజించుట శక్యము కాదు. కర్మఫలమును త్యజించుటయును శక్యముకాదు. ఎందుచేతననగా త్రిగుణములు కర్మవలన సంస్కారము. సంస్కారమువలన చేయవలసిన కర్మయును ఆ కర్మఫలమనుభవించుటయును ఉండును. కోరిక లేనివారు (ఈ త్రిగుణములు లేని వారు) సంస్కార కర్మ ననుభవించి కర్మరహితులగుదురు.

శ్లో॥ అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలం।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్॥ 12

తా. కర్మఫల త్యాగము చేయని వానియొక్క కర్మఫలము జన్మాంతరమున అనిష్టమైనదిగను, ఇష్టమైనదిగను, మిశ్రమముగను మూడు విధములు గలది యగుచున్నది. సన్న్యాసికి (కోరికయే లేనివానికి) ఎప్పుడును కలుగదు.

వ్యా. జ్ఞాన విజ్ఞానములుగల వారియందున్న విజ్ఞానమే వారి దరిజేరినవారిని ప్రకృతి సంబంధమైన కర్మలు విడుచువారినిగను, ఏ ఫలాపేక్షయును లేనివారలనుగను కర్మలయందు ప్రవర్తింపజేయును. ఇదియే కర్మ ఫలత్యాగ మనబడును. ఇందు వ్రాసినటుల త్రిగుణములు గలవారు స్వయముగా చేయు కర్మలకు కర్మఫల త్యాగము కలుగదు. వారికి కర్మఫలము కలుగుచున్నది. అది యిష్టానిష్టములుగను మిశ్రమముగను ఉండును. ఇట్లు సన్న్యాసికి ఎప్పుడును కలుగదు. సన్న్యాసి చెప్పినటుల చేయువారికిని కలుగదు. కామ, రాగద్వేషాది గుణములు లేనివాడే సన్న్యాసి.

శ్లో॥ పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే।
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥

తా. అర్జునా! సమస్త కర్మలయొక్క సిద్ధికొరకు సాంఖ్యమునందు చెప్పబడిన యిక చెప్పబోయెడు ఐదు కారణములను నా వలన వినుము.

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధం।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్॥14

తా. కర్మ సిద్ధికొరకు అధిష్ఠానం, కర్త, వేరువేరు విధములగు కరణములు వివిధములగు (వేరు వేరగు) చేష్టలును, ఐదవది దైవము అనునవి కారణములు.

వ్యా. కర్మఫలమును పొందుటకు శరీరము, జీవుడు, జీవునియందున్న రాగ ద్వేషాది ప్రకృతి (మాయా) గుణములు, ఈ గుణములు చేయు కర్మలు, ఈగుణములు చేయు కర్మలను మరల యింకొకపుడు చేయు జీవుని స్వభావమును కారణములగుచున్నవి. జీవుడు, జీవుని స్వభావమును ఈరెండింటిని దైవము, ఆత్మయని ఈ గీతయందు వ్రాసియున్నారు. అంతియెగాని దైవము లేదు. ఆత్మలేదు. జీవుడు వానియందున్న గుణములు చేయు కర్మల ననుసరించి వాని స్వభావమను గుణము మరల ప్రవర్తించు కర్మలవలన ఈ ప్రపంచమునందు సర్వమును అనుభవించుచున్నవి. ఈ

గుణములను అసుర సంపదయని, కర్మబంధమును కలుగజేయునవియని, జ్ఞాన, విజ్ఞాన భావములను (గుణములను) దైవసంపదయని, పరమపదమును చేర్చునని 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడినది. ఈ అసుర గుణములలోని జీవులస్వభావము యొక్క ప్రవర్తనను ఈశ్వరుడు సర్వజీవులను యంత్రములను త్రిప్పునటుల త్రిప్పు చున్నాడని ఈ అధ్యాయమున 61 వ శ్లో.లోను, సర్వమును కృష్ణునివలననే ప్రవర్తింపబడుచున్నదని 10 వ అ. 8 వ శ్లో.లోను వ్రాసినారు. ఇది కల్పితము. పరమపదమును చేర్చు జ్ఞాన, విజ్ఞాన భావముల ప్రవర్తనను ఈశ్వరుని శరణు వేడు కొనుము. వాని అనుగ్రహమువలన పరమశాంతిని, శాశ్వతముగ నుండు స్థానమును (పరమపదమును) పొందగలవని ఈ అధ్యాయము 62 వ శ్లో.లో వ్రాసినారు. ఇది కల్పితము.

శ్లో॥ శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః।
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ॥ 15

తా. మనుజుడు శరీరముచేతను వాక్కుచేతను, మనస్సుచేతను, న్యాయమైనట్టిదిగాని, అన్యాయమైనట్టిదిగాని ఏ కర్మను ప్రారంభించునో, ఆ కర్మకు పైన చెప్పినవి ఐదును కారణము లగుచున్నవి.

వ్యా. జీవుడు, జీవునియందున్న రాగద్వేషాది గుణములు, ఈ గుణములు చేయు కర్మలు, వీని ననుసరించి ఆ జీవుల స్వభావము చేయు కర్మలు, శరీరము ఈ ఐదును ఈ ప్రపంచమునందు మంచి, చెడులనునట్టి సర్వకర్మలకును కారణము. అంతియె కాని యిట్లు ప్రవర్తింపజేయు ఈశ్వరుడు లేడు. కృష్ణుడు లేడు. ఈ విధముగ జీవుల స్వభావము శరీరములద్వారా చేయు కర్మలను కృష్ణుని విభూతులని 10 వ అధ్యాయములోను, విశ్వరూపమని, ఈశ్వరరూపమని 11 వ అధ్యాయము లోను వ్రాసినారు. ఇది కల్పితము.

శ్లో॥ తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః।
పశ్యత్యకృత బుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః 16

తా. ఆ కర్మకు ఈ ఐదును కారణములగుచుండగ, ఎవ్వడు అజ్ఞాన బుద్ధి వలన కేవలం ఆత్మను (జీవుని) కర్తగా చూచునో, అట్టి అజ్ఞాని కర్మ చేయు కర్త నెరుగడు.

వ్యా. జీవుడుండుటకు ఆధారము శరీరము. గుణములుండుటకు ఆధారము జీవుడు. శరీరముద్వారా కర్మచేయునవి గుణములు. గుణములే కర్తలుగాని జీవుడు కర్తకాదు. అయినను గుణములు జీవునియందుండుటవలన గుణములు చేయు కర్మలను, ఆ జీవుని స్వభావమను గుణము యింకొకపుడు చేసి ఆ కర్మలను కర్మ ఫలమును ఆ జీవునిచేత అనుభవింపజేయును. ఇట్లు సర్వజీవులును అనుభవించు చున్నవి. జ్ఞాన, విజ్ఞానములు గలవారు విజ్ఞానమువలన పరమపదమును, జీవు చేయు గుణములను, ఆ జీవుల స్వభావమను గుణమును, కర్మలను ఈ సర్వమును ఎరిగియున్నారు. కర్మలవలననే గుణముల నెరిగియున్నారు. అజ్ఞానము గలవారు పరమపదము నెరుగరు. జీవుల నెరుగరు. జీవుల స్వభావము నెరుగరు. కర్మ చేయు కర్తలు గుణములని ఎరుగరు.

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।
హత్వాఽపి స ఇమాన్ లోకాన్న హన్తి న నిబధ్యతే ॥

తా. ఎవనియందు అహంకారముతో చేయు భావములేదో, ఎవరి బుద్ధి ఆసక్తి గలది కాదో, అట్టివాడు ఈ లోకమునందలి జనులను చంపినను చంపినవాడుకాడు. కర్మబద్ధుడును కాడు.

వ్యా. జ్ఞానవిజ్ఞానములు గలవారియందు రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వ వాంఛాది మాయాగుణములుండవు. వారు కోరికయే లేనివారగుటచేత వారిసంస్కార కర్మలయందు వారి స్వభావము విధిగా ప్రవర్తించుచుండును. ఆ కర్మలయందు విజ్ఞానము నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించుచుండును. అందువలన వారు కర్మబద్ధులు కారు. అకర్ములనబడుదురు. వారియందు ఎవరినిగాని, దేనినిగాని చంపవలయునను భావముండదు. వారికి కావలసినది లేదు. వారు అందరియందును పవిత్రప్రేమ భావములతో ఉందురు. వారి పూర్వసంస్కార కర్మవలన వారి స్వభావముచేత వారిద్వారా జనులు చంపబడినను వారు జనులను చంపినవారు కారు. కర్మబద్ధులు కారు.

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః॥ 18

తా. కర్మ ప్రేరణకు కారణము జ్ఞానము, జ్ఞేయము, పరిజ్ఞాతయని మూడు విధములుగ నున్నది. కర్మ సంగ్రహమునకు కరణము, చేయుట, చేయువాడు అను మూడు విధములుగ నున్నది.

శ్లో॥ జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి 19

తా. జ్ఞానము, కర్మ, కర్తయును గుణములను గురించిన సాంఖ్యమునందు గుణభేదమువలన మూడు విధములుగా చెప్పబడియున్నవి. వానిని యధారీతిగాచెప్పెదను వినుము.

శ్లో॥ సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే।
అవిభక్తం విభక్తేషు తద్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥ 20

తా. దేనిచేత సమస్త భూతములయందు వేరువేరుగా విభజింపబడి యున్న భావము (స్వభావము) విభజింపబడనిది, నాశరహితమైనది ఒక్కటేయని చూచుచున్నాడో, ఆ జ్ఞానమును సాత్త్విక జ్ఞానమని యెరుంగుము.

వ్యా. ప్రకృతి (మాయ) యందుండి వచ్చిన జీవులు స్వభావము గలవియై వేరు, వేరుగా విభజింపబడి సమస్త భూతములయందును ఉన్నవి. వేరు, వేరుగా విభజింపబడి యున్న జీవులు ఒకలాంటివేగాని, ఒకటి కాదు. వాని స్వభావమును ఒకలాంటిదేగాని, ఒకటి కాదు. ఈ స్వభావము జీవులనుండి వేరుగా విభజింపబడునది కాదు. ఇది 8 వ అ. 3 వ శ్లో.,లో చెప్పబడిన స్వభావము. ఇది 8 వ అ. 18, 19 శ్లో.లో చెప్పబడినటుల మాయయందుండి వచ్చి మాయయందే కలియుచు తిరుగుచుండు జీవుల స్వభావము. ఈ స్వభావము త్రిగుణములలోనున్న సత్వగుణమునకు తెలియదు. ఇది సర్వజీవులకును ఉన్న స్వభావము. జీవులకు స్వభావముప్రవర్తించుచున్నదని 5 వ అ. 14 వ శ్లో.లో చెప్పబడినది. ఈ సత్వము జీవులను సుఖములయందు బంధించునది. ఇది పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను. జ్ఞానముద్వారా చేరవలెనని 13 వ అ. 18 వ శ్లో.లో చెప్పబడిన జ్ఞానమను భావము కాదు. ఈజ్ఞానమనుభావము 8 వ అ. 20 వ శ్లో.లో మాయకంటె వేరుగా అనాదియై యున్నదని చెప్పబడిన భావము. ఇది మాయయందుండి వచ్చిన జీవులయందు లేదు.

జీవుల స్వభావము కాదు. ఈ భావము పరమతేజస్సును చూచునది. స్వభావము జీవులకు కర్మ బంధమును కలుగజేయునవి అసుర సంపదయని 16 వ అ. 5 వ శ్లోకములో చెప్పబడినఅసుర గుణములలోనిది. ఇట్టిస్వభావముగాని, పరమపదమును చూచు భావముగాని8 వ అ. 3 వ శ్లో.లో బ్రహ్మమని, 21 వ శ్లో.లో జన్మమునకు రానిదని చెప్పబడిన పరమపదముగా ఉన్న పరమతేజస్సు కాదు.

శ్లో॥ పృథక్త్వేన తు యద్ జ్ఞానం నానాభావాన్ పథగ్విధాన్।
వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్ 21

తా. ఏ జ్ఞానము సమస్త భూతములయందు వేరు వేరుగా నుండెడు భావములను (స్వభావమును) వేరు వేరుగా నెరుంగుచున్నదో, ఆ జ్ఞానమును రాజసమని యెరుంగుము.

శ్లో॥ యత్తు కృత్స్నవదేకస్మిన్కార్యే సక్తమహైతుకం।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్॥ 22

తా. ఏ జ్ఞానము ఒక్కటే కార్యమై యున్నదానిని, సమస్తమును కూడి యున్నదిగా నెంచియున్నదో, అకారణమైనట్టిదియు, తత్త్వము తెలియనిదియు, అల్పమైనదియునగు ఈ జ్ఞానము తామస జ్ఞానమని చెప్పబడుచున్నది.

వ్యా. జీవులయందున్న రాగద్వేషాది గుణములు చేయునది మరల ఆ జీవులకు చేయు స్వభావమను గుణము విజ్ఞానమునకు తెలియునుగాని, సత్వ రజస్తమో గుణముల మాయా జ్ఞానమునకు తెలియదు.

శ్లో॥ నియతం సంగరహితమరాగద్వేషతః కృతం।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే॥ 23

తా. ఏది స్వభావముచే నియమింపబడినదై, ఫలాపేక్ష లేక సంగరహితముగను, రాగద్వేషములు లేకయును చేయబడుచున్నదో, అట్టి కర్మ సాత్త్విక కర్మయని చెప్పబడుచున్నది.

వ్యా. ఈ 23 వ శ్లోకమునందు చెప్పబడినది త్రిగుణములు లేనివారి (కోరికయే లేని) వారియందున్న విజ్ఞానము చేయుకర్మ. ఇది సత్వగుణ కర్మ కాదు. సత్వగుణము సుఖముల ననుభవింపజేయునదియేగాని ఫలాపేక్ష లేక చేయునది కాదు. విజ్ఞానము గలవారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయువారి కర్మయే ఫలాపేక్ష లేని కర్మ.

శ్లో॥ యత్తు కామేప్సునా కర్మ సాహఙ్కారేణ వా పునః।
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్24

తా. ఏ కర్మయైనను ఫలాపేక్ష గలవానిచేత, నేను చేయుచున్నానను అహంకారముచేత ఆయాసముతో చేయబడుచున్నదో అది రాజస కర్మయని చెప్పబడుచున్నది.

శ్లో॥ అనుబంధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషం।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామస ముచ్యతే॥ 25

తా. తాను చేయబోవు కర్మవలన సంభవించునష్టమును, బాధను, బలమును ఆలోచింపక, మోహముతో ఏ కర్మ ప్రారంభింపబడుచున్నదో, అది తామస కర్మయని చెప్పబడుచున్నది.

వ్యా. సాత్త్విక, రాజస, తామస గుణములు అహంకార కర్తృత్వములు గలవి. వీనిద్వారా కష్ట సుఖముల ననుభవించెదరు. ఇవి ఫలాపేక్ష లేక చేయునవి కాదు.

శ్లో॥ ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః।
సిద్ధ్య సిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥ 26

తా. సంగ విముక్తుడును, నేనను అహంకారము లేనివాడును, ధైర్యోత్సాహములతో గూడినవాడును, సిద్ధి, అసిద్ధులయందు వికారము నొందనివాడునగు కర్త సాత్త్విక కర్తయని చెప్పబడుచున్నాడు.

వ్యా. ఈ 26 వ శ్లోకమునందు వ్రాయబడిన కర్త జ్ఞానము గలవారియందు ఉన్న నిత్యసత్వముగల విజ్ఞానమేగాని, త్రిగుణములు గలవారి సాత్త్విక గుణము కాదు.

శ్లో॥ రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥ 27

తా. అనురాగము గలవాడును, కర్మఫలమును కోరువాడును, లుబ్ధుడును, హింసించు గుణము గలవాడును, అశుచి గలవాడును, సంతోషమును, దుఃఖమును గలవాడునగు కర్త, రాజస కర్తయని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ అయుక్తః ప్రాకృతస్స్తబ్ధశ్శఠో నైష్కృతికోఽలసః।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే॥ 28

తా. నియమము లేనివాడును, తమోగుణ మధికము గలవాడును, నమ్రత లేనివాడును, మోసగాడును ఇతరుల జీవనమును జెరుచుట యందాసక్తి గలవాడును, సోమరియును, వ్యసనము గలవాడును, చురుకుదనము లేనివాడునగు కర్త తామసు డని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ॥ 29

తా. అర్జునా ! నిశ్శేషముగను, వేరు వేరుగను చెప్పబడు బుద్ధి, ధైర్యము సత్వ రజస్తమో గుణములనుబట్టి మూడు విధములగు భేదములను వినుము.

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే।
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ॥

తా. అర్జునా ! ఏ బుద్ధి మోక్షమార్గమును, బంధహేతువగు కర్మమార్గమును కార్యా కార్యములను, భయా భయములను, ప్రకృతి బంధమును, ప్రకృతి బంధ విముక్తిని ఎరుగుచున్నదో ఆ బుద్ధి సాత్విక బుద్ధి యనబడును.

వ్యా. ఈ శ్లోకమునందు వ్రాసినవి జ్ఞానము గలవారియందున్న విజ్ఞానము ఎరిగియున్నది. కాని, త్రిగుణములు గలవారి సత్వగుణ (సాత్విక) బుద్ధి ఎరుగదు.

శ్లో॥ యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ।
అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ॥ 31

తా. అర్జునా! ఏ బుద్ధి ధర్మమును, అధర్మమును, కార్యమును, అకార్యమును పొరపాటుగా నెరుంగుచున్నదో ఆ బుద్ధి రాజసబుద్ధి.

శ్లో॥ అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ॥ 32

తా. ఏ బుద్ధి తమోగుణముచేత ఆవరింపబడి అధర్మమును ధర్మముగను, సర్వార్థములను విపరీతముగ తలంచుచున్నదో, ఆ బుద్ధి తామస బుద్ధి.

వ్యా. ఇది తమోగుణ బుద్ధియేగాని, తమోగుణముచేత ఆవరింపబడిన బుద్ధి యనుట కాదు. జీవునియందున్న త్రిగుణములలో ఏ గుణము అధికము గలదియై యున్నదో, అదియే ఎక్కువగ కర్మలయందు ప్రవర్తించుచుండును.

శ్లో॥ ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియా
యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ సాత్త్వికీ॥ 33

అర్జునా! చలింపనియే ధైర్యముతో మనస్సు, ప్రాణ, ఇంద్రియముల వ్యాపారములను యోగముచేత నియమించుచున్నాడో ఆ ధైర్యము సాత్విక ధైర్యము.

వ్యా. ఎట్టి ధైర్యముతో ఏ యోగముచేతనైనను ప్రాణ, ఇంద్రియ వ్యాపారములను నియమించినను వానికి ఇదియొక వ్యాపారమగునుగాని, వాడు వ్యాపారము లను నియమించువాడు కాదు. ఈ సత్వగుణ ధైర్యము చలింపనిది కాదు.

శ్లో॥ యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ రాజసీ॥ 34

తా. అర్జునా! ఏ ధైర్యముచేత ఫలాపేక్ష గలవాడు ధర్మ కామార్థముల నాసక్తితో ధరించుచున్నాడో, అట్టి ధైర్యము రాజస ధైర్యము.

శ్లో॥ యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ
న విముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ తామసీ॥ 35

తా. అర్జునా! దుర్బుద్ధి గలవాడు ఏ ధైర్యముచేత స్వప్నమును, భయమును దుఃఖమును, దిగులును, మదమును విడువడో అట్టి ధైర్యము తామస ధైర్యము.

శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి॥ 36

శ్లో॥ యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమం।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్ ॥

తా. అర్జునా! ఇప్పుడు మూడు విధములగు సుఖమును నా వలన వినుము. దేనిని అభ్యాసము చేయుటవలన రమించుచున్నవాడై దుఃఖ నాశనమునుకూడ పొందుచున్నాడో, అట్టి అభ్యాసము ఆరంభమునందు విషమువలె నుండును. పరిణామమునందు అమృతమువలె నుండును. అట్టి ఆత్మబుద్ధివలన కలిగిన సుఖము సాత్త్విక సుఖమని చెప్పబడుచున్నది.

వ్యా. ఈ సత్వగుణ అభ్యాసమువలన కొంచెము సుఖ మనుభవించెదరు. కాని, దుఃఖనాశము కలుగదు. దేనినైనను స్వయముగా అభ్యాసము చేయుట సత్వ రజస్తమో గుణముల లక్షణము. వీనివలన హెచ్చుతగ్గులుగా సుఖదుఃఖములు కలుగును. ఈ సత్వగుణ లక్షణము అజ్ఞాన లక్షణమేగాని నిత్యసత్వముగల విజ్ఞాన లక్షణము కాదు. పరమతేజో ఆనందమనుభవించునది, రాగద్వేషాది త్రిగుణరహితమగునది దుఃఖనాశము కలుగునది జ్ఞాన, విజ్ఞానములు గలవారి స్థితి. జ్ఞాన విజ్ఞానములు గలవారి సాంగత్యము చేయుట, వారు చెప్పునటుల చేయుట ఆరంభమునందుకష్టముగను, తదుపరి సుఖముగను ఉండును. వారియందున్న జ్ఞాన విజ్ఞానములను పొందినపుడు వీరికిని జ్ఞానముద్వారా పరమతేజస్సు కాన్పించును. వీరియందున్న త్రిగుణములు విజ్ఞానమువలన వీరిని విడుచును. అందువలన దుఃఖ నాశనము కలుగును. త్రిగుణములు ఏ విధముగ అభ్యాసము చేసినను దుఃఖనాశము కలుగదు. ఆత్మలేదు. ఆత్మ బుద్ధి యనునది లేదు.

శ్లో॥ విషయేన్ద్రియ సంయోగాద్యత్తదగ్రేఽమృతోపమం।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥ 38

తా. ఏ సుఖము ఇంద్రియ విషయ సంయోగమువలన మొదట అమృతమువలె నుండి పరిణామమునందు విషమువలె నుండునో అట్టి సుఖము రాజస సుఖము.

శ్లో॥ యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్॥ 39

తా. నిద్ర, అలస్య, ప్రమాదములవలన ఏది ఆదియందును, అంత్యము నందును తనకు సుఖముగా నున్నట్లు మోహింప జేయుచున్నదో అది తామస సుఖమని చెప్పబడినది.

వ్యా. ఈ అధ్యాయమున 18 వ శ్లోకమునుండి 39 వ శ్లోకమువరకును ప్రకృతి (మాయ)చే సృష్టింపబడిన త్రిగుణములను గురించి వ్రాసియున్నారు. ఆ శ్లోకములలో పరమతేజస్సుగా ఉన్న పరమపదము నెరిగిన వారియందున్న విజ్ఞాన లక్షణములను, వారి సాంగత్యము చేయువారి లక్షణములను త్రిగుణములలోని సత్వ గుణ లక్షణములని తప్పుగా వ్రాసియున్నారు.

శ్లో॥ న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః40

తా. ప్రకృతివలన జనించిన ఈ త్రిగుణములచేత విడువబడిన సత్వము ఈ భూలోకమందుగాని, దేవలోకమందున్న దేవతలయందుగాని లేదు.

వ్యా. పరమపద దర్శనమైనవారే జ్ఞానము, నిత్యసత్వముగల విజ్ఞానమును గలవారు. సత్వ రజస్తమాది ప్రకృతి గుణములన్నియును వారియందుండ లేక వారిని విడిచి వెళ్ళిపోవును. వారిని ప్రకృతివలన జనించిన త్రిగుణములచేత విడువబడినవారని చెప్పవలెను. అట్టివారు ఈ లోకమునందచ్చటచ్చటను అరుదుగా ఉన్నారు. వారు అనగా అట్టిజీవులు కర్మరహితులైన తదుపరిపరమపదమునుజ్ఞానము ద్వారా చూచుచు చేరనుగాని ఈ లోకమునందుండవు. దేవలోకము నందుండవు. 8 వ అ, 18, 19 శ్లో.లలో చెప్పబడినటుల మాయాభ్రమచేత మాయయందుండి వచ్చిన ఈ ప్రపంచములో జీవులకు వాని స్వభావమువలన ఈ ప్రపంచసంబంధమున కామ రాగద్వేషాది త్రిగుణములు సంభవించినవి. త్రిగుణములచేత విడువబడునది జీవుడు. అట్టి జీవుడు సత్వము కాదు. పరమపదముగా ఉన్న పరమతేజస్సు ఈ

లోకమునకు వచ్చునది కాదు. ఈ లోకమునందు లేదు. త్రిగుణములచేత విడువ బడిన సత్వమనునది లేదు.

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాం చ పరన్తప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః॥ 41

తా. అర్జునా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకును, వారిస్వభావము వలన సంభవించిన గుణముల కర్మలు విభజింపబడినవి.

వ్యా. జీవులకు జాతులు లేవు. అన్నియును ఒకలాంటివే. జీవులకు వాని స్వభావమువలన ప్రపంచ సంబంధమున సంభవించిన రాగద్వేషాది గుణముల కర్మలను బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని నాలుగు విధములుగా కామ రాగ ద్వేషాది గుణములు గలవారిచేతనె కల్పింపబడినవి. ఇటులనె వేదములునుకల్పింప బడినవి. ఇవి 16 వ అ. 5 వ శ్లో. నందు కర్మబంధమును కలుగజేయునవి అసుర సంపదయని చెప్పబడిన కామ, రాగ, ద్వేషాది సత్వరజోస్తమో గుణములకర్మలు. వీనిలో జ్ఞాన, విజ్ఞానములు లేవు. ఈ నాలుగు వర్ణములనునట్టి కర్మలు గలవారిలోను జ్ఞాన, విజ్ఞానములు లేవు.

శ్లో॥ శమో దమస్తపశ్శౌచం క్షాన్తిరార్జవమేవ చ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మస్వభావజమ్॥

తా. శమము, దమము, తపస్సు, శౌచము, ఓర్పు, ఋజుస్వభావము, జ్ఞానమును, విజ్ఞానమును, భగవంతుడున్నాడను నమ్మకమును ఇవి వారి స్వభావమువలన కలిగినవి. బ్రాహ్మణ కర్మ లనబడుచున్నవి.

వ్యా. ఎవరికైనను జ్ఞాన, విజ్ఞానములు అవి ఉన్నవారి సాంగత్యమున వారి ద్వారా సంభవించును గాని స్వభావమువలన కలుగవు. జ్ఞానము విజ్ఞానము ఉన్న వను నమ్మకము ఇవి యున్నవారి ప్రవర్తనవలన కలుగవచ్చును. ఇందు వ్రాసినవి రాగద్వేషాది గుణములు గలవారి ఎరుగన్ని ప్రవర్తన.

శ్లో॥ శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥ 43

తా. శౌర్యము, తేజస్సు, ధైర్యము. సామర్థ్యము, యుద్ధమున పారి పోవకుండుట, దానమిచ్చుట, ఈశ్వర భావమును కలిగియుండుట యనునవి వారిస్వభావము వలన కలిగిన క్షత్రియ కర్మలు అయియున్నవి.

వ్యా. ఈశ్వరభావము కలిగియుండుటనునది క్షత్రియ కర్మలని కల్పించినారు అంతియేకాని ఈశ్వరుడు లేడు.

## శ్లో॥ కృషిగోరక్షవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజం।
## పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ 44

తా. వ్యవసాయము చేయుట, పశుసంరక్షణ, వ్యాపారము వారి స్వభావము వలన గలిగిన వైశ్యకర్మలై యున్నవి. పరిచర్య చేయుట అనునది వారిస్వభావము వలన గలిగిన శూద్రకర్మలై యున్నది.

వ్యా. పై శ్లోకములయందు చెప్పబడిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనునట్టి నాలుక రకముల కర్మలును కామ, రాగ ద్వేషాది ప్రకృతి గుణముల కర్మలు. నాలుగు వర్ణములని చెప్పబడిన కర్మలు గలవారిలో ఎవరియందును జ్ఞాన విజ్ఞానములు లేవు. వైశ్య శూద్రుల కర్మలలో భగవంతుడు, ఈశ్వరుడున్నాడను మూఢ నమ్మకములు వ్రాయలేదు. అందువలన వీరు అదృష్టవంతులని చెప్పవలెను. వర్ణములని వేరు వేరుగా విభజింపబడిన కర్మలు గలవారు ఇప్పుడున్న అన్ని వర్ణముయందును ఉన్నారు. ఈ ప్రపంచమునందు మూడువిధములుగ వారున్నారు. 1.జ్ఞాన విజ్ఞానములు గలవారున్నారు. వారియందు రాగద్వేషాది గుణములుండలేక వెడలిపోవును. వారు నిష్కామభావము, సమత్వబుద్ధి, నిత్యసత్వము,పవిత్రప్రేమభావములతో ప్రవర్తించు విజ్ఞాన ప్రవర్తనగలవారు. 2. అట్టి వారియందున్న జ్ఞానవిజ్ఞానముల కొరకు ప్రేమతో వారు సాంగత్యము చేయువారు రాగద్వేషాది గుణములు గలవారే గాని, జ్ఞానము గలవారు చెప్పునటుల చేయువారు. 3. ప్రకృతి గుణములైన రాగ, ద్వేష, అహంకార,కర్తృత్వ, వాంఛాది త్రిగుణములచేత కర్మలయందు ఈ ప్రపంచ సంబంధమున ప్రవర్తింపబడువారు. వీరిని వీరి ఆచరణనుబట్టియే నిర్ణయించవలెను. అంతియెకాని,వర్ణములనునవి యథార్థము కాదు. రాగద్వేషాది గుణముల కర్మలనె వర్ణములని వ్రాసినారు.

శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు॥ 45

తా. మనుజుడు తన తన కర్మయందాసక్తుడై ఆయా సిద్ధిని పొందుచున్నాడు. స్వకర్మయందు ప్రవర్తించువాడెట్లు సిద్ధిని పొందుచున్నాడో దానిని వినుము.

వ్యా. ఎవడు, తాను చేయు కర్మయందాసక్తుడై యున్నాడో, వాడు ఆ కర్మ ఫలమును పొందును. స్వభావముచే నియమింపబడిన స్వకర్మయగుపూర్వసంస్కార కర్మయందు ఏట్లు ప్రవర్తించువాడు సిద్ధిని పొందునది వినుమని చెప్పెను.

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతం।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥ 46

తా. ఎవనిచేత భూతములకు ప్రపంచమునందు ప్రవృత్తి గలుగుచున్నదో, ఎవనిచేత సర్వ ప్రపంచమును వ్యాపింపబడియున్నదో, వానిని మనుజుడు స్వకర్మ చేత నారాధించి పొందుచున్నాడు.

వ్యా. కామ రాగద్వేషాది గుణముల ప్రవర్తనయే ప్రవృత్తి. జీవులయందు ఉన్న కామ రాగాది గుణముల ప్రవృత్తి అనగా ప్రవర్తన (సంస్కారము) ననుస రించి అట్టి కర్మలయందు మరల ప్రవర్తించుచున్నది ఆ జీవుల స్వభావము. ఆ కర్మలయందును మరల ప్రకృతి గుణములు ప్రవేశించి ప్రవర్తించుటవలన మరల ప్రవృత్తి కలుగుచున్నది. ఈ విధముగ ప్రపంచము ప్రవర్తింపబడుచున్నది. సర్వ ప్రపంచమును వ్యాపించి యున్నదనునది జీవుల స్వభావము. దీనివలన ఏ సిద్ధియును కలుగదు. దీనిని ఆరాధించుటయనునది తప్పు ప్రవర్తనయేగాని యథార్థము కాదు. ఆరాధన అవ్యక్త ప్రవర్తన. మనుజుడు స్వకర్మముచేత ఆరాధించుట యనునది యథార్థము కాదు.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ 47

తా. బాగుగా నాచరింపబడిన ఇతర ధర్మముకంటె, గుణ హీనమైనను స్వధర్మము శ్రేష్ఠమైనది. స్వభావముచే నియమింపబడిన కర్మ చేయుచు పాపమును పొందడు.

వ్యా. ప్రకృతి గుణములు గలవారిచేత నిర్మింపబడిన ధర్మము నెంత బాగుగా నాచరించినను, అది యథార్థ ధర్మముకాదు. వానికంటె నిష్కామాది పవిత్ర ప్రేమ భావములతో ప్రవర్తించు విజ్ఞానముయొక్క ప్రవర్తనయే పరమధర్మము. అట్టిపరమ ధర్మముగల జ్ఞాన, విజ్ఞానములు గలవారి సాంగత్యమున వారియందున్న జ్ఞాన విజ్ఞానముల నార్జించుటయే మానవునికి స్వధర్మము. ఇదియే శ్రేష్ఠమైనది. అట్టివాడు వాని స్వభావముచేత నియమింపబడి చేయబడు పూర్వ సంస్కారకర్మను జ్ఞాన, విజ్ఞానములు గలవారు చెప్పునటుల చేయుటవలన పాపమును పొందడు.

శ్లో॥ సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్।
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః 48

తా. అర్జునా! సహజమైన కర్మదోషము గలదియైనను విడువదగినది కాదు. ఎందుచేతననగా, సమస్త ఆరంభ కర్మలును నిప్పు పొగచేత ఆవరింపబడినట్లు దోషముచేత ఆవరింపబడియున్నవి.

వ్యా. సహజమైన అనగా పూర్వసంస్కార కర్మదోషము గలదియైననుదానిని విడుచుటకు సాధ్యము కాదు. వారి సంస్కారము ననుసరించి వారి స్వభావముచేత చేయబడు కర్మలే యిందు వ్రాసిన ఆరంభకర్మలు. అట్టి కర్మలయందు రాగద్వేషాది గుణములుండకూడదు. ఎందుచేతననగా మానవులయందున్న రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వ, వాంఛాది గుణములచేత చేయబడు సర్వకర్మలును కర్మబంధములు గలవియై మరల వారి స్వభావముచేత చేయబడునవి. వీనిని నిగ్రహించుటకెవ్వరికిని సాధ్యము కాదు, రాగద్వేషాది గుణముల కర్మలే ఆరంభకర్మలుగాని, చేయవలసిన సంస్కారకర్మలు ఆరంభ కర్మలుకాదు. కర్మలయందు రాగద్వేషాది గుణములుండకూడదు. అందువలన మానవులయందు రాగద్వేషాది గుణములుండకూడదు. ఎవరైనను యీ గుణములను వారినుండి వెడలగొట్టవలెను. అంతియెకాని ఈ గుణములను యీ గుణములు చేయు కర్మలను, వీనివలన కలుగు సంస్కారకర్మలనునిగ్రహించలేరు.

శ్లో॥ అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః।
నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసేనాధి గచ్ఛతి ॥

తా. సర్వమునందును కోరికయే లేనివాడు రాగ, ద్వేష, అహంకార, కర్తృత్వాది గుణములు లేనివాడును, ఆశ లేనివాడును, సర్వసంగరహితుడును, నిష్కామ కర్మచే కర్మరహితుడునై పరమపదమును పొందు (చేరు) చున్నాడు.

వ్యా. ఇవి పరమపదము నెరిగిన జ్ఞాన, విజ్ఞానములు గలవారి లక్షణములు. వీరియందు కోరిక యుండదు. రాగద్వేషాది గుణములుండవు. కోరికయే లేనివాడు గావలెను గాని, సర్వమునందును కోరిక లేకుండ యుండుట యనునది కాదు. ఇందు జితాత్మా అనగా ఆత్మను జయించుట (నిగ్రహించుట) యనునది యథార్థము కాదు. ఆత్మయే లేదు.

శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధమే
సమాసేనైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యాపరా॥ 50

తా. అర్జునా! జ్ఞానమును పొందినవాడు కర్మరహితుడై పరబ్రహ్మమును (పరమపదమును) ఏ విధముగా పొందుచున్నాడో, ఆ విధమును సంగ్రహముగా నా వలన తెలిసికొనుము.

వ్యా. జ్ఞానము నార్జించిన వానికి జ్ఞానముద్వారా పరమపద దర్శనమగును. వాడు విజ్ఞానమువలన రాగద్వేషాది గుణరహితుడై, కర్మరహితుడునై పరమ పదమును జ్ఞానముద్వారా చూచుచు చేరును.

శ్లో॥ బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ।
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥

తా. శుద్ధ బుద్ధి గలవాడు, దృఢమైన ఆత్మనియమము గలవాడును, శబ్దాది విషయములను విడిచినవాడును, రాగద్వేషాది గుణములను వదలినవాడును,

వ్యా. సమత్వ బుద్ధిగల విజ్ఞానము గలవాడు తన స్వభావముచేత నియమింపబడు సంస్కారకర్మలు గలవాడును, శబ్దాది విషయములందు ఆసక్తి లేనివాడును, రాగద్వేషాది గుణములచేత విడువబడినవాడును, (ఇందు ఆత్మయనునది తన స్వభావమను గుణమేగాని, ఆత్మలేదు. ఆత్మ నియమము లేదు).

శ్లో॥ వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయ మానసః ।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ 52

తా. ఏకాంతస్థల వాసియును, మితాహారుడును, స్వాధీనము చేసికొనబడిన మనస్సు గలవాడును, ఎల్లప్పుడును ధ్యానయోగపరుడును, వైరాగ్యము నాశ్రయించి యుండువాడును,

శ్లో॥ అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే53

తా. అహంకారము, బలమును, గర్వమును, కామమును, కోపమును ఇతర వస్తువులను పరిగ్రహించుట విడిచినవాడును, మమకారము లేనివాడును, శాంతభావము గలవాడునైనవాడు బ్రహ్మమును పొందుట కర్హుడగుచున్నాడు.

వ్యా. 49 వ శ్లోకమునందు జ్ఞానము నార్జించినవారు రాగద్వేషాది గుణములు లేనివారై పరమపదమును చేరుచున్నారని, అట్టి వారిలక్షణములను వ్రాసియున్నారు. 50 వ శ్లోకమునందు జ్ఞానమును పొందినవాడు ఏ విధముగ పరబ్రహ్మమును పొందు (పరమతేజస్సుగా ఉన్న పరమపదమును చేరు) చున్నాడో చెప్పెదను వినుమని మరల వ్రాసియున్నారు. 51 వ శ్లోకములో శుద్ధబుద్ధి (సమత్వ బుద్ధిగల విజ్ఞానము) గలవాడు రాగద్వేషాది గుణములు లేనివాడని, తనస్వభావము నియమించుసంస్కార కర్మలు గలవాడని వ్రాయుచు, 52, 53 శ్లోకములలో ఉన్నది రాగద్వేషాది గుణముల తప్పు ప్రవర్తన. అట్టి తప్పు ప్రవర్తనగుణములు గలవాడు బ్రహ్మమును పొందుట కర్హుడగుచున్నాడని తప్పుగా కల్పించి వ్రాసినారు. జీవులకు స్వభావమను గుణమున్నది కాని, మనస్సుఅనునది లేదు. స్వాధీనముచేసికొనబడిన మనస్సు గలవాడనునది యథార్థము కాదు. ఇందు జ్ఞాన విజ్ఞానములు గలవారి లక్షణములను కొన్ని వ్రాసినారు.

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ 54

తా. నా యందే యుండు శ్రేష్ఠమైన భక్తిని పొందినవాడు, ఆత్మ గలవాడై పరమపదము గానున్న తేజస్సును దర్శించినవాడును, దుఃఖము నొందనివాడును, కోరిక లేనివాడును, సమస్త భూతములయందును సమభావము గలవాడును అగును.

వ్యా. ఇంతు పరమపదము నెరిగిన వారి సాంగత్యమున వారియందుండు భక్తి గలవాడై వారియందున్న జ్ఞానమును, విజ్ఞానమును పొందిన వాని లక్షణములను వ్రాసినారు. అటులనే కృష్ణుని సాంగత్యమున కృష్ణునియందుండు భక్తి గలవాడై ఆ భక్తిద్వారానే కృష్ణునియందున్న జ్ఞాన విజ్ఞానములను పొంది, జ్ఞానముద్వారా పరమపద దర్శనమైనవాడై, విజ్ఞానమువలన సర్వము నెరిగినవాడును, కోరిక లేని వాడును దుఃఖము లేనివాడును, సమస్త భూతములయందు సమభావము గలవాడును అగును. వాడు కృష్ణునితోసమానుడు. ఎవరైనను జ్ఞాన విజ్ఞానములను అవి యున్న వారి సాంగత్యమున వారిద్వారానే ఆర్జించి, వానిద్వారా ఈ శ్లోకమునందు చెప్పబడి నటుల ప్రవర్తించు వారగుదురు. ఈ శ్లోకమునందు ఆత్మగలవాడని యున్నది యథార్థము కాదు. ఆత్మ లేదు.

శ్లో॥ భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః।
తతోమాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్॥55

తా. భక్తిచేత నన్ను ఎవడైనదియు, ఎట్టివాడనైనదియుయథార్థముగనెరుంగు చున్నాడు. అట్లెరిగిన తరువాత నాయందు ప్రవేశించుచున్నాడు.

వ్యా. తాను సర్వభూతములయందును సమభావము గలవాడనని, తనకు విరోధియును లేడని, హితులును లేరని, భక్తులు తనయందును, తాను భక్తుల యందును ఉండునని 9 వ అ. 29 వ శ్లోకములో ఉన్నది. భక్తిచేత తాను ఎవడై నది, ఎట్టివాడైనది యథార్థముగ నెరుగుచున్నాడు. ఎరిగిన తరువాత నాయందు ప్రవే శించుచున్నాడని ఈ శ్లోకమునందున్నది. 10 వ అ. 10, 11 శ్లోకములతో చెప్ప బడినటుల కృష్ణుడు తనను విడువక తన సేవ చేయువారలకు తనను తెలియు బుద్ధి (భక్తి) నిచ్చినపుడు ఆ భక్తిద్వారా కృష్ణుడు వారియందున్నవాడై వారియందున్న అజ్ఞానము పోవుటకు వారియందు విజ్ఞానముతో నున్న జ్ఞానమును ప్రవేశింపజేయును. వారు జ్ఞానముద్వారా పరమపద దర్శనమైనవారై, విజ్ఞానమువలన సర్వము నెరిగి, గుణరహితులు, కర్మరహితులునై జ్ఞానముద్వారా పరమపదమును చూచుచు అచటికి

చేరుదురు. కృష్ణునియందు ప్రవేశించుట పరమతేజస్సుగా నున్న పరమపదమునందు ప్రవేశించుట కాదు.

శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్ 56

తా. ఎల్లప్పుడును నన్నాశ్రయించినవాడు సర్వకర్మలను చేయుచున్నవాడై నను, నా అనుగ్రహమువలన శాశ్వతమైనదియు, నాశము లేనిదియునగు స్థానమును (పరమతేజోపదమును) పొందు (చేరు) చున్నాడు.

వ్యా. కృష్ణుడు తన సాంగత్యమున తాను చెప్పునటుల ప్రవర్తించువానిని తనయందు భక్తి గలవానినిగా చేయును. వాడు ఆ భక్తిద్వారా కృష్ణునియందున్న జ్ఞాన, విజ్ఞానముల నార్జించినవాడై వానివలన శాశ్వితముగనుండు పరమపదమును, సర్వము నెరిగి ఆ పదమును చేరును. అటులనే, ఎవరైనను జ్ఞాన విజ్ఞానములు గల వారి సాంగత్యముద్వారానే వారియందు భక్తి గలవారై ఆ భక్తితో వారియందున్న జ్ఞానవిజ్ఞానములను పొంది, వీనిద్వారానే నాశనములేని పరమపదమును, సర్వమునెరిగి ఆ పదమును చేరవలెను. నశించు ఈ లోకముగాక 8 వ అ. 21 వ శ్లో.లో చెప్ప బడినటుల నాశనము లేనిది, శాశ్వతముగ నుండునట్టిదియగు స్థానము అనగా పరమ తేజస్సుగా ఉన్న పరమపదము అనునది వేరుగా ఉన్నది. 8 వ అ. 18, 19 శ్లో. లలో చెప్పబడినటుల మాయయందుండి వచ్చి నశించి మాయయందే కలియుచు మరల వచ్చుచు తిరుగుచుండు ఈ లోకము వేరుగా ఉన్నది. కాని, పరమపదముగా ఉన్న పరమతేజస్సునందు లేదు. అందుండి ఈ లోకమునకు వచ్చినది కాదు. నశిం చని ఆ పరమతేజస్సు మాయయందుండి వచ్చునది కాదు. నశించి మాయయందే కలియునది కాదు. మరల వచ్చుచు ఈ ప్రపంచమునందు తిరుగుచుండునది కాదు. ఈ లోకములో ఎవరియందును పరమపదముగా ఉన్న పరమతేజస్సు లేదు.

శ్లో॥ చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్యమత్పరః।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ॥ 57

తా. సర్వ కర్మలను మనస్సుచేత నాకర్పించి, నా పరము గలవాడవై బుద్ధి యోగము నవలంబించి ఎల్లప్పుడును నాయందున్న చిత్తము గలవాడవగుము.

వ్యా. అర్జునుడు కృష్ణునియందు ప్రేమ గలవాడై, కృష్ణుని వశమునందున్న వాడై చేయవలసిన సర్వకర్మలను కృష్ణుడు చెప్పినటుల చేయుచున్నచో అర్జునుని కృష్ణుడు తనయందు భక్తి గలవానినిగా చేయును. ఇందు మనస్సుచేత అనునది, బుద్ధియోగమనునది, తనయందున్న చిత్తము గలవాడనునది యథార్థము కాదు.

శ్లో॥ మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి।
అథ చేత్త్వ మహంకారాన్న శ్రోష్యసి వినజ్ఞ్యసి॥ 58

తా. నీవు నాయందు చిత్తము గలవాడవైతివేని నా అనుగ్రహమువలనసర్వ కర్మబంధములను దాటగలవు. అట్లుగాక అహంకారమువలన నా మాట విననివాడ వైతివేని చెడిపోవుదువు.

వ్యా. అర్జునుడుగాని, మరెవరైననుగాని జ్ఞాన విజ్ఞానములు గలవారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయుచున్నచో వారియందు భక్తిగలవారినిగా వారేచేయుదురు. అట్టి భక్తిద్వారా వీరును వారియందున్న జ్ఞానవిజ్ఞానముల నార్జించి వానివలన సర్వకర్మబంధములను దాటగలరు. వారి మాటలు విననిచో ఇంకేవిధముగను కర్మ బంధములను దాటలేరు. కర్మబంధితులై చెడిపోవుదురు 54 నుండి 58 వ శ్లోకము వరకు కృష్ణుని సాంగత్యముద్వారా కృష్ణుని సంబంధులైన వారిని గురించి చెప్ప బడినది. అర్జునుడు కృష్ణుడు చెప్పినటుల చేయవలయునుగాని, తనయందు చిత్తము గలవాడవగుమని, తన అనుగ్రహమువలన అని కృష్ణుడు చెప్పినటుల వ్రాసినది యథార్థము కాదు.

శ్లో॥ యద్యహఙ్కారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి 59

తా. అహంకారముతో యుద్ధము చేయనని తలంచెదవేని, నీయీ నిశ్చయము వ్యర్థమైనది యగును. నీ ప్రకృతి నిన్ను నియమించును.

వ్యా. అర్జునుడు అహంకారముతో యుద్ధము చేయనని నిశ్చయించుకొనినను ఆ నిశ్చయము యథార్థము కాదు. ఎందుచేతననగా అర్జునుడు తన సంస్కారము

వలన తాను చేయవలసిన కర్మలను, యుద్ధమును తన ప్రకృతి (తన స్వభావము) నియమించి చేయును. అందువలన నీ నిశ్చయము వ్యర్థమని కృష్ణుడు చెప్పి యుండును.

శ్లో॥ స్వభావజేన కౌన్తేయ నిబద్ధస్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపితత్ ॥60

తా. అర్జునా! నీ పూర్వ కర్మ సంస్కారమువలన నీ స్వభావముచేత బద్ధుడవగు నీవు మోహమువలన దేనిని చేయుటకు నిచ్ఛగింపక యున్నావో దానిని అవశ్యముగ చేయుదువు.

వ్యా. సర్వ మానవులును వారి పూర్వ కర్మ సంస్కారమువలన వారి స్వభావమునకు వశులై ఆ కర్మలయందు ప్రవర్తింపబడుచుందురు. అర్జునుడును తన సంస్కారమువలన తన స్వభావమునకు వశుడై తన సంస్కార కర్మలయందు ప్రవర్తింపబడును. సంస్కార కర్మలను తప్పించుట కెవ్వరికిని సాధ్యముకాదు. మానవులకు వారి సంస్కారము ననుసరించి వారి స్వభావము ప్రవర్తించును.

శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్సర్వ భూతాని యన్త్రారూఢాని
మాయయా॥ 61

తా. అర్జునా! సర్వజీవులకును ఈశ్వరుడు (జీవుల స్వభావము) దేహములనునట్టి యంత్రములను ధరించియున్న సర్వజీవులను వానియందుండి మాయచేత త్రిప్పుచున్నాడు.

వ్యా. సర్వజీవులకును ఈశ్వరుడనునది జీవుల స్వభావము. ఇది యంత్రములనునట్టి శరీరములను ధరించియున్న సర్వజీవులను వాని పూర్వకర్మ సంస్కారము ననుసరించి కర్మలయందు ప్రవర్తింపజేయుచు వానిని జనన మరణ సుఖ,దుఃఖముల ననుభవింపజేయుచు త్రిప్పుచుండును. అందువలన జీవులకు స్వభావము ప్రవర్తించుచున్నదని 5 వ అ. 14 వ శ్లోకములో ఉన్నది. అర్జునుడు వాని సంస్కారమునను సరించి వాని స్వభావమునకు వశుడై యుద్ధమును, సర్వకర్మలును చేయునని పైన

59, 60 శ్లో.లలో ఉన్నది. సర్వజీవులకును, జ్ఞానియైన వానికిని స్వభావము ప్రవర్తించుచున్నదని దానిని నిగ్రహించలేరని, ఆ కర్మలయందు రాగద్వేషము లుండకూడదని 3 వ అ. 33, 34 శ్లో.లలో ఉన్నది. కృష్ణునకు తనకు స్వభావమున్నదని స్వభావము ననుసరించి పుట్టుచున్నానని 4 వ అ. 6 వ శ్లో.లలో ఉన్నది. రాముని జన్మయందు చేసిన కర్మయను సంస్కారమువలన తన స్వభావముచేతనే కృష్ణుడుగా పుట్టినాడు. వాలిని చంపిన కర్మయను సంస్కారమువలన తన స్వభావముచేతనే బోయవానిద్వారా చంపబడినాడు. మానవులయందున్న రాగ ద్వేషాది గుణములు చేయునది మరల యింకొకపుడు వారికి వారి స్వభావము చేయుచున్నది. జీవుల స్వభావమునే ఉత్తమ పురుషుడు, పరమాత్మ (పరమతేజస్సు) ఈశ్వరుడు కృష్ణుడు అని 15 వ అ, 17, 18 శ్లో.లోను పరమపురుషుడు, ఆత్మ అని ఈ గీతయందును వ్రాసినారు. ఈశ్వరుడు సర్వజీవులను వానియందుండి మాయచేత త్రిప్పుచున్నాడని యీ 61 వ శ్లో.లో వ్రాసినారు. వానిని శరణు వేడుకొనుము. వాని అనుగ్రహము వలన పరమశాంతిని పొందుదువు. శాశ్వతముగ నుండు స్థానమును జేరుదువని ఈ దిగువ 62 వ శ్లో.లో వ్రాసినారు. ఇది తప్పు. కల్పితము.

శ్లో॥ తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥ 62

తా. అర్జునా! అన్ని విధములచేతను వానిని శరణు వేడుకొనుము. వాని అనుగ్రహమువలన పరమశాంతిని, శాశ్వతముగా నుండు స్థానమును పొందగలవు.

వ్యా. ఎన్నివిధములచేత ఈశ్వరుడని (జీవులస్వభావమును) శరణ్యమనినను ధ్యానించినను, స్మరించినను ఇది వారిని ఎరుగదు. దీనికి అనుగ్రహమనునది లేదు. ద్వేషమును లేదు. ఇది పరమశాంతి నెరుగదు. శాశ్వతముగనుండు స్థానము(పరమపదము) నెరుగదు. ఇది పరమశాంతిని కలుగజేయునది కాదు. పరమపదమును చేర్చునది కాదు. పరమశాంతియను పరనుతేజస్సుగా ఉన్న పరమపదమును జ్ఞానము ద్వారా చూడవలెను. జ్ఞానముద్వారానే చేరవలెనని 13 వ అ. 18 వ శ్లో.లోఉన్నది. మానవజన్మయందు జీవుల స్వభావము ఆ జీవులయందున్న రాగద్వేషాది ప్రకృతి గుణములు చేయు కర్మలను మరల యింకొకపుడు చేయుచు ఆ కర్మలను, కర్మ

ఫలములను వానిచేత ననుభవింపజేయక వానిని విడువడు. శరణ్యమను వారిని రక్షించుటయు, అననివారిని రక్షింపకుండుటయు దీనికి తెలియదు.

శ్లో॥ ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు॥　　63

తా. ఇట్లు రహస్యములన్నిటిలో నతి రహస్యమగు జ్ఞానమును నీకు నా చేత చెప్పబడినది. దీనిని నిశ్శేషముగా విమర్శించి ఎట్లు చేయుటకు ఇచ్ఛగించుచున్నావో అట్లు చేయుము.

వ్యా. రహస్యములన్నిటిలో నతి రహస్యమగు జ్ఞానమును నీకు నా చేత చెప్పబడినదనినది మానవులయందున్న రాగద్వేషాది గుణములును, వారి స్వభావమును ప్రవర్తించు అజ్ఞాన ప్రవర్తనయేగాని పరమపదమును జ్ఞానముద్వారా చూడవలెను, జ్ఞానముద్వారా చేరవలెనని 13 వ అ. 18 వ శ్లో.లో చెప్పబడిన జ్ఞానము (భావము) కాదు. సర్వము నెరిగి రాగద్వేషాది గుణములను జయించి, నిష్కామాది పవిత్ర ప్రేమ భావములతో ప్రవర్తించి కర్మబంధ రహితులనుగా జేయు విజ్ఞానము కాదు. అనగా మోక్షపదమును జేర్చు దైవసంపద యనిన జ్ఞాన విజ్ఞానములలోనిది కాదు. జీవుల స్వభావముయొక్క ప్రవర్తనను జ్ఞాన, విజ్ఞానములు గలవారియందున్న విజ్ఞానము ఎరిగియున్నదిగాని, రాగద్వేషాది గుణములు గలవారెరుగరు. ఈ గీతను వ్రాసిన వారెరుగరు.

ఈ ప్రపంచమునందు సర్వజీవులను మాయచేత త్రిప్పుచున్నాడని 61 వ శ్లోకములో యున్న ఈశ్వరుడు లేడు. శరణ్యమనిన వానిని మోక్ష(పరమ)పదమును జేర్చునని 62 వ శ్లో.లో యున్న ఈశ్వరుడును లేడు. ఈశ్వరుడు జీవులకు కర్తృత్వమును, కర్మలను, కర్మఫలములతోటి సంబంధమును కలిగింపడు. జీవులకు స్వభావము ప్రవర్తించుచున్నదని 5 వ అ. 14 వ శ్లో.లో ఉన్నది. 8 వ అ. 18. 19 శ్లో.లలో చెప్పబడినటుల మాయయందుండి వచ్చిన సర్వజీవులకును స్వభావమను గుణమున్నదిగాని, ఈశ్వరుడు లేడు. కర్మబంధమును కలుగజేయునవి అసుర సంపదయని 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన అసుర గుణములలోని జీవుల స్వభావమును ఈశ్వరుడని ఈశ్వరుని శరణు వేడుకొనుము. వాని అనుగ్రహము

వలన పరమపదమును చేరుదువని ఇది పరమపదమును జేర్చు అతి రహస్యమగు జ్ఞానమని తప్పుగా వ్రాసినారు. 61, 62, 63 శ్లోకములును యథార్థము కాదు.

శ్లో॥ సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః।
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ 64

తా. రహస్యములన్నిటిలో నతి రహస్యమైనదియు, పరమోత్కృష్టమైనదియు నగు నాయొక్క వాక్యమును మరల వినుము. నాకు మిక్కిలి ఇష్టుడవు. అందు వలన నీకు హితమును చెప్పుచున్నాను.

వ్యా. రహస్యములన్నిటిలో నతి రహస్యమగు జ్ఞానమును నేను నీకుచెప్పితి నని 63 వ శ్లోకమునందున్నది. ఇది ఎట్టిదనిన అర్జునా! అన్ని విధములచేతను ఈశ్వరుని అనగా మాయయందుండి వచ్చిన అసుర గుణములలోని జీవుల స్వభావ మును శరణు వేడుకొనుమని 62 వ శ్లోకములో చెప్పబడిన అవ్యక్త మార్గము. అనగా గ్రుడ్డివారు పోవు తప్పు మార్గము(ప్రవర్తన). ఇది 16 వ అ. 5 వ శ్లో.లో కర్మబంధమును కలుగజేయునవి అసుర సంపదయని చెప్పబడిన కామ రాగద్వేషాది గుణములును, జీవుల స్వభావమను గుణమును ప్రవర్తించు అవ్యక్తమగు అజ్ఞాన ప్రవర్తన. పరమోత్కృష్టమైన వాక్యమును మరల చెప్పుచున్నాను వినుమని 64వ శ్లోకము నందున్నది ఎట్టిదనిన, ఈ దిగువ 65, 66 శ్లోకములలో చెప్పబడినది ప్రత్యక్షముగ కాన్పించు ప్రవర్తన. ఇది (64 వ శ్లో.లో చెప్పబడిన పరమ రహస్యము) దైవసంపద పరమపదమును జేర్చునని 16 వ అ. 6 వ శ్లోకమునందు చెప్పబడిన విజ్ఞానముతోనున్న జ్ఞానమును (జ్ఞాన విజ్ఞానములను) అవియున్న కృష్ణు డను వాని సాంగత్యమున వానివలన పొందు రహస్యము.

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే65

తా. నాయందే యున్న మనస్సు (ప్రేమ) గలవాడవగుము. నన్నే సేవిం చుము. నాకు నమస్కారము చేయుము. నా భక్తుడవగుము. నన్నే పొందుదువు. నాకు ప్రియుడవైనందున నేను నీ కొరకు ప్రతిజ్ఞ చేసి సత్యమును చెప్పుచున్నాను.

వ్యా. అర్జునుడు కృష్ణుడు చెప్పునటుల చేయుచున్నచో, వానిని కృష్ణుడే తనయందు ప్రేమ, భక్తి గలవానినిగా చేయును. అర్జునుడు ఆ భక్తిచేతనే కృష్ణుని యందుండి "నన్ను" అని చెప్పుచున్న విజ్ఞానమును పొందును. విజ్ఞానమువలన పరమపదమును చూచు జ్ఞానమును పొందును. అందువలన ప్రతిజ్ఞ చేసి సత్యమును చెప్పుచున్నానని కృష్ణు డర్జునునకు చెప్పును. అంతియేకాని స్వయముగ అర్జునుడు కృష్ణునియందు భక్తి గలవాడు కాలేడు. కృష్ణుని యందున్న జ్ఞాన విజ్ఞానములను పొందలేడు. కృష్ణునియందు ప్రేమ గలవాడగుటయేగాని, మనస్సు గలవాడవగు మనునది యథార్థము కాదు.

శ్లో॥ సర్వ ధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

తా. సమస్త ధర్మములను విడిచి నన్ను ఒక్కనినే శరణుబొందుము. నేను నిన్ను సర్వపాపములనుండియును విముక్తుని జేసెదను. దుఃఖపడకుము.

వ్యా. అర్జునుడు పై 65 వ శ్లోకమునందు చెప్పబడినటులచేయుచున్నప్పుడు కర్మబంధములకు కారణములగు తనయందున్న రాగద్వేషాది ప్రకృతి (మాయా) గుణముల ధర్మాధర్మములను విడిచినవాడై భక్తి గలవాడై సర్వము నెరిగి పరమ ధర్మమగు నిష్కామాది పవిత్ర ప్రేమ భావములతో ప్రవర్తించు విజ్ఞానముగల కృష్ణునియందున్న విజ్ఞానమును పొందును. విజ్ఞానమువలన జ్ఞానమును పొందును. అందువలన అర్జునుడును జ్ఞానముద్వారా పరమపద దర్శనమైనవాడగును. విజ్ఞానము వలన సర్వము నెరిగినవాడై గుణరహితుడును, కర్మరహితుడునగును. జ్ఞాన,విజ్ఞాన ములు గలవారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయు ప్రవర్తనయే పరమోత్కృ ష్టమైన పరమ రహస్యము. ఈ విధముగ జ్ఞాన, విజ్ఞానములుగల కృష్ణుడును, అట్టి వారందరును చెప్పుదురు. ఇట్లు కృష్ణుడు శరీరమును విడిచిన తరువాత తననుశరణు బొందుమని చెప్పినది కాదు. ఎవరైనను ఇప్పుడు కృష్ణుని శరణ్యమనుట, ధ్యానము నామము చేయుట, గీతాపారాయణ చేయుట ఇవియన్నియును కర్మబంధములకుకారణ మగు అసురసంపదయనిన రాగద్వేషాదిగుణముల అవ్యక్తప్రవర్తన. ఎవరైననుగుణ రహితులు, కర్మ రహితులునై పరమపదమును చేరవలెననిన, ఆ పదమునెరిగి రాగ ద్వేషాది గుణములు లేనివారై కర్మరహితమగు విజ్ఞాన ప్రవర్తనచేత ప్రవర్తింప

ఖడువారిని, వారి ప్రవర్తనద్వారా తెలిసికొని వారి సాంగత్యమున వారు చెప్పునటుల చేయవలెను. అట్టివారు జీవించి యున్నపుడు వారి సాంగత్యమున వారియందున్న విజ్ఞానముతోనున్న జ్ఞానమును (జ్ఞాన, విజ్ఞానములను) వారిద్వారానే పొందవలయును గాని, యింకేవిధముగను ఆర్జింపలేరు. ఆ తేజోపదమును చూడలేరు. గుణ రహితులును, కర్మరహితులును కాలేరు. ఆ పదమును చేరలేరు.

సర్వ ధర్మములను విడిచి జ్ఞాన విజ్ఞానములు గలవాడగు కృష్ణుని శరీరమును శరణ్యమనుటయే కృష్ణునియందున్న విజ్ఞానమును శరణ్యమనుట. కర్మబంధముల నుండి విముక్తులగునటుల నిష్కామాది పవిత్ర ప్రేమ భావములతో ప్రవర్తించునది విజ్ఞానము. జ్ఞాన, విజ్ఞానములు కృష్ణునియందును, ఇంక కొందరియందును ఉన్నవి. ఈ విధముగ కృష్ణునికి పూర్వమును, ఇప్పుడును ఉన్నవి. ఇట్లు ఒకరినుండి కొందరికి సంభవించుచు ఎప్పుడును ఉండును. ఎవరైనను వానిని అవి యున్నవారి సాంగత్యమువలననే వారిద్వారానే పొందవలయును. అంతియెకాని మాయ యందుండి వచ్చిన సమస్త జీవులకును ఉన్న స్వభావమును ఈశ్వరుడని, కృష్ణుడని, ప్రార్థించినను, స్మరించినను ఇది వారిని ఎరుగదు. ఎవరికిని ఉపకారము చేయునది కాదు. అపకారము చేయునదియు కాదు. మానవులయందున్న రాగద్వేషాది ప్రకృతి గుణములు చేయునది మరల వారికి చేయునదియే కాని, ఈ గుణములను జయించునది కాదు. ఈ స్వభావము జన్మమునకు రాని పరమపదముగా నున్న పరమతేజస్సును చూచు జ్ఞానము(భావము)కాదు. సర్వము నెరిగి రాగద్వేషాది గుణములను జయించి నిష్కామాది పవిత్రప్రేమ భావములతో ప్రవర్తించు విజ్ఞానము కాదు. నిరాకార నిర్గుణమగు పరమపదముగా ఉన్న పరమతేజస్సు కాదు.

శ్లో॥ ఇదం తే నాతపస్కాయ నా భక్తాయ కదాచన।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్య
సూయతి॥ 67

తా. నీకు చెప్పిన పరమరహస్యమును తపస్సు లేనివారికిని, భక్తి (ప్రేమ) లేనివారికిని, సేవ చేయనివారికిని ఇంక మఱియును నన్ను నిందించుచున్న వారికిని చెప్పదగినది కాదు.

వ్యా. కృష్ణ ర్జునునకు చెప్పినట్టి పరమ రహస్యమును కృష్ణుడున్నపుడు కృష్ణునియందు ప్రేమ గలవారికి మాత్రమే చెప్పదగినది. కాని, యితరులకు చెప్పదగినది కాదు.

ఇతరులకు చెప్పినయెడల అది వారికి యథార్థమని తెలియదు. ఇందుతపస్సు లేని వారికనినది యథార్థము కాదు. తపస్సు మాయాగుణముల తపస్సు.

శ్లో॥ య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః

తా. ఎవడు ఈ పరమరహస్యమును నా భక్తులకు చెప్పుచున్నాడో, వాడు సంశయరహితుడై, నాయందు పరమ భక్తి గలవాడై నన్ను పొందుచున్నాడు.

వ్యా. కృష్ణుడు అర్జునునకు చెప్పిన పరమరహస్యమును తనయందు ప్రేమ గలవారలకు ఎందరికో చెప్పియుండును. వారిలో ఎవరు ఈ రహస్యమును కృష్ణుని యందు ప్రేమ గలవారలకు చెప్పియున్నాడో, వారు యింక కొందరిని కృష్ణుని సాంగత్యము చేయువారినిగా జేసిన వారగుదురు. అందువలన వారు ఇతరులకు సహకారము చేసిన వారగుదురు. సంశయరహితులగుదురు. కృష్ణుడు వారిని తనయందు భక్తి గలవారినిగా జేయును. వారు ఈ భక్తిద్వారా కృష్ణునియందుండి "నన్ను" అనుచున్న విజ్ఞానమును పొంది, విజ్ఞానమువలన జ్ఞానమునుకూడ పొందుదురు. ఈ విధముగా జ్ఞాన, విజ్ఞానములను అవి యున్నవారి సాంగత్యమున వారిద్వారా నార్జింపవలయును. అంతియెకాని, వారు శరీరములను విడిచిన తదుపరి వారివలన పొందలేరు. ఇంకేవిధముగను పొందలేరు.

శ్లో॥ న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి॥ 69

తా. మనుష్యులలో పైన చెప్పబడిన విధముగా నాయందు ప్రేమగలవారలకు ఈ పరమరహస్యమును చెప్పునట్టి వానికంటె, అధికప్రియమును చేయు వాడొక్కడును నాకు లేడు. వానికంటె ఇతరుడు ప్రియతరమైనవాడును నాకు కలుగబోడు.

వ్యా. పై శ్లోకమునందు చెప్పబడినటుల జ్ఞాన విజ్ఞానములు గల కృష్ణుని సాంగత్యము చేయునటుల ఇతరులకు సహకరించు వానికంటె-అధిక ప్రియము చేయువాడును, ప్రియతమమైనవాడును కృష్ణునికి యింకొకడుండడు. జ్ఞాన విజ్ఞానములు గలవారి సాంగత్యమే సత్సాంగత్యము. మానవులు కర్మ బంధవిముక్తులై పరమ పదమును చేరవలెననిన అట్టి వారి సాంగత్యము చేయుటయే మార్గము. అంతియేకాని యింకొక విధము లేదు, ఇంకొక ప్రవర్తన లేదు. అందువలన వారు చెప్పునట్టి పరమ రహస్యమనుదానిని ఇతరులకు చెప్పు వానికంటె తనకు ప్రియము చేయువాడును, ప్రియతమమైనవాడును వారికి ఇంకొకడు ఉండడు.

శ్లో॥ అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః।
జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టస్స్యామితి మే మతిః॥ 70

తా. ఎవడు ధర్మ సంబంధమగు మనయొక్క సంవాదమును చదువునో, అట్టి వాడు జ్ఞానయజ్ఞముచేత నన్ను పూజించువాడని నా అభిప్రాయము.

వ్యా. కృష్ణుని సాంగత్యమునగాక, కృష్ణార్జునుల సంవాదమును చదువుట, జ్ఞానయజ్ఞముచేత కృష్ణుని పూజించుట యనునది యథార్థము కాదు. కృష్ణుడుగాని, అర్జునుడుగాని వారి సంవాదమును వ్రాయించినటుల లేదు. భగవద్గీతయని యితరులు కల్పించి వ్రాసినదియేగాని కృష్ణార్జునుల సంవాదము కాదు. జ్ఞానయజ్ఞమనునది లేదు. కృష్ణుని పూజించుట యనునది లేదు. ఈ గీతను చదువుటవలన అజ్ఞానముయొక్క అవ్యక్త ప్రవర్తన గలవారగుదురు గాని, విజ్ఞాన ప్రవర్తన గలవారు కారు. ఈ శ్లోకము యథార్థము కాదు.

శ్లో॥ శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।
సోఽపి ముక్తశ్శుభాన్ లోకాన్ప్రాప్నుయాత్పుణ్య కర్మణాం॥ 71

తా. ఏ నరుడు అసూయారహితుడై ఈ గీతా శాస్త్రమును వినుచున్నాడో, అట్టివాడు బంధవిముక్తుడై పుణ్యకర్మలు చేయువారియొక్క పుణ్యలోకమును పొందగలడు.

వ్యా. ఈ గీతాశాస్త్రమును చదువువాడును, వినువాడును 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడినటుల అసుర గుణములచేత కర్మబంధితులగుదురుగాని, అసూయా రహితులు కారు. బంధవిముక్తులు కారు. పుణ్యకర్మలు చేయువారు పొందు పుణ్య లోకమును పొందరు. ఈ శ్లోకము యథార్థము కాదు.

శ్లో॥ కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ॥ 72

తా. అర్జునా ! ఈ గీతాశాస్త్రము ఏకాగ్రచిత్తముతో వింటివా ! అర్జునా ? నీ అజ్ఞానమువలన కలిగిన మోహము సంపూర్ణముగా నశించినదా ?

వ్యా. ఈ గీతాశాస్త్రము కల్పితమే కాని కృష్ణుడు చెప్పినదికాదు. అర్జునుడు వినుట యనునదియును కాదు. ఈ శ్లోకము యథార్థము కాదు.

అర్జున ఉవాచ :- అర్జునుడు చెప్పెను.

శ్లో॥ నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽ
చ్యుత।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ॥ 73

తా. నీ అనుగ్రహమువలన జ్ఞానమును పొందితిని. నా యొక్క మోహము నశించెను. సంశయరహితుడనై స్థిరముగా నున్నాను. నీ వచనమును పరిపాలించెదను.

వ్యా. ఈ శ్లోకము యథార్థము కాదు. 10 వ అ. 10. 11 శ్లో.లలో చెప్పబడినటుల అర్జునుడు కృష్ణునిసేవ చేయుచు సర్వకర్మలను కృష్ణుడు చెప్పునటుల చేయుచున్నచో కృష్ణునిద్వారానే కృష్ణునియందు భక్తి గలవాడై ఆ భక్తిచేతకృష్ణుని యందున్న జ్ఞాన, విజ్ఞానములను పొందినపుడు వానికి జ్ఞానముద్వారా పరమపదదర్శన మగును. విజ్ఞానమువలన వానియందున్న మోహాది ప్రకృతి గుణములు వెడలి పోవును. అప్పుడు అర్జునుడు మోహము నశించిన (లేని) వాడగును. ఈ భగవద్గీత యనునది కల్పితము,

సంజయ ఉవాచ : సంజయుడు చెప్పెను.

శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః।
సంవాదమిమమశ్రౌషమద్భుతం రోమహర్షణమ్॥ 74

తా. ఇట్లు మహాత్ముడగు వాసుదేవునియొక్కయు, అర్జునునియొక్కయు, అద్భుతమైనదియు, గగుర్పాటు కలుగజేయునదియునగు ఈ సంవాదమును వింటిని.

వ్యా. ఈ భగవద్గీతయని వ్రాసినది కృష్ణార్జునుల సంవాదము కాదు. సంజయుడు వినినదియును కాదు. ఈ శ్లోకము యథార్థము కాదు.

శ్లో॥ వ్యాసప్రసాదాచ్ఛ్రుతవానేతద్గుహ్యతమం పరం।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయత
స్స్వయమ్॥ 75

తా. వేదవ్యాసునియొక్క అనుగ్రహమువలన పరమరహస్యమైన ఈ యోగశాస్త్రమును యోగీశ్వరుడగు శ్రీకృష్ణుడు స్వయముగా అర్జునునకు చెప్పుచుండ ప్రత్యక్షముగా వింటిని.

శ్లో॥ రాజన్ సంస్మృత్య సంస్మృత్యసంవాదమిమమద్భుతం
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ
ముహుర్ముహుః ॥ 76

తా. ధృతరాష్ట్ర మహారాజా! కృష్ణార్జునులయొక్క అద్భుతమైనదియు, పుణ్యమైనదియునగు ఈ సంవాదమును తలంచి మాటిమాటికి సంతోషించుచున్నాను.

శ్లో॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం
హరేః ।
విస్మయో మే మహాన్ రాజన్ హృష్యామి చ పునః
పునః ॥ 77

తా. ధృతరాష్ట్ర మహారాజా! కృష్ణునియొక్క ఆ అద్భుతరూపమునుగూడ తలంచినపుడెల్ల నాకు విస్మయము కలుగుచున్నది. మాటి మాటికి సంతోషించు చున్నాను.

వ్యా. విశ్వరూపమనినది 8 వ అ. 18, 19 వ శ్లో.లలో చెప్పబడినటుల మాయాభ్రమచేత మాయయందుండి వచ్చిన ఈ లోకములో జీవులయందున్న అసుర సంపద యనిన కామ రాగద్వేషాది గుణముల కర్మల ననుసరించి ఆ జీవుల స్వభావ మను గుణము ప్రవర్తించు కర్మలరూపము. ఇది కృష్ణునియొక్క విశ్వరూపమని అద్భుతరూపమని కల్పించినదియేగాని యథార్థము కాదు.

74. 75, 76, 77 శ్లోకములయందున్నది సంజయుడు చూచినది కాదు. ధృతరాష్ట్రునకు చెప్పినది కాదు. భగవంతుడు లేని ఈ విశ్వములో భగవంతుడు కృష్ణుడు చెప్పిన భగవద్గీతయని జ్ఞాన విజ్ఞానములు లేని వారగు ప్రకృతి (మాయా) విద్యాపండితులచే కల్పించి వ్రాయబడినది. ఇందు సర్వజ్ఞులగు జ్ఞాన విజ్ఞానము గల వారు చెప్పినవి కొన్ని ఎచ్చటనో విని, వానిని వ్రాయుచు ఇందు సత్వ రజస్తమో గుణములగు త్రిగుణముల సంబంధమైనవి, కోరికలను పెంచునవియగు వేదముల యందు చెప్పబడినవి వ్రాసినారు.

శ్లో॥ యత్రయోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్రశ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ॥ 78

తా. యోగీశ్వరుడగు కృష్ణుడు ఎచ్చట నుండునో, గాండీవమను ధనస్సును ధరించిన పార్థుడు ఎచ్చటనుండునో అచ్చట సంపదయును, విజయమును, ఐశ్వర్య మును, దృఢమైన నీతియును ఉండునని నా అభిప్రాయము.

వ్యా. జ్ఞాన, విజ్ఞానములు గలవారును, వారి సాంగత్యము చేయుచు వారు చెప్పినటుల చేయువారును ఎచ్చట నుందురో అచ్చట, వారికి అతి సుఖమును, సంతోషమును, విజ్ఞానముయొక్క నిష్కామము, సమత్వబుద్ధి,నిత్యసత్వము,పవిత్ర ప్రేమ భావముల ఆనందమగు పరమధర్మ ప్రవర్తనయగు దృఢమైన నీతియును

ఉండును. వారు విజ్ఞానము గలవారివలన ఆ విధముగ కర్మలయందు దివ్యమైన ఆనందముతో ప్రవర్తించుచుందురు. యోగీశ్వరుడగు కృష్ణుడని, గాండీవమను ధనుస్సును ధరించిన అర్జునుడని యిందు వ్రాసినది యథార్థము కాదు. ఈ ప్రపంచములో యోగీశ్వరుడగు కృష్ణుడు ఎప్పుడును లేడు.

ఈ అధ్యాయమున కర్మబంధమును కలుగజేయునవి అసురసంపదయని 16వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన సత్వ, రజ, స్తమోగుణముల కర్మలను వ్రాయుచూ, మోక్ష (పరమ) పదమును జేర్చునవి దైవసంపదయని చెప్పబడిన జ్ఞాన విజ్ఞానములు గలవారియందున్న విజ్ఞానముయొక్క నిత్యసత్వ గుణ కర్మలను కొన్ని త్రిగుణముల లోని సత్వ గుణ కర్మలుగా కల్పించి వ్రాసినారు. అసుర గుణముల కర్మలను బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కర్మలనుగా వ్రాసినారు. ఈ నాలుగువర్ణముల వారును కర్మబంధమును కలుగజేయు రాగద్వేషాది గుణములు గలవారేగాని, పరమ పదమును జేర్చు జ్ఞాన, విజ్ఞానభావములు (గుణములు) గలవారు కాదు.

అర్జునుడు ప్రపంచసంబంధమైన సర్వధర్మములను విడిచి 10 వ అ, 10, 11 శ్లో.లలో చెప్పబడినటులను; 18 వ అ. 65, 66 శ్లో.లలో చెప్పబడినటులను కృష్ణునిని సేవ చేయుచు శరణ్యమనినచో, కృష్ణుడు అర్జునుని తనయందు ప్రేమ, భక్తి గలవానిగా జేసి తనయందున్న జ్ఞాన,విజ్ఞానములను అర్జునునియందు ప్రవేశింప జేయును. ఈ జ్ఞాన, విజ్ఞానములు అర్జునుని పరమపదమును జేర్చును. ఈ విధము గనే జ్ఞాన, విజ్ఞానములు గలవారును వారి సాంగత్యము చేయు అనేకులను తమ యందు ప్రేమ, భక్తి గలవారినిగా జేసి, వీరియందున్న జ్ఞాన విజ్ఞానములను వారి సాంగత్యము చేయు వారియందును ప్రవేశింప జేయుదురు. ఈ జ్ఞాన, విజ్ఞానములే వారిని పరమపదమును జేర్చును. అట్టి వారి సాంగత్యమే సత్సాంగత్యము. ఇదియే మోక్షపదమనునట్టి పరమపదమును జేర్చు సన్న్యాస యోగము.

ఇటులగాక 8 వ అ. 18, 19 శ్లో.లలో చెప్పబడినటుల మాయయందుండి వచ్చి నశించి మాయయందే కలియుచు మరల వచ్చుచున్నదనిన ఈ ప్రపంచములో కర్మబంధమును కలుగజేయునవి అసుర సంపదయని 16 వ అ. 5 వ శ్లో.లోను

కామ క్రోధ లోభములు నరకద్వారములని 16 వ అ. 21 వ శ్లో.లోను చెప్పబడిన రాగద్వేషాది అసుర గుణములలో సర్వజీవులకును నున్న స్వభావమను అసురగుణమును ఈశ్వరుడని, జీవులయందున్న కామ రాగద్వేషాది గుణములు చేయు కర్మలను మరల యింకొకపుడు ఆ జీవులకు చేయుచూ వానిని అనేక జన్మలనెత్తించుచు, సుఖ దుఃఖముల ననుభవింపజేయుచూ ఈ ప్రపంచమునందు త్రిప్పుచుండు జీవుల స్వభావముయొక్క ప్రవర్తనను ఈశ్వరుడు సర్వజీవులను వానియందుండియంత్రములను త్రిప్పునటుల మాయచేత త్రిప్పుచున్నాడని ఈ అధ్యాయమున 61 వ శ్లో.లో కల్పించి వ్రాసినారు.

మోక్షపదమును జేర్చునవి దైవసంపదయని 16 వ అ. 5 వ శ్లో.లో చెప్పబడిన జ్ఞాన విజ్ఞానభావముల (గుణముల) యొక్క ప్రవర్తనను ఈశ్వరుని శరణువేడుకొనుము. వాని అనుగ్రహమువలన పరమశాంతి ననుభవించెదవు. శాశ్వితమగు పరమపదమును జేరుదువని 62 వ శ్లో.లో కల్పించి వ్రాసినారు.

సర్వ జీవులయందుండి ఈ సర్వమును ప్రవర్తింపజేయుచున్నారనిన ఈశ్వరుడును, కృష్ణుడును అని ఈ గీతయందు వ్రాసినది జీవుల స్వభావమను అసుర గుణమును. మాయయందుండి వచ్చిన జీవుల స్వభావమను అసురగుణమును ఈశ్వరుడని, కృష్ణుడని యింకేవిధముననైనను ధ్యానించినను, స్మరించినను, శరణ్యమనినను, వీనిద్వారా 12 వ అ. 55 వ శ్లో.లో చెప్పబడినటుల అధికతర దుఃఖములకు కారణమగు అవ్యక్తాసక్తి (మూఢ నమ్మకము) గలవారై అవ్యక్తగతిని (గుడ్డివారివలె) ప్రవర్తింపబడువారై అధికతర దుఃఖముల ననుభవించువారగుదురు. ఈ విధముగ వ్రాసి దీనిని భగవంతుడు కృష్ణుడు అర్జునునకు యుద్ధభూమియందు చెప్పినటుల వ్రాసినారు. ఇదియొక కల్పితగాధ. ఈ గీతవలన అనేకులు రాగద్వేషాది అసుర గుణములచేత అవ్యక్తాసక్తితో గ్రుడ్డివారివలె ప్రవర్తింపబడుచున్నారు. ఈ విధముగ అనేకులు అధిక దుఃఖముల ననుభవించు వారగుచున్నారు.

ఈ అధ్యాయమున 65, 66 శ్లో.లలో చెప్పబడినటుల అర్జునుడును, యింకెవరైనను జ్ఞాన, విజ్ఞానములు గల కృష్ణుని సాంగత్యమున కృష్ణునిగాని, అట్టివారిని

గాని, శరణ్యమని, వారు చెప్పునటుల చేయుచు ప్రపంచ సంబంధమైన కర్మలను విడుచుటయే మోక్షపదమును జేర్చు జ్ఞాన, విజ్ఞాన భావముల (గుణముల) ను అవి యున్న వారినుండి వారిద్వారానే ఆర్జించు సన్న్యాసయోగము (ప్రవర్తన).

62 వ శ్లో.లో చెప్పబడినటుల అందరియందును ఉన్నాడని ఈ గీతయందు వ్రాసిన కృష్ణుని శరణ్యమనుట, ఈశ్వరుని శరణ్యమనుట 16 వ అ. 21 వ శ్లో.లో చెప్పబడిన నరక ద్వారములగు కామ క్రోధ, లోభ రాగద్వేషాది గుణముల అవ్యక్త ప్రవర్తన. వీరి శరణ్యమును విను అందరియందున్నాననిన ఈశ్వరుడును లేడు, కృష్ణుడును లేడు.

